# నేటి సోవియట్ యూనియన్

కంభంపాటి సత్యనారాయణ
(సీనియర్)



ప్రజాశక్తి కార్యాలయం
బెజవాడ

# విషయసూచిక

## మొదటిభాగం : కొత్తవిధానం



## రెండవభాగం : కొత్త వికాసం



## మూడవభాగం : కొత్త జాతీయత

# BIBLIOGRAPHY

ఈ రచనకు క్రింది పుస్తకాలు, పత్రికలు యెక్కువగా తోడ్పడ్డాయి :


1. The strength of the Soviet – Dean of Canterbury
2. The Socialist sixth of the World — "
3. Dawn over Samarkhand–Kunitz
4. Soviet Trade Unions – George Hovner
5. Nationalities in the Soviet Union– G. Adhikari
6. The Kolkhoz – F. Klemenko
7. Socialist Farming – K. Borin
8. Moscow News
9. Indo–Soviet Journal


---

రష్యాలో చెలామణీలో వున్న "రూబుల్" విలువ యుద్ధానికి ముందు రు. 1–8–0 ఉండేది.

# తొలిపలుకు

1941 వ సంవత్సరం జూన్ 22 వ తేదీని హిట్లరు సోవియట్ యూనియన్‌మీద ఆకస్మాత్తుగా దాడి సాగించినప్పుడు, సోవియట్ యూనియన్ చలించక, ధైర్యంతో నిలబడింది. జర్మన్ల "మెరుపు యుద్ధ" వ్యూహాన్ని భగ్నం గావించింది.

ఇదిచూచి, ప్రపంచం అంతా ఆశ్చర్యపోయింది.

ఇరవై సంవత్సరాలక్రితం రష్యన్ రైతాంగం గాఢాంధకారంలో మునిగియుండేవారు. కొయ్యనాగళ్ళతో వ్యవసాయం చేసేవారు చెప్పుకో దగ్గ పెద్ద పరిశ్రమలు లేవు. జర్మనీ అలాకాదు. 20 సంవత్సరాలక్రితం జర్మనీ పారిశ్రామికంగా యూరపుఖండంలో అత్యున్నతమైనస్థానం అలంకరించియుండేది. అమెరికాతప్ప ప్రపంచంలో మరేదేశం జర్మనీతో పోటీ చేయగలిగిన స్థితిలో ఉండేదికాదు.

జర్మనీ యీ 20 సంవత్సరాలూ తన కాలాన్నీ, ధనాన్నీ, తన యావచ్ఛక్తినీ, వినియోగించి విరివిగా యుద్ధపరిశ్రమను వృద్ధిచేసింది. ఇంత బ్రహ్మాండమైన యుద్ధపరిశ్రమ యే దేశంలోనూ లేదు. దీని సహాయంతో, అప్పుడే నిద్రావస్థనుండి మేల్కొన్న రష్యాపై ఆకస్మాత్తుగా దుముకుటకు శక్తిని సంపాదించింది.

అయితే, రష్యాకూడా జూన్ 22, 1941 నాటికి జర్మనీతో సరిసమానమైన మిలిటరీబలాన్ని సంపాదించింది. రష్యా యెంతో వెనుకబడ్డదేశం అనీ, పెద్దపెద్ద దండయాత్రల నెదుర్కొనగలశక్తి రష్యాకులేదనీ, యీ 24 సంవత్సరాలనుండీ ప్రపంచంలో సామ్రాజ్యవాదులు చేసిన ప్రచారం కొద్ది వారాలలో వట్టి అసత్యప్రచారమని రుజువైంది. రష్యాలో ఆధునిక యంత్రాలు లేవని యిప్పుడెవరు చెప్ప సాహసించగల్గుతారు? పోషలిష్టు

విధానంలో మానవుని వ్యక్తిత్వం, ఉత్సాహం, నాశనంచేయబడ్డాయని యేమూర్ఖుడు అనగల్గుతాడు ? రష్యాయొక్క ఆర్థికనిర్మాణం బలహీనమైన దని యే చవట అనగల్గుతాడు ? రష్యాకు ఇంతటి ఆయుధబలం, మిలిటరీ శక్తి యెలావచ్చిందని యీరోజున మనం ఆశ్చర్యపడుతున్నాం. రష్యన్ మిలిటరీనాయకుల నైపుణ్యం చూచి విస్మయం పొందుతున్నాం. వారి యుద్ధవ్యూహం, ఎత్తుగడలు, ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచుతున్నాయి. సర్వసామాన్యమైన రష్యన్‌పౌరుడు ఈయుద్ధంలో ప్రదర్శిస్తున్న ధైర్య స్థైర్యాలు, స్వార్థత్యాగం, సంఘీభావం, అద్వితీయమని చెప్పాలి.

## పన్నెండునెలలకు పూర్వం

పన్నెండునెలలకు పూర్వం, హిట్లరు తన యుద్ధయంత్రాన్ని రెండు సామ్రాజ్యప్రభుత్వాల సేనలమీదికి (బ్రిటన్, ఫ్రాన్సు) పంపాడు. ఇలా జరుగుతుందని ఆనాయకులకు చాలాకాలంనుంచీ తెలుసు. దెబ్బకు కాచు కొనే నిమిత్తం కొన్ని సంవత్సరాలమంచి వారు తయారౌతూన్నట్లుకూడా మనం వింటూ ఉండేవాళ్ళం. తప్పకుండా ఇంగ్లండ్ నిలబడగలదని జనరల్ ఐరన్‌సైడ్ హామీ యిచ్చాడు. ఫ్రాన్సుతరపున జనరల్ గామెలిన్ కూడా యిలాగే పలికాడు. హాలెండ్, బెల్జియం దేశాలు మిత్రరాజ్యాల తరపున నిలబడి, యుద్ధంచేశాయి. ఈవిధంగా యుద్ధరంగంలో హిట్లరు నలుగురు శత్రువుల్ని ఎదుర్కొన్నాడు.

కాని,

ముప్పై అయిదు రోజులలో హాలెండ్‌దేశం బాంబుదాడులకు ఆగలేక, లొంగిపోయింది; ఫ్రెంచిసేనలు పలాయనమంత్రం చిత్తగించాయి. బెల్జియం పతనమయింది. ఇంగ్లండు ఏకాకిగానిలిచి పోరాడ వలసి వచ్చింది. ముఖ్యమైన యుద్ధసామగ్రికి విపరీతంగా నష్టం కలిగింది. కొద్ది వారాలలో ఇంగ్లండుకూడా తుడిచిపెట్టుకుపోవలసిందే ; కాని బ్రిటిష్ ప్రజలు చూపిన చాకచక్యంవల్ల, ధైర్య సాహసాలవల్ల ఆ దేశం నాజీలకు పాదాక్రాంతం కాకుండా నిలబడింది.

# పన్నెండునెలల తరువాత

పన్నెండునెలల తరువాత హిట్లరు రష్యామీద పడ్డాడు. ఆ తేదీ ప్రపంచ చరిత్రలో ఎంత ప్రధాన ఘట్టమో, అది ఎంత పెద్ద మార్పును ప్రపంచంలో తీసుకురాగలిగిందో ముందుముందు చరిత్రకారులు వ్రాసి తీరుతారు. ఆరోజున సోవియట్ సేనలకు ఏదేశపు సహాయమూలేదు. 12 నెలల యుద్ధానుభవం గల జర్మనుసేనలు అకస్మాత్తుగా 2000 మైళ్ళ పొడ వైన యుద్ధరంగంలో దాడి ప్రారంభించాయి. అంతవరకు జర్మనీ యితర మిత్రరాజ్యాలపై ప్రయోగించిన బలంకంటె అనేకరెట్లు ఎక్కువ బలాన్ని సోవియట్ రంగంమీద ప్రయోగించింది.

హిట్లరు యీవిధంగా ఒక్క కనురెప్పపాటులో అకస్మాత్తుగా రష్యాను దొంగపోటు పొడిచాడు. అతిసులభంగా విజయం పొందవచ్చు ననే ధీమాతోనే అతడలాచేశాడు. అట్టి ధీమాకు కారణం లేకపోలేదు. తాను జయించిన దేశాల సాధన సంపత్తి అంతా తనకు పాదాక్రాంతమై వుంది. దాన్ని రష్యాను ఓడించడానికి ఉపయోగించవచ్చు. ఉత్తరదిశలో ఫిన్నిష్‌సేనలు, మధ్య హంగేరియన్ సేనలు, దక్షిణాన రుమేనియన్ సేనలు, నాజీలకు సహాయంచేశాయి. ఇక విజయం తనదేనని హిట్లరు చిందులు త్రొక్కాడు. హాలెండు యిదివరకే ఓడిపోయింది. బెల్జియం కూడా స్వాధీనమయింది. ఫ్రాన్సు పతనమయింది. నార్వే, గ్రీసుదేశాలు కూడా లొంగిపోయాక, ఇంగ్లండుకు సముద్రమే శరణ్యమైంది. జర్మనీకి క్రీట్ దీవి చాలాదూరంలో వున్నప్పటికీ దాన్ని స్వాధీనం చేసుకోవడంతో సూయజ్‌కెనాల్ ప్రమాదంలో పడింది. క్రీట్‌లో నిర్మించుకొన్న విమా నాశ్రయంనుండి సూయజ్‌కెనాల్‌పై సులభంగా బాంబులవర్షం కురిపించ వచ్చు.

ఇంతేకాదు, బ్రిటిష్ విమానాలను, బ్రిటిష్ నౌకలను లెక్కచేయ కుండా నాజీసేనలు ఈజిప్టు పొలిమేరలలో స్థావరం యేర్పరచుకున్నాయి. ఉత్తరఆఫ్రికాలో బ్రిటిష్‌సేనలు ఇటాలియన్లను తరిమివేసినప్పటికీ, పక్కనే పోలంవద్దనున్న జర్మన్‌సేనలు ఏ నిమిషంలోనైనా విజృంభించవచ్చు.

కాబట్టి ప్రపంచంలో యెవరూ తనధాటికి ఆగలేరని హిట్లరు భావించ డంలో ఆశ్చర్యం ఏముంది ? పెద్ద సేనలు, విశాలమైన సామ్రాజ్యాలు, తృటికాలంలో విచ్ఛిన్నమవుతున్నాయి !

## హిట్లరు రష్యాపై ఎందుకు విరుచుకు పడ్డాడు ?

ఇంగ్లండునుకూడా స్వాహా చేసేస్తే, ప్రపంచాధిపత్యం సంపాదించ టానికి ఒక్క దేశంమాత్రమే యిక హిట్లరుకు అడ్డుగా వుంటుంది. అది సోవియట్ రష్యా. రష్యాకూడా లొంగిపోతే ఉక్రెయిన్ రాష్ట్రంలోవున్న బొగ్గు గనులు, ఇనుము పరిశ్రమ, గోధుమపంట, తన స్వాధీనంలో ఉంటాయి. బాకూ పెట్రోలుగనులు పాదాక్రాంతమవుతాయి. సప్లయిల విషయంలో యిక ఆదుర్దా పడనవసరం ఉండదు కాకేసస్ పర్వతశ్రేణిని కూడా దాటితే, పెర్ష్యా మీదుగా ఆఫ్గనిస్థాన్‌ను స్వాధీనంచేసుకొని బ్రిటిష్ సామ్రాజ్యానికంతటికీ "మణిపూస" అని పేరుగాంచిన మన భారతదేశంపై దాడి చేయవచ్చు. ఇటు తూర్పు దిశనుండి జపాను సేనలు బర్మామీదుగా యిండియాపై దూకితే ఉభయ సేనలు ఎంతో సులభంగా, అనతికాలంలో మనదేశాన్ని ఆక్రమించుకోవచ్చు ! 200 సంవత్సరాలుగా బ్రిటిష్ సామ్రా జ్యంక్రింద నలిగి, కృశించి స్వాతంత్ర్యంకొరకు పెనగులాడే భారతీయులు బ్రిటిష్‌సేనలకు సహాయంచేయరు. రష్యాలోను, ఇండియాలోను గల సాధన సంపత్తిని వినియోగించుకొని, ఇంగ్లండుమీద — అమెరికామీద పావకాశంగా దండయాత్ర చేయవచ్చు.

ఇదీ, హిట్లరు ప్లాను. ప్రపంచ చరిత్రలో అనేకమంది చక్రవర్తులు విదేశాలపై దండయాత్రలుగావించి, సామ్రాజ్యాలు స్థాపించుకోవడం చూచాము. కాని, ఏ చక్రవర్తికి, ఏ సామ్రాట్టుకు, విజయలక్ష్మి ఇంత చేరువలోకి రాలేదు !

హిట్లరుకు ఆ విధంగా నోరూరిందంటే, ఆశ్చర్యమేముంది ? రష్యాను ఓడించడంవల్ల ఒకేదెబ్బకు రెండుపిట్టల్ని కొట్టవచ్చునను కున్నాడు. ఏవిధంగా నంటే, ఒకవైపు తనకుపోటీదారైన ఇంగ్లండును దెబ్బతీయవచ్చును, మరొక వైపున కమ్యూనిజాన్ని అణచివేయవచ్చును.

ఈ కమ్యూనిజమే తనకు, తనదేశంలోవున్న పెట్టుబడిదారీవర్గానికి, పరమ శత్రువుగా పరిణమించింది. వారి దృష్టిలో ఇంగ్లండు కంటె కూడా ఎక్కువ ప్రమాదకరమైన " పెనుభూతం " ఈ కమ్యూనిజమే.

ఇంతకంటెకూడా మరొక ఆశ హిట్లరును ప్రేరేపించింది. ఇప్పుడు ఇంగ్లండుమీదికి కాకుండా, తూర్పుదిశగా రష్యామీదికి విజృంభించినట్లయితే, ఇంగ్లండే తనకు సహాయం చేయవచ్చును. ఎందువల్లనంటే బోల్షివిజం జర్మన్ పరిపాలకవర్గానికి, బ్రిటిషు పరిపాలకవర్గానికికూడ శత్రువే. ఇంగ్లండులో, ముఖ్యంగా అమెరికాలో బలమైన కొన్ని శక్తులు ఫాసిజంకంటె కమ్యూనిజాన్నే వ్యతిరేకించేవి వున్నాయని హిట్లరుకు బాగా తెలుసు. ఇంగ్లండ్, అమెరికాలలో మీర్జాఫర్లు, జయచంద్రులు తనకు సహాయం చేసి తీరుతారని అతడు అంచనావేసుకున్నాడు. తాను రష్యాను చీల్చి చెండాడుతూంటే, ఇంగ్లండు అమెరికాలలోని ఈ కమ్యూనిస్టు వ్యతిరేక బృందం కనీసం తటస్థంగానైనా వుండేటట్లు తమ ప్రభుత్వాలపై ఒత్తిడి తీసుకువస్తారని ఆశించాడు. హిట్లరు హెస్సును ఇంగ్లండుకు పంపించినది ఇందుకే!

## హిట్లరు వ్యూహం

ఈ ఆలోచనలతో హిట్లరు 1500 మైళ్ళ యుద్ధరంగంలో దాడికి సన్నాహాలు ప్రారంభించాడు. టాంకులు, విమానాలు, ఆరితేరిన సైనిక దళాలు ఏ నిమిషంలోనైనా ముందుకు దూకడానికి సిద్ధంచేయబడ్డాయి. అకస్మాత్తుగా మెరుపుయుద్ధంచేసి రష్యాను స్వాధీనచేసుకుందామని హిట్లరు ప్లానువేశాడు. మొదట "డైవ్‌బాంబర్లు" కీలకస్థానాలపై దాడులుచేయడం: తరువాత సైనికదళాలు దేశంలో ప్రవేశించడం: ఆటుతరువాత మోటారు సైకిళ్లు, ఆర్మర్డుకార్లు, టాంకులు, వరుసగా ప్రవేశించి కొద్దిరోజులలో గాని, కొద్ది వారాలలోగాని, మాస్కోనగరాన్ని, లెనిన్‌గ్రాడ్‌ను స్వాధీనం చేసుకోవడం; ప్రపంచమంతా తన కనుసన్నలలో మెలగేటట్లు చేసుకోవడం—ఇదీ హిట్లరు వ్యూహం.

హిట్లరు యీవిధంగా అకస్మాత్తుగా రష్యామీదికి లంఘించాడు.

కాని రష్యా పతనంకాలేదు. ధైర్యంతో నిలబడింది. రష్యా దెబ్బకు దెబ్బ దిమ్మతిరిగేటట్లు కొట్టింది. హిట్లరుసేనలు తోకముడించి, పలాయన మంత్రం చిత్తగిస్తున్నాయి. నేడో రేపో రష్యనులు నాజీ విషపురుగుల్ని పూర్తిగా నాశనంచేయ బోతున్నారు.

అయితే ఎందుకు రష్యా ఇంత ధైర్యంతో నిలబడగలిగింది? దెబ్బకుదెబ్బ కొట్టి, వెనక్కి తరిమివేయుగల శక్తి రష్యాకు ఎక్కడనుంచి వచ్చింది?

ఈ ప్రశ్నలకు జవాబీయడమే యీ పుస్తకంయొక్క వుద్దేశ్యం.

"....25 ఏళ్ళు గడిచాయి మీరు నూతన రష్యాను నిర్మించి. ఈ 25 యేళ్లూ కాలచక్రం పరుగులో ఒక్క త్రుటికాలం. ఈ స్వల్పకాలంలో మీరు అద్భుతమైన ఘనకార్యాలను సాధించారు. ఒకవైపు ఆశ్చర్యం. మరొకవైపు గర్వం తొలుకాడ మీ అమోఘ కృషిని మేం కనిపెడుతూవచ్చాం.



శ్రీమతి సరోజినీ దేవి

"విచ్ఛిన్నమై పోతున్న ఒక సామ్రాజ్యం యొక్క శిధిలాలపై అద్భుతమైన ప్రజాస్వామ్య ప్రపంచాన్ని మీరు నిర్మించారు. కన్నీటి కాల్వలతోను, రక్తధారలతోను మీరీ అద్భుతమైన కార్యాన్ని సాధించారు. విజయ సాధనవల్ల చెక్కు చెదరని నమ్మకంతో, భవిష్యత్తుపై అచంచలమైన విశ్వాసంతో మీరీ నిర్మాణాన్ని కొనసాగించారు. రైతును నికృష్ట దశనుండి విముక్తిచేసి, స్వాతంత్ర్యరథంలో కూర్చొపెట్టారు. నిరంకుశ ప్రభువులు ప్రజానీకాన్ని ఒక మట్టిముద్దగా నలగగొట్టేవారు. మీ రా మట్టిముద్దలోంచి లక్షలకొలది వీరాధివీరులను సృష్టించారు! ప్రపంచ నాగరికతను, స్వాతంత్ర్యాన్ని కాపాడగల సంరక్షకులను ప్రసాదించారు!

"మా భారతదేశం స్వాతంత్ర్య సంపాదనకై పడరానిపాట్లు పడుతోంది. ఇంకా యెన్నో దేశాలు యిట్టి ఆవేదననే అనుభవిస్తున్నాయి. మీ ఆదర్శం మా అందరికీ ఆరని ఆశాజ్యోతి. సోవియట్ ప్రజానీకమా! ఇవే మీకు మా జోహారులు. మా ప్రేమాభివందనలివిగో!"

— 26 వ రష్యా విప్లవ దినోత్సవ సందర్భంలో
శ్రీమతి సరోజినీదేవి సందేశం.

# 1. సోవియట్ల ఆర్థిక నీతి

యుద్ధరంగంలో నేడు సోవియట్ రష్యాకు గల బలాన్ని మనం చూస్తున్నాం. ఆబలం యెక్కణ్ణించి, యెలా వచ్చిందో యిప్పుడు చూదాం.

నేటి యుద్ధానికిముందు, శాంతిరోజుల్లో అది సంపాదించిన బలమే యుద్ధకాలంలో ఈనాడు ప్రదర్శిస్తూన్నబలానికి కారణం. యుద్ధవ్యూహాలలో రష్యా కన్పరచుతూన్న చాకచక్యానికికారణం, యుద్ధానికిముందు మానవ జీవితాన్ని బాగుచేయడంలో అది చూపిన నైపుణ్యం తప్ప మరొకటికాదు. పరిశ్రమల్ని నడపడంలోను, వ్యవసాయాన్ని అభివృద్ధిచేయడంలోను, విద్యాలయాల్ని నిర్వహించడంలోను, శాస్త్రపరిశోధనల్ని ప్రోత్సహించడం లోను, రష్యా ఎంతో శక్తిని ప్రదర్శించడంవల్లనే యుద్ధరంగంలోకూడా ఒక అజేయమైన శక్తిగా తయారైంది.

శిశువుల, బాలబాలికల, స్త్రీపురుషుల జీవితం సర్వతోముఖంగా వికసించడానికి సోవియట్ ప్రభుత్వం చక్కని అవకాశాలెన్నో కల్పించడం వల్లనే, అట్టి మానవవికాసాన్ని కాపాడడంలో యిప్పుడింత బ్రహ్మాండమైన శక్తిని సంపాదించగలిగింది. నాజీరాక్షసుల భయంకర దండయాత్రను రెడార్మీ తుత్తునియలు చేస్తూన్నదంటే, అందుకు కారణం సోవియట్ యూనియన్‌లో నివశించే వివిధజాతుల ప్రజల్లో అంతర్గర్భితమైయున్న శక్తులను కేంద్రీకరించుతూ, వారివిశ్వాసాన్ని చూరగొనడమేనని చెప్పాలి.

శాంతిరోజుల్లో సోవియట్ యూనియన్ చల్లిన విత్తనాలే యుద్ధ కాలంలో ఫలించుతున్నాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే, పరమోత్కృష్టమైన కొన్ని నైతిక సూత్రాలకు శాస్త్రీయపద్ధతుల్ని జోడించి, దేశంయొక్క ఆర్థికనిర్మాణాన్ని బలపరచుకోవడంలోనే ఉంది సోవియట్ రష్యా బలం అంతా. ఈ ఆర్థిక

నిర్మాణాన్ని వివరంగా పరిశీలిస్తే, అనేక తికమకలు కలిగేమాట నిజమే. కాని దాని మూలసూత్రం తెలుసుకుంటేమాత్రం, పసిబాలుడుసయితం దాన్ని సులభంగా అర్థంచేసుకోవచ్చు ! ఏ పునాదులపై రష్యా తన ఆర్థికనిర్మాణాన్ని నిర్మించిందో, ఆ పునాదుల్ని గురించి మొదట తెలుసుకోకపోతే, రష్యా మనకు అర్థమేకాదు.

## నైతిక పునాదులు

రష్యాయొక్క ఆర్థికవిధానాన్నిగురించి సోవియట్ నాయకులు ప్లానులు వేసేటప్పుడు ఒక చిన్నప్రశ్న వేసుకున్నారు. అది యేమంటే : ప్రపంచంలో అసలు ప్రతి వస్తువునూ తయారుచేయడంలో ఉద్దేశం ఏమైయుండాలి ?

ఈప్రశ్నకు సరియైన, సూటియైన జవాబు ఒక్కటే. అది యేమంటే, మానవుని ఉపయోగంకొరకే ప్రతిసరుకు తయారుకావాలి. ప్రతిమనిషికీ తిండి, బట్ట, యిల్లు, విద్య, వైద్యసహాయం, రైళ్లు, సినీమాలు, నాటకాలు, సంగీతం, ఉద్యానవనాలు — యివన్నీ అవసరం. సమాజం యొక్క ఉత్పత్తి విధానంలో యివన్నీ పుష్కలంగా ప్రతిమనిషికీ లభించాలి. ప్రతిమనిషీ సౌఖ్యంగా జీవించేటందుకు తగిన రక్షణలుండాలి. ప్రతివ్యక్తికీ సమానంగా అట్టి అవకాశాలు కల్పించాలి. పనిచేయగల ప్రతివానికీ ఏదో ఒకపని యివ్వాలి. ఆ పనిలో అతని నైపుణ్యాన్నిబట్టి, చేసే శ్రమనుబట్టి, ప్రతిఫలం యివ్వాలి. రోజల్లా కష్టపడ్డ తరవాత, విశ్రాంతికి అవకాశమీయాలి. జబ్బుచేసినా, శక్తులుడిగిపోయినా, వయస్సు మళ్ళినా, పనిచేయాలనే నిర్బంధం ఉండకూడదు. ఆరోగ్యకరమైన వాతావరణంలో అతన్ని సమాజం పోషించాలి. అనగా ఉత్పత్తి విధానానికంతకూ మానవుని శ్రేయస్సు పునాదిగా ఉండాలన్నమాట ! ఇదే న్యాయం. ఇదే ధర్మం. ఇదే ఉపయోగకరంకూడా.

ఈసూత్రాన్ని అమలులోపెట్టడం అసాధ్యమేమీకాదు; చాలా సుళువైనపని. అయితే ఇందుకొక ప్లాను అవసరం. భూమి, కర్మాగారాలు, గనులు, యంత్రాలు—ఇవన్నీ వ్యక్తుల స్వాధీనంలో కాకుండా, సమాజం చేతుల్లో ఉండాలి.

# మన దేశంలో ఉత్పత్తి విధానం

ఇప్పుడు మన దేశంలో - మన దేశంలోనేకాదు, రష్యా తప్ప మిగతా దేశాలన్నింటిలోను—ఉత్పత్తి విధానం యెలా సాగుతోంది? ఒక భూస్వామిగాని, జమీందారుగాని రైతులచే యెందుకు వ్యవసాయం చేయిస్తాడు? ఒక వ్యక్తి ధనం పెట్టుబడిపెట్టి, రైసుమిల్లువంటి మిల్లును యెందుకు తెరుస్తాడు? అహమ్మదాబాదులో కోటీశ్వరులెందుకు బట్టలమిల్లులను నడుపుతున్నారు? బెంగాలులో బొగ్గుగను లెందుకు తవ్వబడ్డాయి? అస్సాం టీ తోటలలో యెందుకు 12 లక్షలమంది కూలీలచేత పనిచేయిస్తున్నారు?

కొంతమంది వ్యక్తులో, లేక వ్యక్తుల సమూహాలో, తమ లాభాలనుమాత్రమే దృష్టిలో ఉంచుకొని యివన్నీ నడుపుతున్నారు; ప్రజల అవసరాలను తీర్చడానికికాదు. నీకు తగినంత లాభంరాకపోతే నీ భూమిని యెవరికీ కౌలుకియ్యవు. ప్రజల సౌకర్యార్థం నీ రైసుమిల్లులో బియ్యాన్ని యెవరికీ ఉచితంగా ఆడిపెట్టవు. అహమ్మదాబాద్ బట్టలమిల్లులలో కార్మికులు తమ కిష్టంవచ్చినన్ని ధోవతులు, చొక్కా-తాన్లు, నేసుకోడానికి హక్కువున్నదా? తాపీపనివారి శ్రమవల్ల లాభంపొందేవ్యక్తులు కొందరు లేనట్లయితే, ఆ పనివారంతా నిరుద్యోగులై వీధులలో తిరుగుతూ ఉండవలసిందేగదా! వారిచేతిలో విద్యవున్నప్పటికీ ప్రయోజనం యేముంటుంది? నివశించడానికి యిళ్లయినా లేకుండా పోతాయి.

కాబట్టి యీ రోజుల్లో వస్తువులన్నీ కొందరి లాభాలకోసం తయారౌతున్నాయి. ప్రజలకొరకుకాదు. ఎంత యెక్కువ లాభంవస్తే అంత యెక్కువ సరుకు తయారౌతుంది. అన్ని యెక్కువ పరిశ్రమలు బయలుదేరుతాయి. కాబట్టి పెట్టుబడియొక్క ఉద్దేశం లాభాలు; ప్రజల అవసరాలు కాదు.

ఎందువల్లనంటే నేడు భూమి, ఫ్యాక్టరీలు, గనులు ఇల్లాంటి ఉత్పత్తి సాధనాలన్నీ ఏ కొద్దిమంది చేతుల్లోనోవున్నాయి. ఒక వస్తువును తయారుచేయడంగాని, తయారుచేయకుండా మానడంగాని, వీరి యిష్టా యిష్టాలపై

వనే ఆధారపడి యుంటుంది. ఆ వస్తువు యెవరెవరికవసరమో వారి యిష్టాన్నిబట్టికాదు. కారణం, యీ వుత్పత్తి సాధనాలపై పెత్తనం ప్రజలకు లేదు; కొద్దిమంది వ్యక్తులకు మాత్రమే వుంది. వారే వీటికి స్వంతదార్లు. వారి వుత్తరువులేనిదే యంత్రాలు నడువవు. ఆ వుత్తరువు లెప్పుడొస్తాయి? తమకు పుష్కలంగా లాభాలొస్తాయన్నప్పుడే. అనగా ప్రజలకు కావలసిన వస్తువులన్నీ తాము సొంతంగా తయారుచేసుకునే హక్కు లేదన్నమాట. కార్మికుల జీవితంకూడా యజమానుల యిష్టా యిష్టాలపైనే ఆధారపడి యుంటుందన్నమాట.

ఇట్టి ఆర్థికవిధానం అక్రమం, అశాస్త్రీయం, అన్యాయం, అవినీతికరం అని సోవియట్ ప్రజలు నమ్మి దానిని నిర్మూలించి, మరొక కొత్త విధానాన్ని స్థాపించుకున్నారు. దీన్నే సోషలిజం అంటాం.

## రష్యాలో ఉత్పత్తి విధానం

సోవియట్ రష్యాలో భూమి, ఫ్యాక్టరీలు, గనులు, రైల్వేలు ప్రజల ఆస్థి. వ్యక్తులకు వీటిపై పెత్తనంలేదు. ఏ కొద్దిమంది పెట్టుబడిదారుల లాభంకొరకో యివి నడుపబడవు; ప్రజల అవసరాలను తీర్చడానికే నడుపబడతాయి. రష్యాయొక్క ఉత్పత్తి విధానానికంతకూ ప్రధానం ప్రజల అవసరాలు. ఏ యే సరుకులు అన్నింటికంటె యెక్కువ అవసరమో నిర్ణయించేది ప్రజలు. వేటిని ముందు తయారుచేయాలో, వేటిని తరువాత తయారుచేయాలో నిర్ణయించేది ప్రజలు. తమ తమ సంస్థలద్వారా ప్రజలే ఒక ప్లానుప్రకారం ఏ యే సరుకును ఎంతెంత తయారుచేయాలో, అందుకవసరమైన ఆదాయాన్ని ఎలా సేకరించుకోవాలో, నిర్ణయాలు తీసుకుంటారు. ఒక పంచాయతీబోర్డు ప్రతియేటా ఆదాయ వ్యయ పట్టీని తయారుచేసి, గ్రామ జీవనాన్ని యెలా నడుపుతుందో, అలాగే సోవియట్ యూనియన్‌లో ఆదాయ వ్యయ పట్టీలనుబట్టి ఉత్పత్తి విధానం నడుపబడుతుంది. ఇంగ్లండు మొదలైన దేశాలలో ప్రతికుటుంబం ఆహారానికెంత ఖర్చుపెట్టాలో, అద్దెకు ఎంత ఖర్చుపెట్టాలో, బట్టలకెంతో, చదువుకెంతో, మందులకెంతో, దాన ధర్మాలకెంతో, అంచనావేసి మిగతా సొమ్మును విలా

సాలకుగాని, నిలవకుగాని ఖర్చుపెడతారు. ఇలాగే రష్యాలో ఏ యే సంవత్సరం ఏ యే సరకులకు ఎంతెంత ఖర్చుచేయాలో అంచనావేసి, అందు కవసరమైన సొమ్మును సేకరిస్తారు.

సోవియట్ రష్యా అంతటి పెద్ద దేశానికి వివరాలతో యిట్టి ప్లానును తయారు చెయ్యాలంటే అనేక చిక్కులొస్తాయి. అయినా మూలసూత్రం యేమిటో తెలుసుకుంటే కష్టం అనిపించదు.

## ప్రజల అవసరాలు

అసలు ప్లాను యెక్కడ, ఎలా ప్రారంభమవుతుందో చూదాం. బండిచక్రానికిమధ్య యిరుసు, ఆ యిరుసుచుట్టూ ఆకులు, యెలా అమర్చబడి ఉంటాయో, అలాగే ఉత్పత్తివిధానాని కంతకూ కేంద్రస్థానంలో ప్రజల అవసరాలుంటాయి; వాటిచుట్టూ అనేక పరిశ్రమలుంటాయి. అంతే గాని, కొద్దిమంది పెట్టుబడిదార్ల లాభాలచుట్టూ పరిశ్రమలుండవు.

సాధారణంగా ప్రజల అవసరాలెట్టివో పరిశీలిద్దాం. ఆహారం, బట్ట, యిల్లు, అన్నింటికంటె ముఖ్యం. తరవాత తమ్ముతాము రక్షించుకో డాని కవసరమైన సాధనసామగ్రి. ఇవన్నీ కావాలంటే ఇనుము, ఉక్కు, బొగ్గు, రాగి, దూది, కలప మొదలైనవి ఎన్నో అవసరం. వీటికై గనులు తవ్వాలి; ఫౌండ్రీలు తెరవాలి; ఆ ఫౌండ్రీలో యంత్రాలు తయారుకావాలి. ఒక్కొక్క సరుకును రవానా చేయడాని కవసరమైన రైళ్లు, వేగన్లు కావాలి.

అయితే, కేవలం యంత్రసామగ్రితోనే ప్రజల అవసరాలు తీరుతాయా? ఒక ఆయిల్ ఎక్స్‌పెల్లర్ తిని మనం ఆకలి తీర్చుకోగలమా? బియ్యం, గోధుమలు, రాగులు, జొన్నలు, కందులు, మినుములు వగైరా కాయధాన్యాలుకూడా కావాలి. కట్టుకోడానికి బట్టలు కావాలి. నివసించడానికి యిళ్లుకావాలి. తొడుక్కోడానికి జోళ్లుకావాలి. ఏటేటా వీటిని ప్రజల అవసరాన్నిబట్టి తయారుచేయడానికి బడ్జట్‌లో కొంతసొమ్మును ప్రత్యేకించాలి.

ఇలాగే, వీటిని తయారుచేసే యంత్రసామగ్రికై మరికొంత ధనాన్ని ప్రత్యేకించాలి.

ఆహారం, బట్ట, యిళ్లు, జోళ్లు, యంత్రసామగ్రిమాత్రమే కాకుండా, పాఠశాలలు, హైస్కూళ్లు, కాలేజీలు కూడా మనకవసరం. ఇందుకై చక్కని ఉపాధ్యాయుల్ని తరిఫీదుచెయ్యాలి. హాస్పిటళ్లు వగైరా ఆరోగ్య వసతులు ఉండాలి. వాటిల్లో పనిచేయడానికి డాక్టర్లకూ, నర్సులకూ శిక్షణ యివ్వాలి.

పత్రికలు, సినీమాలు, నాటకాలు, రేడియోలు కూడా విరివిగా స్థాపించబడాలి.

ఈవిధంగా, ప్రజల శారీరక - మానసిక శక్తుల్ని అభివృద్ధిపరచడాని కవసరమైన ప్రతివిషయం ప్లానులో యిమిడి ఉంటుంది. కనుకనే, ఒక దేశంయొక్క ఉత్పత్తివిధానాన్ని నిర్వహించడానికి ప్రతి చిన్న వివరంలోకి పోవలసిన అవసరం కలుగుతుంది. ఈవిధంగా, ప్రతియేటా ప్రజల అవసరాల్నిబట్టి ఉత్పత్తివిధానం అంతా ప్లానుప్రకారం నడుపబడితే, మానవసమాజం అంతా ఒక చక్కని సమిష్టికుటుంబంగా వర్ధిల్లుతుంది. ప్రతివ్యక్తి సంఘానికి నెరవేర్చవలసిన విధులు, సంఘంవల్ల తాను పొందే సౌకర్యాలు ఎన్నో ఉంటాయి. సంఘంకొరకు వ్యక్తి, వ్యక్తికొరకు సంఘం, పాటుపడే పద్ధతి ఆచరణలోకి వస్తుంది.

# 2. పంచవర్ష ప్రణాళికలు

సమగ్రమైన ఒక ప్లానుప్రకారం రష్యాలో ఉత్పత్తి యెలా జరుగుతుందో యిప్పుడు పరిశీలిద్దాం. మొట్టమొదట మనం జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయాలు రెండు. మొదటిది : ప్రజల అవసరాలనుబట్టి మాత్రమే అక్కడ సరుకులు ఉత్పత్తిచేయబడతాయి. రెండోది : భూమి, యంత్రాలు, ఫ్యాక్టరీలు, రైళ్లు—ఇవన్నీ వ్యక్తులచేతుల్లో కాకుండా ప్రభుత్వంచేతుల్లో (ప్రజలచే ఎన్నుకొనబడేది) ఉంటాయి.

దేశంయొక్క ఉత్పత్తివిధానాన్ని నడిపే నిమిత్తం సోవియట్ ప్రభుత్వం ఒక ప్లానింగ్ కమిషన్‌ను నియమిస్తుంది. 5 సంవత్సరాలకొకసారి యీ కమిషన్ ప్రణాళికను ప్రచురిస్తుంది. వీటినే "పంచవర్ష ప్రణాళిక"లంటారు. స్టేట్ ప్లానింగ్ కమిషన్‌వారి కార్యాలయం మాస్కో నగరంలో వుంటుంది. ఎత్తైన అనేకపెద్దభవనాలలో వివిధశాఖలకు సంబంధించిన ఆఫీసులు నిరంతరం పనిచేస్తూవుంటాయి. ప్రపంచంలో మరే సంస్థా యింత విశాలమైన భూభాగంలో, యింతమందిప్రజల నిత్య జీవితంతో సంబంధం కలిగియుండదు. అందువల్ల దీనికున్నంత ప్రాముఖ్యత ప్రపంచంలో ఏ సంస్థకూ లేదు. ప్రతి చిన్న ఫ్యాక్టరీ, ప్రతి యకరం భూమి, ప్రతి పాఠశాల, ప్రతి సినిమాహాలు, ప్రతి నాటకశాల, ప్రతి కోర్టు, ప్రతి ఆసుపత్రి, ప్రతి సైనికదళం స్టేట్ ప్లానింగ్ కమీషన్ యొక్క పరిశీలనకు గురికాక తప్పదు.

వివిధ శాఖలలో పనిచేసేవారందరికీ వారి వారి సంఘాలుంటాయి. ఫ్యాక్టరీ కార్మికులకు ట్రేడ్ యూనియన్‌లు, వ్యవసాయంచేసే రైతులకు గ్రామ సోవియట్లు, విద్యార్థులకు విద్యార్థి సంఘాలు, ఉపాధ్యాయులకు ఉపాధ్యాయ సంఘాలు, రచయితలకు రచయితల సంఘాలు, నటకులకు

నటకుల సంఘాలు — యిలా ఏ యే వృత్తులలో పనిచేసేవారికి వారి వారి సంఘాలుంటాయి. వాటిద్వారా స్టేట్ ప్లానింగ్ కమీషన్ పంపే ప్రశ్నలకు ప్రజలు జవాబులిస్తూ, ఎప్పటికప్పుడు భోగట్టా పంపుతూవుండాలి. ఇది ప్రభుత్వంయొక్క ఆజ్ఞ. ఏ యే గ్రామంలో ఏ యే పంట పండేదీ, ఇప్పుడు ఎంతెంత పండుతూన్నదీ, అంతకంటె ఎక్కువ పండించడానికి ఏ యే అవకాశాలున్నవీ, గ్రామసోవియట్లు లెక్కలువేసి పంపాలి. ఊళ్ళు లకు యెన్ని ట్రాక్టర్లు అవసరమో, కోతలకు యెన్ని కంబైన్లు కావాలో తెలియచేయాలి. ప్రతి ఫ్యాక్టరీలోను ఇప్పుడెంతెంత సరుకు తయారౌతూ న్నదీ, కొత్తరకపు యంత్రాలతో యెంత సరుకు తయారయేదీ, అందుకు ఎంతమంది కార్మికులు కావలసినదీ, ఆయా ట్రేడుయూనియన్లు వివరాలతో పంపాలి. ఇలాగే మానవ జీవితంయొక్క ప్రతి శాఖకు సంబంధించిన లెక్కలు స్టేట్ ప్లానింగు కమిషన్ కార్యాలయానికి పంపుతారు. ఈవిధంగా ప్రతిరోజూ, ప్రతిగంట, ప్రతి నిమిషం వచ్చే భోగట్టాను ఎప్పటికప్పుడు అందుకొని ఏ డిపార్టుమెంటుకు పంపవలసిన కాగితాలను ఆ డిపార్టుమెం టుకు పంపుతూ, వాటిని యెలా వుపయోగించుకోవాలో అలా వుపయో గించుకుంటూంటారు. ఈ కార్యాలయంలో చక్కని శాస్త్రజ్ఞానం కలిగి, ఎంతో తర్ఫీదుపొందిన, నిపుణులు కొన్ని వేలమంది పనిచేస్తుంటారు. వారికింద అనేకవేలమంది గుమాస్తాలు వారి సహాయార్థం వుంటారు. ఇలాంటి అపూర్వమైన సంస్థ ప్రపంచంలో యెక్కడా లేదు.

## ప్లానులో ప్రతివ్యక్తికీ స్థానం

ఈ కార్యాలయం ఏ కలెక్టరాఫీసువంటిదో, ఏ సూపరింటెండింగు ఇంజనీయరు ఆఫీసువంటిదో కాదు. హృదయంలేని గుమాస్తాలుకాదు అందులో పనిచేసేది. లంచగొండి వుద్యోగస్థులకు అందులో ఏలాంటి స్థానమూ లేదు. అనేక లక్షలమంది స్త్రీపురుషుల, బాలబాలికల, భవిష్య త్తును నిర్ణయిస్తున్నామనే విషయం అందులో పనిచేసే ప్రతివ్యక్తికీ తెలుసు. ఆ కార్యాలయానికి వచ్చే లెక్కలలో ప్రతివ్యక్తికీ స్థానం వుంటుంది. శరీరదారుఢ్యం గలవారి లెక్కలు ఒక ప్రత్యేకమైన శాఖకు

చేందుతాయి. శక్తి ఉడిగిపోయినా, వృద్ధాప్యంవచ్చినా, బాగా చిన్నవయస్సులో వున్నా, ఇంటిపనులలోవున్నా, శాస్త్రపరిశోధనలలో నిమగ్నులై వున్నా, చదువుకొంటున్నా, యుద్ధరంగంలో పోరాడుతున్నా, అలాంటివారి వివరాలు ప్రత్యేక శాఖలలో చేర్చుతారు. ఈవిధంగా సరుకుల వుత్పత్తికి మొత్తం ఎంతమంది పనికివచ్చే కార్మికులున్నారో మొదట తెలుసుకుంటారు.

ఇంతమంది ప్రజలకు ఆహారం, బట్ట, ఇళ్లు, విద్య, ఆరోగ్యం, విరామం ఎంతెంత అవసరమో మరొక డిపార్టుమెంటు వివరాలను సేకరిస్తుంది. మొత్తం దేశానికంతకు రక్షణయేర్పాట్లు ఏమేమి చేయాలో, ఫ్యాక్టరీలు, గనులు, యంత్రాలు, ఇలాంటి ఉత్పత్తిసాధనాలు ఎన్ని అవసరమోకూడ పై కార్యాలయంలో అంచనావేస్తారు.

స్టేట్ ప్లానింగు కమిషనువారి కార్యాలయానికి ఇట్టి లెక్కలు ఎడతెగకుండా నిరంతరం చేరుతుంటాయి. ప్రతి పరిశ్రమలోను, ప్రతి వ్యవసాయ కేంద్రంలోను, ప్రతి వైజ్ఞానికసంస్థలోను, గత సంవత్సరం ఏమేమి ఎంత తయారైనదీ, ఈసంవత్సరం ఏమేమి తయారుకాబోతున్నదీ, వివరాలీయడమే కాకుండా, అయా సంస్థలలో పనిచేయడానికి ఎంతెంతమంది మనుష్యులవసరమో, ఎన్నెన్ని ముడిపదార్థాలు కావాలో, ఎంత అప్పు తీసుకోవలసివున్నదో, ఎలాంటి రవాణాసౌకర్యాలు వుండాలోకూడా తెలియజేయవలసి వుంది. ప్రజల ఆహారంకొరకు, బట్టలకొరకు, ఇతర అవసరాలకొరకు, యిప్పుడెట్టి ఏర్పాట్లు జరుగుతున్నాయో, యికముందు ఏయేర్పాట్లు అవసరమోకూడా సూచించుతారు.

ఈలెక్కలన్నింటినిబట్టి, వచ్చేసంవత్సరం ఏయే పరిశ్రమలలో ఎంతెంత తయారుకావడానికి అవకాశంవుందో ప్లానింగ్ కమిషన్ దామాషా లెక్కలను తయారుచేస్తుంది. కాని, ఈ లెక్కలే అంతిమనిర్ణయాలు కావు. జాతీయశక్తుల్ని కొన్ని పరిశ్రమలలో ఎక్కువగాను, మరికొన్ని పరిశ్రమలలో తక్కువగాను వినియోగించవలసి వస్తుంది. ఉదాహరణకు, యుద్ధపరిశ్రమలో గత సంవత్సరంకంటె ఎక్కువ పెట్టుబడి

అవసరంకావచ్చు. అలాంటప్పుడు బట్ట ఉత్పత్తినిగాని, జోళ్ళ ఉత్పత్తినిగాని తగ్గించవలసి వస్తుంది. ఒక్కొక్క సంవత్సరం యంత్రపరిశ్రమల ఉత్పత్తికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వవలసివస్తుంది. మరొక సంవత్సరం జీవితావసరాల ఉత్పత్తికి, ఇంకొక సంవత్సరం వైజ్ఞానికాభివృద్ధికి, ఎక్కువ ప్రాధాన్యత నీయవలసివస్తుంది. ఈ విషయాలనుగూర్చి రాజ్యాంగయంత్రం లోని ముఖ్యశాఖలయొక్క సహకారంతో (వీటిని పీపుల్స్‌కమిసారియట్లు అంటారు) కమ్యూనిస్టు సెంట్రల్‌కమిటీ కొన్ని సూచనలిస్తుంది.

## నిర్ణయాలీయడం సులభంకాదు

ఇది అంత సులభమైన పనికాదు, ప్రతియేటా జనసంఖ్య అతివేగంగా వృద్ధిచెందుతూన్న పరిస్థితులలో, ఏయేటా కార్మికు లెంతమంది లభిస్తారో సరిగా అంచనావేయడం మాటలుకాదు. గత 18 సంవత్సరాలలో రష్యా జనసంఖ్య షుమారు 3½ కోట్లు పెరిగింది. ఈసంఖ్య పోలెండ్ జనాభాకంటె పెద్దది. ఇంతేకాదు, ఈసంవత్సరంకంటే వచ్చేసంవత్సరంలో కార్మికుల నైపుణ్యం ఎట్టిస్థాయిలో ఉంటుందో చెప్పలేము। ప్రజల అవసరాలన్నింటినీ అంచనావేయడంకూడా కష్టమే. దేశం మొత్తంమీద ఫ్యాక్టరీలన్నింటికి ఎంతబొగ్గు అవసరమో, ఎంత విద్యుచ్ఛక్తికావాలో, లెక్కలువేయాలి. అదనపు విద్యుచ్ఛక్తిని సప్లయిచేయడంవల్ల యితర అవసరాలెంతవరకు తగ్గుతాయో నిర్ణయించాలి. రవాణాసౌకర్యా లెంతవరకు అవసరమో, వాటిని స్థానికంగా యేర్పాటుచేయడంవల్ల ఎంత కలిసి వస్తుందో తెలియాలి. ఒక పరిశ్రమను మరొకచోటికి మార్చడంవల్ల ఎంతవరకు ఉపయోగకరమో తెలుసుకోవాలి. వ్యవసాయంలో యంత్రశక్తిని ప్రవేశపెట్టడంవల్ల సహజంగా రైతుల అవసరం పూర్వంఅంత ఉండదు. మిగతావారందరినీ ఏయే పరిశ్రమలకు పంపాలి? లేదా ఏయే కేంద్రాలలో పనిచేయించాలి? ఈప్రశ్న లన్నింటికీ జవాబులిస్తూ వేర్వేరు ప్రభుత్వ శాఖలద్వారా స్టేట్ ప్లానింగ్ కమిషన్, కమ్యూనిస్టుపార్టీ సూచనల కనుగుణ్యంగా సమగ్రమైన ఒక తాత్కాలికప్లానును తయారుచేసి క్రింది సంస్థలకు పంపుతుంది.



ప్రజల కవసరమైన వస్తువులు
పంచవర్ష ప్రణాళిక ముడివస్తువులు కార్మికులు




ఫ్యాక్టరీలు




స్టేట్ ప్లానింగ్ కమిషన్
వివిధ మంత్రివర్గశాఖలు
చిన్న యంత్రాల పరిశ్రమ
పెద్ద యంత్రాల పరిశ్రమ
ఆహారపదార్థాల శాఖ
వ్యవసాయశాఖ
ఆర్థిక శాఖ
ఒకమాదిరి పెద్ద యంత్రాల పరిశ్రమ




గోర్కీ మోటారు ఫ్యాక్టరీ




ఫ్యాక్టరీ కార్మికులు తమకు సంబంధించిన ప్లానును చర్చించుచున్నారు




ప్లానును గురించి చర్చలు. సూచనలు.

# తాత్కాలిక ప్లాను

ఇప్పుడు బండిచక్రాలు మళ్ళీ వెనుకకు తిరుగుతాయి. మొదట సోవియటు యూనియన్‌లో వున్న ప్రతి ఫ్యాక్టరీనుంచి, ప్రతి వ్యవసాయ క్షేత్రంనుంచి, ప్రతి స్కూలునుంచి, ప్రతి ఆసుపత్రినుంచి వివరాలతో గూడిన లెక్కలు స్టేట్ ప్లానింగ్ కమిషన్ కార్యాలయానికి చేరాయి. ఇప్పుడు సమగ్రమైన ఒక ప్లానును వివరాలతో, ప్రతి సంస్థకు స్టేట్ ప్లానింగు కమిషన్ పంపుతోంది. దేశంయొక్క మొత్తం అవసరాల కనుగుణ్యంగా ఏ ఫ్యాక్టరీలో ఎంత సరుకు తయారుకావాలో, అందు కవసరమైన బొగ్గు, విద్యుచ్ఛక్తి, ముడి పదార్థాలు, ఎంతెంత సరఫరా చేయబడతాయో, ఎంతమంది కార్మికులు పనిచేస్తారో వివరాలతో తెలియజేస్తారు. అలాగే ప్రతి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో యెంత పంటనుపండించ వలసియుందో, అందుకెన్ని ట్రాక్టర్లు సప్లయి చేయబడతాయో, పని చేసేవా రెంతమంది ఉంటారో, మొదలైన వివరాలతో తెలియజేస్తారు. ఒక స్కూలులోగాని, కాలేజీలోగాని యెంతమంది విద్యార్థులకు శిక్షణ యివ్వాలో, ఉపాధ్యాయు లెంతమంది ఉంటారో, వారికి జీతాలెంతో మొదలైన లెక్కలు తయారుచేసి పంపుతారు. ప్రతి ఫ్యాక్టరీ, ప్రతి వ్యవసాయ క్షేత్రం, ప్రతి విద్యాకేంద్రం, ప్రతి సినిమా, ప్రతి నాటకశాల, ప్రతి కో-ఆపరేటివ్ స్టోరు - యీ ప్లానునుగురించి తమ తమ అభిప్రాయా లీయవలసిందని కోరుతారు.

పైనుండి వచ్చిన యీసూచనల్ని ప్రతి చిన్న సంస్థా ఎంతో బాధ్యతతో పరిశీలిస్తుంది. ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రం తన శక్తికిమించిన కోటా యివ్వబడినట్లు భావించవచ్చు. లేదా ముడి సరుకు యిప్పటికంటె వేగంగా సప్లయి చేయబడినప్పుడే ఆ కోటాను పూర్తిచేయ గల్గవచ్చు. ఒక ఫ్యాక్టరీకిచ్చిన కోటా చాలా స్వల్పం అని కార్మికులు అభిప్రాయపడవచ్చు. ఎందువల్లనంటే, అందులోవున్న యంత్రాలు యిప్పటికంటె జోరుగా నడిచే కొత్త ఉపాయం ఏదైనా వారు కనిపెట్టియుండవచ్చు. లేదా ఒక కొత్త పరిశోధనవల్ల యిప్పటికంటె తక్కువ ముడిసరుకే సరి

పోవచ్చు. ఈవిధంగా ప్రతి సంస్థలోనూ సమావేశాలు జరుపుకొని కొత్త సూచనలేవైనా వుంటే, ప్రభుత్వానికి సమిష్టిగా తెలియజేస్తారు. అనగా బండి చక్రాలు మళ్ళీ రెండోసారి ప్లానింగు కమిషన్ వైపుకు ప్రయాణం చేస్తాయి. ఆఫీసు అంతా మళ్ళీ కొత్త సూచనలతో నిండుతుంది. మళ్ళీ నిపుణులు కూర్చొని వీటినిగురించి తర్జనభర్జనచేసి, చివరకు తమ అంతిమ నిర్ణయాలు గావిస్తారు.

5 సంవత్సరాల కొకసారి యిట్టి నిర్ణయాలు దేశానికంతకూ పంప బడతాయి. ఈ కోటాలను ప్రతి వ్యవసాయక్షేత్రం, ప్రతి ఫ్యాక్టరీ, ప్రతి విద్యాసంస్థ, ప్రతి ఆసుపత్రి, పూర్తిచేయాలి. వీటికే "పంచవర్ష ప్రణాళిక" అని పేరు.

స్టేట్ ప్లానింగ్ కమీషన్ పంపే యిట్టి అంతిమనిర్ణయాలకై 17 కోట్ల మంది సోవియట్ పౌరులు కుతూహలంతో యెదురు చూస్తూవుంటారు. మన దేశంలో పరీక్షా ఫలితాలకొరకు యే కాలేజీవిద్యార్థీ యింత ఆతృతతో యెదురుచూడడు. ప్రతి సోవియట్ పౌరునికీ యీ ప్లాను ఒక పరమా వధి. తన జీవితాన్ని ముందుకు నడిపించే మార్గదర్శి; తన అభ్యున్నతికి తోడ్పడే చెలికాడు.

మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలు సోవియట్ ప్రజల్ని ఆర్థికంగాను, వైజ్ఞానికంగాను యెంతో ముందుకు తీసుకెళ్ళాయి. ఇప్పుడు 3 వ పంచవర్ష ప్రణాళిక సాగుతోంది. ఇది 1942 లో పూర్తికావలసింది. దీని వల్ల సోవియట్ ప్రజల నిత్య జీవితావసరాలు, యింటి సౌకర్యాలు, వైజ్ఞానిక సంపద, పూర్వంకంటె యెక్కువ సంతృప్తికరంగా అభివృద్ధి పొందాయి. "రష్యాలో నేడు నిరుద్యోగం అనే సమస్య లేదు. పల్లెటూళ్ళలో పేదరికంలేదు. ఇప్పటి సమస్య ప్రజల ఆర్థిక - వైజ్ఞానిక సంపదను యే యితర పెట్టుబడిదారీ దేశాలలోను లేనంతగా వృద్ధిచేయడమే" అని మూడవ పంచవర్ష ప్రణాళిక చెబుతోంది.

# 3. శాస్త్ర పరిశోధన

మానవజీవితాన్ని తేజోవంతంగా చేయడానికి సోవియట్ ప్రభుత్వం శాస్త్రపరిశోధన కెంతైనా ప్రోత్సాహమిస్తుంది. ఏ దేశంలోనూ శాస్త్ర విద్యలకింత ప్రోత్సాహంలేదు.

ఇందుకు కారణంలేక పోలేదు. పెట్టుబడిదారీ దేశాలలో శాస్త్రవిద్య లెంతవరకు షాహుకార్లకు లాభాలు సంపాదించిపెట్టుతాయో, అంతవరకు మాత్రమే వాటిని పోషిస్తారు. ఉదాహరణకు, ఒకబట్టలమిల్లు తీసుకుందాం. అందులో యిప్పుడు తిరిగే యంత్రాన్ని తీసివేసి, మరొక కొత్తయంత్రాన్ని ప్రవేశపెట్టడంవల్ల సగంమంది కార్మికులతోనే మిల్లును నడిపించవచ్చు; అప్పుడు యజమాని కూలీలకీయవలసిన జీతాలమొత్తం తగ్గుతుంది. లాభం యెక్కువౌతుంది. అందువల్ల కొత్తయంత్రాన్ని మిల్లులో ప్రవేశపెడతాడు. కాని, తీసివేయబడిన సగంమంది కార్మికులు నిరుద్యోగులలో కలిసిపోయి, శాస్త్రపరిశోధనను దూషిస్తారు. కారణం, అది తమ అన్నాన్ని మట్టిలో కలిపింది! మద్రాసులో సుమారు 20 సంవత్సరాల క్రితం పాయఖానా దొడ్లలో ఫ్లష్‌ఔట్ పద్ధతి ప్రవేశపెట్టబడింది. దొడ్లు శుభ్రం చేయడానికి పాకీపనివారి అవసరంలేకుండా, పైనున్న గొలుసులాగితే నీళ్లవేగంగా ప్రవహించి, ఒకలోతైన సొరంగంద్వారా భూమిలోకి పోతాయి. ఈ పద్ధతి వల్ల కొన్ని వేలమంది కార్మికులు నిరుద్యోగులయారు. తమను యీ గతికి తీసుకొచ్చింది "ఫ్లష్‌ఔట్" దొడ్లేనని వారు యిప్పటికీ దూషిస్తారు.

సోవియట్ యూనియన్‌లో ఇలాకాదు. అక్కడ శాస్త్రవిద్యలన్నీ మానవ జీవితాన్ని సౌఖ్యవంతంగా చేస్తాయి. సాధారణంగా యంత్రశక్తి వల్ల మనుష్యులశ్రమ చాలా వరకు తగ్గుతుంది; అనగా పనిచేసే గంటల సంఖ్యతగ్గుతుంది. అదనంగాఉన్న కార్మికుల్ని మరొక పరిశ్రమకుపంపు తారు. నిరుద్యోగం అనే రాక్షసికి కార్మికులు బలికానవసరంలేదు. శరీర

దారుఢ్యంగల ప్రతివ్యక్తి - స్త్రీపురుషుడు - సంఘానికి ఉపయోగించే ఏదో ఒక పనిచేసితీరాలి. అలాంటి అవకాశం ప్రభుత్వం కల్పిస్తుంది.

కాబట్టి, సోవియట్ ప్రభుత్వం శాస్త్రవిద్యలకూ - మానవ జీవితానికీ మధ్య ఎట్టి అవినాభావసంబంధం ఉంటుందో గుర్తించి, శాస్త్ర పరిశోధన కెంతప్రోత్సాహం యివ్వాలో అంతా యిస్తుంది. కొద్దిమంది పెట్టుబడిదార్ల లాభాల కొరకుకాదు సోవియట్‌లో శాస్త్రపరిశోధన. రష్యాలో 1918 లో మొత్తం 211 పరిశోధనాలయాలు ఉంటే, 1938 నాటికి వాటిసంఖ్య 2,292 కు పెరిగింది; నిపుణుల సంఖ్య ఎక్కువౌతూన్నకొద్దీ, పరిశోధ నాలయాల సంఖ్యకూడా సహజ గా పెరుగుతూఉంటుంది. 17 కోట్లమంది జనాభాలో నిపుణులు దాదాపు 1 కోటిమంది ఉన్నారంటే, రష్యాలో శాస్త్ర విద్యలకెంత ప్రోత్సాహంఉందో తెలుసుకోవచ్చు. ఇతరదేశాలలోపరిశోధన లంటే ఎంతో గోప్యంగా ఉంచి, పెట్టుబడిదార్లు దానివల్ల లాభాలు సంపా దిస్తారు. రష్యాలో అలాకాదు, ప్రతిపరిశోధన ప్రజలసొత్తు; రహస్యం అనేది ఉండదు.

## వృక్ష శాస్త్రంలో పరిశోధనలు

వ్యవసాయంలోను, ఫల వృక్షాలలోను, శాస్త్ర పరిశోధన యెలా జరుగుతూందో చూద్దాం.

సోవియట్ ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటినుంచీ కొత్తరకాల విత్తనాలకై ప్రపంచంలో నలువైపులకు శాస్త్రపరిశోధకుల్ని పంపించారు. ఈ పనికి నాయకత్వంవహించి నడిపింది ప్రొఫెసరు వవిలోవ్. ఈయన లెనిన్ వ్యవసాయ పరిశోధన సంఘానికి అధ్యక్షుడు (Lenin Academy of Agricultural science). అద్భుతమైన వ్యక్తి. అసమానమైన శక్తి సంపన్నుడు. రోజుకు కొలది గంటలసేపు మాత్రమే నిద్రపోతాడు. ఈయన శరీరంలోవున్న నరాలు ఉక్కుతో చేయబడినవా? అనిపిస్తుంది. ఈయననుగురించి ఒక చిత్రమైన గాధవుంది. ఒకరోజున వవిలోవ్, బాకూ పట్టణంవైపు విమానంలో ప్రయాణంచేస్తూంటే విపరీతమైన గాలి వచ్చిందట. అది గంటకు 90 మైళ్ళచొప్పున వీస్తోందట. అందువల్ల

నేలమీద దిగడం అసాధ్యమయింది. అక్కడకు దగ్గరలోనేవున్న ఒక కొండమీద ఆశ్రియం తీసుకుందామని దానిమీద దిగాడు. కాని ఇంజన్‌లో పెట్రోలు అయిపోయింది. తోడి వైమానికులుకూడా యిదే స్థితిలో వున్నారు. ఏమిచేయాలో యెవరికీ తోచటంలేదు. చర్చలవల్లకూడా ఉపయోగం కనపడలేదు. ప్రొఫెసర్ వవిలోవ్ యిట్టి స్థితిలో ప్రశాంతంగా నిద్రపోయాడట!

ఎంత ధీరచిత్తుడై యుండాలి ఆ ప్రొఫెసర్!!

వవిలోవ్ నాయకత్వంక్రింద మొత్తం 60 పరిశోధకదళాలు ప్రపంచ యాత్రచేసి, 3 లక్షల కొత్త నమూనాలతో తిరిగివచ్చారు. ప్రపంచంలో యెక్కడా వృక్షశాస్త్రానికి సంబంధించిన యిన్ని నమూనాలు లేవు.

ఒక్కొక్క విత్తనం యెంతెంతకాలానికి పంటకువచ్చేదీ యీ నమూనాలు తెలియజేస్తాయి.

కొన్ని ప్రదేశాలలో యితరచోట్లకంటె యెక్కువ రకాలు పండుతాయి. ఉదాహరణకు ధాన్యంపంట తీసుకుందాం: అనేక ప్రదేశాలలో అనేకరకాల ధాన్యం పండడం చూస్తున్నాం. కాని, శాస్త్రజ్ఞులు యెక్కువ రకాల వరి యెక్కడైతే పండుతుందో ఆ ప్రదేశంలో ప్రాచీనకాలంనుంచీ వరి పండుతున్నట్లు సిద్ధాంతీకరించారు. వరిపంటకు ఆ ప్రాంతం పుట్టినిల్లని స్పష్టపడింది.

ఈ సూత్రాన్నిబట్టి ఆసియాఖండమందలి నైరుతిభాగం (అఫ్ఘనిస్తాన్, పెర్షియా, ఈరాన్, ఇరాక్ మొదలైనవి) వరి ధాన్యానికీ, మెత్తని గోధుమలకూ, బఠానీలకూ, వెడల్పు చిక్కుడుకూ, బాదంపప్పుకూ, Lentils అనే కాయ ధాన్యానికీ, Apricots అనే పండుకూ, పుట్టినిల్లని నిర్ణయించారు. ఇదేవిధంగా బార్లీకి, సోయాచిక్కుడుకూ, ఓట్లు అనే ధాన్యానికీ, ఆసియాఖండమందలి ఆగ్నేయభాగం (చైనా, సయాం, ఇండోచైనా, మొదలైనవి) పుట్టినిల్లని ధృవపరిచారు. అబిసీనియాదేశం గట్టి గోధుమజాతికీ, దక్షిణఅమెరికా బంగాళాదుంపకు, టొమాటోకు, పొగాకుకు పుట్టినిల్లని తెలుసుకున్నారు. చిన్న దేశమైన అబిసీనియాలో, యే గ్రామం

అయినా వెళ్ళి గుప్పెడు గోధుమగింజలను పరిశీలిస్తే, అందులో షుమారు 50 రకాలు కనపడతాయట. జారు కాలంనాటి రష్యా అంతా వెతికినా యీ రకాలన్నీ లేవట.

## 30 వేల రకాల గోధుమ

వ్యవసాయ శాస్త్రజ్ఞులు యీవిధంగా నిర్ణయించిన కొన్ని ప్రదేశాలకు వెళ్ళి, అక్కడలభించే విత్తనాలను సేకరించారు. వాటిపై పరిశోధనలు ప్రారంభించారు. ఉదాహరణకు: లెనిన్‌గ్రాడ్ యందలి ఒక పెద్ద భవనంలో యీరోజున 30,000 రకాల గోధుమవిత్తనా లున్నాయి.

రష్యను శాస్త్రజ్ఞులు గోధుమ పంటకు యెక్కువ ప్రాధాన్యత నిస్తారు. ఎందువల్లనంటే ఇదే రష్యన్లకు ముఖ్యమైన భోజనం. గోధుమ అసలే పండని ఉత్తర ధృవ ప్రాంతంలోను, పురుగుపట్టే రాష్ట్రాలలోను, శాస్త్రీయ పద్ధతులప్రకారం గోధుమపంటను పండించగలిగారు. అధికాహారోత్పత్తిని ఒక ఉద్యమంగా నడిపారు. అమెరికావంటి పెట్టుబడిదారీ దేశాలలో ఒక్కొక్క సంవత్సరం గోధుమల ధర అకస్మాత్తుగా పడిపోతే వెంటనే షాహుకార్లు వేలకొద్దీ టన్నుల సరుకును సముద్రంలో కలిపివేసి ధరను నిలబెట్టుతారు. కాని, ఆ దేశంలోనే గోధుమలు సరిపోక లక్షలాది నిరుద్యోగులు బాధపడుతూ వుంటారు. రష్యాలో ఇలాకాదు. సిద్ధాన్నాన్ని సముద్రంలో కలపడం అక్కడ ఘోరమైన అపరాధం. ఎంత యెక్కువ పండితే అంత మంచిదని భావిస్తారు.

రష్యాలో మంచిమంచి గోధుమజాతులు ఎన్నో పండుతాయి. అయితే, కొన్ని ప్రాంతాలలో గింజచిన్నదిగా ఉంటుంది; మరికొన్నిచోట్ల పంట తక్కువ పండుతుంది. కొన్ని ప్రాంతాలలో పురుగు తినివేస్తుంది. ఈలోపాలన్నీలేని ఒక గోధుమజాతిని పరిశోధించడానికి రష్యన్‌శాస్త్రజ్ఞులు తంటాలుపడ్డారు. ఇతర దేశాలలోలభించిన మేలురకం గోధుమతో రష్యన్ గోధుమను అంటుకట్టి పై లోపాలను సరిదిద్దారు. ఉదాహరణకు: అబిసీనియాజాతి త్వరలో పంటకొస్తుంది. ట్రాన్స్‌కాకేషియాజాతికి చీడపట్టదు; దక్షిణజాతి గోధుమగింజ చాలా పెద్దది. ఆఫ్ఘనిస్తాన్ గోధుమ ఎర్రాలు

లేకపోయినా, నాశనంకాదు. లక్షణాలన్నీ కలిసిఉన్న ఒక గోధుమ విత్తనం కొరకు ఎన్నోపరిశోధనలు జరిగాయి. తమకుపలభించిన విత్తనాలన్నింటినీ తీసుకొని, ఒక రకం గోధుమకూ, యితర రకాలకూ - అంటుకట్టి, కొత్త గోధుమజాతిని పండిస్తున్నారు.

## శాశ్వతపు గోధుమపంట

సిట్సిన్ అనే వ్యవసాయ పరిశోధకుడు ప్రపంచఖ్యాతి గాంచాడు. మంచు నేలలోను, వర్షాలెక్కువగా కురియని ప్రదేశంలోను, పుష్కలంగా పండేగోధుమజాతిని కనిపెట్టుటకు ఈయనకొన్ని సంవత్సరాలు పరిశోధన చేశాడు. "ధైర్యంగానువ్వు పరిశోధనలుచేయి, నీకెంతప్రోత్సాహం కావలసినా, మేమివ్వడానికి సిద్ధంగాఉన్నాం" అనిస్టాలిన్ సిట్సిన్‌తో అన్నాడు. చివరకు సిట్సిన్ విజయాన్ని సాధించాడు. ఈయన కనిపెట్టిన విత్తనం మంచు ప్రదేశంలోగాని, మెట్టభూములలోగాని, విపరీతంగా పండుతూంది. దానికి చీడపట్టదు. ఎలాంటి జబ్బు దగ్గరకు రాదు.

1937 లో సిట్సిన్ ప్రపంచాన్ని ఆశ్చర్యసముద్రంలో ముంచి వేశాడు. శాశ్వతంగాపండే కొత్తరకం గోధుమను కనిపెట్టాడు. ఒకసారి చల్లితే, మళ్లీ నాలుగైదు సంవత్సరాలవరకు చల్లనవసరంలేదు. ఒకేవేరు నుండి ప్రతిసంవత్సరం మొక్కమొలుస్తుంది. ఈ పరిశోధనవల్ల మానవ జాతికి ఎంత ఉపకారం కలిగిందో వేరేచెప్పనవసరంలేదు. ప్రొఫెసర్ హాన్సన్ అనే అమెరికన్ శాస్త్రజ్ఞుడు యీ కొత్తవిత్తనాన్ని చూచి, విస్మయం పొందాడు. "సోవియట్లు మాజిక్ చేశారు ; అనిపిస్తోంది" అని ప్రశంసించాడు. ఇప్పుడు సిట్సిన్ సోవియట్ వ్యవసాయ పరిశోధనశాఖకు అధ్యక్షుడుగా ఉన్నాడు. ఇతనికి 1 లక్షరూబుల్సు స్టాలిన్ బహుమతివచ్చింది.

## బొగ్గు గనులలో

గనులలో దొరికే రాక్షసిబొగ్గుతో కోల్‌గ్యాసు తయారుచేసి, దాన్ని పెద్దపెద్ద పరిశ్రమలలో ఉపయోగిస్తారు కోల్‌గ్యాసు సహాయంతో బాయిలర్లలో నీటిని కాస్తారు. ఆనీటినుండివచ్చే ఆవిరిశక్తితో చక్రాలు తిరుగు

తాయి. ఇంతేకాదు, పెద్దపెద్ద బ్లాస్ట్‌ఫర్నేసు (అంటే రాక్షసిబొగ్గుతో మండే కొలిమి)ల సహాయంలేకుండా కోల్‌గ్యాసుతో యినుమును కరిగించవచ్చు.

అయితే, కోల్‌గ్యాసు ఎలాతయారౌతుంది ? బొగ్గును పైకితీసి, దాన్నికరిగించి తయారుచేస్తారు. గనులలోఉన్న బొగ్గును తవ్వడం, దాన్ని పైకితీయడం, అప్పుడుదాన్ని కరిగించడం - యిదంతా వ్యయప్రయాసలతో కూడుకొని ఉన్నపని. 1881 లో ప్రొఫెసర్ రామ్సే అనే బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు బొగ్గుగనులలో ఉండగానే గ్యాసును తయారుచేసే పద్ధతిని కనిపెట్టాడు. దీనివల్ల ఎంతఖర్చు, ఎంతశ్రమ, తగ్గుతుందో చూపెట్టాడు. కాని బొగ్గు గనులన్నీ యజమానుల స్వంతఆస్థి; పరిశోధనకు అనేకలక్షల పౌన్లుఖర్చు అవుతుంది. చివరకు గ్యాసు తయారౌతుందో, కాదోనని వారు శంకించారు. పరిశోధన ఫలించకపోతే యీనష్టాన్ని భరించుటకు ఏయజమాని సిద్ధంగా లేడు. ప్రభుత్వమైనా చొరవచేసిందా, అంటే అదీలేదు. అందువల్ల ఈ కొత్తపద్ధతి ఆయన మెదడులోనే ఉండిపోయింది.

కాని, సోవియట్ ప్రభుత్వం యీ పరిశోధనకు ప్రోత్సాహం యిచ్చింది. లెనిన్ యిలాఅన్నాడు.

"సోషలిస్టు ప్రభుత్వంలో రామ్సే పద్ధతినిగూర్చి పరిశోధనలు జరగ డానికెన్నో అవకాశాలుంటాయి. ఎందువల్లనంటే, ఆపద్ధతిని ఆచరణలో పెట్టడంవల్ల అనేకలక్షలమంది కార్మికులు పనిచేయనవసరం ఉండదు. వారిని యితర పరిశ్రమలలో పనిచేయించవచ్చు. మిగతావారు రోజుకు 7 లేక 6 గంటల చొప్పున పనిచేస్తే సరిపోతుంది. బోలెడు శ్రమశక్తి వృధాకాకుండా తప్పించవచ్చు. ఇంతేకాదు. ఆరోగ్యకరమైన వాతావర ణంలో కార్మికులు పనిచేయగల్గుతారు. పొగలలోను, మురికి గుంటలలోను పడి కొట్టుకుంటూ ఆరోగ్యాన్ని చెడకొట్టుకోనవసరం ఉండదు. అసహ్యా కరమైన వర్కుషాపులస్థానే, మానవమాత్రులు నివశించి పనిచేయగల చక్కని పరిశోధనాలయాలు బయల్దేరుతాయి."

ప్రొఫెసర్ రామ్సే కనిపెట్టిన పద్ధతిని ఆచరణలో పెట్టాలని 1931 లో రష్యన్ కమ్యూనిస్టుపార్టీ నిర్ణయించింది. వెంటనే యీ నిర్ణ

యాన్ని క్రియారూపంలో పెట్టారు. 1938 వ సంవత్సరంలో పరిశోధన నెగ్గింది. కొన్ని వేల అడుగుల లోతునుండి కోల్ గ్యాసు తయారై, పైనున్న బాయిలర్లకు వేడిని సప్లయిచేసింది. డోన్‌బాస్ రాష్ట్రమందలి గొర్లోవ్‌కా స్టేషనులో గంటకు 15 వేల క్యూబిక్‌మీటర్లు చొప్పున నేడు (1940) గ్యాసు తయారౌతోంది. లిసిషాన్‌స్క్ అనేచోట గంటకు 1 లక్ష క్యూబిక్ మీటర్ల గ్యాసుచొప్పున తయారౌతోంది.

ఈవిధంగా రష్యాలో కోల్‌గ్యాసును తయారుచేయడానికి, గనులలో నున్న బొగ్గును ఒకచోటనుండి మరొకచోటికి రవానా చెయ్యడం అనవసరమయింది. బాయిలర్లను వేడిచేయడానికి పూర్వం అయే ఖర్చులో సగం తగ్గింది. కార్మికులు ఆరోగ్యకరమైన వాతావరణంలో పనిచేస్తున్నారు.

మన దేశంలో బెంగాల్, బీహార్, మధ్య పరగణాలలో అనేక బొగ్గుగనులున్నాయి. ఇతర దేశాల ప్రభుత్వాలు స్త్రీలు గనులలో పనిచేయరాదని నిషేధించివుంటే, యీ మూడురాష్ట్రాలలో నేడు స్త్రీ కార్మికులచేత పని చేయించుతున్నారు ఇండియా ప్రభుత్వం స్త్రీ కార్మికులపై వున్న నిషేధాన్ని తొలగించింది. ఇందుకు కారణం చెబుతూ, పురుషులసంఖ్య సరిపోవడంలేదని తెలియజేసింది. ఎంత ఆశ్చర్యం! సరియైన జీతాలిస్తే పనిచేసే కార్మికులు మనదేశంలో కొల్లలుకొల్లలుగావున్నారు. ఈ కారణం ప్రపంచాన్ని మభ్యపరచడానికి చెప్పిన బుకాయింపుతప్ప మరొకటి కాదు. అసలు కారణం యేమంటే, స్త్రీలకు పురుషులకంటె తక్కువ జీతాలీయవచ్చునని. యజమానుల్ని ప్రభుత్వం యీ విధంగా సంతృప్తిపరచి, స్త్రీ కార్మికుల ఆరోగ్యాన్ని మట్టిపాల్జేస్తూంది.

సామ్రాజ్యవాద ప్రభుత్వానికీ, సోవియట్ ప్రభుత్వానికీ యెంత తారతమ్యముందో చూడండి!

## సినీమా రంగంలో

ఇలాగే సినీమారంగంలోకూడా సోవియట్ ప్రభుత్వం కొత్త పరిశోధనలెన్నిటికో ప్రోత్సాహమిస్తోంది. ఉదాహరణకు : ఈమధ్య ఐవెనోవ్

అనే పరిశోధకుడు కొత్త సినిమా పద్ధతిని కనిపెట్టాడు. ప్రతి సినిమా లోను మనం చూచే బొమ్మలకు ముందు భాగం మాత్రమే కనపడుతుంది. కథానాయకుడు గుర్రంమీద సవారీ చేస్తున్నాడనుకుందాం; అతని ముఖంలో ఒకపక్క మాత్రమే మనకు కనపడుతుంది. అతడే నిజంగా రోడ్డు మీద సవారీచేస్తూ వెళుతున్నాడనుకుందాం; అప్పుడతని ముఖం మూడు వైపులా కనబడుతుంది. వెనుకవైపున వున్న భాగంతప్ప, యెదురుగాఉండే భాగం, పక్క రెండు భాగాలు, స్పష్టంగా కనపడుతాయి సినిమాలోకూడ సరిగ్గా అలాగే కనపడడానికి ఐవనోవ్ ఒకపద్ధతిని కనిపెట్టాడు. అందులో గుడ్డతో చేయబడ్డ స్క్రీన్‌కు (తెరకు) బదులు అతి సూక్ష్మంగా ఉన్న వైర్‌నెట్ ఒకటి అమర్చబడుతుందట. నిలువుగాను, అడ్డంగాను. దగ్గర దగ్గరగా నేయబడిన ఈ వలలో 30 వేల తీగలుంటాయట. వాటిని వరుసగా పెట్టి కొలిస్తే 95 మైళ్ళ పొడవు ఉంటుందట. ఈ వైర్‌నెట్ చుట్టూ గట్టి ఉక్కుతో చేయబడిన ఫ్రేమ్‌లుంటాయి. అవి 30 టన్నుల బరువును అవలీలగా ఆపగలవు. ఇలాంటి స్క్రీనుమీద వెలుతురు పడితే, మూడు వైపులా కనపడే బొమ్మలొస్తాయి.

ఈ పద్ధతివల్ల సినిమా తెరకూ, మనకూ మధ్య ఎలాంటి అంతరం ఉండదు. అంటే, మనం చూచేవి బొమ్మలుగా కనపడవు. నిజమైన మనుష్యుల్నే చూస్తున్నట్లుంటుంది. అకస్మాత్తుగా కథానాయకుడు గుర్రం యెక్కి కత్తి ఝుళిపిస్తూవస్తూంటే మనమీదికే వస్తున్నాడా అనిపించి, చటుక్కున బెంచీకిందికి తల దూరుస్తామట। విమానం యెగురుతూ వస్తూంటే, ప్రేక్షకులు భయకంపితులౌతారట. ఐనప్పటికీ యీ కొత్త పద్ధతిలో ఒక లోపం ఉంది. ప్రేక్షకులు తల కదపకుండా, ఒకే వైపునుండిచూస్తూ కూచోవాలట తలకదిపితే, బొమ్మలు గజిబిజిగా తయారౌతాయి. ఈ లోపాన్ని సరిదిద్దుటకు సోవియట్ నిపుణులు పరిశోధనలు చేస్తున్నారు. రెండుసంవత్సరాలలో వారి ప్రయత్నాలు ఫలించుతాయని కొందరి అంచనా.

ఇతర దేశాలలో శాస్త్రపరిశోధన ధనికులకు మాత్రమే సాధ్యమౌతుంది, సోవియట్ యూనియన్‌లో అలాకాదు. 17 కోట్లమంది జనసంఖ్య

ఉన్నదేశంలో, ప్రతివ్యక్తిలో నిబిడీకృతమైయున్న శక్తుల్ని ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. పరిశోధనల కవసరమైన సాధనసామగ్రికి ఎంతసొమ్మైనా శాంక్షన్ చేస్తుంది. అందువల్ల, యుక్తవయస్సువచ్చిన ప్రతిపౌరుడూ శాస్త్రపరిశోధనలంటే ఉవ్విళ్లూరుతాడు. శాస్త్రవిద్యలను గురించి ప్రచురింప బడే గొప్పగ్రంథాలు రష్యన్ భాషలోకి వెంటనే తర్జుమాచేస్తారు. ఉదాహరణకు: డైరాక్ అను ఆంగ్లశాస్త్రజ్ఞుడు Quantum Mechanics అనే గ్రంథం వ్రాశాడు. అది ఇంగ్లండులో 3 సంవత్సరాలకాలంలో 2000 కాపీలు అమ్మబడ్డాయి. పుస్తకమే రష్యన్‌భాషలోకి తర్జుమాచేసి ప్రచురిస్తే కొద్ది నెలలలో 3000 కాపీలు అమ్మబడ్డాయి.

మనదేశంలో సర్ సి. వి. రామన్ వస్తుశాస్త్రంలో గావించిన పరిశోధనలు బ్రిటన్ - అమెరికాలలో యెంతో ఖ్యాతి గాంచాయి; కాని మన దేశంలో యెంతమందికి తెలుసు వాటి గొప్పతనం?

రష్యన్ కార్మికులు శాస్త్ర పరిశోధనలంటే భయపడరు. సంతోషంగా ఆహ్వానిస్తారు. ఎందువల్ల? ఇతర దేశాలలోవలె రష్యాలో నిరుద్యోగం అనే రాక్షసికి కార్మికులు బలి కానవసరంలేదు. శాస్త్ర పరిశోధనల వల్ల లభించే కొత్త సౌకర్యాలు, కొత్త సంపద ప్రజల ఆస్తి.

# 4. సహజసంపద - పరిశ్రమల అభివృద్ధి

విప్లవం వచ్చాక సోవియట్ నాయకుల్ని బ్రహ్మాండమైన సమస్య లెన్నో యెదుర్కొన్నాయి. 17 కోట్లమంది జనాభాకు బలంయిచ్చే ఆహార పంటలు, సంవత్సరం పొడుగునా అవసరమయే బట్ట, నివాసయోగ్యమైన యిండ్లు, మానసికంగా అభివృద్ధిచెందడానికి సౌకర్యాలు, నైతికాభ్యుదయానికి అవకాశాలు - ఇవన్నీ సేకరించిపెట్టాలి. అందువల్ల ప్రభుత్వం సహజ సంపదను పూర్తిగా వినియోగించడం అవసరమయింది.

ఈ కర్తవ్యం నెరవేర్చడానికి సోవియట్ ప్రభుత్వం తమ దేశంలో యెక్కడెక్కడ, యెంతెంత సహజసంపద ఉందో తెలుసుకురమ్మని అనేక మంది నిపుణుల్ని పంపించింది. ఎల్లప్పుడూ మంచుతో కప్పబడియుండే ఆర్కిటిక్ మహాసముద్రంవైపు యేముందో, ఎత్తైన పామీర్ పర్వత పంక్తులలో యేముందో, దట్టమైన సైబీరియా అడవులలో యేముందో, పరిశీలించి రావడానికి ఏటేటా శాస్త్ర పరిశోధకుల్ని పంపించింది. వీరి సౌకర్యార్థం మోటారుకార్లు, విమానాలు, మంచును బద్దలుకొట్టే యంత్రాలు, పంపబడ్డాయి. ఇదివరకెట్టి మనుష్యసంచారంలేని ప్రదేశాలలో తెల్లని గుడారాలు లేచాయి. చలి కాచుకోడానికి చలిమంటలు బయల్దేరాయి.

క్రమంగా భూగోళ శాస్త్రజ్ఞులు ఏ యే ప్రదేశం యెక్కడుందో కనుక్కోసాగారు. దానికి సరిహద్దుల్ని నిర్ణయించారు. దేశ పటాల సహాయంతో పరిశోధనలుచేశారు. ఇక భూగర్భశాస్త్రజ్ఞులు యెక్కడెక్కడ ఏ యే లోహాలున్నాయో తెలుసుకోడానికి రాళ్లు బద్దలుకొట్టి పరిశీలించారు. వృక్ష శాస్త్రజ్ఞులు మొక్కలు - విత్తనాలు - నేల మొదలైనవాటిని పరీక్షచేశారు.

ఈ పరిశోధనలు త్వరలోనే ఫలించాయి. ఆర్కిటిక్ మహాసముద్రంవద్ద నొవాయాజెమ్లా అనే ప్రదేశంవుంది. అక్కడ ఎస్బెస్టాస్ అనే

లోహాన్ని కనిపెట్టారు; వైగాష్ ద్వీపంలో ఇనుము కలియని లోహాలెన్నో కనపడ్డాయి. ఫ్రాన్స్ జోసెఫ్‌లాండ్‌లో బొగ్గు దొరికింది. తైమీర్ ద్వీప కల్పంలో మైకా, పెట్రోలు దొరికాయి. అట్లాంటిక్ మహాసముద్రంనుండి పసిఫిక్ మహాసముద్రానికి వెళ్ళే సముద్ర మార్గంకొరకు కొన్ని శతాబ్దాల నుండి అనేకమంది నిపుణులు ప్రయత్నించేవారు. అలాంటి మార్గాన్ని 1932 లో ష్మిట్ అనే అతడు కనిపెట్టాడు. నేడు ఆ సముద్రతీరం పొడుగునా హార్బర్లు, లైటుహౌసులు, బొగ్గు కేంద్రాలు కనబడుతున్నాయి. చక్కని ప్రయాణ సౌకర్యాలు నిర్మించబడ్డాయి

క్యుజ్‌నెట్స్కి ప్రాంతంలో బొగ్గుగనులు కనబడ్డాయి. ఈరోజున యిక్కడ దొరికేటంత బొగ్గు ప్రపంచంలో యెక్కడా దొంకదు. ప్రపంచాని కవసరమైనంత బొగ్గును 300 సంవత్సరాలవరకు యీ గనులు సప్లయి చేయగలవట ; ఇలాగే ఊరల్ పర్వతప్రాంతంలోను, కాస్పియన్ సముద్ర ప్రాంతంలోను పెట్రోలు గనులున్నాయి.

జార్ కాలంనాడు రష్యాలో ముడియినుము మొత్తం 20 లక్షల టన్నులు దొరుకుతుందని అంచనావేశారు. ఈరోజున 26,000 కోట్ల టన్నులు దొరుకుతుందని అంచనా.

రష్యాకు యితర దేశాలు ముడిసరుకులు పంపకుండా దిగ్బంధన మొనర్చినప్పటికీ రష్యా చెక్కుచెదరదు. ముఖ్యమైన ప్రతివస్తువు రష్యాలో దొరుకుతుంది. పారిశ్రామికాభివృద్ధికి 22 ముఖ్యమైన ముడివస్తువులు అవసరము. ఇంగ్లండులో 19 వస్తువులులేవనీ, జర్మనీలో 18 లేవనీ, అమెరికాలో 9 లేవనీ, సోవియట్ యూనియన్‌లో 4 మాత్రమే లేవనీ, అమెరీబ్రిక్స్ అను అమెరికన్ అర్థశాస్త్రజ్ఞుడు చెప్పాడు. అవి (1) తుంగ్‌స్టెన్, (2) టిన్, (3) ఆంటిమొనీ, (4) నికెల్. వీటికై నేడు పరిశోధనలు జరుగుతున్నాయి.

కుర్స్కి ప్రాంతంలో యినుము దొరుకుతుందని 1922 లో కనిపెట్టారు. వెంటనే తవ్వడం ప్రారంభమైంది. ప్రపంచంలో దొరికే ముడి

యినుము ఒక్కసారిగా రెట్టింపయింది. ప్రపంచంలో దొరికే మొత్తం యినుముతో సరిసమానమైన స్థానం కుర్స్కుకు లభించింది.

ఇలాగే ఆర్కిటిక్ ప్రాంతంలో ఉన్న కోలా ద్వీపకల్పంలో ఎపెటైట్, నెఫెలైన్ అనే ముడివస్తువులు కొల్లలు కొల్లలుగా ఉన్నట్లు కని పెట్టారు. ఇది అల్యూమినయం, గాజు, ఎరువులు, మొదలైన వాటి ఉత్పత్తికి చాలా అవసరం. ఎపెటైట్ 200 కోట్ల టన్నులున్నట్లు అంచనా వేశారు. నెఫెలీన్ ఎంత తవ్వినా అంతు ఉండదట! రోజుకు 6000 టన్నులచొప్పున నెఫెలీన్ తయారౌతూన్నట్లు తెలుస్తోంది.

అయినా భూగర్భ శాస్త్రజ్ఞులకు యింకా చేతినిండా పనివుంది. మొదటి పంచవర్ష ప్రణాళికనాటికి దేశం మొత్తంలో 9వ వంతు నేలమాత్రమే పరిశోధనలకు గురి అయింది. రెండవ పంచవర్ష ప్రణాళికనాటికి 4 వ వంతు భూమిపై పరిశోధన జరిగింది. ఇంకా ముప్పాతిక వంతుకావాలి. 1933 నాటికే భూగర్భశాస్త్రంలో 6000 మంది ఇంజనీరింగ్ నిపుణులు, 1 లక్షమంది వర్కర్లు పరిశోధనలు జరిపేవారు. ప్రపంచములో యెక్కడైనా శాస్త్ర విద్యలకు యింత ప్రోత్సాహం వుందా?

భూగర్భశాస్త్రజ్ఞులు యెక్కడైతే సహజ సంపదను కనిపెడతారో, అక్కడే తత్సంబంధమైన పరిశ్రమలుకూడా స్థాపించబడ్డం సహజం. ముడి సరుకులు విస్తారంగా ఉండే ప్రాంతాలలో జన సంఖ్యకూడా యెక్కువగా వృద్ధిచెందుతుంది. కాని, జార్ కాలంనాటి రష్యాలో యిలాకాదు. ముడి యినుము లభించేచోట యినుముపరిశ్రమ ఉండేదేకాదు. పత్తి విస్తారంగా దొరికే ప్రదేశాలలో జనసంఖ్య యెక్కువగా ఉండేదికాదు. యూరపియన్ రష్యాలోమాత్రమే ప్రధాన పరిశ్రమలన్నీ ఉండేవి. (రష్యా రెండు ఖండాలలో విస్తరించియుంది. (1) యిరోపా, (2) ఆసియా). ఏషియాటిక్ రష్యాలో పరిశ్రమలకెట్టి ప్రోత్సాహం ఉండేదికాదు. అక్కడ లభించే ముడిపదార్థాలను యూరపిన్ రష్యాలోవున్న పెట్టుబడిదార్లు లాక్కుపోయే వారు. చేతి పరిశ్రమలను నాశనంచేసేవారు. ప్రజల కళానైపుణ్యాన్ని అణచివేసేవారు; అసంఖ్యాకులు విద్యావిహీనులై పేదరికంలో చెప్పరాని బాధలు పడేవారు.

200 సంవత్సరాలక్రితం మన దేశంలో తూర్పు ఇండియా కంపెనీ వారు యేవిధంగా మన బట్టల పరిశ్రమను, ఓడల పరిశ్రమను, రంగు పరిశ్రమను, సిల్కు పరిశ్రమను నాశనంచేశారో, ఏవిధంగా మన చేనేత పారిశ్రామికుల అన్నంలో మట్టికొట్టి, మాంచెస్టర్‌లో తయారైన మిల్లుబట్టతో దేశాన్ని నింపివేశారో, ఢక్కా మజ్లిన్‌లవంటి సన్నని చేనేతబట్టల పరిశ్రమ ఎలా అడుగంటిందో, మనందరికీ తెలుసు. అలాగే రష్యాలోకూడా జార్ ప్రభుత్వం మధ్య ఆశియా ప్రజల్ని దోచుకుతినేది. అక్కడ పరిశ్రమలు వృద్ధిచెందకుండా, అరికట్టుతూవుండేది. దేశంయొక్క 30 వ వంతు భూభాగంలోమాత్రమే పరిశ్రమలు వృద్ధిచెందాయి

ఇంతేకాదు. ముఖ్యమైన పరిశ్రమలన్నీ పీటర్స్‌బర్గ్ (లెనిన్‌గ్రాడ్) మాస్కో, ఐవెనోవ్, యుక్రెయిన్‌వంటి ప్రాంతాలలో కేంద్రీకరించబడ్డం వల్ల, అవి జర్మనీ - ఆస్ట్రియా - హంగేరీ - పోలెండ్ మొదలైన దేశాలకు దగ్గరలో ఉండేవి. శత్రువు దాడిచేస్తే, సులభంగా దేశ పరిశ్రమలన్నీ శత్రువుకు వశమయేటట్లు దగ్గరగా ఉండేవి. కోడిగుడ్లన్నీ ఒక బుట్టలో పెట్టి ఆ బుట్టను శత్రువు పాదాలకు దగ్గరగావుంచితే యేమవుతుందో, యీ పరిశ్రమలగతికూడా అలాగే ఉండేది.

సోవియట్ ప్రభుత్వం అధికారానికి రాగానే యెక్కడెక్కడ ఏయే పరిశ్రమ ఉండడంవల్ల ప్రజలకెక్కువ ఉపయోగిస్తుందో, యెక్కడ యే పరిశ్రమ సురక్షితంగా అభివృద్ధిచెందుతుందో నిర్ణయించి, ఆ యా ప్రదేశాలలో పరిశ్రమల్ని పునర్నిర్మించసాగారు. ముడిపదార్థాలు యెక్కువగా లభించే స్థలాలవైపు - ఉత్తర, దక్షిణ, తూర్పు, పశ్చిమ దిశలుగా - రైల్వేలు, రోడ్లు వేయ నారంభించారు. బురద నేలలను బాగుచేశారు. ఎడారులలో నీటిని ప్రవహింపజేశారు. అవసరమైన అడవుల్ని మాత్రమే వుంచి, మిగతావాటిని తెగనరికారు. దేశం అంతటా కొత్త పారిశ్రామిక కేంద్రాలు అకస్మాత్తుగా బయల్దేరాయి. వాటికవసరమైన ముడిపదార్థాలు స్థానికంగా లభించేవి. విద్యుచ్ఛక్తి, బొగ్గు వగైరాలన్నీ స్థానికంగానే దొరికేవి. వివిధ ప్రాంతాలలో నివశించే ప్రజల విజ్ఞానం, కళలు అభివృద్ధి

చెందాయి. ప్రజలకొక కొత్త జీవితం ఆరంభమయింది. జార్ ప్రభుత్వం నాటి దోపిడీవిధానం అంతరించి, వలసదేశాలు శాశ్వతంగా అభివృద్ధి పొందాయి.

## మూడు ప్రధాన సూత్రాలు

ఈ పునర్నిర్మాణం అంతా మూడు ప్రధాన సూత్రాల కనుగుణ్యంగా చేయబడింది.

1. సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో సరుకులన్నీ తయారవాలి. రవాణా ఖర్చులు, యంత్రనిర్మాణానికయ్యే ఖర్చులు, సాధ్యమైనంత తక్కువలో ఉండాలి. ఉదాహరణకు: 1000 మైళ్ళ దూరంలో ఉన్న ముడి యినుమును తీసుకొచ్చి, దాన్ని మరొక 1000 మైళ్ళ దూరంలో తవ్విన బొగ్గుతో కరిగించడంవల్ల ఖర్చు యెక్కువౌతుంది. స్థానికంగా దొరికే బొగ్గుతో కరిగిస్తే ఖర్చు సహజంగా తగ్గుతుంది.

2. శత్రుసైన్యాలకు, శత్రువిమానాలకు, శత్రు టాంకులకు పరిశ్రమలెంతదూరంగా ఉంచే అంతమంచిది. ఎంత విశాలమైన దేశంలో వ్యాపిస్తే అంత క్షేమకరం.

3. ముడి పదార్థాలు విరివిగా దొరికే ప్రదేశాలలో ప్రజలు ఆర్థికంగానూ, రాజకీయంగానూ, వైజ్ఞానికంగాను అభివృద్ధిచెందడానికి అక్కడ పరిశ్రమలను విస్తారంగా స్థాపించాలి.

ఈ సూత్రాలననుసరించి ముఖ్యమైన పరిశ్రమలన్నీ తూర్పు భాగానికి ట్రాన్స్‌ఫర్ చేశారు. మధ్యభాగంలో అనేక కొత్త పరిశ్రమలులేచాయి. తాజీకిస్థాన్‌లో బట్టలమిల్లులు, ట్రాన్స్‌కాకేషియాలో సిల్కుమిల్లులు, కజాకిస్థాన్‌లో రాగిపరిశ్రమ, తాష్‌కెంట్‌లో రసాయనిక పరిశ్రమ, స్టాలిన్‌గ్రాడ్‌లో యంత్ర పరిశ్రమ, కొమొసొమాల్‌స్కులో ఇంజనీరింగ్ పరిశ్రమ, కొత్తగా బయలుదేరాయి.

రష్యన్ భూగర్భ శాస్త్రజ్ఞులు ఊరల్ పర్వతాలలో ఇనుము విపరీతంగా దొరుకుతుందని కనిపెట్టారు. కాని దాన్ని కరిగించడానికి బొగ్గు అవసరం. ఈపర్వతాలకు సమీపంగా ఎక్కడెక్కడ బొగ్గుగనులున్నాయో పరిశోధనలు ప్రారంభించారు. త్వరలోనే జయంపొందారు; ఇక్కడికి 625 మైళ్ళు తూర్పుగా క్యూజ్నెట్స్క్ ప్రాంతంలో చక్కని బొగ్గుగను లున్నట్లు కనిపెట్టారు. ఇనుముదొరికే ఊరల్ పర్వతాలలోను, బొగ్గు దొరికే క్యూజ్నెట్స్క్ ప్రాంతంలోను బ్రహ్మాండమైన ఉక్కు పరిశ్రమ బయలుదేరింది. ఇక్కడికీ - అక్కడికీ మధ్య రైల్వే వేయబడింది. ముడి యినుము బొగ్గుగనులవద్దకు, బొగ్గు యినుంగనులవద్దకు ప్రతిరోజూ వాగన్లలో ప్రయాణం చేస్తూవుంటాయి. వాగన్లు ఎప్పుడూ నిండిఉంటాయి. నిన్నమొన్నటివరకూ యుక్రెయిన్‌లోమాత్రమే ఉక్కు పరిశ్రమ ఉండేది. కాని ఉక్రెయిన్ శత్రువుకు దగ్గరలోవుంది. అందువల్ల యిక్కడి ఉక్కు పరిశ్రమ యుద్ధాలలో నాశనమయితే, రష్యా ఓటమి తప్పదు.

సోవియట్ ప్రభుత్వం వచ్చాక ఊరల్‌పర్వతాలలోను, క్యూజ్నెట్స్క్ ప్రాంతంలోను బ్రహ్మాండమైన ఉక్కు పరిశ్రమ బయలుదేరింది. మాస్కోకు ఊరల్‌పర్వతాలు 875మైళ్ళు తూర్పున ఉన్నాయి. క్యూజ్నెట్స్క్ ఊరల్ పర్వతాలకు 625 మైళ్ళు తూర్పున ఉంది. దేశరక్షణ విషయంలో యీ రెండు కేంద్రాలు రెండు ఉక్కు కోటలని చెప్పవచ్చు. ఇక్కడ కార్మిక నిపుణులు నిరంతరం అతి చాకచక్యంగా, చురుకుగా, దేశభక్తితో పనిచేస్తూ ఉంటారు. 1942 డిసెంబరు నెలాఖరులోగా పూర్తికావలసిన కోటాను నవంబరు మొదటి రోజులలోనే పూర్తిచేశారు. పురుషులు చేయవలసిన పనిని స్త్రీలు చేస్తారు. ఇక్కడున్న మొత్తం కార్మికుల సంఖ్యలో దాదాపు సగంమంది స్త్రీలే. పింఛను తీసుకున్నవారు సయితం యీరోజున దేశరక్షణకై ఉత్సాహంగా వర్కుషాపులలో పనిచేస్తున్నారు. సైనికులుగా వెళ్ళినవారిస్థానే కొత్త నిపుణుల్ని త్వరత్వరగా తరిఫీదు చేస్తున్నారు. ప్రతి కార్మికుడు తాను చేయవలసినపనికంటె యెక్కువపని చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రతి నిముషాన్ని పొదుపుగా వినియోగపరుస్తాడు.

తూర్పురంగంలో జర్మనీసేనలు అంతకంతకు ముందుకు చొచ్చు కొస్తూంటే, ఆయుధ పరిశ్రిమలన్నింటినీ సురక్షితమైన యీ ఉరల్ పర్వ తాలకు చేర్చివేశారు.

ఒకవైపు దేశంలో పరిశ్రమలన్నీ యీవిధంగా వృద్ధిపొందుతూంటే, అదే సమయంలో భూగర్భ శాస్త్రజ్ఞులు కొత్త పరిశోధనలను సాగిస్తూనే ఉన్నారు. అనేకకోట్ల టన్నుల బొగ్గును కొత్తగా కనిపెట్టారు. 1941 లో తవ్వవలసిన బొగ్గుకంటె 1942లో తవ్వవలసినది 100కి 80 చొ॥ హెచ్చింద నీ అంచనావేశారు. ఈవిధంగా దేశరక్షణకై శాస్త్రజ్ఞులు తమ యావ చ్ఛక్తుల్నీ వినియోగిస్తున్నారు.

# 5. వ్యవసాయాభివృద్ధి

జార్ ప్రభుత్వంక్రింద వ్యవసాయం మనదేశంలో మాదిరిగానే యెంతో వెనుకబడియుండేది. సరియైన వ్యవసాయ పనిముట్లు ఉండేవి కావు. శాస్త్ర పరిశోధనలు అసలేలేవు. వంతులప్రకారం పంటలు పండించడం యెవరూ యెరుగరు; కంపెనీ యెరువులు బహు అరుదు: నీటి పారుదల సౌకర్యాలు అత్యల్పం. ఇందువల్ల పంట బహుకొద్దిగామాత్రమే పండేది. దక్షిణాన అనేకవేల యకరాల యెడారిని పంటభూమిగా చేయడం ఆరోజుల్లో ఊహాగానంగా ఉండేది. ఉత్తరాన మంచుతో యెల్లప్పుడూ కప్పబడియున్న ప్రదేశాన్ని సస్యశ్యామల దేశంగా చేయడం ఎవరి బుర్రకూ తట్టనేలేదు!

కాని, సోవియట్ ప్రభుత్వం అధికారానికివచ్చాక, 17 కోట్లమంది ప్రజల అవసరాల నిమిత్తం యెక్కడెక్కడ ఏ యే పంటను పండించాలో, యెలాంటి విత్తనాలు చల్లాలో నిర్ణయించి, యంత్రసహాయంతో వ్యవసాయాన్ని అభివృద్ధి చేయనారంభించింది. తూర్పు ప్రాంతాలలో కాయ ధాన్యాలు, ఉత్తర దిశను గోధుమ, దక్షిణభాగంలో పత్తి - యీ విధంగా వేర్వేరు ప్రాంతాలలో వేర్వేరు పంటలను పండించసాగారు. వ్యవసాయం అంటే యెరుగని ప్రదేశాలలో కొత్తపంటలు బయలుదేరాయి.

ఉత్తర ధృవ ప్రాంతంలో సంవత్సరానికి 2 నెలలకంటె ఎక్కువ సూర్యరశ్మి ఉండదు. అయినా సోవియట్ శాస్త్రజ్ఞులు ఒక కొత్తజాతిగోధుమ విత్తనాన్ని కనిపెట్టి, ఆ ప్రాంతంలో వేశారు. త్వరలోనే మొక్క బయల్దేరి, కోతకువచ్చింది. పొలాలన్నీ పుష్కలంగా పండాయి!

తూర్పురాష్ట్రాలలో యినుము, బొగ్గు, నూనె వగైరా పరిశ్రమలు యెలా స్థాపించబడ్డాయో మనం చూచాం. వీటిల్లో అనేక లక్షలమంది

కార్మికులు పనిచేయసాగారు. అయితే, వీరందరికీ ఆహారపదార్థాలు కావాలి గదా ! గోధుమలు, మాంసం, కూరగాయలు, కోడిగుడ్లు, యివి కార్మికు లకు నిత్యమూ అవసరం. వెంటనే ఆ ప్రాంతంలో ఆహారపంటలు వేయ సాగారు. ఎక్కడ అవసరమైన పదార్థం అక్కడే పండించి, రవాణా ఖర్చులు తగ్గేటట్లు చూచారు.

## ప త్తి ప ం ట

మధ్య ఆసియాలో పత్తి యెక్కువగా పండుతుంది. పత్తిని తెల్ల బంగారం అని ప్రజలు పిలుస్తారు. ఇక్కడ యెక్కువగాపండే పత్తినిచూచి, జార్ చక్రవర్తులు తమ సామ్రాజ్యాన్ని మధ్య ఆశియాకు విస్తరింపజేశారు. మధ్య ఆశియాలో దొరికే పత్తిని లెనిన్‌గ్రాడ్, మాస్కో మొదలైన కేంద్రాలకు తీసుకుపోయి, మిల్లులలో బట్టలుగానేసి, వ్యాపారం సాగించి, కోట్లకొద్దీ రూబుల్సు లాభం సంపాదించేవారు. ఈ ప్రాంతంలో పత్తిని గురించే యెప్పుడూ ప్రజలు మాట్లాడుకొనేవారు; పత్తినిగురించే పాటలు పాడేవారు: పత్తితోనే ఆటలాడేవారు; పత్తిని పరిశీలించేవారు; పత్తిని గురించి కలలుగనేవారు; జార్ ప్రభుత్వం పత్తిపంటను లాక్కుపోగలి గిందేగాని, దాన్ని చక్కగా అభివృద్ధిపరచలేకపోయింది. తనకు కావల సిన పత్తిలో సగంవంతు పై దేశాలనుండి వచ్చేది.

కాని, నేడో ? సోవియట్ రష్యాయొక్క బట్టలపరిశ్రమకంతకూ పత్తి రష్యాలోనే లభిస్తోంది. చక్కని నీటి పారుదల వసతులు కల్పించ బడ్డాయి. పూర్వం ఒంటెల సహాయంతో నీరు తోడేవారు. ఇప్పుడు పెట్రోల్ పంపులతో యింజన్లు నీరు లాగుతాయి. పూర్వంవలె మట్టి కాలువలగుండా కాక, కాంక్రీట్ కాలువలగుండా నీరు ప్రవహిస్తుంది. మొక్క కొంత యెదిగిన తరువాత మరొకమడిలోవేసి, ఎక్కువ పత్తి పండేలా చేస్తున్నారు. కొత్తరకపు విత్తనాలతో పంట పండిస్తున్నారు. పత్తికాయలలోనుండి పత్తి బయటికి రాగానే యంత్ర సహాయంతో దాన్ని కోసివేస్తారు.

దేశం మొత్తంమీద పండే పత్తిలో సగంభాగం ఉజ్‌బెకిస్తాన్, తాజీకిస్తాన్‌లలో పండుతుంది. కారణం, ఈ రాష్ట్రాలలో కావలసినంత నీటి సప్లయి, సూర్యరశ్మి ఉన్నాయి. అంతేగాక, తరాతరాలనుండీ యీ ప్రదేశం పత్తిపంటకు నివాసస్థలం. ఈపత్తికి విలువకూడా చాలా హెచ్చు. ఈ కారణాలవల్ల ప్రజలీప్రాంతంలో పత్తిపంటకు ప్రాధాన్యత యిస్తున్నారు.

## వ రి ప ం ట

పత్తిమాత్రమేకాదు: వరికూడా శాస్త్రీయపద్ధతుల ప్రకారం పండించ బడుతోంది. శరీరానికి గోధుమలతో సమానంగా వరికూడా యెక్కువ బలాన్నియిస్తుంది. చైనాలో సగంమంది వరిధాన్యం తిని జీవిస్తారు. జపాన్ అంతా వరిపై ఆధారపడుతోంది. మన దేశంయొక్క జనాభాలో ముప్పాతికమందికి బియ్యమే ముఖ్యమైన ఆహారపదార్థం. అయితే వరిపంటకు పుష్కలమైన నీటిపారుదల, వేడి ప్రదేశం ఉండాలని చాలమంది అభిప్రాయం. కాని సోవియట్ శాస్త్రజ్ఞులు అనేక పరిశోధనలుచేసి, బురద నేలలో వరిమొక్కలు నాటారు. కొంతకాలంఅయాక పంట పుష్కలంగా పండింది. కజాక్‌స్తాన్‌వంటి మెట్ట ప్రాంతాలలోను, ఉక్రెయిన్ రాష్ట్రమందలి తేమ భూములలోనుకూడా నాట్లువేశారు. తేమ భూములలోను, బురద నేలమీద విత్తనం 100 రోజులవరకు నీటి అడుగునే ఉంటుంది. ఇంతేకాదు; మంచు విస్తారంగా ఉండేనేలపై వరిపండదని ఒక సిద్ధాంతం. సోవియట్ శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసి, యీ అభిప్రాయం వట్టి మూఢవిశ్వాసంతప్ప మరొకటి కాదని తెలుసుకున్నారు. ఉత్తర ధృవ ప్రాంతాన, మాస్కో పరిసరాల్లో వరి యీనాడు విపరీతంగా పండుతోంది.

వోల్గానదికి ఎడంవైపు అనేకలక్షల యెకరాల బంజరుభూమివుంది. కాని, వోల్గానది ప్రాజెక్టు కొద్దికాలంలోనే పూర్తికానుంది. అప్పుడీభూములన్నీ పచ్చని వరిచేలతో నిగనిగలాడుతాయి. షుమారు 1 లక్ష టన్నులు యీ ప్రాంతంలో పండుతుందని అంచనావేశారు.

సోవియట్లు ఆధికారానికి రాకపూర్వం రష్యన్లు చేత్తోనే వరి విత్తనాలు చల్లుతూ ఉండేవారు. నడుంలోతు నీళ్ళలో దిగి, చేనుచుట్టూ అనేక సార్లు తిరిగితేనేగాని చల్లడం పూర్తి అయేదికాదు. గోధుమనాట్లకు ఉపయోగించే యంత్రం వరినాట్లకు పనికిరాదు. ఎందువల్లనంటే, అది నీటిలో సులభంగా దిగబడిపోతుంది. కాబట్టి శాస్త్రజ్ఞులొక ఉపాయం కనిపెట్టారు. ఒక పెద్ద విమానం గండభేరుండ పక్షివలె పెద్ద ధ్వనిచేసుకుంటూవస్తుంది; నెమ్మదిగా కిందికిదిగి నీటికి కొద్ది గజాలయెత్తున యెగురుతూ విత్తనాలు చల్లుతుంది. కొంతకాలానికి మొక్కలు బయల్దేరి, వెన్నువేసి, కోతకు సిద్ధంగావున్నప్పుడు యంత్రశక్తితో నడిచే కంబైన్ హార్వెస్టర్లు వచ్చి కోసివేస్తాయి.

ఇదేవిధంగా బీట్ దుంప (పంచదార), సోయా చిక్కుడు మొదలైన ఆహారపదార్థాలు శాస్త్రీయ పద్ధతు లవలంబించడంవల్ల యెక్కువగా లభించుతున్నాయి.

## వ్యవసాయంలో యంత్రసహాయం

అన్నిటికంటె వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంలో యంత్రశక్తి యెక్కువ అద్భుతమైన ఫలితాలను తీసుకొచ్చింది. 1941 వ సంవత్సరం జూన్ 22 న హిట్లరు రష్యాపై దూకినప్పుడు, మాస్కోలో అఖిల సోవియట్ వ్యవసాయ ప్రదర్శనం ఒకటి జరుగుతోంది. 3 వారాలలో 5 లక్షల మంది యీ ప్రదర్శనాన్నిచూచి ఉప్పొంగారు. అక్కడ మొత్తం 400 రకాల యంత్రాలను చూపారట. వాటిలో 80 రకాలు ఆ సంవత్సరమే కొత్తగా కనిపెట్టబడినవి. అనగా, వ్యవసాయంలో రష్యన్లు యంత్రశక్తి ఎంత వేగంగా ప్రవేశపెట్టుతూ ముందుకు పోతున్నారో తెలుసుకోవచ్చు. పూర్వం చేత్తోచేసే అనేకపనులు యీరోజున యంత్రంతో చేస్తున్నారు. భూమిని దున్నడంలోను, పంటను కోయడంలోను, 100 కి 90 వంతులు యంత్రాలే సహాయ పడుతున్నాయి. మిగతా 10 వంతులు మాత్రం చేత్తో చేస్తున్నారు. ఇంతేకాదు. పారిశ్రామిక వంటలలో ప్రతి చిన్నపనికీ యంత్రాన్నే ఉపయోగిస్తున్నారు.



యుక్రైన్‌లో రై అనే ధాన్యపు పంటను యంత్రాలతో కోస్తున్న దృశ్యం

సోవియట్ ఇంజనీర్లు బీట్ దుంపను, ఎందుగడ్డిని, ఫ్లాక్స్ అనే పత్తిని, మొక్కజొన్నను, బంగాళాదుంపను పెల్లగించే కంబైన్ యంత్రాన్ని ప్రపంచానికంతకూ మొట్టమొదట కనిపెట్టారు. రాస్టోవ్‌లో ఒక ఇంజనీరు తేయాకు మొక్కనుండి ఆకును కోయడం దాన్ని నలగ్గొట్టడం-దుబ్బులు నరికివేయడం యివన్నీ ఒకేసారి చేసేయంత్రాన్ని తయారు చేశాడు. నీటిలో మునిగియుండే వరిచేలను దున్నడానికి ప్రత్యేకమైన యంత్రం కనిపెట్టబడింది. కంబైన్‌యంత్రం అతిచురుకుగా పత్తికాయలను కోయడమే కాకుండా, గింజను తీసివేసి, శ్రేష్టమైన దూదిని తయారు చేస్తుంది. బీట్ దుంపనుంచి పంచదార తయారౌతుంది. ఆ దుంపను ట్రెంచెన్ అనే యంత్రం భూమిలోనుండి పెల్లగించి మట్టిని గుట్టలు గుట్టలుగా బయట పోస్తుంది. అప్పుడు కంబైన్ యంత్రంవచ్చి, దుంప యొక్క వ్రేళ్ళను, పైనున్న మొక్కనునరికేసి, దుంపను వేరుచేసి, గుట్టలు గుట్టలుగా పేర్చుతుంది. ఈ విధంగా, గంటకు 1 యకరంచొప్పున పేర్చుతుంది. కంబైన్ యంత్రం గంటకు 3 యకరాల భూమిలో ఫ్లాక్స్ అనే పత్తిని విడదీసి, శుభ్రపరచి, కట్టలు కడుతుంది.

మొదట్లో వేర్వేరు రకాల పంటను వేర్వేరు హార్వెస్టర్ యంత్రాలు కోసేవి. ఈవిధంగా మొత్తం 21 రకాల యంత్రాలుండేవి. క్రమేణా ఒకే రకం యంత్రానికి 21 విధాలైన సాధనాల నమర్చితే, 21 రకాల పంటలకు ఆ ఒక్కయంత్రం ఉపయోగపడుతుందని తెలుసుకున్నారు. దీనివల్ల లాభమేమంటే, ఒకేరకమైన యంత్రాన్ని తయారుచేయడం బహుచౌక. దాన్నే చురుకుగాగూడ తయారుచేయవచ్చు. ఇదేవిధంగా నాట్లు వేయడానికి మొదట 5 రకాల యంత్రాలుండేవి. ఇప్పుడు ఒకేరకం వుంది. ఏ రకం విత్తనమైనా దానితో నాటవచ్చు.

నేడు ఇటలీలో 18000, జర్మనీలో 30,000 ట్రాక్టర్లు ఉన్నట్టు అంచనావేశారు. రష్యాలో 5,58,600 ట్రాక్టర్లు వున్నాయి. ఒక్క చెల్యాబిన్‌స్క్ ఫ్యాక్టరీలోనే యేడాదికి 40వేల ట్రాక్టర్లు తయారౌతున్నాయి.

కంబైన్‌హార్వెస్టర్ల (కోతలుకోసే యంత్రం) విషయంలో సోవియట్ యూనియన్ ప్రపంచానికంతకూ అగ్రస్థానం వహిస్తోంది.

# 6. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

జార్ చక్రవర్తి పరిపాలనలో 28 వేలమంది జమీందార్లు 17 కోట్ల యకరాల భూమిని కలిగియుండేవారు. షుమారు 1 కోటి రైతుకుటుంబాలు 20 కోట్ల యకరాలను కలిగియుండేవి. ఇందులో ఫలవంతమైన భూమి అంతా రాజకుటుంబీకుల్దీ, దేవస్థానాలదీను. మొత్తం జనాభాలో జమీందార్లు, భూస్వాములు కలిపి 100 కి 13 రు ఉండేవారు. పండిన మొత్తం పంటలో 100 కి 72 పాళ్లు యీ జమీందార్లదీ, భూస్వాములదీను.

రైతు కుటుంబాలలో 100 కి 65 గురు పేదరైతులు; 15 గురు వ్యవసాయ కూలీలు. 100 కి 30 మందికి గుర్రాలే వుండేవికావు. (మన దేశంలో నాగళ్ళకు యెద్లను కట్టినట్లే, రష్యాలో గుఱ్ఱాలను కడతారు.) 100 కి 35 గురివద్ద ఎలాంటి వ్యవసాయ పనిముట్లూ ఉండేవికావు. భూస్వాములవద్ద వాటిని అద్దెకు తెచ్చుకునేవారు. పండిన పంటలో ఎక్కువ భాగం పన్నుకు, అప్పులకు, సరిపోయేది. మిగతాది కుటుంబ పోషణకేమీ సరిపోయేదికాదు. సామాన్య రైతుకి కడుపునిండ గోధుమరొట్టె సంవత్సరం పొడుగునా దొరకడం దుర్లభమయేది. కాబట్టి రకరకాల దుంపలు, ఆకులు, కాయలు తిని జీవిస్తూవుండేవాడు. ప్రతి సంవత్సరం షుమారు 20 లక్షల మంది పేదరైతులు, వ్యవసాయకూలీలు ఉక్రెయిన్ - క్యూబాన్ వంటి రాష్ట్రాలకువెళ్ళి జమీందార్ల పొలాలలో తక్కువ కూలికి పనిచేసుకుని జీవించేవారు.

వ్యవసాయం అంతా చాలా పురాతనపద్ధతులమీద జరిగేది. మొదటి సంవత్సరం కొంత భూమిని సాగుచేసి, కోతలు పూర్తి అయాక మరో భూమిని దున్ని నాట్లువేసేవారు. మొదటి భూమి పోరంబోకుగా పడి యుండేది. అందులో మరొక పైరు వేయడంగాని, చక్కని యెరువులతో ఫలవంతంగా చేయడంగాని, యెలాగో తెలిసేదికాదు. తెలిసినా అలా

చేయడానికి అవకాశం ఉండేదికాదు. మంచి విత్తనాలు దొరకడమే గగనం. ఇంచుమించు రైతులందరూ తమ తాత ముత్తాతలనాటి కొయ్య నాగళ్ళతోను, యినుప పలుగులతోను దున్నేవారు. ఈ కారణాలవల్ల యకరానికి ఒకటి రెండు టన్నులకంటె యెక్కువ ధాన్యం పండేదికాదు.

విద్య విషయం చెప్పనవసరమేలేదు. బహు కొద్ది గ్రామాలలో పాఠశాలలుండేవి. భూస్వాముల బిడ్డలకు మాత్రం యెక్కువ పాఠశాలలుండేవి. పిల్లవానికి 8 లేక 10 సంవత్సరాల వయస్సు వచ్చేసరికి తండ్రి బడిలోనుండి యింటికి తీసుకొచ్చి, పొలాలలో బరువైన పనులు చేయించేవాడు; లేదా భూస్వాములవద్ద పాలేర్లుగా పనిచేయించేవారు. కొందరు తమ పిల్లల్ని పట్నవాసాలకు పంపి, అక్కడ "యెవరి అదృష్టానికి" వారిని విడిచిపెట్టేవారు.

ఇదీ, సర్వసాధారణంగా జార్ పరిపాలనలో రష్యన్ రైతు పరిస్థితి. మాస్కో రాష్ట్రంలో ఉస్కోవో అనే గ్రామం ఒకటివుండేది. అక్కడి రైతులు పన్నులభారంతోను, అప్పులభారంతోను పూర్తిగా శిధిలమయారు. వ్యవసాయం చేసుకోగలిగిన శక్తి వారికిలేదు. అందువల్ల మాస్కోరాష్ట్రపు గవర్నర్ జనరల్ ఆ గ్రామాన్ని పూర్తిగా ధ్వంసం చేయవలసిందని ఉత్తర్వులిచ్చాడు. వెంటనే పోలీసులొచ్చి, రైతుల యిళ్ళలోవున్న ప్రతి వస్తువును జప్తుచేసి, యిళ్ళను స్వాధీనం చేసుకున్నారు. గ్రామస్థులు దిక్కులేని పక్షులవలె దూరదేశాలకు ప్రయాణమైపోయారు. దారిలో అనేకమంది స్త్రీ పురుషులు, బాలబాలికలు, ఆకలికి ఆగలేక మరణించారు; కొందరు ఉరిపోసుకొని చనిపోయారు.

## జమీందారీ పద్ధతి నాశనమయింది

1917 లో సోషలిస్టు విప్లవం వచ్చింది. వచ్చినమరునాడు కొత్త ప్రభుత్వం రైతుల కీ విధంగా తెలియజేసింది.

"జమీందారీ పద్ధతి యీనాటితో నాశనమయింది. ఎస్టేట్లు, దేవస్థానం భూములు, వాటిలో ఉండే పశువులు, వ్యవసాయ సామగ్రి, బిల్డింగులు - అన్నీ రైతు సంఘాలకు స్వాధీనం చేయబడుతున్నాయి."

వెంటనే రైతులు - కూలీలు జమీందార్లను తరిమివేశారు. వారి ఆస్తుల్ని స్వాధీనం చేసుకున్నారు. స్వాధీనం చేసుకొని, సమిష్టిగా వ్యవసాయం ప్రారంభించారు. చిన్న చిన్న భూములలో వ్యవసాయంచేయడం వల్ల రైతులకెలా నష్టమో, అలాచేస్తే భూస్వాముల పెత్తనం యెలా కొనసాగుతూ వుంటుందో తెలుపుతూ, సోవియట్ ప్రభుత్వం ప్రచారం చేసింది.

## ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు

సమిష్టి వ్యవసాయంద్వారా రైతులు భూస్వాముల దోపిడీనుండి యెలా బయటపడగలరో, యెలా తమ పేదరికాన్ని శాశ్వతంగా నిర్మూలించుకొనగలరో ప్రత్యక్షంగా చూపడానికి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు స్థాపించబడ్డాయి. వీటిల్లో ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టి పనిచేయించసాగారు. కొత్త వ్యవసాయ పద్ధతులు, శాస్త్ర పరిశోధనలు ప్రారంభమయాయి.

వీటిని సంవత్సరం పొడుగునా నిర్వహించేది ప్రభుత్వం. భూమి ప్రభుత్వానిది. యంత్రాలు, బిల్డింగులు, అన్నీ ప్రభుత్వానివి. పట్టణాలలో మాదిరిగా కూలీలచేత పనిచేయించి, రోజుకింత చొప్పున జీతం ఇస్తారు. వారు 8 గంటలకంటె యెక్కువపని చేయనవసరంలేదు.

ఇట్టి క్షేత్రాలు రష్యాలో అన్నిమూలలా చురుకుగా వ్యాపించాయి. 1939 జనవరినాటికి ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు షుమారు 4000 వరకూ ఉన్నాయి. 17 కోట్ల యకరాలభూమి యీ పద్ధతిప్రకారం సాగుచేయబడింది. ఇందులో పండేపంటలు రకరకాల కాయధాన్యాలు, కూరగాయలు, పండ్లు, పత్తి, బీట్‌దుంప (పంచదార) వగైరా; మాంసం, పాలు, కోడిగుడ్లు, వెన్న, ఉన్నికూడా ప్రభుత్వ వ్యసాయ క్షేత్రాలలో తయారౌతున్నాయి.

మొదటి రెండు పంచవర్ష ప్రణాళికల ప్రకారం (1928 — 32; 1933 — 37) సోవియట్ ప్రభుత్వం యిట్టి వ్యవసాయ క్షేత్రాలకు మొత్తం 1500 కోట్ల రూబుల్సు ఖర్చుపెట్టింది.



యుక్రైన్ రాష్ట్రంలో సమిష్టి వ్యవసాయం. సమిష్టివ్యవసాయ క్షేత్రంక్రింద సాగుచేయబడుతున్న అఖండమైన పంటభూమి.

ఈ విధంగా వ్యవసాయంలో యంత్రాల్ని ఎక్కువగా ప్రవేశ పెట్టడంవల్ల గ్రామాలలో అనేక కొత్త వృత్తులు బయల్దేరాయి. ట్రాక్టర్లను నడపడానికి ట్రాక్టర్ డ్రైవర్లు, కంబైన్ ఆపరేటర్లు, మెకానిక్కులు, లారీ డ్రైవర్లు, అవసరమయారు. వీరిని తరిఫీదు చేయడానికి టెక్నికల్ స్కూళ్ళు తెరువబడ్డాయి. 1931 - 37 సంవత్సరాలమధ్య మొత్తం 2 లక్షల మంది ట్రాక్టర్ డ్రైవర్లు, 52 వేలమంది కంబైన్ ఆపరేటర్లు, 6000 మంది మెకానిక్కులు, తరిఫీదు జేయబడ్డారు. వీరుగాక, అనేకమంది ఇంజనీర్లు, శాస్త్ర పరిశోధకులు, వృక్షశాస్త్ర నిపుణులు, జంతుశాస్త్ర నిపుణులు, పశువుల డాక్టర్లు, నిరంతరం పనిచేస్తూవుంటారు.

ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో పనిచేసే కార్మికుల విషయమై ప్రభుత్వం తీసుకునే శ్రద్ధ ఇంతా - అంతాకాదు. రోజూ పనిచేసేవారి జీతాలు 1932లో కంటె 1938లో 2½రెట్లు హెచ్చు. 1932లో సంవత్సరం మొత్తం మీద ఒక్కొక్క కార్మికుడు 910 రూబుల్సు సంపాదిస్తే, 1938 లో 2,396 రూబుల్సు సంపాదించాడు. ప్రతి కార్మికునికి సంవత్సరానికొక సారి జీతంమీద సెలవిస్తారు. చాలామంది కార్మికులు దూర ప్రదేశాలకు వెళ్ళి ఆరోగ్యాశ్రమాలలోను, విశ్రాంతి గృహాలలోను, ప్రభుత్వం ఖర్చుతో కాలం గడిపి, సెలవులయ్యాక తిరిగి వస్తారు. ప్రతి వ్యవసాయ క్షేత్రానికీ నర్సరీలు, (శిశువుల్ని పెంచే సంస్థలు) మాతా శిశురక్షణాలయాలు, ఆసుపత్రులు, స్కూళ్ళు, ఉంటాయి. వీటికయే ఖర్చు ప్రభుత్వానిదే. ఈక్షేత్రాలలో క్లబ్బులు, సినిమాలు, నాటక శాలలు కూడా ఉన్నాయి.

## కోల్ఖోజులు; లేక కో-ఆపరేటివ్ వ్యవసాయ క్షేత్రాలు

ఈ విధంగా సమిష్టి పద్ధతులవల్ల రైతులెంత సుఖపడవచ్చునో ప్రత్యక్షంగా చూపారు. పాతకాలంనాటి బూజుపట్టిన పద్ధతులన్నింటికి రైతులు స్వస్తిచెప్పారు. సొంత వ్యవసాయ పద్ధతిని కాలదన్నారు. "కోల్ఖోజ్"లనే కో-ఆపరేటివు వ్యవసాయక్షేత్రాలు బయల్దేరాయి. వీటిని మొదట పేదరైతులు మాత్రం స్థాపించుకొని నడుపుకునేవారు. మధ్య తరగతి రైతులు మొదటచేరలేదు. కొత్తపద్ధతివల్ల ఫలితాలెలావుంటాయో

నని వారు శంకించి పూరుకున్నారు. కాని, క్రమంగా సమిష్టి వ్యవసాయం వల్ల కలిగే లాభాలను స్వయంగా చూచి, తాముకూడా చేరడం ప్రారం భించారు.

కోల్హోజు అంటే ఏమిటి? సోవియట్ రాజ్యాంగచట్టంలో 8 వ నిబంధన ప్రకారం:

" జమీందార్లనుండి, దేవస్థానాలనుండి, రాజ కుటుంబీకులనుండి కో-అపరేటివ్ వ్యవసాయ క్షేత్రాలు (కోల్హోజులు) స్వాధీనంచేసుకున్న భూములన్నీ వాటికే శాశ్వతంగా సంక్రమిస్తాయి. వాటిని ఉచితంగా సాగుచేసుకోడానికి హక్కును కలిగియుంటాయి. ఎంత కాలమైనా యీ హక్కు రద్దుకాదు.

" వీటిల్లో ఉండే పశుసంపద, వ్యవసాయ సామగ్రి, పంట, బిల్డిం గులు - మొదలైన ఆస్తికూడ ఆ క్షేత్రానికే చెందుతుంది. ఈ ఆస్తి ప్రజల సోషలిస్టు ఆస్తి."

అనగా, ప్రభుత్వశాసనం ప్రకారం రష్యాలోవున్న భూమి యావత్తు ప్రజల్ది. వ్యవసాయంచేసే రైతులు శాశ్వత జిరాయితీ హక్కును కలిగి యుంటారన్నమాట.

కొన్ని వందల, లేక వేల యకరాల భూమిని కలిపితే, ఒక "కోల్హోజు" అవుతుంది. సాగుకు కావలసిన సాధన సామగ్రి, పశువులు, బిల్డింగులు - అన్నీ ఉమ్మడి ఆస్తి. వీటిని యేవిధంగా ఉపయోగించాలో "కోల్హోజు"లో పనిచేసే రైతులే తమ సమావేశాలలో నిర్ణయించుకుంటారు. ఇవిగాక వ్యవసాయానికి శ్రేష్ఠమైన యెరువులు, విత్తనాలు అవసరమవు తాయి. వీటిని ప్రభుత్వం అప్పుగాయిస్తుంది. ట్రాక్టర్లు వగైరా యంత్రాలు అద్దెకు యిస్తుంది. వీటన్నిటి సహాయంతో పొలాలు సాగు అయాక, సంవత్సరం మొత్తంమీద ఖర్చులు పోగా మిగిలిన పంటలో ప్రభుత్వాని కొక నిర్ణీతభాగం పన్నుగా చెల్లించాలి. మిగతా పంటను రైతులు పంచు కుంటారు.

# పంటను పంచుకునే విధం

ఏ సూత్రం ప్రకారం రైతులు పంటను పంచుకుంటారో చూదాం. ప్రతి రైతు యెంతెంత పనిచేస్తాడో ఆ పనినిబట్టి అతని షేరు (భాగం) నిర్ణయించబడుతుంది. సాధారణంగా ఒక సామాన్య రైతు రోజుకి కొంత పని చేయగలుగుతాడని అంచనా వేస్తారు. ఈ అంచనా అన్ని గ్రామాల లోను ఒకేవిధంగా వుండదు. ఒకే గ్రామంలో రకరకాలుగా ఉండవచ్చు. యంత్రశక్తినిబట్టి, వాటి స్థితినిబట్టి, పశుసంపదనుబట్టి, భూ సారాన్నిబట్టి, పనిచేయడంలో వుండే కష్టాన్నిబట్టి, చూపవలసిన నైపుణ్యాన్నిబట్టి, యీ అంచనాలు వేస్తారు. ఈవిధంగా ప్రతి రైతు తాను పూర్తిచేయవలసిన కోటాను పూర్తిచేసినట్లయితే, ఆ రోజు పూర్తిగా పనిచేసినట్లు రిజిష్టరులో వ్రాసుకుంటారు. కొందరు తమకోటామమించి పనిచేయవచ్చు. అలాంటి వారు యెంత అదనంగా పనిచేశారో రిజిష్టరులో నోట్ చేసుకుంటారు. తమ కోటాను పూర్తిచేయనివారు కూడా కొందరుండవచ్చు. అట్టివారి లెక్కలుకూడా నోట్ చేసుకుంటారు. ఈవిధంగా, ప్రతి రైతు చేసిన పని గంటలసంఖ్యలో చూపబడుతుంది. దీన్ని నిర్ణయించే దెవరంటే, ప్రతి శాఖకు ఒక్కొక్క నాయకుడుంటాడు. అతనికి "బ్రిగేడ్ నాయకు"డని పేరు. ఈ బ్రిగేడ్ నాయకునితోపాటు "క్వాలిటీ ఇన్స్పెక్టర్లు" ఉంటారు. వీరు పనిలోచూపిన నైపుణ్యాన్ని పరీక్షించి, గంటల సంఖ్యను హెచ్చించడంగాని, తగ్గించడంగాని, అలాగే ఉంచడంగాని, చేస్తారు. ఒక వ్యక్తి తన ప్రత్యేక శ్రద్ధవల్ల 7 గంటలలో పూర్తిచేయవలసిన కోటాను 3½ గంటలలోనే పూర్తిచేయగలిగినా దనుకుందాం. అప్పుడతనికి ఆ రోజున రెండురోజుల ప్రతిఫలం యిస్తారు.

ఈవిధంగా ప్రతి రైతు "కోల్హోజు"లో చేసిన పనినిబట్టి, అతడు చూపే శ్రద్ధనుబట్టి, సంవత్సరాంతంలో పంటను పంచుతారు. రైతుల సాంవత్సరిక సమావేశంలో యివన్నీ నిర్ణయించబడతాయి.

ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నును పంటరూపంలోనే "కోల్హోజు" నుండి వసూలుచేస్తారు. ఏ వ్యవసాయక్షేత్రంలో యెంత పంట పండు

తుందో, ఖర్చులెన్ని అవుతాయో, ప్రభుత్వం మొట్టమొదటే అంచనావేసి, అందులో సాధారణంగా మూడోవంతు పంటను పన్నుగా వసూలుచేస్తుంది. (యంత్రాలకీయవలసిన అద్దెతోసహా) ఈ పన్నును సంవత్సరం చివర వసూలుచేస్తారు. ఈలోగా రైతులు తమ స్వంత కృషివల్లగాని, కొత్త పద్ధతు లవలంబించిగాని, బంజరుభూమిని అదనంగా సాగుచేసిగాని పొందే అదనపు రాబడిపై ప్రభుత్వానికి ఎట్టి అధికారం ఉండదు.

ఈవిధంగా, ప్రభుత్వానికి చెల్లించే పన్ను, అద్దె, బాకీ, పోగా మిగిలిన సొమ్ములోకొంత విత్తనాలకు, కొత్త బిల్డింగులకు, కొత్త పరికరాలకు, శిశుపోషణాలయాలకు, సినిమాలకు, ఆసుపత్రులకు, పాఠశాలలకు, పఠన కేంద్రాలకు, ప్రత్యేకించుతారు. మిగతా పంటను ప్రతి వ్యక్తిచేసిన పనినిబట్టి పంచుతారు. ఈవిధంగా ప్రతి రైతుకు లభించే షేరును అందరూ ఉమ్మడిగా బజార్లోగాని, సహకార సంస్థలలోగాని, అమ్మి, వచ్చిన సొమ్మును నగదు రూపంలో పంచుకోవచ్చు; లేదా, ఒక్కొక్క రైతు తన కుటుంబావసరాలకు కొంత పంటను ఉంచుకొని, మిగతాదాన్ని బజార్లోగాని, స్టోర్సులోగాని అమ్ముకోవచ్చు.

సమిష్టి వ్యవసాయక్షేత్ర నిబంధనల ప్రకారం "కోల్ఖోజు"లో చేరిన ప్రతిరైతు తనభూమిని, పశువుల్ని, వ్యవసాయ పరికరాల్ని, "కోల్ఖోజు"కు స్వాధీనం చేయాలి. కాని ప్రతి రైతుకుటుంబం 2 లేక 3 ఆవులు, 20 లేక 25 'గొర్రెలు', పందులు, అవసరమైనన్ని కోళ్ళు, చెవులపిల్లులు, వీటిని సొంతానికి ఉంచుకోవచ్చును. 1½ యకరాలవరకూ పెరడుకూడా ఉంచుకోవచ్చును. అందులో కూరగాయలు, పండ్లమొక్కలు, పువ్వుల మొక్కలు వేసుకుంటారు.

"కోల్ఖోజుల్ని" ప్రోత్సహించడానికి ప్రభుత్వం దేశంఅంతటా 6350 ట్రాక్టర్ స్టేషన్లను నిర్మించింది. 1938 సంవత్సరాంతానికి, మొత్తం 4,83,500 ట్రాక్టర్లు, 1,53, 500 హార్వెష్టర్ కంబైన్లు, 1,95,800లారీలు వ్యవసాయంలోపాల్గొన్నాయి. ఇవిగాక కొన్నిలక్షల మరనాగళ్లు (ట్రాక్టర్ల వెనుక అమర్చుతారు), నాట్లువేసే సాధనాలు సప్లయిచేయబడ్డాయి.

ఈవిధంగా షుమారు 20 సంవత్సరాలలో రష్యా ప్రపంచంలో యెక్కడాలేనంతటి యంత్రశక్తిని వ్యవసాయంలో ప్రవేశపెట్టగలిగింది. దేశం మొత్తమీద యీరోజున 2,43,300 కోల్ఖోజులున్నాయి. వీటిల్లో 1,88,00,000 రైతుకుటుంబాలు. అనగా 100 కి 93½ మంది పాల్గొంటున్నారు.

## స్టాలిన్ కోల్ఖోజ్

ఉక్రెయిన్‌లో అజోవ్ సముద్రతీరాన "స్టాలిన్ కోల్ఖోజ్" అనే వ్యవసాయ క్షేత్రం ఉంది. దానికి అధ్యక్షుడుగా పనిచేసిన క్లిమెనోక్ అనే రైతు తన కోల్ఖోజునుగురించి 1939 లో యిలా వ్రాశాడు.

"మా కోల్ఖోజ్‌లో మొత్తం 674 కుటుంబాలున్నాయి. అందులో 518 కుటుంబాలు పూర్వం బీదరైతుల కుటుంబాలు. మాకు దాదాపు 30వేల యకరాల భూమివుంది. ఇందులో 1480 యకరాలు గడ్డికి, 8980 యకరాలు పచ్చికబయళ్ళకు విడిచిపెట్టాం. 104 యకరాల అడవికూడా మాకిందే ఉంది. 1081 యకరాలభూమి యింటి పెరళ్ళుగా విడిచిపెట్టాం. 13,830 యకరాలలో గోధుమ, మొదలైన కాయ ధాన్యాలువేశాం. 1270 యకరాలలో పారిశ్రామిక పంటలను పండించాం. మిగతానేలలో పశువులమేతకు పనికివచ్చే మొక్కలు, కాయకూరలు వగైరా వేశాం.

"మా వ్యవసాయక్షేత్రం సముద్రప్రాంతంలో ఉన్న నేల అయినప్పటికీ గత సంవత్సరం (1938) యకరానికి 1450 పౌన్లు చొప్పున ఆహారపంటలను పండించాం. పత్తి యకరం 1కి 715 పౌన్లు పండింది.

"షుమారు 9½ అంగుళాల లోతుకు మేం భూమిని దున్ని, పొటాషియం, ఫాస్ఫేట్, నైట్రేట్‌వంటి యెరువులు విస్తారంగా వేశాం. నాట్లకు శ్రేష్టమైన శాస్త్రీయ విత్తనాలే మేం ఉపయోగిస్తాం. వ్యవసాయ శాస్త్రజ్ఞులు క్రొత్తగా కనిపెట్టిన పద్ధతులప్రకారం పంటను ఇంకా హెచ్చు పండించడానికి నిశ్చయించుకొని పనిచేస్తున్నాం.

"వేసవికాలంలో మేము పూర్తిగా ట్రాక్టర్లతోనే భూమిని దున్నుతాము. 1938 లో 100 కి 98 వంతుల పంటను కంబైన్లతో కోశాం.

కలుపు తీత, రంధ్రాలువేయడం, తుక్కు తీయడం - మొదలైన పనులన్నీ కూడా యంత్రాలతోనే చేస్తున్నాం.

" 1930 లో మా కోల్ఖోజుకు మొత్తం 4,24,000 రూబుల్సు విలువ గల పంట (ఖర్చులు కలుపుకొని) పండితే, 1938 లో 33,00,000 రూబుల్సు పంటపండింది. కొత్త సంవత్సరానికి కొన్ని ఖర్చు లుంటాయి. మా యిళ్ళు యిప్పుడు కొత్త పద్ధతిలో కట్టబడ్డాయి. మా గ్రామానికి 8 పవర్ యింజన్లు, 9 లారీలు ఉన్నాయి. పశువులకు ప్రత్యేకమైన షెడ్లు కట్టించాం. బిల్డింగులు, యంత్రపరికరాలు, సాధనసామగ్రి కలిసి మొత్తం 20 లక్షల రూబుల్సు ఖరీదు.

" ఈ ఖర్చులన్నీ తీసివేస్తే, మా "కోల్ఖోజు"లో ప్రతి రైతుకి దామాషాన, అతడుచేసిన పనినిబట్టి రోజుకు 11 పౌన్లు కాయ ధాన్యాలు, 6 రూబుల్సు నగదువచ్చింది. ఇంతకంటె చాలా అధికంగా సంపాదించిన వారుకూడా ఉన్నారు. ఉదాహరణకు : బొరోడిన్ కుటుంబం 6½ టన్నుల కాయ ధాన్యం, 6932 రూబుల్సు నగదు సంపాదించింది. పెఖొమెన్కో- అనే మరొక రైతు 5 టన్నుల కాయధాన్యం, 5120 రూబుల్సు నగదు, సంపాదించాడు.

" 25 సంవత్సరాలకు పూర్వం పల్లెటూళ్ళలో పాఠశాలలకు అనుమతిరావడమే దుర్లభమయేది. కాని, యీరొజున కావలసినన్ని పాఠశాల లున్నాయి మాఊళ్లో. ఒక సినీమా, కొన్ని క్లబ్బులు, ఒక చక్కని లైబ్రరీ, ఒక రేడియోబ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్, ఒక పవర్‌హవుసు కూడ ఉన్నాయి. ఈసంవత్సరం మేమంతాకలిసి 24,000 రూబుల్సు విలువ గల పుస్తకాలకు, పత్రికలకు చందాలుకట్టాం. ఇంతేకాదు. మాకొక మాతా శిశురక్షణాలయం, ఒక శిశుపోషణాలయం, ఒక మంగలిషాపు, ఒక పెద్ద స్నానాల చెరువు కూడా ఉన్నాయి.

" మా యిళ్ళన్నిటికీ ఎలెక్ట్రిక్ దీపాలు వున్నాయి. మాలో 3000 మందికి సైకిళ్లు ఉన్నాయి. యువకులు రకరకాల ఆటలలో పాల్గొం టున్నారు. నాటకాలలోను, సంగీత కచేరీలలోను కూడా పాల్గొంటారు.

మా "కోల్ఖోజులో" యిప్పుడు చదువురానివారెవరూ లేరు. 100 కి 20 మంది విశ్వవిద్యాలయాలలో పరీక్షలు ప్యాసయ్యారు."

## కొత్త వ్యవసాయ పద్ధతులు

యంత్రశక్తితోబాటు శాస్త్రపరిశోధనకూడా ఎక్కువగా వ్యాపించింది. అనేక కొత్త వ్యవసాయపద్ధతులు బయర్దేరాయి.

విప్లవానికి పూర్వం రష్యాలో మిచూరిన్ అనే వ్యవసాయ శాస్త్రజ్ఞుడు పరిశోధనలు చేస్తూ ఉండేవాడు. ఇప్పటికి 85 సంవత్సరాలయింది అతను పుట్టి. ఆయనలో దాగియున్న శక్తుల్ని జార్ ప్రభుత్వం గుర్తించలేదు; ధనసహాయంగాని, వస్తుసామగ్రినిగాని, యిచ్చి ఆయన్ని ప్రోత్సహించలేదు. 1914 లో ఆయన యిలా రాశాడు: "నా జీవితంలో చాలా సంవత్సరాలు గడిచిపోయాయి. నాశక్తి క్రమంగా ఉడిగిపోతూంది. ఇన్ని సంవత్సరాలుగా నేను ప్రజల కవసరమైన కొత్తపద్ధతులెన్నో కనిపెడుతూ శ్రమ పడుచున్నప్పటికీ, నాశ్రమకు తగిన ప్రతిఫలం యిచ్చేనాథుడు లేడు. ఇప్పుడు నేను ముసలివాణ్ణయాను. నా జీవితనౌకను యెలా నడపాలో బోధపడడంలేదు."

విప్లవంవచ్చాక, సోవియట్ ప్రభుత్వం ఆయన కెంత ప్రోత్సాహమివ్వాలో అంతా యిచ్చింది. ఆయన అనేక కొత్త వ్యవసాయపద్ధతులు కనిపెట్టాడు. 80వ ఏట ఆయన యిలాచెప్పగలిగాడు: "జీవితం యిప్పుడు పూర్తిగా మారిపోయింది....నేనిప్పు డెంతో ఆనందంగా ఉన్నాను...."

ఆయన ఒకేజాతికి చెందిన కొన్ని మొక్కలకు అంట్లుకట్టి, కొత్తకొత్త ఫలజాతుల్ని సృష్టించాడు. ఉదాహరణకు, "ఫ్రెంచిపియర్" అనే పండు చాలా తియ్యగాను, పెద్దదిగాను ఉంటుంది. అయితే, అది ఉత్తరప్రాంతాలలో శీతకాలపు గాలులకు తట్టుకోలేదు. అందువల్ల యీ జాతి అక్కడ బయల్దేరదు. బయల్దేరినా, కాయలుకాయదు. శీతకాలపు గాలికి తట్టుకోగల అడవిజాతిమొక్క లున్నాయిగాని, అవి రుచిగా ఉండవు. పై రెండు లక్షణాలూగల ఒక కొత్తజాతిని సృష్టించడానికి

మిశూరిన్ అనేక పరిశోధనలు చేశాడు. చివరకు జయించాడు. చాలా దూరంలో ఉన్న ఒక అడవిజాతిమొక్కను తీసుకొచ్చాడు. దానిపేరు " ఉస్సూరి పియర్ " అదికూడా శీతకాలపు దాడిని ఎదుర్కొంటుంది. ఫ్రెంచిపియర్ మొక్కతో, ఈ ఉస్సూరిపియర్ మొక్కను కలిపి అంటు కట్టాడు. వెంటనే తనకు కావలిసిన కొత్తజాతి లభించింది. దీన్నిబట్టి మిశూరిన్ ప్రపంచాని కొక కొత్తసూత్రాన్ని వెల్లచేశాడు. అదేమంటే; ఒకేజాతికి చెంది, వేర్వేరు ప్రదేశాలలో దూరదూరంగా పెరిగే రెండు మొక్కల్ని కలిపి మరో ప్రదేశంలో అంటు కట్టినట్లయితే, కొత్తగా అక్కడ బయల్దేరే మొక్క స్థానిక వాతావరణాన్ని తట్టుకొన గల్గుతుంది.

కొత్తరకపు పియర్‌ఫలవృక్షం ఎంత ఉత్తర ప్రాంతంలోనైనా పెరుగుతుంది. దానిపండు ఫ్రెంచిపియర్‌వలె రుచిగాను, పెద్దదిగాను, అందంగాను ఉంటుంది.

ఈ సూత్రాన్నిబట్టే మిశూరిన్ అడవి ఛెర్రీమొక్కను దేశీయ ఛెర్రీతో అంటుగట్టి కొత్తరకం ఛెర్రీమొక్కను సృష్టించాడు. చైనా ఆపిల్‌తో మరొక బూడిదరంగు ఆపిల్‌మొక్కను అంటుకట్టి, కొత్తరకం ఆపిల్ మొక్కను సృష్టించాడు.

మిశూరిన్ మరొక సూత్రాన్ని కనిపెట్టాడు. అమెరికన్ ఆపిల్‌తో చైనా ఆపిల్‌ని కలిపి అంటుకట్టితే మూడోరకమైన ఆపిల్ తయారయింది. కాని, అది చాలా త్వరగా కాయలు కాస్తూంది; అవైనా చాలా చిన్నవి; పండితే ఎంతోకాలం వుండవు. అందువల్ల యీ కొత్త ఆపిల్ మొక్కను అమెరికన్ మొక్కతోకలిపి మళ్ళీ అంటుకట్టాడు. వెంటనే చెడ్డలక్షణాలు పోయి, మంచిలక్షణాలు గల కాయలు కాయసాగింది. వారంరోజులు ఆలస్యంగా కాచి, పండు చాలా కాలం నిలవఉంది; సైజుకూడా పెద్దది.

ఈవిధంగా మిశూరిన్ అడవిజాతి మొక్కలలో యెన్నెన్ని శక్తులు దాగియున్నాయో కనిపెట్టి, వాటిని మన ఉపయోగంకొరకు వినియోగంలోకి తీసుకొచ్చాడు.



ఉజ్‌బెకిస్థాన్‌లోని ఒక సమిష్టి వ్యవసాయక్షేత్రానికి చెందిన పరిశోధనాలయం

# కొత్త గోధుమ

మిచూరిన్ పరిశోధనలు అతివేగంగా దేశంలో వ్యాపించాయి. ఇంకా కొత్తపద్ధతులకై నిపుణులు ప్రయత్నాలు ప్రారంభించారు. లైసెంకో అనే వ్యవసాయ శాస్త్రజ్ఞుడు ఉక్రెయిన్ రాష్ట్రంలో ఒడెస్సావద్ద గోధుమ పంటపై అనేక పరిశోధనలు చేశాడు. ఆ ప్రయత్నాలు చివరకు ఫలించాయి. తత్ఫలితంగా యీ రోజున అనేక లక్షల టన్నుల గోధుమ అదనంగా పండుతోంది. ఈయన అనేక పరిశీలనలు చేసినమీదట ఒక సూత్రాన్ని కనిపెట్టాడు. అదియేమంటే, మొక్క యెదగడంలో కొన్ని ప్రత్యేక దశలుంటాయి. మొదటిదశతరవాత రెండోదశ, తరవాత మూడో దశ, ఆతరవాత నాలుగోది - యీవిధంగా ఒకటితరవాత మరొకదశ వచ్చి తీరుతుంది. ప్రతి దశకూ కొన్ని ప్రత్యేక లక్షణాలు, కొన్ని ప్రత్యేక అవసరాలు ఉంటాయి. ఏ ఒక్క దశ లేకపోయినా మొక్క పెరగదు.

ఉదాహరణకు: మొదటిదశలో కొన్ని డిగ్రీల టెంపరేచర్ ఉంటే గాని ఆ మొక్క పెరగదు. అంతకు తక్కువగాని, యెక్కువగాని టెంపరేచర్ ఉంటే, మొక్క యెదగడం ఆగిపోతుంది.

ఈ సూత్రాన్ని లైసెంకో శీతకాలపు గోధుమపై ప్రయోగించాడు. రష్యన్లు ఈ విత్తనాన్ని ఆకురాలుకాలంలో, అనగా సెప్టెంబరు - అక్టోబరు నెలలలో నాటుతారు. కొన్నాళ్ళకు శీతాకాలం ప్రవేశించుతుంది. నేల మంచుమాదిరిగా చల్లగా తయారౌతుంది. అప్పుడు విత్తనం పెరగడానికవసరమైన టెంపరేచరు ఆ నేలలో ఉండదు. మొక్క యిక పెరగకుండా రెండు మూడు నెలలు అలాగే ఉండిపోతుంది ఈ రెండు మూడు నెలలు వృధా అన్నమాట.

ఈ విత్తనాన్నే వేసవిలోకూడ నాటవచ్చు. కాని నేలలో విపరీతమైన వేడి వుండుటవల్ల మొక్క బయలుదేరదు. విత్తనానికవసరమైన దానికంటె యెక్కువ టెంపరేచరు ఉంటుంది.

లైసెంకో ఆలోచించాడు. ఈ గడ్డు పరిస్థితి నెదుర్కొడానికి పరిశోధనలు ప్రారంభించాడు. వాటి ఫలితంగా అతనొక కొత్త విషయాన్ని

క్కున్నాడు. ఏమిటంటే, విత్తనాని కవసరమైన ఉష్ణోగ్రత ఉంటే, లోనేకాకుండా, నీటిలోకూడా పెంచవచ్చు. ఈవిధంగా విత్తనం నీటిలో మొదటిదశను దాటిందంటే దాని అర్థం ఒక పెద్ద గంతువేసిందన్న మాట. అలా మొలకెత్తిన విత్తనాన్ని ఆకురాలుకాలానికి ముందే, వేసవి కాలం నెలలలో, నాటినట్లయితే రెండోదశ, మూడోదశ, నాలుగోదశ-యీ విధంగా దశలన్నీ గడచి బహు కొద్దిరోజుల్లో వెన్ను వేస్తుంది.

ఈవిధంగా "శీతకాలపు గోధుమ" "వేసవికాలపు గోధుమ"గా మారింది. ఈ విత్తనాన్ని ఉత్తర ప్రాంతంలోను, దక్షిణ రాష్ట్రాలలోను కూడా నాటుతున్నారు.

## కొత్త బంగాళా దుంప

బంగాళాదుంపమీద కూడా లైసెంకో విజయాన్ని సాధించాడు. అదివరకు సాధారణంగా మార్చి-ఏప్రిల్ నెలలలో నాట్లువేయడం మామూలుగా అలవాటు. అలాకాకుండా జూన్ నెలాఖరున నాటినట్లయితే శ్రేష్ఠమైన పెద్దదుంప తయారౌతుందని అతను కనిపెట్టాడు.

ఇందుకు కారణంయేమో తెలుసుకోవడం కష్టంకాదు. విషయం చాలా చిన్నదే కాని దాన్ని కనిపెట్టడానికి ఒక శాస్త్రజ్ఞుడు అవసరమయ్యాడు. వేసవి నెలలలో దుంపను నాటితే మండు వేసంగి అంతా అది భూమిలోనే ఉంది. ఆ వేడికి దుంప తట్టుకోలేక మరుగుజ్జు దుంపలౌస్తాయి. అలా కాకుండా జూన్ నెలాఖరున నాటితే, ఉష్ణోగ్రత అంత ఎక్కువకాకుండా అంత తక్కువకాకుండా సరిపోతుంది. అందువల్ల ఆగస్టు - సెప్టెంబరు నాటికి పెద్ద పెద్ద దుంపలౌస్తాయి. ఈవిషయం కనిపెట్టినవెంటనే కొత్త పద్ధతిప్రకారం 3,75,000 యకరాల భూమి సాగుచేయబడింది.

కామచాట్కా అనే చిన్నద్వీపకల్పం రష్యాకు బాగా తూర్పున వుంది. అక్కడ వుండేటంత మంచు ప్రపంచంలో యెక్కడావుండదు. సూర్యుడు బహు కొద్దిరోజులు మాత్రమే ప్రకాశిస్తాడు. అందువల్ల పంటలుపండవు. ఇక్కడ గనులలో పనిచేసే కార్మికులకు తిండి, బట్ట వగైరా జీవితావసర వస్తువులన్నీ రైల్వే వేగన్లలో పంపుతూవుండేవారు. కొన్ని వేలమైళ్లు

యిటు, కొన్నివేల మైళ్ళు అటు రైళ్ళు యిందుకై ప్రయాణం చేయవలసి యుండేది. కాని టిట్ల్యానోవ్ అనే శాస్త్రజ్ఞుడు అంతటి శీతల ప్రదేశంలో కూడా గోధుమను పండించాడు. ఆవిధంగా యెంతో రవానాఖర్చు కలసి వచ్చింది.

ఇదెలా జరిగిందో చూద్దాం. బహు కొద్దిరోజులు మాత్రమే కామచాట్కాలో సూర్యుడు ప్రకాశిస్తాడు. ఆ కొద్దికాలంలో గోధుమ విత్తులు నాటినట్లయితే, ఒక సంవత్సరమయాక చచ్చిపోయిన గోధుమ మొక్కలు కనుపిస్తాయి. చాలా సందర్భాలలో మంచుకరిగి, దానితో కొట్టుకుపోతాయి.

ఇలాంటిచోట టిట్ల్యానోవ్ గోధుమను పండించాడు. ఒకరోజున టిట్ల్యానోవ్ కామచాట్కా మంచు నేలమీద ఒక బండిలో ప్రయాణం చేస్తున్నాడట. బండినితోలే ఆసామి ఒక అగ్నిపర్వతాన్ని చూపించి, టిట్ల్యానోవ్‌తో యిలా అన్నాడు: "అదుగో చూచారా ఆ పొగ? అదొక అగ్నిపర్వతం. చాలా సంవత్సరాలనుంచి అది మామూలు పర్వతంలాగే వుంటూంది. ఇప్పుడు మళ్ళీ పొగవస్తూంది. కొన్నాళ్ళలో అది పగులు తుంది. ఆ బూడిద చుట్టుపక్కలకు వ్యాపించి నేలపైవున్న మంచు కరిగి పోతుంది. మళ్ళీ కొన్నినెలలదాకా నాకు బండిపని ఉండదు. వేసవికాలం మామూలుకంటె త్వరగా ప్రారంభమవుతుంది. వేటకువెళ్ళే స్వాములు వేటాడ్డం కొన్నాళ్లు కట్టిపెడతారు. అబ్బ! ఎలాగోకదండి బ్రతకడం?"

వెంటనే టిట్ల్యానోవ్ యీతనివద్ద ఒక రహస్యంతెలుసుకున్నాడు. కట్టెలుకాలిన బూడిద కొంత తీసుకొచ్చి, దాన్ని భూమిమీద చల్లాడు. సూదంటురాయి యినుమును ఆకర్షించినట్లు, ఆ బూడిద మసక మసకగా వున్న సూర్యకిరణాల్ని ఆకర్షించింది. చటుక్కున మంచు కరగ నారంభిం చింది. భూమి క్రమంగా యెండింది. దానిమీద గోధుమలునాటగా, కొద్ది రోజులకు పచ్చని మొక్క బయలుదేరింది. ఈ భూమికి దగ్గరలోనే ప్రజలు బళ్ళెక్కి వేటకు వెళుతున్నారు. కాలిపోయిన బూడిదకు యెంత మహత్తర శక్తి ఉందో అతడు కనిపెట్టాడు.

# పంటలపై సూర్యుని ప్రభావం

టిమిరజోవ్ అనే శాస్త్రపరిశోధకుడు మొక్కలపై సూర్యుని ప్రభావం ఏ యే రకంగా, ఎంతెంత ఉంటుందో తెలుసుకోడానికి అనేక పరిశోధనలు చేశాడు. చివరకు ఆయన ఏమన్నాడంటే, "క్లోరోఫైల్ గ్రెయిన్" అనే గోధుమ విత్తనంమీద సూర్యకిరణాలలోని జీవశక్తి యెక్కువగా కేంద్రీకరించబడి, అది గింజలో చాలాకాలం నిలవఉండి, నెమ్మదినెమ్మదిగా విడుదల చేయబడుతుంది.

ఈసూత్రా న్ననుసరించి అనేకమంది యువకులు అనేక రకాల గోధుమ విత్తనాలతో పరిశోధనలు చేశారు. "క్లోరోఫైల్" విత్తనం చివరకు కనుక్కున్నారు. 1939లో మాస్కోలో జరిగిన వ్యవసాయ వస్తు ప్రదర్శనలో యీ పరిశోధనల ఫలితాలను కన్పరచారు.

యెఫ్రమోవ్ కనిపెట్టిన విత్తనంతో యిదివర కెన్నడూ కని విని యెరుగనంతటి పంటను పండించారు. అది యకరానికి 10 టన్నులు పండిందట। 13 టన్నులవరకూ పండడాని కవకాశం ఉన్నదట।

ఏదైనా ఒక ప్రదేశంమీద సూర్యునికాంతి ఎంత యెక్కువ పడితే ఆప్రదేశం అంత యెక్కువ సారవంత మౌతుందని టిమిరజోవ్ కనిపెట్టిన సూత్రాన్ని యెఫ్రమోవ్ వివిధరకాల పంటలపై ప్రయోగించి చూచాడు. మామూలుగా వ్యవసాయం చేసేప్పుడు సూర్యకాంతికి ఉన్న శక్తిలో 100 కి 1 వంతు మాత్రమే మొక్కలకు ఉపయోగపడుతుందని తెలుసు కున్నాడు అంతకంటె యెక్కువ శక్తిని—వీలైతే 100 కి 100వంతులు—మొక్కలకు ఉపయోగించడాని కతడు పరిశోధనలు చేశాడు. అతని సిద్ధాంతం ప్రకారం, భూమియొక్క సారం ఎరువులమీద, తేమమీద ఎక్కువ ఆధారపడదు. సూర్యకాంతిపై యెక్కువ ఆధారపడుతుంది. ఈ సిద్ధాంతాన్ననుసరించి, ఒకే పొలంలో యిప్పటికంటె చాలా మొక్కల్ని మొలిపించి, చాలా గింజలు పండించవచ్చు. 1 హెక్టేర్ (అనగా 2½ యకరాలు) లో అంతకుపూర్వం మామూలుగా షుమారు 16½ లక్షల గింజ వచ్చేదట. కొత్తనాట్ల పద్ధతిప్రకారం 1 కోటి గింజ వస్తుందట.



దక్షిణ రష్యాలో ఒక ద్రాక్షతోట



ఒక జార్జియన్ రైతుబిడ్డ

ఈ ఫలితాన్ని తీసుకువచ్చేటందుకు యేస్రెమోవ్ రకరకాల నేలపై రకరకాలుగా నాట్లువేశాడు. చివరకు జయించాడు. కాని, కొన్నిచిక్కుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఉదాహరణకు, దగ్గరదగ్గరగా నాట్లువేసినప్పుడు మొక్క తగినంత బలంగా ఉండాలి. కాబట్టి బలమైనమొక్క లెలా వస్తాయో మళ్ళీ పరిశోధనచేశాడు. పూర్వంకంటె లోతుగానాటి, ఫాస్ఫరస్ యెరువును ఉపయోగిస్తే, బలమైన మొక్క బయల్దేరుతుందని తెలుసుకున్నాడు.

చేనుమీద పంట నాశనంకావడానికి చాలావరకు కారణం మిడతల దండులు రష్యాలో వీటి నెదుర్కోడానికి విమానాలమీదుగా మందును చల్లుతారు. ఈ సంవత్సరం (1944) జనవరి నెలలో 10 రష్యన్ విమానాలు సింధురాష్ట్రాని కొచ్చాయి. ఈ పనికై వీరు ప్రత్యేకంగా ఆహ్వానించబడ్డారు. మధ్యప్రాచ్యరంగంలోని "మిడతలదండ్ల నిర్మూలన సంఘం" తో జరిగిన ఒడంబడిక ఫలితంగా, పై 10 మంది రష్యన్ వైమానికులు పది విమానాలలో ఇండియాకు వచ్చారు. వీరి విమానాలలో మిడతలను చంపే విషద్రవ్యాన్ని సన్నని బిందువులుగా చల్లే సాధనాలున్నాయి. ఇట్టి విమానాల సహాయంతోనే రష్యాప్రభుత్వం ఎన్నో సంవత్సరాల క్రితం ఈ ఉపద్రవంనుండి పంటను రక్షించగలిగింది. ఇండియాకో ఇట్టి విమానాలు లేవనీ, మిడతలదండు ప్రారంభమయిందనీ రష్యన్ప్రభుత్వానికి తెలియగానే, వారు అనుభవజ్ఞులైన వైమానికుల్ని పెర్షియానుండి యిక్కడికి పంపించారు.

పత్రికావిలేఖరులతో ఒకవైమానికు డిలా అన్నాడు: "అక్షరాజ్యాల బలాలవలె మిడతలదండ్లు కూడా దేశసరిహద్దుల్ని గౌరవించవు. కాబట్టి సమస్తజాతులు యీ మిడతలదండ్లపై దండయాత్ర సాగించాలి."

మిడతలదండ్లు ఏ వైపునుండి బయలుదేరాయో, ఎటువెళ్ళాయో, ఏ ప్రదేశంలో వాలినవో, బ్రిటిష్-భారతీయ శాస్త్రజ్ఞులు కనిపెట్టి, అసంగతిని రష్యన్ వైమానికులకు తెలియజేస్తారు. వెంటనే వారు మారణహోమం చెయ్యడానికి విమానాలలో ఆ ప్రాంతానికి వెళ్తారు.

(8)

ఈ వైమానికులే రష్యారంగంలో జర్మన్లపై విమానదాడులు సాగించారు. కాని అట్టి విమానదాడులకన్న మిడతలదండ్లపై దాడిజరపడంలోనే యెక్కువ చాకచక్యాన్ని, శక్తిసామర్ధ్యాలను కనపరచవలసి వస్తోందట! విషద్రవ్యాన్ని చల్లడానికి వైమానికుడు భూమినుండి 15 అడుగుల యెత్తుకు విమానాన్ని దింపి నడపవలసి వుంటుందట. ఆ పని చాలాప్రమాదకరమైనదట. ఇందుకై వైమానికులు బహుతేలికగా ఉన్నట్టి, ఎటుకావలసి వస్తే అటు సులభంగా మళ్ళించడానికి వీలయేటట్టి చిన్నవిమానాలను ఉపయోగించుతారు.

ఈ విధంగా రష్యాలో కొత్తకొత్త వ్యవసాయపద్ధతులు అమల్లోకి వస్తున్నాయి. అనేక కొత్త పరిశోధనాలయాలు బయలుదేరుతున్నాయి. సామాన్యరైతులెందరో వాటిల్లో శిక్షణ పొందుతున్నారు.



మిడతల్ని నాశనం చేయటానికి విమానాలతో మందుచల్లుట

# సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

| | 1933 | 1938 |
| --- | --- | --- |
| ట్రాక్టరు స్టేషన్లు | 2,916 | 6,356 |
| ట్రాక్టర్లు | 123,000 | 394,000 |
| కోతలుకోసే యంత్రాలు | 10,400 | 127,500 |
| లారీలు | 12,300 | 92,600 |

రైతులు చేసేపని, తీసుకునే విశ్రాంతి

1923 లో వేర్వేరుగా వ్యవసాయంచేసే కుటుంబంలో

పొలంలో పని 11 గంటల 51 నిమిషాలు, ఇతరపని 2 గంటల 56 నిమిషాలు, విశ్రాంతి 3 గంటల 15 నిమిషాలు, నిద్ర 5 గంటల 58 నిమిషాలు

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో (1936)

పొలం పని 8 గం. 23 ని., ఇతర పని 2 గం. 28 ని., విశ్రాంతి 5 గం. 27 ని., నిద్ర 7 గం. 42 ని.





పురుషులు 100 కి 63 గురు　　　　స్త్రీలు 100 కి 37 గురు

1937 లో తీసిన లెక్కల ప్రకారం సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో 100 కి ఎంతెంతమంది పాల్గొన్నారు ?

# 7. విద్యుచ్ఛక్తి, బొగ్గు, పెట్రోలు

మనిషి బ్రతకాలంటే ఆహారం, బట్ట, యిల్లు, కావాలి. దేశాన్ని రక్షించుకోవాలంటే, ఆయుధాలు అవసరం. వీటినన్నిటినీ తయారు చెయ్యడానికి పెద్దపెద్ద యంత్రాలుండాలి. యంత్రోత్పత్తికి లోహాలు అవసరం. ఈ యంత్రాలు విద్యుచ్ఛక్తి సహాయంతో నడుస్తాయి.

ఇంట్లో విద్యుచ్ఛక్తి ఉంటే, మనిషికెంతైనా ఉపయోగకరం. ఒక స్విచ్చినొక్కితే లైటు వెలుగుతుంది. మరో స్విచ్చినొక్కితే నీళ్ళు కాగుతాయి. విదుచ్ఛక్తితో అన్నం, పప్పు, కూర, పులుసు - అన్నీ ఉడుకుతాయి. కట్టెలతో నిప్పంటించి, పొగలో బాధపడనవసరం ఉండదు. విద్యుచ్ఛక్తితో యింటిని పరిశుభ్రంగా తుడుచుకోవచ్చు. బట్టలుతికి, ఇస్త్రీ చేసుకోవచ్చు. శీతకాలంలో నీళ్ళు కాచుకొని స్నానం చెయ్యవచ్చు.

మనుష్యులు పైకెత్తలేని పెద్దపెద్ద బరువులు విద్యుచ్ఛక్తిసహాయంతో యంత్రాలు యెత్తుతాయి. నదులకు ఆనకట్టలుకట్టి విద్యుచ్ఛక్తిని తయారుచేసి, దాని సహాయంతో మహాసముద్రాన్నిసహితం ఆకాశంమీదికి తీసుకుపోగలం. అక్కడ కురిసిన వర్షాన్ని పంటలకు ఉపయోగించుకోగలం. కర్మాగారాలలో పెద్దపెద్ద సుత్తులచేత, గొడ్డళ్ళచేత విద్యుచ్ఛక్తితో పనిచేయించవచ్చు. లక్షలాది కార్మికులు చేయలేనిపనులు విద్యుచ్ఛక్తి, బహు కొద్దిమంది కార్మికుల సహాయంతో చేయగలదు. ఇంగ్లండులో ఒక పవర్ స్టేషన్ 24 గంటలు వరుసగా పనిచేస్తే, ఆ దేశంలోవున్న యుక్త వయస్కులందరు కలసి యెంతపని చేయగలరో అది అంతపని చేస్తుంది.

కాబట్టి సోవియట్ నాయకులు జలపాతాలకు చాలా యెక్కువ ప్రాధాన్యత యిచ్చారు. లెనిన్ మొదట విద్యుచ్ఛక్తిపై తనదృష్టిని కేంద్రీకరించాడు. ముఖ్యంగా రష్యాలోవున్న జలపాతాలు ఎంతెంత విద్యుచ్ఛక్తిని

యువ్వగల అవకాశాలున్నాయో తెలుసుకోవడం ఆరంభించాడు. "మనం విద్యుచ్ఛక్తిని ఉపయోగించుకోడానికి సమగ్రమమైన ఒక ప్లానును వేసుకోకపోతే, పెద్ద పరిశ్రమలను నిర్మించడం అసాధ్యమౌతుంది. వచ్చే 10 సంవత్సరాలలో మన ఆర్థిక ప్రణాళిక జయంపొందాలంటే, ముందుగానే చిత్తు ప్లాను ఒకటి అవసరంగదా! కమ్యూనిజాన్ని స్థాపించడానికి ఆర్థిక పునాది ఒకటి ఉండాలిగదా!.... కమ్యూనిజం అంటే, సోవియట్ ప్రభుత్వము + దేశాన్ని విద్యుచ్ఛక్తితో నింపివేయడం. విద్యుచ్ఛక్తి లేకపోతే రష్యా యిప్పటిమాదిరిగానే చిన్నచిన్న రైతులతో నిండియుంటుంది. వారు అర్థాకలితో బ్రతకవలసియుంటుంది. ఈ విషయాన్ని మనం స్పష్టంగా గ్రహించాలి." అని లెనిన్ 8 వ అఖిల రష్యన్ సోవియట్ కాంగ్రెసులో తెలియజేశాడు.

విద్యుచ్ఛక్తిని తయారు చేయడానికి 1921 లో డినీపర్ నదికి ఆనకట్ట కట్టడానికి ప్లానులు ప్రారంభమయాయి. కొండలు పగులగొట్టారు. రైల్వేలనునిర్మించారు. చివరకు 11 సంవత్సరాలయాక 1932 లో డినీపర్ ప్రాజెక్టు తయారయింది. బ్రహ్మాండమైన యీ నదిని విద్యుచ్ఛక్తి ఉత్పత్తికై యింజనీర్లు వినియోగించసాగారు. నదిలో ప్రవహించే నీటిని 6 అంతస్థులమేడ యెత్తువరకు పైకి తీసుకుపోగలిగారు. పెద్దపెద్ద స్టీమర్లు కిందినుండి పై లెవెల్‌లోకి లాకులగుండా ప్రయాణం చేస్తున్నాయి. పూర్వం సుడిగుండాలు, విపరీతమైన ప్రవాహాలు వుండేచోట నీరు ప్రశాంతంగా ప్రవహించింది. పూర్వం యిక్కడ సెకండుకు 3000 క్యూబిక్ గజాల నీరు (క్యూబిక్ గజం అంటే 1 గజం పొడవు, 1 గజం వెడల్పు, 1 గజం ఎత్తు, ఉండే విస్తీర్ణం) ప్రవహించేదట. అనగా ఎంతవేగంగా ప్రవహించేదో తెలుస్తుంది. 9 పెద్దతూములగుండా ఆ నీరు ప్రశాంతగా కిందికి ప్రవహించేది. ఇక్కడ ఉత్పత్తి అయే విద్యుచ్ఛక్తి ఇంతా-అంతా అని చెప్పడానికి వీల్లేదు. జర్మన్లు దీన్ని స్వాధీనంచేసుకోడానికి ముందుకొస్తూంటే, రెడ్ ఆర్మీ యీ ప్రాజెక్టును పూర్తిగా పేల్చివేసింది. జర్మన్లకది దక్కకుండా చేశారన్నమాట.



సీపర్ ఆనకట్ట



బాకూ నూనె గనులు

డినీపర్ ప్రాజెక్టు ఒక్కటే రష్యాలో విద్యుచ్ఛక్తిని సప్లయి చేయ డంలేదు: ఆమధ్య జర్మన్లు రష్యాలోకి చొచ్చుకువస్తూంటే సోవియట్ ప్రభుత్వం మాస్కోనుండి క్యుబిషేవ్‌కి మార్చబడినట్లు మనం విన్నాం. ఎందువల్ల ? క్యుబిషేవ్‌లో పెద్ద పవర్ స్టేషన్ ఒకదాన్ని కట్టడానికి పని ప్రారంభమయింది. ప్రపంచం మొత్తంమీద యెక్కడా అంత స్టేషన్ ఉండదని అంచనావేశారు. యూరపు ఖండంలో పెద్ద నదియైన వోల్గాపై 8 బ్రహ్మాండమైన ప్రాజెక్టులు నిర్మించబోతున్నారు. వరదలు, ప్రవాహాలు దానికి అడ్డురావు. మహాసముద్రాలలో ప్రయాణంచేసే పెద్ద స్టీమర్లు ఇందులో ప్రయాణంచేస్తాయి. పూర్వం ఎడారిగావున్న భూమిలో ఫలవంత మైన మాగాణి పంటలు ఎన్నో పండుతాయి.

చలితో గజగజమనిపించే ఆర్కిటిక్ మహాసముద్రంవద్ద, కజాక్ స్థాన్‌వంటి వేడి ప్రదేశాలలోను, ఆర్మీనియాలోను, హైడ్రో ఎలెక్ట్రిక్ స్టేషన్లు విద్యుచ్ఛక్తిని సప్లయిచేస్తున్నాయి. తూర్పు రాష్ట్రాలలో అంగారా, యెనీసీ నదులపైకూడా ప్రాజెక్టులు నిర్మించి, పవర్ స్టేషన్లద్వారా విద్యు చ్ఛక్తిని సప్లయిచేయబోతున్నారు. ఇక్కడ తయారుకాబోయే విద్యుచ్ఛక్తి డినీపర్ ప్రాజెక్టు - క్యుబిషేవ్ ప్రాజెక్టులకంటె కూడా అధికంగా ఉంటుం దని అంచనా వేశారు.

ఇతర దేశాలలో యిలాంటి బ్రహ్మాండమైన స్కీములెన్ని ఆచరణలో పెట్టాలంటే, అనేక అంతరాయాలు కలుగుతాయి. పెట్టుబడిదార్లు యింత ధనం వెచ్చించడానికి భయపడతారు. లేదా తమ సొంత ఆస్థిగా వున్న భూమిని యిట్టివాటికి యివ్వరు. కాని సోవియట్ రష్యాలో యిలాకాదు. అక్కడ భూమి వ్యక్తుల సొంత ఆస్థికాదు. ప్రభుత్వం కొద్దిమంది ధని కుల హక్కుల్ని కాపాడడానికి యేర్పడలేదు. అందువల్ల సోవియట్ యింజనీర్లు యెక్కడున్న భూమినైనా ఉపయోగించి, ప్రాజెక్టులను నిర్మిం చడానికి స్వేచ్ఛను కలిగియున్నారు. ప్రతి సోవియట్ పౌరుడు తన దేశ ములో లభించే సహజ సంపదవల్ల సుఖపడ్డానికి హక్కువుంది.

# బొగ్గు, ఆవిరిశక్తి

యంత్రాలను నడపడానికి విద్యుచ్ఛక్తితోబాటు ఆవిరిశక్తికూడా ఉప యోగిస్తుంది. ఇందుకు బొగ్గువుండాలి. ఇంగ్లండు పారిశ్రామికంగా ఇంతగా అభివృద్ధికి వచ్చిందంటే, బొగ్గే చాలవరకు కారణం. ఆవిరిశక్తితో రైళ్ళు నడుస్తాయి. ఆవిరియంత్రాలతో మరమగ్గాలు పనిచేస్తున్నాయి. పెద్దపెద్ద సుత్తుల్ని పైకెత్తి కిందికి దించుతున్నాయి. బ్రహ్మాండమైన చెట్ల మానుల్ని పరపర కోసివేస్తున్నాయి.

ఇంగ్లండులోవలె రష్యాలోకూడా బొగ్గుగనులు విస్తారంగాఉన్నాయి. ఇంగ్లండులోకంటెకూడా యెక్కువున్నాయి. ప్రపంచంలో ఉన్న మొత్తం గనులలో యెంత బొగ్గు దొరుకుతుందో అంత రష్యన్ గనులలో దొరుకు తుంది. జారిస్టు రష్యాలో యెక్కడెక్కడ బొగ్గుగనులున్నాయో, యెవరూ పరిశోధన చేయలేదు. డాన్‌నది బేసిన్‌లోమాత్రం బొగ్గు చాలా దొరికేది. కాని అది శత్రుసేనలకు దగ్గరలో ఉండేది. సోవియట్ ప్రభుత్వం అధి కారానికొచ్చాక భూగర్భశాస్త్రజ్ఞులు అనేక కొత్తగనులను కనిపెట్టారు. క్యుజ్నెట్స్క్ ప్రాంతంలో కనిపెట్టబడిన బొగ్గుగనుల్ని గురించి ఇదివరకు తెలుసుకున్నాం. కాని, యింకా చాలాచోట్ల బొగ్గుగనులున్నాయి. తూర్పు సైబీరియాలో యెనిసీ అనే నది దక్షిణంనుండి ఉత్తరదిశగా పెద్ద పెద్ద బొగ్గుగనులకు సమీపాన ప్రవహిస్తోంది. అక్కడ లభించేబొగ్గు క్యుజ్ నెట్స్క్ ప్రాంతంలోవున్న బొగ్గుకంటె అధికమట! ఉత్తర మహాసము ద్రంవద్ద పెకోరా అనేచోటకూడా బొగ్గుగనులున్నాయి. దక్షిణాన కజాక్ స్థాన్‌లో బొగ్గుగనులున్నాయి. ఆమూర్ నదీతీరాన కనిపెట్టినగనులలో 10,000 కోట్ల టన్నుల బొగ్గువున్నదని అంచనావేశారు.

ఐతే బొగ్గుగనులవల్ల దేశం, ప్రజలు పూర్వంకంటె బాగుపడాలి గాని, నష్టాలకు గురికాకూడదు. ఈరోజున ఇంగ్లండ్‌లో యెలాంటిదృశ్యం చూస్తున్నాం? నీలిరంగు ఆకాశం అంతా బొగ్గుగనులవల్ల నల్లగా తయా రయింది. ఇళ్ళు, వాకిళ్ళు చెట్లు, చేమలు, తోటలు, పొలాలు అన్నీ నల్లగా తయారయాయి. పల్లెటూళ్ళలో నివసించే జనసంఖ్య కూలిడబ్బులకొరకు

పట్టణాలకు పోవలసి వచ్చింది. కార్మికులు దుర్భరమైన పరిస్థితులలో పని చేయడంవల్ల ఆరోగ్యం చెడిపోతోంది. కాని, సోవియట్ రష్యాలో యిలా కాదు. ప్రజల ఆరోగ్యాన్ని, దేశంయొక్క సౌభాగ్యాన్ని, మనస్సులో ఉంచుకొని బొగ్గుగనులు తవ్వుతారక్కడ. గనులలోనే బొగ్గునుకాల్చి కోల్ గ్యాసును తయారుచేస్తారు. యంత్రాలను విద్యుచ్ఛక్తితో నడుపుతారు. అందువల్ల పొగ, మురికి యేర్పడవు. కార్మికులకు కష్టం కలుగకుండా ఉండే సాధనాలను కనిపెట్టారు. వారు పనిచేసే గంటల సంఖ్యను తగ్గించారు. ఫలితం గనులలో పనిచేసే కార్మికులు మంచి ఆరోగ్యంగా ఉంటారు. పట్టణాలు పరిశుభ్రంగా ఉంటాయి. దేశంయొక్క సంపద ఎక్కువవుతూంది.

## పెట్రోలు సప్లై

ఆధునిక యుగంలో విద్యుచ్ఛక్తి, బొగ్గు ఎంత అవసరమో, పెట్రోలుకూడా అంతే అవసరం. రష్యాలో దీన్ని "నల్లబంగారం" అని పిలుస్తారు. పెట్రోలుతో మోటార్ లారీలు, కార్లు నడుస్తాయి. పెట్రోలుతో విమానా లెగురుతాయి. పెట్రోలుతో ఓడలు, స్టీమర్లు ప్రయాణం చేస్తాయి.

పెట్రోలు లేకపోతే నేటి యుద్ధాలలో దేశాన్ని రక్షించుకోవడం దుర్లభం. పెట్రోలు గనులున్న దేశాలపై అనేక రాజకీయసమస్యలు ఆధారపడియున్నాయి. పాలస్టయిన్‌లో బ్రిటిష్‌వారు పెత్తనం చెలాయించడం పెట్రోలు కొరకు. హిట్లరు రుమేనియా వైపు మొదటినుంచీ ఎందుకు దృష్టులు నిగిడ్చాడు? పెట్రోలు కొరకు! జపాను బర్మానెందుకు స్వాధీనపరచుకుంది? పెట్రోలు కొరకు!

కాబట్టి, సోవియట్ యూనియన్ వర్ధిల్లాలంటే, పెట్రోలు చాలా అవసరం. రష్యాయొక్క శత్రుదేశాలు నూనెను అందకుండా చేసినప్పుడు ప్రమాదం తప్పదు. కాబట్టి దీని అవసరం మరింత యెక్కువయింది.

ఈ రోజున సోవియట్ రష్యాకు ఏ దేశంలోనూ లేనంతటి పెట్రోలు ఉంది. పూర్వం పెట్రోలుకు బాకూ, గ్రాస్నీ ప్రాంతాలపై రష్యా ఆధారపడి

యుండేది. కాని, భూగర్భ శాస్త్రజ్ఞులు నిరంతరం ఎడతెగకుండా లభించే పెట్రోల్ గనులను కనిపెట్టారు. బాకూ లగాయతు ఊరల్‌పర్వతశ్రేణి మార్గాన ఎన్నో గనులున్నాయి. ఇంకా ఉత్తరాన ఉఖ్టా, పెకోరా నదుల మీద కూడా పెట్రోల్ గనులున్నాయి. వాటికి దక్షిణాన ఛౌసర్, స్టెర్లిటామక్, ఎంబా అనే పెట్రోల్‌గనులున్నాయి. బాగా దక్షిణాన, టర్కేమేనియాలో కూడా చాలా గనులున్నాయి. ఊరల్ పర్వతాలలో పుట్టి, వోల్గా నదిలో కలిసే తెల్లనదికి యిటూ - అటూకూడా పెట్రోల్ నూతులున్నాయి. ఒక్క స్టెర్లిటామక్ గనులలో దొరికే నూనె ఊరల్ పరిశ్రమలన్నింటికీ సరిపోతుంది. ఈ కేంద్రాలన్నీ శత్రురాజ్యాల దాడికి అనేకవందల మైళ్ళ దూరంలో, సురక్షితంగా ఉన్నాయి.

1937 లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ భూగర్భశాస్త్రజ్ఞుల సమావేశంలో ప్రొఫెసర్ గుబ్కిన్ మాట్లాడుతూ, సోవియట్‌రష్యాలో లభించే మొత్తం పెట్రోలు 638 కోట్ల టన్నులని తెలియజేశాడు 6 నెలల తరవాత మళ్ళీ అంచనావేస్తే, ఇంకా చాలా దొరుకుతుందని కనుక్కున్నాడు 1920 లో తీయబడిన పెట్రోలు మొత్తం 39 లక్షల టన్నులు. 1937 లో అది 3 కోట్ల టన్నులకు హెచ్చింది.

# 8. ఉక్కు పరిశ్రమ

ఈ రోజుల్లో మానవజీవితానికి ఉక్కు ఎంత అవసరమో తెలుసు కోవడం కష్టంకాదు. మనం కట్టుకునే బట్టలు ఉక్కుయంత్రాలపై నేయ బడుతున్నాయి. అవి ఉక్కు ఇంజన్లచే నడుపబడతాయి. రైలు ఇంజన్ల సహాయంతో ఆ బట్ట అనేకప్రాంతాలకు రవానా చేయబడుతుంది. రైళ్లు నడవడానికి ఉక్కు రైలుబద్దీలవసరం. సోవియట్ యూనియన్‌లో వ్యవసాయం అంతా మరనాగళ్ళమీద, యంత్రాలమీద జరుగుతుంది. అవన్నీ ఉక్కుతో చేయబడతాయి.

జారిస్టు రష్యాలో ఇనుము, ఉక్కు పరిశ్రమలు బహుచిన్నవి. ఈ రోజున సోవియట్ రష్యాలో తయారయ్యే మొత్తం ఉక్కులో 100కి 3వ వంతు మాత్రమే పాతవర్కుషాపులలో తయారౌతుంది. మిగతా 96వ వంతులు కొత్త వర్కుషాపులలో తయారౌతూంది. అంటే, సోవియట్ ప్రభుత్వం ఈ విషయంలో ఎంత శ్రద్ధ చూపెడుతూందో బోధపడగలదు.

ఊరల్‌పర్వతాలకు బాగా దక్షిణాన మాగ్నిట్నయా అనే కుగ్రామం ఒకటి ఉండేది. ఆ పేరుకు అర్థం "సూదంటురాయి కొండ". 1929 లో పైనున్న ఈగ్రామం చుట్టూ పచ్చికబయళ్ళు ఉండేవి. వాటిపైనున్న, అటాచ్ కొండమీద పశువులు రోజుల్లా మేస్తూ ఉండేవి. కాని, యీరోజున పశువులు మేత మేసేచోట ప్రపంచానికంతకూ పేరెన్నికగన్న ఉక్కుపరిశ్రమ ఉంది. అటాచ్‌కొండ అంతా ఒక పెద్ద ఇనుప ముద్ద అనిచెప్పవచ్చు. అందులో 100 కి 63 పాళ్ళు యినుం, 37 పాళ్లు రాయి ఉంటుంది. దాని బరువు 30 కోట్ల టన్నులు.

మాగ్నిట్నయా అనే పేరుకు బదులు మాగ్నిటోగోర్‌స్కు అని ఆ గ్రామానికి పేరు పెట్టారు.

35 జాతులకు చెందిన ప్రజలు యిక్కడికొచ్చి, కార్మికులకు నివాస యోగ్యమైన ఇళ్లు కట్టారు. విదేశాలనుండి వచ్చిన ఇంజనీరింగ్ నిపుణుల కొరక ప్రత్యేక కాలనీని కట్టారు. కో-ఆపరేటివ్ స్టోర్లు, కాఫీహోటళ్లు, ఆసుపత్రులు, నర్సరీలు, క్లబ్బులు, నాట్యశాలలు నిర్మించబడ్డాయి. నీటి సప్లయి నిమిత్తం అక్కడకు దగ్గరలో ఉన్న నదిపై ఒక ప్రాజెక్టు కట్టి, పెద్ద సరస్సు వంటిదాన్ని యేర్పరచారు.

చకచక మాగ్నిటాగార్స్కకు విమానాశ్రయాలు, రైల్వేలైన్లు, రోడ్లు బయల్దేరాయి. ఈ విధంగా కొన్నిశతాబ్దాలలో జరుగవలసిన పని కొన్ని నెలలలో పూర్తి అయింది.

యేర్పాట్లన్నీ పూర్తి అయాక 60,000 మంది కార్మికులు మాగ్నిటోగోర్స్కకు చేరుకున్నారు. వెంటనే పర్వతంమీద దాడి ప్రారంభమయింది. ముడి యినుమును పైకి తీయడానికి మ్పై్పయ్యేసి అడుగుల లోతున బీటలు కొట్టారు. పెద్దపెద్ద కట్టడాలు కట్టారు. వర్కుషాపులు నిర్మించారు. ఎత్తైన గోడలుగల పవర్ స్టేషన్లను నిర్మించారు. 130 అడుగుల పొడవుగల బ్లాస్టుఫర్నెసులు కట్టారు. మాగ్నిటోగోర్స్కలో ఉన్న బ్లాస్కఫార్నెసులవల్ల ఉత్పత్తి అయేటంత ఆవిరిశక్తి ప్రపంచంలో మరెక్కడా ఉత్పత్తికాదు. బొగ్గు కాలుతుండగానే బెంజాల్, ఎమోనియా, కోల్‌టార్ వంటి రసాయనపదార్థాలు తయారౌతూ ఉంటాయి వాటిని ఉపయోగించే నిమిత్తం రసాయనిక కర్మాగారా లేర్పడ్డాయి

## కార్మికులకు సౌకర్యాలు

కార్మికులు, ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు నివసించడానికి వీలుగా అనేక సౌకర్యాలు కల్పించబడ్డాయి. 17 వరుసలలో నివాసయోగ్యమైన బిల్డింగు లున్నాయి ప్రతివరుసకు ఒక్కొక్క స్టోరు, స్కూలు, కాఫీహోటలు, శిశుశిక్షణాలయం ఉన్నాయి. ఒక్కొక్క యింట్లో చక్కని స్నానాలగది, నీటి కుళాయిలు, ఎలెక్ట్రిక్‌లైటింగు, గ్యాసు, వేడిని పుట్టించే సాధనాలు, ఉంటాయి.



ఒక కొత్త ఇనుము - ఉక్కు పరిశ్రమాగారం

1934 నాటికి మాగ్నిటోగార్స్కులో మొత్తం 1 కోటి టన్నుల Cast Iron తయారయితే, 1937 నాటికి అది 1½ కోటి టన్నులకు హెచ్చింది. ఉక్కు కూడా 1 కోటి టన్నులనుండి 1 కోటి 75 లక్షలకు పెరిగింది. అలాగే రేకు యినుం 90 లక్షలనుండి 1 కోటి 30 లక్షలకు హెచ్చింది.

ఈ విధంగా ఊరల్‌పర్వతాలకు దక్షిణంగా మాగ్నిటోగార్స్కులో యేర్పడ్డ యినుము పరిశ్రమ, క్యుజ్నెట్స్కి ప్రాంతంలో స్థాపించబడిన బొగ్గుపరిశ్రమ కలిసి రెండు కోటలవలె రష్యాను కాపాడుతున్నాయి. మాగ్నిటోగార్స్కులో శ్రేష్టమైన ముడి యినుము, క్యుజ్నెట్స్కులో శ్రేష్ట మైన బొగ్గు దొరుకుతాయి. అందువల్ల క్యుజ్నెట్స్కులో దొరికే బొగ్గు మాగ్నిటోగార్స్కుకూ, మాగ్నిటోగార్స్కులో దొరికే ముడియినుము క్యుజ్నె టస్కీకు నిరంతరం ప్రయాణం చేస్తాయి. ఈ రెండు కేంద్రాలలోను పెద్ద పెద్ద ఉక్కుపరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. వెళ్ళే వాగన్లు, వచ్చేవాగన్లు నిండివుంటాయి.

ఈ రెండు కేంద్రాలలో తయారయే సరుకు ఇంతా - అంతా అని చెప్పడానికి వీల్లేదు.

ఇదే విధంగా, ఉక్రెయిన్‌లో దొరికే క్రివైరాగ్ ముడియినుము డాన్బాస్ బొగ్గుగనుల వద్దకు, డాన్బాస్ బొగ్గుగనులలోని బొగ్గు క్రివైరాగ్ యినుము కేంద్రం వద్దకు ఎప్పుడూ రవానా అవుతూ ఉంటాయి. ఈరెండు కేంద్రాలలోను ఉక్కుపరిశ్రమలు బయల్దేరాయి.

ఇంతేకాదు. ఉత్తరాన నోవోటాగిల్స్కి, దక్షిణాన బాకాల్-ఖలీలోవ్ లలో కూడా కొత్తగా ఉక్కుపరిశ్రమ బయల్దేరింది. ఇంకా తూర్పుదిక్కున అమూర్ నదిమీద నిర్మించబడిన వర్క్‌షాపులలో దేశంయొక్క మూడవ వంతు ఉక్కు తయారౌతుంది.

రష్యా అంతటిలోను 1942 లో తయారైన పిగ్‌ఐరన్ 1937 లో కంటె 1½ రెట్లు హెచ్చింది. ఉక్కు 100 కి 56 చొప్పున. రేకు ఉక్కు 100 కి 62 చొప్పున, హైగ్రేడ్ రేకు ఉక్కు 2 రెట్లు చొప్పున ఎక్కు

వయింది. ఈ 5 సంవత్సరాలలో అదనంగా తయారైన ఉక్కుతో రైలు బద్దీలు వేస్తే అవి భూమధ్యరేఖవద్ద భూమిచుట్టూ తిరిగేటంతటి పొడవుగా ఉంటాయని అంచనావేశారు.

## ఇతర లోహాలు

ఇనుము—ఉక్కుతోబాటు వివిధపరిశ్రమలకు యితర లోహాలుకూడా అవసరం. రాగి, సీసం, తగరం, నికెల్ మొదలైన లోహాలు పూర్వం ఇతర దేశాలనుండి దిగుమతి అయేవి. కాని, యీ రోజున వాటిని రష్యాలోనే తయారుచేస్తున్నారు. వీటిలో ఒక్కొక్క లోహానికి ప్రత్యేకంగా ఎన్నో అవసరా లుండడమేకాకుండా, ఇనుములోను—ఉక్కులోను వీటిని కలిపి అనేక మిశ్రమలోహాలను తయారుచేస్తారు. మిశ్రమలోహాల అవసరం నేడు చాలా ఎక్కువైంది. కాబట్టి, ఈ లోహాలు కొద్దికొద్దిగానే లభించినప్పటికీ, వాటి ప్రాధాన్యత ఎంతో ఉంది. రాగి ఊరల్‌పర్వతాలలోను, కజాక్‌స్థాన్‌లోను దొరుకుతుంది. కజాక్‌స్థాన్‌లోని ప్రిబాల్‌ఖాష్కీ కంబైన్ ప్రపంచంలోని రాగి పరిశ్రమలన్నింటిలో అగ్రగణ్యత వహిస్తోంది. మధ్యఆసియా అంతకూ యిది రాగిని సప్లయిచేస్తుంది. ఇలాగే అల్యూమినియం, నికెల్, మెగ్నీషియం—మొదలైన లోహాలు రష్యాలో విరివిగా దొరుకుతున్నాయి.

ఈ విధంగా సోవియట్ ప్రభుత్వం ఎక్కడ ఏయే సహజసంపద ఉందో తెలుసుకొని, దాన్ని వినియోగంలోకి తీసుకురావడానికి పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించి, అక్కడి ప్రజల్ని అభివృద్ధిలోకి తీసుకొస్తోంది. ఈ విధానం ఎంత చక్కనిదో చరిత్రే రుజువుచేసింది. డాన్బాస్ బొగ్గు గనులు హిట్లరు వశమయాక, సోవియట్ యూనియన్ చాలా నష్టానికి గురి అయినమాట వాస్తవమే అయినప్పటికీ, పూర్తిగా దెబ్బతినలేదు. ఎందువల్లనంటే, ఊరల్—క్యుజ్నెట్స్కి—మాగ్నిటోగార్స్కిలలో ఉన్న ఉక్కుపరిశ్రమలు సోవియట్ సేనలకు ఎడతెగకుండా సప్లయిచేస్తూ వచ్చాయి.

# 9. బంగారం

పెట్టుబడిదారీ దేశాలలో బంగారంయొక్క చరిత్ర అనేక విషాద గాథలతో నిండివుంది. దక్షిణాఫ్రికాలో జోహాన్స్‌బర్గ్ బంగారుగనులు యెలా తవ్వబడ్డాయి ? మొదట అచ్చటి ప్రాంతీయ ప్రజలు, గనులలో మేం పనిచేయం అని నిరాకరించారు. అనేక వందల అడుగులు కిందికిపోయి నానా అవస్థలుపడ్డానికి వారిష్టపడలేదు. కాని, బ్రిటిష్ పెట్టుబడిదార్లొక ఉపాయం కనిపెట్టారు. ప్రాంతీయ ప్రజలు నివశించే ప్రతి పూరిగుడిసెకు పన్ను విధించారు. ఈపన్ను చెల్లించడానికి నాణెములు అవసరంకదా ! కాబట్టి బంగారు నాణెములతో పన్ను చెల్లించుకోవలసి వచ్చింది. అనగా గనులు తవ్వడం అవసరమయింది. జాన్ హాడ్జ్‌సన్ అనే సుప్రసిద్ధ ఇంజనీరు 1916 లో "న్యూ స్టేట్స్‌మన్" అనే పత్రికలో ఒక వ్యాసం రాస్తూ, జోహన్స్‌బర్ గనులనుండి తవ్విన బంగారంలో ప్రతి 60 పౌనుల ముద్దకు ఒకడు చనిపోతున్నాడనీ, గాయాలవల్లగాని - రోగంవల్లగాని 5గురు జీవితంలో పనికిరాకుండా పోతున్నారనీ, లెక్కలతో నిరూపించాడు.

ఆ ప్రాంతీయ కార్మికులు ఎక్కువగంటలు పనిచేసేటట్లు ప్రొప్రయిటర్లు వారికి పెద్దపెద్ద జీతాలియ్యడం సాగించారు. యూరపియన్ కార్మికు లీవలలో పడ్డారుగాని, అక్కడి ప్రాంతీయులు పడలేదు. ఎందువల్లనంటే, పెద్దజీతాలతో కొన్నాళ్ల పనిచేసి, తరవాత వారు స్వతంత్రంగా జీవించనారంభించారు. అప్పుడు ప్రొప్రయిటర్లు మరొక ట్రిక్కు చేశారు. పందెములు, లాటరీలుపెట్టి, కార్మికుల్ని ఆకర్షించారు. ఇందుకు వారు అప్పుచేయ నారంచారు. అప్పులు తీర్చడానికి గనులలో పనిచేయవలసి వచ్చింది. ఈ విధంగా అడకువతో పనిచేసే కార్మికులు అసంఖ్యాకంగా లభించారు.

జార్ కాలంనాటి రష్యాలో బంగారు గనులలో పనిచేసే కార్మికుల స్థితినికూడా హాడ్జ్‌సన్ చిత్రించాడు. లీనా బంగారు గనుల పై పెత్తనం

బ్రిటిష్ పెట్టుబడి దారుల్ది. 1912 వ సంవత్సరం ఏప్రిల్ 17వ తేదీని కార్మికులు సమ్మెచేసి, ఊరేగింపుగా వెళ్తూంటే, వారిమీద జార్ చక్రవర్తి సైనికులు తుపాకులు కాల్చారు. 129 మంది సమ్మెదార్లు మరణించారు.

ఈ సమ్మెకు కారణం, ఎక్కువగంటల పని, ఆలస్యంగా జీతాలీయడం.

ఈ విధంగా, ప్రపంచంలో బంగారాన్ని తవ్వడంకోసం అనేకవేల మంది కార్మికులు బలి అయారు. ఇలా సంపాదించి బంగారాన్ని వినియోగించడంలో ఇంతకంటె అనేకరెట్లు కార్మికులు బలి అయారు. ఎందువల్లనంటే, ఎంతఎక్కువ బంగారం ఉంటే అంతయెక్కువ వడ్డీ వస్తుంది. వడ్డీలమీద కాంపౌండు వడ్డీలు పెరుగుతాయి. వాటిని తీర్చుకోవడం ఒక్కొక్కప్పుడు అసాధ్యమౌతుంది. బంగారం మానవజీవితం పాలిట బ్రహ్మరాక్షసిగా తయారౌతుంది. ఒక్క కలంపోటుతో ధనాన్ని సృష్టించవచ్చు. మరో కలంపోటుతో దాన్ని అపహరించనూ వచ్చు. బంగారం ఉన్నవాడు మానవుల జీవితాన్ని చక్రంమీద తిప్పినట్టు తిప్పవచ్చు; వారి ప్రాణాలపై పూర్తియైన అధికారం చలాయించనూ వచ్చు.

కాని, సోవియట్ రష్యాలో యిలాకాదు. బంగారం తవ్వడానికి అక్కడ కార్మికులు బలిచేయ బడరు. దాన్ని వినియోగించడంలో ప్రజలు బానిసత్వంలో మ్రగ్గరు.

సోవియట్ యూనియన్ అంతటా బంగారు గనులున్నాయి. పాత గనుల్ని తిరిగి తవ్వుతున్నారు. కొత్తవాటిని కనిపెట్టుతున్నారు. కజాక్స్థాన్ పీఠభూములలోను, పామీర్ కొండలలోను, కాకేసస్‌పర్వత లోయలలోను, ఊరల్—ఆల్టాయి పర్వతపంక్తులలోను బంగారం విరివిగా దొరుకుతుంది. ప్రపంచంలోని వివిధదేశాలలో లభించే బంగారం ఎంతెంతో లెక్కలు వేస్తే, రష్యా రెండవస్థానాన్ని అలంకరిస్తోంది.

కార్మికులు కొత్తకొత్త సాధనాలతో గనులను తవ్వుతున్నారు. ఎంపైర్‌డ్రిల్లులు (డ్రిల్లు అనగా సొరంగాలు త్రవ్వే సాధనం). క్రేలిన్ డ్రిల్లులు, కేస్టోన్‌డ్రిల్లులు, సలివాన్ డ్రిల్లులు తీసుకొని పరిశోధకులు అనేక

చోట్ల సంవత్సరం పొడుగునా నేలను తవ్వుకుంటూ పోతారు. వారికి దొరికిన ముడిబంగారం యొక్క నమూనాలను శాస్త్రజ్ఞులవద్దకు పంపుతారు. వాటిని శాస్త్రజ్ఞులు పరిశోధనాలయాలలో పరీక్షచేస్తారు.

ఈ పరిశోధనల ఫలితంగా ఎక్కడైనా బంగారుగని ఉన్నట్లు తెలుసుకుంటే, వెంటనే రోడ్లు, రైల్వేలు, విమానాశ్రయాలు బయల్దేరుతాయి. ఈ విధంగా గనులకూ—దేశంయొక్క ప్రధాన నగరాలకూ మధ్య రహదారులు ఏర్పడతాయి. విద్యుచ్ఛక్తితోను, ఆవిరిశక్తితోను యంత్రాలు బయల్దేరుతాయి. సోషలిస్టు నిర్మాణంలో పూర్తి విశ్వాసం ఉన్న కార్మికులక్కడికి ప్రయాణమౌతారు. పాతకాలంనాటి గుడిసెలస్థానే నివాసయోగ్యమైన చక్కని యిళ్లు, దుకాణాలు, హోటళ్ళు, స్కూళ్ళు, కాలేజీలు — తయారౌతాయి. పుస్తకాలు, వార్తాపత్రికలు అచ్చు అవుతాయి.

## రష్యాకు బంగారం ఎందుకవసరం ?

ఈవిధంగా తవ్వి, తీయబడిన బంగారాన్ని ఉపయోగించడంలోకూడా సోవియట్ యూనియన్ తనప్రజల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొంటుంది.

అయితే, అనేక శతాబ్దాలనుండి మానవజాతిని పీల్చి పిప్పిచేసిన బంగారంకొరకు సోవియట్ యూనియన్‌కూడా యిలా ఎందుకు తాపత్రయపడ్డం ? పెట్టుబడిదార్ల మాదిరిగా సోవియట్ యూనియన్‌లో బంగారానికింత విలువ ఎందుకిస్తున్నారు ?

సోవియట్ యూనియన్ చుట్టూ ఉన్నదేశాలు పెట్టుబడిదారీ దేశాలనే విషయం మనకు తెలుసు. ఆర్థికంగా నిలబడ్డానికి ఆ దేశాలు బంగారపు రాసులు కూడబెట్టుకున్నాయి. ఏ దేశానికైనా బంగారం ఎక్కువగా ఉంటేనే, ఆధునికయంత్రసామగ్రిని కొనగల్గుతుంది. బంగారం ఎక్కువగా ఉన్నప్పుడే ఆ దేశానికి రక్షణయేర్పాట్లు కట్టుదిట్టంగా ఉంటాయి. కాబట్టి, యితర దేశాలలో బంగారానికి యెక్కువ విలువ ఉన్నదికాబట్టి, రష్యాలో కూడా ప్రభుత్వం విలువయివ్వడం తప్పనిసరి అయింది.

అయితే, ఒక విషయాన్ని మనం మరచిపోకూడదు. రష్యాలో బంగారాన్ని విదేశవ్యాపారానికి మాత్రమే ఉపయోగిస్తారు. దేశంలో చెలా

మణి అయే నాణెములు బంగారం నాణెములుకాదు. ఇతర దేశాలలో మారక విధానం ఎలావుంటుందంటే, ప్రభుత్వఖజానాలో ఉండే బంగారం మొత్తాన్ని బట్టి కాగితపునోట్లు అచ్చువేస్తారు. ఎంత బంగారంఉంటే అంతకు కొన్ని రెట్లు అచ్చువేస్తారు. ఆ మొత్తాన్నిమించి కాగితపునోట్లు వేయరు. వేస్తే, వస్తువుల ధరలన్నీ పెరుగుతాయి. దీన్నే ఇన్‌ఫ్లేషన్ అంటారు. యుద్ధాలలో ప్రతి ప్రభుత్వం తన అవసరాల నిమిత్తం నోట్లు అదనంగా అచ్చువేయడం, అందువల్ల ధరలు పెరగడం, చూస్తూనే ఉన్నాం. కాని సోవియట్ యూనియన్‌లో అలాకాదు. ఈ రోజున యింపుమించు అన్నిదేశాలలోను ధరలకంట్రోలు ఉన్నరీతిగా రష్యాలో ఎల్లప్పుడూ ధరలకంట్రోలు ఉంటుంది. అయితే కంట్రోలు ఏ ఒకటి రెండు వస్తువులకో కాకుండా, ప్రతి వస్తువుకూ, ఉంటుంది. అందువల్ల నోట్లముమ్మరం ఎక్కువౌతూన్న కొద్దీ ధరలు పెరగడం అనేది రష్యాలో లేదు. అనగా, బంగారంతో నిమిత్తలేకుండానే సరుకుల విలువనుబట్టి ప్రభుత్వం నోట్లు అచ్చువేయిస్తుంది. ప్రజలకు తమ ప్రభుత్వంమీద పూర్తి విశ్వాసం ఉందికాబట్టి, కాగితం నోట్లు పుచ్చుకొని బంగారం యిమ్మని ఎవరూ బ్యాంకులకు పరుగెత్తరు.

రష్యన్లు బంగారాన్ని మెళ్ళో గొలుసులు మొదలైన ఆభరణాలకు, పిల్లల ఆటవస్తువులకు, నోటి పళ్ళకు మాత్రమే ఉపయోగిస్తారు. కొన్ని పరిశ్రమలకు కూడా బంగారం ఉపయోగిస్తుంది.

కాబట్టి సోవియట్ యూనియన్ ఇతరదేశాలలోవలె బంగారాన్ని పాతర్లలో నిలవచేసుకోదు. కొత్త యంత్రాలు, కొత్తసాధనాలు కొనడానికి వినియోగిస్తుంది.

ప్రపంచం అంతటా సోషలిజం స్థాపించబడితే, బంగారానికి యిప్పుడున్న విలువ ఉండదు. అన్నంతినే కంచాలకు, ఆటవస్తువులకు, ఆభరణాలకు, మాత్రమే అది పనికివస్తుంది. ప్రస్తుతం రష్యా బంగారాన్ని నిలవజేస్తున్నమాట నిజమే. జపాన్ - జర్మనీ - ఇటలీలలో ఉన్న మొత్తం బంగారంకంటె రష్యాలో ఎక్కువ నిల్వ ఉంది. అకస్మాత్తుగా వచ్చే యుద్ధాలలో ఈ నిలవ బంగారం ఎంతైనా సహాయపడుతుంది.

# 10. యంత్ర పరిశ్రమ

మనం ఇప్పుడు యంత్రయుగంలో ఉన్నాం. పదివేల చేతులతో చేసే పనిని ఒక యంత్రం చేస్తుంది. యంత్రం బట్టనేస్తుంది. పొలాలు దున్నుతుంది. సరుకుల్ని మోసుకుపోతుంది. మహాసముద్రాల్ని చీలుస్తుంది. గాలిని ఛేదిస్తుంది. యంత్రాలలో అనేక రకాలున్నాయి. అవి అనేక రకాలైన పనులు చేస్తాయి. నమ్మశక్యంకాని వేగంతో సరుకుల్ని తయారు చేస్తాయి.

యంత్రం చేయలేని పనిలేదు. ఎంత బరువునైనా అవలీలగా మోస్తుంది. ఎంత సున్నితమైన దెబ్బనైనా వేగంగా కొడుతుంది. ఒక ఎలెక్ట్రిక్ చెయ్యి ఒక టన్ను బరువుగల పదార్థాన్ని ఒక్క గుప్పెట్లో యెత్తి వేస్తుంది. 24 గంటలలో 30 క్యూబిక్ ఘనగజాల మట్టిని (క్యూబిక్ గజం అంటే ఒక గజం పొడవు, 1 గజం వెడల్పు, 1 గజం ఎత్తు, గల విస్తీర్ణం) తీసి బయట పోస్తుంది. అనగా, 15 వేలమంది కూలీలుచేసే పనిని చేస్తుందన్నమాట. చిమ్నీలు చేసే ఒక సున్నితమైన ఎలెక్ట్రిక్ వేలు నిమిషానికి 422 ఎలెక్ట్రిక్ బల్బుల్ని తయారు చేస్తుంది. అనగా, 10 వేల మంది కార్మికులు చేసేపనిని చేస్తుందన్న మాట. యంత్రాలవల్ల మన పనులు ఎంత సులభమౌతాయో యిప్పుడు తెలుసుకోవచ్చు.

యంత్రం అంటే బ్రహ్మరాక్షసి అని మనలో చాలామందికి భయం. మన దేశంలో కార్మికులు యంత్రాన్ని చూచి ఉప్పొంగరు; అసహ్యించు కుంటారు. ఇందుకు కారణం లేకపోలేదు. ప్రతి కొత్తయంత్రం కొన్ని వందలమంది నోట్లో మన్నుకొడుతుంది. ఒక గ్లాసు ఫ్యాక్టరీలో ఒకే మనిషి గంటకు 3,000 సీసాల చొప్పున తయారు చేస్తున్నాడు. అంతకు పూర్వం ఆపనే 77 గురు కార్మికులు చేసేవారు. అంటే, కొత్తయంత్రం వచ్చాక 76 గురు కార్మికులు నిరుద్యోగులయారన్నమాట.

కాని, సోవియట్ యూనియన్‌కు యంత్రాలంటే భయంలేదు. భయపడ నవసరం లేదుకూడా. ఎందువల్లనంటే, ఆర్థిక నిర్మాణం అంతా ఒక ప్లాను ప్రకారం నడిచేటప్పుడు, యంత్రాలెన్ని ఎక్కువఉంటే కార్మికు డంత సుఖపడతాడు; పని అంత సులభమౌతుంది; పనిచేసే గంటలు అంత తగ్గుతాయి; జీవితం అంత బాగుపడుతుంది. ఎక్కువైనవారిని యితర పరిశ్రమలకు పంపుతారు. కాబట్టి సోవియట్ యూనియన్ యంత్రోత్పత్తిని అధికంగా ప్రోత్సహిస్తుంది.

1932 లో డినీపర్ నదికి కట్టిన ప్రాజెక్టు ఎంత విద్యుచ్ఛక్తిని యిస్తుందో చూచాం. దామాషాను 1 దమ్మిడీయిస్తే 1 కిలోవాట్ విద్యుచ్ఛక్తి అక్కడ లభిస్తుందని శాస్త్రజ్ఞులు అంచనా వేశారు. అంటే బలిష్ఠమైన ఒక వ్యక్తి 3 రోజుల్లో ఈయగల శ్రమశక్తి 1 దమ్మిడీకి దొరుకుతుందన్న మాట. ఈ విద్యుచ్ఛక్తిని వినియోగించుకునే టందుకు పెద్దపెద్ద యంత్రా లుండాలి. జోళ్ళుకుట్టే యంత్రాలు, బట్టలునేసే యంత్రాలు, భూమినిదున్నే యంత్రాలు, కోతలుకోసే యంత్రాలు, కాగితం తయారుచేసే యంత్రాలు, కూడికలు కూడే యంత్రాలు, - అవసరం.

అన్నింటికంటె ముఖ్యం, యంత్రాలను తయారుచేసే యంత్రాలు కావాలి.

## యంత్రం చేయలేనిపని లేదు

కాబట్టి, యంత్రోత్పత్తికి సోవియట్ రష్యా సర్వసహాయం చేసింది. ఉదాహరణకు భూమిని తవ్వే ఎక్స్కవేటర్ విషయం చూడండి. ఇదొక రావణాసురుడి చెయ్యివంటిది. దీని పొడవు 60 అడుగులు, దీని అడుగున పదునైన ఉక్కుగోళ్లు ఉంటాయి. వీటితో ఒకేసారి వేగన్‌మట్టిని అవలీలగా తవ్వి, పైకి తీసుకొచ్చి, పెద్ద జలపాతంవలె ఫోర్సుతో సమీపాన ఉన్న ట్రక్కులో పోస్తుంది. మనిషికంటె వందరెట్లు శక్తితోను, వందరెట్లు చురుకుగాను, వందరెట్లు ఎక్కువ సున్నితంగాను యంత్రాలు పనిచేయ గలవు. అవిరిశక్తితో పనిచేసే పెద్దసుత్తి ఒక పెద్దయింటిని సహితం

పిండిచేయగలిగిన బరువుతో దెబ్బకొట్టి, వెంటనే మరుచటి నిమిషాన మనే రిస్టువాచీమీద ఉండే అద్దం పగిలిపోకుండా ముట్టుకొనేటట్టు సున్నితమైన దెబ్బను కొడుతుంది. ఇలాంటి సాధనాలన్నీ రష్యాకు అవసరమని సోవియట్ నాయకులు గుర్తించారు. కాబట్టి పెద్దపెద్ద యంత్రపరిశ్రమలను దేశంలో నెలకొల్పారు. ఒకేచోట కాకుండా, దేశం అంతటా ఈ ఉద్యమాన్ని వ్యాపింపజేశారు.

కాని, మామూలు కార్మికు లింయకు పనికిరారు. తరిఫీదుపొందిన నిపుణులు అవసరం. కాబట్టి, ప్రభుత్వం టెక్నికల్ స్కూళ్ళు, కాలేజీలు, విశ్వవిద్యాలయాలు — తెరువవలసివచ్చింది. వీటిల్లో తరిఫీదు పొందినవారు చక్కని శిక్షణ, కుశాగ్రబుద్ధి, చాకచక్యం, చురుకుతనం కలిగియుంటారు.

ఈ పని అంతా 2 సంవత్సరాలలో పూర్తి అయింది. ఈ రోజున రష్యాకు కావలసిన ఏ ఒక్క యంత్రాన్నీ విదేశాలనుండి తెప్పించుకో నవసరం లేదు. ప్రతిరోజూ కొత్త కొత్త యంత్రాలు రష్యాలో తయారౌతున్నాయి.

## మోటార్లు, రైలు ఇంజన్లు

గోర్కీ అనే పట్టణంలో మోలటోవ్ ఆటోప్లాంట్ అనే మోటారు పరిశ్రమ ఉంది. ఇక్కడ తయారయే మోటారుకార్లు, ట్రక్కులు, ఇంగ్లండ్ మొత్తంమీద తయారౌతూన్న వాటితో సమానం. ప్రపంచంలోకల్లా యిది పెద్ద పరిశ్రమ.

ఇలాగే వొరోషిలావ్‌గ్రాడ్‌లో రైల్వే ఇంజన్ల వర్క్‌షాపు ఉంది. అందులో సంవత్సరానికి 1,080 ఇంజన్లు తయారౌతుండేవి. 1942 లో బ్రాడ్‌గేజ్ ఇంజన్లు సంవత్సరానికి 2,090 చొప్పున తయారైనాయి. ఆ సంవత్సరంలోనే 4 లక్షల మోటారు ట్రక్కులు తయారయాయి.

# విమాన పరిశ్రమ

ఈ రోజుల్లో ఏ ప్రభుత్వమూ విమానాల విషయంలో వెనుకబడి యుండకూడదు. విమానాలు లేకపోతే, సేనలకు కళ్లు లేనట్లే!

అంతేకాదు. సోవియట్ యూనియన్ అంతటి విశాలమైన దేశంలో అడవులు, కొండలు, బురదనేలలు, మంచు ప్రదేశాలు, ఎడారులు ఎక్కువగా ఉండడంవల్ల అనేక రాష్ట్రాలు - జాతులు కేంద్రానికి చాలాదూరంగా ఉంటాయి. అందువల్ల విమానాల అవసరం ఎక్కువయింది. సఖాలిన్ అనే దీవిని తీసుకుందాం. ఇక్కడికి సముద్రంమీద వెళ్ళాలంటే, కొన్ని నెలలు పడుతుంది. ఇలాగే కారకూం ఎడారి కొన్నివేలమైళ్ళు విస్తరించి యుంది. కాబట్టి, అక్కడి ప్రజలు వార్తలకొరకు ప్రతిరోజూ విమానటపా కొరకు ఎదురుచూస్తూ ఉంటారు. ఇంజనీర్లు ఎప్పటికప్పుడు కొత్త ప్లానులకై విమానాల వైపు చూస్తూ ఉంటారు. సోవియట్ వైమానికదళం యీ అవసరాలన్నింటినీ తీరుస్తోంది. దేశాన్నంతటినీ ఒకే యూనిట్‌గా ఐక్యం చేస్తూంది.

ఒకరోజున కెరీలియా ప్రాంతంలో ఒక పంతులమ్మకు మంచుబాధ వల్ల కాళ్ళు కొంకర్లుపోయి, గాంగ్రీన్ అనేవ్యాధి ప్రవేశించిందట. ఆపరేషన్ చేస్తేగాని దానికి చికిత్సలేదట. కొంతసేపట్లో ఆమె చనిపోయే స్థితికి వచ్చింది. అక్కడికి సమీపంలో సర్జన్‌లేడు. ఇక ఎలాగు? వెంటనే లెనిన్‌గ్రాడ్‌నుండి విమానం ఒకటి వచ్చి, ఆమెను అక్కడికి తీసుకుపోయి ఆమె ప్రాణాన్ని కాపాడినదట!

యెనేసీ అనే నదివద్ద వ్యవసాయానికి పనికివచ్చే లేళ్ళకు అంటు వ్యాధి ఒకటి సోకి, విపరీతంగా మరణిస్తున్నాయి. అక్కడికి నాగరిక ప్రపంచం చాలా దూరంలో ఉంది. ప్రయాణసౌకర్యా లేమీలేవు. కాని, సోవియట్ ప్రభుత్వం ఒక వైద్యదళాన్ని విమానాలలో పంపి, ఆ వ్యాధికి చికిత్స చేయించింది!

విమానాలు టపాను మోసుకెళ్తాయి. ఆర్కిటిక్ మహాసముద్రంలో విహరించే సీలుచేపల్ని కనిపెట్టుతాయి. యాకూట్స్కీ ప్రాంతంనుండి

పచ్చి చర్మాల్ని తీసుకొస్తాయి, వరిచేలల్లో విత్తనాలు నాటుతాయి. అడవులలో బయల్దేరే మంటల్ని కనిపెడతాయి. పైర్లను నాశనంచేసే మిడతల్ని సంహరిస్తాయి. చీడపురుగుల్ని రూపుమాపుతాయి. పొగమంచునుండి పైర్లను కాపాడుతాయి.

ఈ రోజున సోవియట్ యూనియన్ తనకుకావలసిన విమానాలన్నింటినీ తానే తయారుచేసుకుంటూంది. అవి చాలా శ్రేష్ఠమైనవి. 1937లో ఉత్తర ధృవానికి వెళ్ళినవారు $2\frac{1}{4}$ రోజులలో విమానంమీద ప్రయాణంచేసి వెళ్ళారు; మాస్కోలో బయలుదేరి, ఒక్కపెట్టున అమెరికాకు దక్షిణాన దిగారు.

సోవియట్ విమానాల శ్రేష్ఠతను యీ రోజున జర్మన్లు స్వయంగా చూస్తున్నారు.

థామస్ మార్గన్ అనే అమెరికా కోటీశ్వరుడు యిలా వ్రాశాడు: " సోవియట్ విమానాలు నిర్మాణంలోను, పనిలోను అమెరికన్ వాటితో పరిసమానమైనవి అక్కడ పరిశోధనలకు ఏర్పాటుచేయబడ్డ సంస్థలు, కర్మాగారాలు ప్రపంచంలో ఉన్న యితర సంస్థలతోను, కర్మాగారాలతోను పోల్చదగినవిగా ఉన్నాయి. సైజులలో అంతపెద్దవి ఎక్కడాలేవు.... ....ఇందుకు కారణం యేమంటే, వాటికి ఎంత ప్రోత్సాహం అవసరమో అంతా ప్రభుత్వం యిస్తుంది. ఇంజనీర్లకు, డిజైనర్లకు అక్కడున్న అవకాశాలు మరెక్కడా లేవు. ఎందుకంటే, ప్రైవేట్ కంపెనీలు అంత ధనాన్ని భరింపజాలవు. "

రష్యాలో వివిధరకాలైన విమానాలు తయారౌతున్నాయి. జీరో కింద 40 డిగ్రీలుండే శీతలప్రదేశంలో సంచరించగల విమానాలున్నాయి. భూమిమీదగాని, నీటిమీదగాని, మంచుమీదగాని, చటుక్కున దిగగల విమానాలున్నాయి. " ఆకాశపు రైళ్లు " అనే మరొక విధమైన విమానాలున్నాయి. వీటికి వెనకాల ప్యాసింజర్లతోగాని, సామాన్లతోగాని ప్రయాణంచేసే గ్లయిడర్లుంటాయి. అవి చేరవలసిన ఊరు రాగానే, విమానం నుండి వాటి లింకును తెగగొట్టుతారు. వెంటనే అవి నెమ్మదిగా భూమిమీదకు జారుతాయి. విమానం మాత్రం తనదారిని తాను పోతుంది.

సోవియట్ యూనియన్ ఈ రోజున యంత్రపరిశ్రమ విషయంలో యూరపుఖండానికంతకూ మొదటిస్థానం అలంకరిస్తోంది. ప్రపంచంలో అమెరికాదేశం ఒక్కటే రష్యాతో పోటీచేస్తూంది. మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వంకంటె యిప్పుడు 23 రెట్లు అధికమయింది ఈ పరిశ్రమ. 1942 లో మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేసరికి 1937 కంటె 42 లో 100 కి 225 చొప్పున హెచ్చుతుందని అంచనావేశారు.

| | 1913 | 1937 |
|---|---|---|
| బట్టల తానులు |  236 కోట్ల రూబుల్సు విలువగలవి |    669 కోట్ల 90 లక్షల రూబుల్సు విలువగలవి |
| రెడిమేడ్ బట్టలు | 2 కోట్ల 80 లక్షల రూబుల్సు |    316 కోట్ల 80 లక్షల రూబుల్సు విలువగలవి |
| జోళ్ళు | 6 కోట్ల 50 లక్షల రూబుల్సు |    153 కోట్ల 90 లక్షల రూబుల్సు విలువగలవి |
| డబ్బాలతో ఆహారపదార్థాలు | 8 కోట్ల 30 లక్షల రూబుల్సు |    137 కోట్ల 20 లక్షల రూబుల్సు |
| బిస్కత్తులు, చాకొలెట్లు వగైరా కన్ఫెక్షనరీ సామాను |  70 వేల టన్నులు |   9 లక్షల 21 వేల టన్నులు |
| సిగరెట్లు |  2200 కోట్లు |    8900 కోట్లు |

# యంత్ర పరిశ్రమకు కావలసిన సరకులు

1913 | 1940

పెట్రోలు, కోల్‌గ్యాసు

 

92 లక్షల టన్నులు — 3 కోట్ల 42 లక్షల టన్నులు

బొగ్గు

    

2 కోట్ల 91 లక్షల టన్నులు — 16 కోట్ల 46 లక్షల టన్నులు

ఉక్కు

    

42 లక్షల టన్నులు — 1 కోటి 84 లక్షల టన్నులు

1937

యంత్ర పరికరాలు

       

1500 మూర్తులు — 48,500 మూర్తులు

రైల్వే ఇంజన్లు

       

664 మూర్తులు — 1620 మూర్తులు

రసాయన పరిశ్రమ

       

45 కోట్ల రూబుల్సు విలువగలది — 594 కోట్ల రూబుల్సు విలువగలది

# 11. సోవియట్ రాజ్యాంగం

సోవియట్ రాజ్యాంగయంత్రానికీ, యితర రాజ్యాంగయంత్రాలకూ చాలా తేడా ఉంది. ఇతరదేశాలలో కొద్దిమంది జమీందార్లు, పెట్టుబడిదార్లు కలిసి ప్రజాసామాన్యం యొక్క శ్రమఫలితాన్ని దోచుకుని తింటారు. రాజ్యాంగయంత్రం వారి హక్కుల్ని నిలబెడుతూ, "శాంతి, భద్రత" ల్ని కాపాడుతూ ఉంటుంది. సోవియట్-యూనియన్‌లో ఇలా కాదు. సోవియట్ రాజ్యాంగ యంత్రం భూమి మొదలైన ఉత్పత్తిసాధనాల్ని వ్యక్తుల నుండి లాక్కుని, సంఘానికి స్వాధీనంచేసింది. కష్టపడి పనిచేసేవారందరికీ అధికారం యిచ్చింది. వారి ప్రతినిధులే ఈ రోజున రాజ్యాన్ని నడుపుతున్నారు. ఇతరుల శ్రమఫలితాన్ని దోచుకునే వర్గాలు సోవియట్ యూనియన్‌లో లేవు.

1936 వ సంవత్సరంలో ఆమోదించబడిన రాజ్యాంగచట్టం యొక్క మొదటి నిబంధన ప్రకారం కార్మిక, కర్షకుల రాజ్యాంగ యంత్రమే సోవియట్ యూనియన్. ఇతర దేశాలలో జమీందార్లు, పెట్టుబడిదార్లు, తమ ఏజంట్లద్వారా పరిపాలన కొనసాగిస్తూంటే, సోవియట్ రష్యాలో కార్మికులు, కర్షకులు తమ ప్రతినిధుల ద్వారా రాజ్యం ఏలుతున్నారు.

## శ్రామికవర్గ నియంతృత్వం

దీన్నే శ్రామికవర్గ నియంతృత్వం అంటారు. అంటే, శ్రామికవర్గం అధికారానికి వచ్చి, ప్రజాస్వామ్య పద్ధతుల ప్రకారం రాజ్యం ఏలడం. నిజమైన ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించాలంటే, శ్రామికవర్గం తన శత్రువుల్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయాలి. దెబ్బతిన్న పాము యెప్పటికైనా కాటువేస్తుంది. అదివరలో అధికారంలో వున్న దోపిడీవర్గాలు కొత్తప్రభుత్వాన్ని నాశనం చేయడానికి తప్పక ప్రయత్నిస్తాయి. కాబట్టి ప్రజల

ప్రభుత్వం నిలబడాలంటే, నియంతృత్వ మవసరం. కనుకనే లెనిన్ 1917 లో యిలా అన్నాడు :

" ప్రజాస్వామ్య ప్రభుత్వం అంటే పేదల ప్రభుత్వం : ప్రజల ప్రభుత్వం. ధనికవర్గానికి కాదు ప్రజాస్వామ్యం. ప్రపంచంలో మొట్టమొదటి సారి యిట్టి ప్రభుత్వం రాబోతూంది. ప్రజాస్వామ్యపరిపాలన విశాలంగా వ్యాపించడంతోబాటు, ప్రజల్ని పీల్చిపిప్పిచేసే దోపిడీగాండ్ర స్వేచ్ఛను అరికట్టడంకూడా అవసరం. పెట్టుబడిదారుల్ని, యితర ధనికవర్గాల్ని అతి క్రూరంగా అణచడం అవసరం. మానవకోటికి స్వాతంత్ర్యం యివ్వడం కోసం యిలా జరిగితీరాలి. ప్రజాశత్రువుల దాడిని యెదురుదాడులతో నాశనం చెయ్యాలి.... ....కాబట్టి, అధికసంఖ్యాకులైన ప్రజాబాహుళ్యం ప్రజాస్వామ్య పరిపాలనను అనుభవించాలంటే, ప్రజల్ని దోచుకొని బ్రతికే వర్గాల్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయాలి. "

మానవ సమాజాన్ని అభివృద్ధివైపుకు నడిపించడమే సోవియట్ నాయకుల ఆశయం. ఇందుకు మొదటిమెట్టు సోషలిజం. ఉత్పత్తి సాధనాలపై పెత్తనం వహించుతూ ప్రజా సామాన్యాన్ని దోచుకొనే వర్గాల్ని మొదట నిర్మూలించాలంటారు వీరు. తరువాత యంత్రసహాయంతో మానవుని శ్రమను తగ్గించి, ఉత్పత్తిని యెక్కువచేసి, దాన్ని ప్రజలందరికీ అందుబాటులో ఉంచుతారు. యంత్ర పరిశ్రమ బాగా వ్యాపించితే, సరుకులన్నీ వేగంగాను, యెక్కువగాను తయారై ప్రతివ్యక్తికీ ఏది ఎంత కావాలో, అంతా లభిస్తుంది. దీనితోబాటు ప్రజల విజ్ఞాన సంపదకూడా యెక్కువౌతుంది. ప్రతివాడు సమాజంకొరకు నిర్వర్తించవలసిన ధర్మాన్ని గ్రహించి పనిచేస్తాడు. ప్రతివ్యక్తి రోజుకు కొన్నిగంటల చొప్పున యిష్టపూర్వకంగా, ఎవరి నిర్బంధం లేకుండానే, పనిచేయడానికి అలవాటుపడతాడు. ప్రతి తేనెటీగ యేవిధంగా కష్టపడి తేనె సంపాదించి తీసుకొస్తుందో, అలాగే ప్రతిమానవుడు తన శక్తినిబట్టి, అభిరుచినిబట్టి యేదో ఒక పనిచేస్తూ ఉంటాడు అలాంటి సమాజంలో ప్రతివానికీ ప్రతి వస్తువు పుష్కలంగా దొరుకుతుంది కాబట్టి యెవరికి ఎంత కావలసివస్తే అంతా



సోవియట్ పార్లమెంటు సమావేశమైవున్న దృశ్యం

ఎడమవైపునుంచి వరుసగా : 1. మికోయన్ (ఆహారశాఖా కమిస్సార్) 2. జడనోవ్ (విదేశవ్యవహార ఉపసంఘ అధ్యక్షుడు) 3. మాలటోవ్ (విదేశాంగ శాఖకు కమిస్సార్) 4. కాలినిన్ (అధ్యక్షుడు) 5. ఒరోషిలోవ్ (ఉత్తర రంగానికి సర్వసేనాధిపతి) 6. స్టాలిన్ (ప్రధాని) 7. కాగినోవిష్ (రైల్వేశాఖ కమిస్సార్)



వీరు అష్కాబాద్ జిల్లాలో గార్యికిహోగ్రామ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేసే రైతులు, రైతుస్త్రీలు. టర్కోమాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ సుప్రీమ్ సోవియట్ ఎన్నికలలో ఓటు చేయటానికి బ్యాలట్ కాగితాల్ని తీసుకొంటున్న దృశ్యం.

తీసుకోవచ్చు. దీన్నే కమ్యూనిస్టు సమాజం అంటాం. అట్టి సమాజంలో రాజ్యాంగయంత్రం అవసరముండదు.

ఐతే, సోవియట్ యూనియన్‌లో ఇట్టి కమ్యూనిస్టుసమాజం ఇంకా స్థాపించబడలేదు. సోషలిజం మాత్రమే ఉంది. అయితే, సోషలిజం కమ్యూనిస్టు సమాజానికి దారితీస్తుంది.

## కొత్త రాజ్యాంగ చట్టం

సోవియట్ యూనియన్‌లో పరిస్థితుల్నిబట్టి కొత్త రాజ్యాంగ చట్టా లేర్పడతాయి. ఎప్పుడూ ఒకే శాశ్వతమైన నిబంధనావళి ఉండదు. రాజ్యాంగ చట్టం ఒక అచేతన పదార్థంకాదు. సమాజం ఎప్పుడూ మార్పుచెందుతూ ఉంటుంది. నిన్నటి పరిస్థితుల కనుగుణ్యమైన చట్టం రేపటి పరిస్థితులకు సరిపడకపోవచ్చు. ఉదాహరణకు, 1918 లో మొట్టమొదటి రాజ్యాంగ చట్టం అమల్లోకి వచ్చింది. 1924 లో సోషలిస్టునిర్మాణం కొత్తసమస్యల్ని యెదుర్కోవలసి వచ్చినప్పుడు మొదటి రాజ్యాంగచట్టం రద్దుచేయబడి, రెండోది అమల్లోకి వచ్చింది. 1936 వ సంవత్సరం నాటికి మళ్ళీ కొత్తపరిస్థితు లేర్పడ్డాయి. దోపిడీవర్గం పూర్తిగా నిర్మూలించబడి, వర్గ భేదాలు అంతరించాయి. ఈ కొత్తపరిస్థితులలో మూడవ రాజ్యాంగచట్టం వ్రాయబడింది. దీన్నే "స్టాలిన్ రాజ్యాంగ చట్టం" అంటాం.

## హక్కుల ప్రణాళిక

ఇందులో సోవియట్ పౌరుల హక్కుల ప్రణాళిక ఉంది. దాని ప్రకారం ప్రతివ్యక్తి ఏదో ఒకపనిని చేసుకోడానికి, విశ్రాంతి తీసుకోడానికి, చదువు నేర్చుకోడానికి, వయసు చెల్లినప్పుడు — ఆరోగ్యం చెడినప్పుడు ఉచిత సహాయనిధిని పొందడానికి, హక్కు కలిగియుంటాడు. ఈ హక్కులు కేవలం కాగితం హక్కులేకాదు. అందని ద్రాక్షపండ్లు కావు. నేడు ప్రతి వ్యక్తి వీటిని అనుభవించుతున్నాడు. అలా అనుభవించడాని కెన్నో అవకాశా లున్నాయి. భూమిపై హక్కు ప్రజలది ఫ్యాక్టరీలన్నీ ప్రజలవి. గనులు ప్రజలవి. రైళ్ళు ప్రజలవి. అన్నీ ప్రజలవి. వాటిని ప్రజోపయోగంకొరకు

ఉపయోగించే ప్రభుత్వం అధికారంలో ఉంది. అది ప్రజానాయకులచే నడుపబడుతుంది ఇట్టి పరిస్థితులలో యీ హక్కుల ప్రణాళికను ధిక్కరించగలవారెవరు ?

ఇంతేకాదు. సోవియట్ యూనియన్‌లో అనేక భాషలు మాట్లాడే వారున్నారు. అనేక మతాలు ఉన్నాయి. అనేక జాతులు, తెగలు ఉన్నాయి. జార్ చక్రవర్తుల పరిపాలనలో ఈప్రజలకు ఎట్టి హక్కులూ ఉండేవికావు. కాని, సోవియట్ రాజ్యాంగచట్టం యొక్క 123 వ నిబంధనలో యెలా ఉందో చూదాం :

"సోవియట్ యూనియన్‌లో నివసించే ప్రజలందరికీ న్యాయ శాస్త్రం సమానమైన హక్కు లిస్తుంది. ఎట్టి జాతివివక్షత ఉండదు. కొన్ని సంతతుల (Races)కు పక్షపాతం ఉండదు. దేశంయొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయ జీవితంలోగాని, ప్రభుత్వశాఖలలోగాని, వైజ్ఞానిక వృత్తులలోగాని, ప్రవేశించడానికి సమస్తజాతులప్రజలకు హక్కుఉంటుంది.

" ఈ హక్కును ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని, యెవరూ హరించకూడదు. కొన్ని జాతులకుగాని, కొన్ని సంతతులకు (Races)గాని, ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని ఇతరులకులేని హక్కు లుండవు, ప్రత్యేక సౌకర్యాలుండవు. ఒక జాతిని మరొక జాతి ద్వేషంతోగాని, అసహ్యాభావంతో గాని చూడ్డానికి వీల్లేదు. ఇందుకు వ్యతిరేకంగా ప్రవర్తించువారు శిక్షించబడతారు."

నిజంచెప్పాలంటే, ఇతరుల్ని నీచభావంతో చూచేవారికి స్వాతంత్ర్యం అనేది ఉండదు. ఒకజాతిని పీడించేజాతి స్వతంత్రజాతి అనబడదు. ఈయదార్థాన్ని గ్రహించే, సోవియట్ నాయకులీ రాజ్యాంగ చట్టాన్ని ప్రవేశపెట్టారు.

## వోటింగు హక్కు

పై సూత్రాల కనుగుణ్యంగా సోవియట్ ప్రభుత్వం ప్రజలందరికీ సమానమైన వోటింగు హక్కు యిచ్చింది. ఏ సంతతికి (Race) చెందినా, ఏ భాష మాట్లాడినా, ఏ మతం అవలంబించినా, యేరంగుకు చెందినా,

సోవియట్ యూనియన్‌లో స్త్రీ పురుషులు 18 సంవత్సరాల వయసుదాటితే వోటు చేయడానికి హక్కు ఉంటుంది. పరోక్షపు ఎన్నికలుండవు. (అనగా, వోటర్లచే ఎన్నుకోబడిన డెలిగేట్లు పై సంస్థలకు తిరిగి వోటు చేయడం). వోటింగు రహస్యంగానే జరుగుతుంది. మతాధిపతులు కూడా వోటు చేయవచ్చును. పూర్వపు జార్ చక్రవర్తుల కుటుంబానికి చెందిన రాజవంశీకులు సహితం నేడు వోటు చేయవచ్చును. ఇంత విశాలమైన వోటింగ్ హక్కు ప్రపంచంలో ఎక్కడాలేదు.

కాని, సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు పార్టీ తప్ప మరొక రాజకీయపార్టీకి స్థానంలేదనీ, వ్యతిరేక పార్టీలులేని ఎన్నిక వట్టి బూటకపు ఎన్నిక అనీ, నిజమైన ప్రజాస్వామ్య ప్రభుత్వంలో వ్యతిరేక పార్టీలుండడం ఒక ప్రధాన లక్షణమనీ — చాలామంది విమర్శిస్తూ ఉంటారు. అట్టివిమర్శకులు కొన్ని ముఖ్య విషయాలను జ్ఞాపకం ఉంచుకోవాలి.

మొదటిది: ఎన్నికల తేదీకి ముందుగానే ఏ యే అభ్యర్థుల్ని నిలబెట్టితే మంచిదో, ప్రజలు బహిరంగసభల ద్వారా తమ అభిప్రాయాల్ని వెల్లడించుతారు. ఏ అభ్యర్థికి యెక్కువ అర్హతలున్నాయో ఆ అభ్యర్థి పట్ల ప్రజలు తమ ఆమోదాన్ని తెలియచేస్తారు. ఇది జరిగేటప్పుడు అనేక చర్చలు జరుగుతాయి. అనేక ప్రశ్నలు, సమాధానాలు వస్తాయి. ఈ సభలలో ఒక అభ్యర్థి పనికిరాడని అభిప్రాయమిచ్చిన వోటర్లు అంతిమ యెన్నికలలో కూడా వ్యతిరేకంగానే వోటుచేయవచ్చును.

రెండోవిషయం: కమ్యూనిస్టుపార్టీసభ్యులు కానివారినికూడా ప్రజలు అభ్యర్థులుగా నిలబెట్టవచ్చు. అలా నిలబెడుతున్నారు కూడా. 1937 లో జరిగిన ఎన్నికలలో పార్టీసభ్యులు కానివారు చాలమంది ఎన్నుకోబడ్డారు.

మూడో విషయం: అన్నివృత్తులకు, అన్ని శాఖలకు ఎన్నికలలో ప్రాతినిధ్యం ఉంటుంది. పశువుల్ని మేపేవారు, పాలు పితికేవారు; ఇంజనీర్లు, మెకానిక్కులు; రచయితలు, ఉపాధ్యాయులు; కళాకోవిదులు, శాస్త్రపరిశోధకులు; సైనికులు, నావికులు, వైమానికులు, మేధావంతులు— అంతా 1937 ఎన్నికలలో ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు.

నాలుగో విషయం : ప్రభుత్వాన్ని వ్యతిరేకించే పార్టీలు సోవియట్ యూనియన్‌లో లేకపోవడానికి ఒక కారణంవుంది. ఇతర దేశాలలో కార్మికవర్గాన్ని అణిచియుంచే పెట్టుబడిదారీవర్గం అధికారంలోవుంది. వర్గభేదాలు, వర్గపోరాటాలు వున్నాయి. అందువల్ల వ్యతిరేక పార్టీలు కూడా ఉండడం సహజం. సోవియట్ యూనియన్‌లో అలాకాదు. కార్మిక వర్గమే అక్కడ అధికారంలో వుండడంవల్ల వర్గపోరాటాలు అంతరించాయి. దోపిడీచేసేవారు, దోపిడీ చేయబడేవారు అక్కడలేరు. అందరూ యేదో ఒక పనిజేస్తూవుంటారు. పనికి తగినప్రతిఫలం లభిస్తూవుంటుంది. మానవసమాజం అంతకంతకు అభ్యున్నతివైపుకు నడుస్తూవుంది. ఇట్టి పరిస్థితులలో వ్యతిరేక పార్టీలెందుకు ?

ఐతే, సోవియట్ యూనియన్‌లోకూడా పాలసీలనుగురించి అభిప్రాయ భేదాలుండితీరుతాయి. ఒక పాలసీవల్ల సోషలిస్టుసమాజం ఎక్కువ వేగంగా వృద్ధిపొందుతుందని కొందరు, మరొక పాలసీవల్ల అభివృద్ధి చెందుతుందని మరికొందరు, భావించవచ్చు కాని అంతమాత్రంచేత అనేక రాజకీయపార్టీలు వుండనవసరంలేదు. సోషలిస్టు సమాజం స్థిరమైన పునాదులపై అభివృద్ధిచెందుతూన్నకొద్దీ వేర్వేరు అభిప్రాయాలను వెల్లడించడానికి వ్యక్తులకు స్వేచ్ఛ యెక్కువౌతుంది. ఏ సమస్యనుగురించియైనా చర్చించేటప్పుడు అభిప్రాయభేదాలు తప్పకుండా ఉంటాయి. ఉండడం అవసరంకూడా. అప్పుడే సరియైన నిర్ణయంజరుగుతుంది. ఉదాహరణకు: కొత్త రాజ్యాంగచట్టం ప్యాసుకాకముందు దాన్ని ప్రతి ఫ్యాక్టరీకి, ప్రతి వ్యవసాయక్షేత్రానికి, ప్రతి చిన్నసంస్థకూ పంపించి ప్రజల అభిప్రాయాలను తీసుకున్నారు. శాసనసభలో అది చర్చకు వచ్చినప్పుడు అనేక సవరణలు సూచించబడ్డాయి. వీటినన్నింటినీ సుప్రీమ్ సోవియట్‌లో చర్చించి నిర్ణయాలు తీసుకున్నారు. కాబట్టి సోవియట్ యూనియన్‌లో అభిప్రాయ భేదాలు సహజమైన పద్ధతులలో తెలియజేయబడతాయి. వ్యతిరేకతకోసమే వ్యతిరేకత అనేది ఉండదు. ఇందుకు కారణం వర్గాలు, వర్గపోరాటాలు సోవియట్ యూనియన్‌లో లేకపోవడమే.

## కొన్ని నిబంధనలు

ఇంతేకాదు, సోవియట్ యూనియన్‌లో ప్రజాస్వామ్య పద్ధతుల ప్రకారమే పరిపాలన జరుగుతూందనడానికి కొన్ని నిదర్శనాలున్నాయి.

"కమ్యూనిస్టు యువజన సమితి" కమ్యూనిస్టుపార్టీతో పోటీగా కొన్ని సందర్భాలలో ప్రవర్తిస్తూవుండేది. రెండూ కమ్యూనిస్టు సంస్థలే; రెండూ సోషలిస్టు నిర్మాణాన్ని బలపరచేవే.

మరొక ఉదాహరణ : ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ సభ్యుల్నే కాకుండా పార్టీలో లేనివారినికూడా నెగ్గించాలని సోవియట్ రాజ్యాంగ వేత్తలు పదేపదే చెబుతారు. వివిధ ప్రజా సంస్థలలో పార్టీసభ్యులకెంత అధికారం ఉంటుందో వీరికికూడా అంతే అధికారం ఉంటుంది.

మూడో విషయం : రాజ్యాంగయంత్రంలో కార్యనిర్వాహకశాఖ కంటె సుప్రీమ్ సోవియట్ (దానికి శాసన నిర్మాణహక్కు ఉంటుంది) కే యెక్కువ అధికారాలున్నాయి. కార్యనిర్వాహకశాఖచేసే ప్రతిపనీ సుప్రీమ్ సోవియటుచే ఆమోదించబడాలి. రాజ్యాంగచట్టంయొక్క 30 వ నిబంధన ప్రకారం "రాజ్యాంగ యంత్రంలో అన్నిటికంటె యెక్కువ అధికారం సుప్రీమ్ సోవియట్‌కి ఉంటుంది." ఇతర దేశాలలో, ఉదాహరణకు బ్రిటన్‌లో, పార్లమెంటు అనుమతిలేకుండానే మంత్రివర్గం కొన్ని శాసనాలు చేస్తుంది. కొన్ని సందర్భాలలో పార్లమెంటుయొక్క ఆమోదం తీసుకోడానికి చాలాకాలం పడుతుంది. ఇక మనదేశంవిషయం చెప్పనవసరమే లేదు. యుద్ధం ప్రారంభమయాక కేంద్ర శాసనసభలో ఆమోదించబడ్డ శాసనాలకంటె వైస్రాయి నిరంకుశంగాచేసిన ఆర్డినెన్సులే యెక్కువ. శాసనసభలో ఏదైనా తీర్మానం వ్యాసైనప్పటికీ వైస్రాయి దానికి వ్యతిరేకంగా తన వీటో అధికారాన్ని చెలాయించవచ్చు.

జార్ చక్రవర్తుల పరిపాలనలో ప్రజాస్వామ్య పద్ధతులంటేను, ప్రజాస్వామ్య హక్కులంటేను యెవరికీ తెలియదు. ఆ పరిస్థితి యిప్పుడు పూర్తిగా మారిపోయింది. సామాన్య రైతు మొదలుకొని రెడ్ఆర్మీ సైనికునివరకూ వోటింగ్‌హక్కు ఉంది. స్థానిక కౌన్సిలు లగాయతు అఖిల

సోవియట్ మహాసభవరకు ప్రజలే ప్రతినిధుల్ని యెన్నుకుంటారు. ఇతర దేశాలలో వోటింగు హక్కుకూ, సోవియట్ యూనియన్‌లో వోటింగు హక్కుకూ సహస్రం తేడావుంది. ఇతర దేశాలలో ధనాన్నిబట్టి వోట్లు లభిస్తాయి. బీదవాడు ధనికునికి పోటీగా ఎన్నికకు నిలబడితే, సర్వసామాన్యంగా ఓటమి తప్పదు. కాని సోవియట్‌యూనియన్‌లో డబ్బుకు ఆశపడి వోటుచేయవలసిన గతిపట్టదు. ఎందుచేతనంటే అందరికీ ఏదో ఒక వృత్తి వుంది. సంవత్సరం పొడుగునా పొట్టపోసుకోడానికి అవసరమైన జీవనోపాధి వుంది.

## ఆర్థిక స్వాతంత్ర్యం

కాబట్టి. యే దేశంలోనైనా ప్రతివ్యక్తికీ ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నప్పుడే రాజకీయ స్వాతంత్ర్యంకూడా ఉంటుంది. బ్రిటన్, అమెరికా మొదలైన దేశాలలో ప్రజలకు రాజకీయ స్వాతంత్ర్యం ఉన్నప్పటికీ ఆర్థికంగా ధనికవర్గాలపై ఆధారపడవలసియుంటుంది. లక్షలాదిజనం నిరుద్యోగ రాక్షసికి బలి అవుతున్నారు. పేదరికంవల్ల ఎవరెక్కువ డబ్బిస్తే ఆ అభ్యర్థికి వోటుచేయవలసివస్తుంది. కనుక సోవియట్ యూనియన్‌లోనే నిజమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఉందనిచెప్పాలి. అది గట్టి పునాదులపై కట్టుదిట్టంగా నిర్మించబడింది. నిన్న మొన్నటివరకూ జమీందార్లకింద, పెట్టుబడిదార్లకింద కుమిలి కృశించిన ప్రజాసామాన్యం యీ రోజున ప్రతి యెన్నికలోను పాల్గొంటూ, స్వేచ్ఛగా తమకిష్టమైన అభ్యర్థులకు వోటు చేస్తున్నారు.

ప్రజల హక్కుల్ని కాపాడే ప్రజానాయకుడు స్టాలిన్. అతను తయారుచేసిన కొత్త రాజ్యాంగచట్టమే యిందుకు తార్కాణం. ఏ దేశంలోనూ ప్రజ లనుభవించనన్ని హక్కులు, స్టాలిన్ రాజ్యాంగచట్టంలో ఉన్నాయి. ప్రజల్ని స్టాలిన్ కొత్తకొత్త మార్గాలలో ప్రజాస్వామ్య పరిపాలనవైపు నడుపుతున్నాడు. రాజ్యాంగచట్టంలో ఉన్న ప్రతి క్లాజు స్పష్టంగా, అందరికీ అర్థమయే భాషలో వ్రాయబడివుంది. సోషలిస్టు సమాజంలో ప్రతిమానవుడు అనుభవించగల హక్కులు సునిశితంగా వివ

రించబడ్డాయి. మానవజాతిపట్ల అపారమైన ప్రేమ, మానవుని ఔన్నత్యం పట్ల గాఢమైన గౌరవం, యీ డాక్యుమెంటుయొక్క ప్రతి వాక్యంలోను కనపడతాయి. మానవసమాజ చరిత్రలో యెప్పుడూ యింత ఉత్కృష్ట మైన డాక్యుమెంటు ప్రచురించబడలేదు. దీన్ని చదువుతూంటే ప్రతి ప్రజాస్వామ్యవాది ఉల్లాసంతో ఉప్పొంగుతాడు. హృదయంలో క్రొత్త ఆశలు మొలకలెత్తుతాయి. ఇలాంటి ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించడంలో యెన్ని ఆటంకాలువచ్చినా యెదుర్కోవాలని ఉవ్విళ్ళూరుతాడు. ఎంత నిర్బంధ విధానాలైనా పటాపంచలు చేయగలశక్తి ఆవిర్భవిస్తుంది.

ఎందువల్లనంటే ప్రపంచంలో మహాపురుషు లందరూ కోరిన కోర్కెలు యీ డాక్యుమెంటులో సఫలీకృతమవుతున్నాయి.

మానవసమాజంయొక్క అభివృద్ధితోబాటు ప్రతి వ్యక్తి సొంతంగా అభివృద్ధిచెందడానికి సోవియటు రాజ్యాంగంలో అవకాశంవుంది. ప్రపంచంలో న్యాయపరిపాలన, ధర్మసంస్థాపన తప్పకుండా సాధ్యమని సోవియటు నాయకులు రుజువుచేశారు.

## ఇతర రాజ్యాంగవేత్తలు మరుగుజ్జులు

"మన కొత్త సోవియట్ రాజ్యాంగచట్టంలో ఉన్నంత ప్రజాస్వామ్యపద్ధతి ప్రపంచంలో యెక్కడా ఉండదని నా దృఢవిశ్వాసం" అని స్టాలిన్ చెప్పాడు. ఈవాక్యంలో ఆడంబరంగాని, అతిశయోక్తిగాని లేదు. 100 కి 100 పాళ్ళు యిది నిజం. యుద్ధం ఆఖరయి, చరిత్రకారులు ప్రపంచ ఘటనలనుగూర్చి వ్రాసేటప్పుడు స్టాలిన్‌ముందు ఇతర రాజ్యాంగవేత్తలు చిన్న చిన్న మరుగుజ్జులుగా కనపడకమానరు. చిల్లర నాయకులంతా యెక్కడ అధికారం దొరుకుతుందా, ఎప్పుడు దాన్ని కాజేద్దామా! అని తహతహలాడతారు. స్టాలిన్ అలాకాదు. తన ప్రజలకు అధికారమంతా వప్పజెప్పి, ఉన్నతమార్గాలలో వారిని నడుపుతున్నాడు. ప్రజల కధికారంయిస్తే పాడుచేస్తారని దొంగనీతులుచెప్పే రాజ్యాంగవేత్తల్ని స్టాలిన్ ఛాలెంజి చేస్తున్నాడు.

# 1944 లో కొత్త సంస్కరణలు

మొన్న ఫిబ్రివరి 1 వ తేదీని (1944) సుప్రీమ్ సోవియటు సమావేశంలో సోవియట్ విదేశాంగమంత్రి మాలటోవ్ రెండు కొత్త శాసనాలను ప్రవేశపెట్టాడు. అవి యేకగ్రీవంగా ఆమోదించబడ్డాయి. వాటి ప్రకారం సోవియట్ యూనియన్‌లోవున్న ప్రతిరిపబ్లిక్కుకు (ఇవి మొత్తం 16) విదేశాలతో స్వతంత్రిగా సంబంధాలు యేర్పరచుకునే అధికారం, ప్రత్యేకంగా సైన్యం నిర్మించుకునే అధికారం యివ్వబడింది.

ఈ మార్పునుగురించి మాలటోవ్ యిలా ఉపన్యసించాడు. "మిత్ర రాజ్య ప్రజలందరికీ శత్రువైన హిట్లరిజాన్ని నాశనంచేయుటకు సమిష్టిగా దెబ్బతీసేరోజు సమీపిస్తోంది. ఇప్పుడు జరిగే పోరాటంలో ఫాసిజాన్ని వ్యతిరేకించే దేశాలన్నింటిమధ్య స్నేహం, ఏకీభావం యెక్కువౌతున్నాయని మనకు తెలుసు. వివిధ జాతులతో కూడుకొనియున్న మనదేశం యెంత గట్టి పునాదులపై నిర్మించబడిందో, మన పాలసీ ఎంత సరియైనదో యితర దేశాలుచూచి ఆశ్చర్యపోతున్నాయి. వివిధ జాతుల కూటమిగా వృద్ధిచెందిన వివిధదేశాలకు హిట్లరు దురాక్రమణవల్ల పెద్ద పరీక్షాసమయం వచ్చింది. ఈ పరీక్షలో మనం పూర్తిగా ఉత్తీర్ణులమయాం. సోవియట్ యూనియన్‌లో నివశించే వివిధజాతులమధ్య చిలికలు వస్తాయని హిట్లరు ఆశించాడు. కాని పాపం అతని ఆశలు అడియాసలయాయి"

"ప్రవదా" పత్రిక యీ మార్పుల్ని గురించి క్రింది విధంగా వ్యాఖ్యానించింది :

"యుద్ధంవల్ల యేర్పడిన కష్టపరిస్థితులలో సోవియట్ యూనియన్‌కీ, ఇతర దేశాలకూ, మధ్య అన్యోన్య సంబంధాలు బలీయమై, స్నేహభావం అంతకంతకు వృద్ధిచెందింది. హిట్లరుతో పోరాడే దేశాలన్నింటి మధ్య ఐక్యత చాలా హెచ్చింది. కాని, యింతకంటె ముఖ్యమైన విషయం ఏమంటే, యుద్ధానంతరం కూడా వివిధ మిత్రరాజ్యాలమధ్య చిరకాలం వరకు ఐక్యత పెంపొందే, అనేక మంచి ఫలితాలకు దారితీయడానికి అవకాశా లేర్పడ్డాయి. ఇతర దేశాలతో సోవియట్ యూనియన్ యొక్క

సంబంధాలు విస్తృతమై, బలీయంగా వృద్ధిచెందుతున్న పరిస్థితులలో యిప్పుడున్న సోవియట్ విదేశాంగ కార్యాలయం ఒక్కటీ తన పనిని నిర్వహింపజాలదు. అంతకంటె విశాలమై, సర్వతోముఖంగా వృద్ధిచెందే మరొక సంస్థ యీనాడు అవసరమయింది. ప్రతి యూనియన్ రిపబ్లిక్కు రాజకీయంగాను, ఆర్థికంగాను, వైజ్ఞానికంగాను అభివృద్ధి చెందాలంటే, (నేటి కొత్త పరిస్థితులలో) 16 రిపబ్లిక్కుల తరఫున సోవియట్ ప్రభుత్వం ఒక్కటీ విదేశాలతో సంబంధ బాంధవ్యా లుంచుకోవడం, సంధులు-ఒడంబడికలు గావించుకోవడం ఉచితం కాదు."

## కొత్త సంస్కరణల ప్రాధాన్యత

యుద్ధం జరుగుతుండగా రాజ్యాంగ మార్పులు సాధ్యంకావని సాకులుచెబుతూ, భారతదేశం వంటి వలసరాజ్యాలకు స్వాతంత్ర్యం యివ్వ నిరాకరించుతూన్న సామ్రాజ్యవాదులకు యీ కొత్త సోవియట్ శాసనాలు దిగ్భ్రమ కలిగించాయి. శాంతి సమాలోచనలలో సోవియటు ఎక్కువ వోట్లు సంపాదించడాని కిదొక ఎత్తు అన్నారు కొందరు. బ్రిటిష్ సామ్రాజ్యంలోని రాజ్యాలు యిదివరకే అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొంటున్నాయి కాబట్టి యీ సంస్కరణలలో గొప్ప విశేషం యేమీలేదని కొందరు చప్పరించివేశారు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు సోవియటు యూనియన్‌ని గురించి యిలా అపార్థాలు చెప్పడంలో ఆశ్చర్యంలేదు. ఏమంటే, వివిధ రిపబ్లిక్కులకు సోవియట్ ప్రభుత్వం సంపూర్ణ స్వాతంత్ర్య మిచ్చిందని వారు అంగీకరిస్తే, తమ సామ్రాజ్య పాలసీకి చేటువస్తుంది. వలసదేశాల ప్రజల్ని దోచుకొనే సామ్రాజ్యవాద పద్ధతికే స్వస్తి చెప్పవల వస్తుంది.

ఇంతేకాదు. సోవియట్ యూనియన్ కూడా ఒక సామ్రాజ్యవాద దేశమేననీ, పోలెండ్, ఫిన్లండ్, లాట్వియా, లిథూనియా, ఎస్థోనియా మొదలైన దేశాలన్నింటినీ బలవంతంగా సోవియట్ యూనియన్‌లో కలుపుకొన జూస్తుందనీ, కొందరు దుష్ప్రచారం చేస్తున్నారు. అట్టివారికి యీ సంస్కరణలు గట్టిగా దెబ్బకొట్టాయి. తాజీకిస్థాన్, కజాక్‌స్థాన్

వంటి ప్రాచ్యజాతుల ప్రజల్ని పాశ్చాత్యప్రభుత్వం సోవియట్ యూనియన్ నిర్బంధపరచి తన సరిహద్దులలో ఉంచుకొంటూందని కూడా కొందరు చేసే అబద్ధపు ప్రచారానికి యీ సంస్కరణలు తగిన జవాబిస్తున్నాయి.

ఈ విధంగా సోవియట్ ప్రజలు కొత్త కొత్త దశలలో కొత్త స్వాతంత్ర్యమార్గాల ననుసరిస్తున్నారు. మన దేశంలో 40 కోట్లమంది ప్రజలు ఉత్సాహంగా యుద్ధంలో పాల్గొని ఫాసిజాన్ని నిర్మూలించుటకై సామ్రాజ్యవాదులు ఎట్టి అవకాశం లేకుండా చేస్తున్నారు. స్వాతంత్ర్యం కోసం ఉవ్విళ్ళూరే ప్రతి భారతీయుడు సోవియట్ యూనియన్ ప్రవేశ పెట్టిన యీ కొత్త సంస్కరణలను అభినందించకమానడు.

## సోవియట్ పరిపాలనాయంత్రం

సోవియట్ యూనియన్‌లో అధికారం అంతా సుప్రీమ్ సోవియట్‌ది. అది 2 సభలుగా విభజించిబడి యుంటుంది. ఒక సభకు 569 గురు మెంబర్లు, రెండోదానికి 574 గురు, ఉంటారు. మొదటి సభను "సోవియట్ ఆఫ్ ది యూనియన్", రెండో సభను "సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్" అంటారు. "సోవియట్ ఆఫ్ ది యూనియన్" మెంబర్లు 3 లక్షలమంది కొకరు చొప్పున ఎన్నుకోబడతారు. వోటర్లు రహస్యపు వోటింగ్ పద్ధతి ప్రకారం అభ్యర్థుల్ని ఎన్నుకుంటారు. 1939 లెక్కల ప్రకారం యీ సభలో 100 కి 43 రు కార్మికులు, 24 గురు రైతులు, 31 మంది ఆఫీసు గుమాస్తాలు, లేక మానసికపరిశ్రమ చేసేవారు. మిగతా యిద్దరూ ఇతరులు.

"సోవియట్ ఆఫ నేషనాలిటీస్" సభలో 16 యూనియన్ రిపబ్లిక్కులకు ప్రాతినిధ్యం ఉంటుంది. అవి రష్యా, బైలోరష్యా, జార్జియా, టర్కోమాన్, తాజికిస్థాన్, ఉక్రెయిన్, అజర్‌బైజాన్, ఆర్మీనియా, ఉజ్బేకిస్థాన్, కాజాకస్థాన్, కిర్ఘిజ్, లాట్వియా, లిథుఏనియా, ఎస్థోనియా, మాల్డేవియా, కెరిలియన్, ఫిన్నిష్. ఒక్కొక్క రిపబ్లిక్కు 25 గురు చొ॥ ప్రతినిధుల్ని పంపవచ్చును. అనగా, యూనియన్ రిపబ్లిక్కులు మొత్తం 275 గురు ప్రతినిధుల్ని పంపుతాయి. వీరు గాక, 22 స్వతంత్ర రిపబ్లి

క్కులు ఒక్కొక్కటి 11 గురు ప్రతినిధుల చొప్పున మొత్తం 242 రిని పంపుతాయి. 9 స్వతంత్ర రీజియన్లు ఒక్కొక్కదానికి 5 గురు చొప్పున మొత్తం 45 గురు ప్రతినిధుల్ని పంపుతాయి 12 జాతీయ ప్రాంతాలు 12 గురు ప్రతినిధుల్ని పంపుతాయి.

ఈ సభలో 100 కి 39 గురు కార్మికులు, 35 గురు రైతులు, 26 గురు ఆఫీసు గుమాస్తాలు లేక మానసిక పరిశ్రమ చేసేవారు ఉన్నారు.

పై 2 సభలు కలిసి కనీసం 2 సంవత్సరాల కొకసారి సమావేశమవుతాయి. దాదాపు 10 రోజులు సమావేశం జరుగుతుంది. సమావేశం పూర్తి కాగానే మెంబర్లు తిరిగి యెవరి వృత్తులలో వారు ప్రవేశించి యెవరి పనులు వారు చేసుకుంటారు. మెంబర్లు తమలో కొందరిని "ప్రెసీడియం" అను చిన్న కమిటీని ఎన్నుకుంటారు. సుప్రీమ్ సోవియట్ సమావేశం కాని రోజులలో రాజ్యాంగసమస్య లన్నింటినీ యీ కమిటీ పరిష్కరించుతుంది. కాని, యిది సుప్రీమ్ సోవియట్‌కి బాధ్యత వహించుతుంది. "ప్రెసీడియం" మెంబర్లు తమలో కొందరిని ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క మంత్రివర్గం చొప్పున ఎన్నుకుంటారు.

ఇలాగే ప్రతి యూనియన్ రిపబ్లిక్కుకూ, ప్రతి స్వతంత్ర రీజియనుకూ కూడా ఒక సుప్రీమ్ సోవియట్ చొప్పున ఉంటుంది. ప్రతి సుప్రీమ్ సోవియట్ ఒక "ప్రెసీడియం"ను ఎన్నుకొంటుంది. ప్రతి "ప్రెసీడియం" వేర్వేరు మంత్రివర్గాల్ని ఎన్నుకుంటుంది. సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి సాధనాలన్నీ సంఘపరం చేయబడ్డాయి కొబట్టి అనేక ప్రభుత్వశాఖలు, వాటికి సంబంధించి అనేక మంత్రివర్గాలు, వుంటాయి. ఉదాహరణకు: బట్టల పరిశ్రమకొరక మంత్రివర్గం, గనుల కొరక మంత్రివర్గం, భారీ యంత్రాల పరిశ్రమకొరక మంత్రివర్గం - యిలా అనేక మంత్రివర్గాలుంటాయి.

సుప్రీమ్ సోవియట్‌తోబాటు జిల్లాబోర్డులు, మ్యునిసిపాలిటీలు, పంచాయతీబోర్డులు ప్రజల స్థానిక సమస్యల్ని పరిష్కరిస్తూ ఉంటాయి. ఇవన్నీ ప్రజలచేతనే యెన్నుకోబడుతాయి.

# సుప్రీమ్ సోవియట్ లో యెవరెవరు ఎంతెంతమంది?

రెండు సభలలోను మెంబర్ల సంఖ్య




పనినిబట్టి




స్త్రీ పురుషులు




వయసునుబట్టి



# 1941 లో సోవియట్ యూనియన్ బడ్జటు

**ఆదాయం : 21, 684 కోట్ల రూబుల్సు**

సేల్సుటాక్సు (పరిశ్రమలమీదా, ప్రభుత్వవ్యాపారం మీద, కో-ఆపరేటివ్ సంస్థల వ్యాపారంమీద) 12,450 కోట్లరూబుల్సు

ప్రభుత్వం నడిపే పరిశ్రమలమీద, చేసే వ్యాపారం మీద, లాభాలవన్ను 3100 కోట్ల రూబుల్సు

ప్రభుత్వ భీమాస్కీము 1000 కోట్ల రూబుల్సు

ఋణాలు 1300 కోట్ల రూబుల్సు

ఆదాయపుపన్ను, వ్యవసాయంపై పన్ను 1084 కోట్ల 20 లక్షల రూబుల్సు

ఇతరత్రావచ్చే ఆదాయం 2748 కోట్ల 80 లక్షల రూబుల్సు

దాగా నల్లనిచుక్కలు క్రిందటి సంవత్సరంకంటె ఎంత యెక్కువో తెలుపుతాయి.

**ఖర్చు : 21,605 కోట్ల 20 లక్షల రూబుల్సు**

ఆర్థిక నిర్మాణం (క్రొత్త ఫ్యాక్టరీలు, గనులు, ఎలెక్ట్రిక్‌ప్లాంటు, రహదారులు, పరిశోధనాలయాలు వగైరా) 5982 కోట్ల రూబుల్సు

వ్యవసాయం 1358 కోట్ల రూబుల్సు

సాంఘిక, వైజ్ఞానిక కళలు, వినోదాలు (విద్య, ఆరోగ్యం, పింఛన్లు, మాతా శిశురక్షణ, ఆరోగ్య సదనాలు, విశ్రాంతి భవనాలు, వగైరా) 4780 కోట్ల రూబుల్సు

దేశరక్షణ 7080 కోట్ల రూబుల్సు

ఇతర ఖర్చులు 2445 కోట్ల 20 లక్షల రూబుల్సు

దాగా నల్లనిచుక్కలు క్రిందటి సంవత్సరంకంటె, ఎంత యెక్కువో తెలుపుతాయి.

" హింసాపద్ధతులపై ఏ నిర్మాణాన్ని శాశ్వతంగా నిలపలేమని నా విశ్వాసం. దాని సంగతి అటుంచి, బోల్షివిక్ ఆదర్శాలు అసంఖ్యాక స్త్రీ పురుషుల స్వచ్ఛమైన ప్రేమదీక్షపై ఆధారపడి యున్నాయనే విషయం యెవ్వరూ కాదనలేరు. లెనిన్‌వంటి మహాపురుషులు చేసిన త్యాగాలతో పునీతమైన ఆదర్శం వ్యర్థం కాజాలదు. వారి త్యాగం, ఆత్మార్పణ, ఆచంద్రార్కంగా వెలుగొందుతూ ఉంటుంది."

మహాత్మా గాంధి : 15-11-1928.



# 1. శిశువులు - బాల బాలికలు

జార్ పరిపాలనలో రోజుకి 20 వేలమంది పసి పిల్లలు మరణించే వారట. బ్రతికిన కొద్దిమందికీ సరియైన ఆహారంగాని, గుడ్డకాని ఉండేది గాదు. దాదులు, నర్సులు వుండేవారుకారు. 100 కి 95 గురు తల్లులు వైద్యసహాయం లేకుండానే ప్రసవించేవారు.

బిడ్డ పుట్టిందంటే తల్లికి సహజంగా యెంతో ఆనందం కలుగు తుంది. కాని ఆబిడ్డను పోషించి, పెంచడం ఒక పెద్ద సమస్య. భర్త రోజల్లా కష్టపడి సంపాదించిన కూలిడబ్బులు కుటుంబానికి సరిపోయేవి కావు. అందువల్ల తానుకూడా యే ఫ్యాక్టరీకో వెళ్ళి పనిచేయాలసివుండేది. కాని, పనిచేసే సమయంలో బిడ్డను కనిపెట్టుకొని వుండేవారేరీ? కాబట్టి తల్లి తన శిశువును నడుముకు కట్టుకొని పనిచేయవలసివచ్చేది. కొన్ని సందర్భాలలో పిల్లలు యేడవకుండా యింట్లో పడుకోపెట్టి, నల్లమందు వంటి మత్తుపదార్థం వేసేవారట.

కొంచెం యెదిగిన పిల్లలైతే వాళ్ళని యింటిదగ్గర విడిచిపెట్టి, తల్లితండ్రులు పనికివెళ్ళేవారు. కాని యింటిదగ్గర పిల్లల్నిగురించి జాగ్రత్త వహించేవారులేక, వారు యిటూ - అటూ తిరుగుతూఉండేవారు. అల్లరి చేసేవారు. ఏ బండికిందో, కారుకిందోపడేవారు. నిప్పుతోను, కత్తులతోను, మందులతోను ఆడి, ప్రమాదాలకు గురి ఆయేవారు. సరియైన తిండిలేక కొందరు, జబ్బుచేసినప్పుడు మందులులేక మరికొందరు చనిపోయేవారు. తల్లితండ్రులు వీటికన్నా డబ్బెక్కువనుంచి తీసుకొస్తారు పాపం!

## "బిడ్డకోసం తల్లి, తల్లికోసం బిడ్డ"

సోవియట్ ప్రభుత్వం అధికారానికిరాగానే "బిడ్డకోసం తల్లి, తల్లి కోసం బిడ్డ" అనే సూత్రాన్ని ప్రకటించింది. దేశంలోవున్న తల్లుల్ని గురించి, బిడ్డల్నిగురించి పూర్తి బాధ్యత తీసుకుంది.

బిడ్డ యింకా తల్లిగర్భంలో ఉంటూండగానే సోవియట్ ప్రభుత్వం చాలా శ్రద్ధ తీసుకుంటుంది. గర్భవతులంటే రష్యాలో ఇంతా - అంతా గౌరవంకాదు. ట్రాంకార్లలో వారికి ప్రత్యేకమైన సీట్లుఉంటాయి. పురిటి రోజులు సమీపిస్తూంటే ప్రభుత్వం అట్టివారికి ఉచితవేతనం యిస్తుంది. ఫ్యాక్టరీలలోగాని, పొలాలలోగాని పనిచేయనివ్వరు. ఈ ఉచితవేతనం బిడ్డపుట్టిన కొన్ని వారాలవరకూ ఉంటుంది. తరువాత తల్లి మామూలుగా పనిలో ప్రవేశిస్తుంది.

పురిటిరోజులు సమీపించే ప్రతి గర్భవతిని ఏదో ఒక "ప్రసూతి వైద్యశాల"లో చేర్చుకుంటారు. అక్కడ అనుభవజ్ఞులైన డాక్టర్లు, నర్సులు ఉంటారు. తల్లి ఆరోగ్యాన్నిగురించి, పుట్టబోయే బిడ్డనుగురించి వారు సకల జాగ్రత్తలు తీసుకుంటారు.

కొన్నాళ్ళకు ఆమె సుఖంగా ప్రసవిస్తుంది.

అక్కణ్నుంచీ తల్లిని, శిశువుని "ప్రసూతి నిలయా"నికి పంపిస్తారు. ఈ "ప్రసూతి నిలయం"లో మాతా, శిశువుల ఆరోగ్యాన్ని కాపాడడమేగాకుండా బిడ్డవిషయంలో తల్లి యెలాంటి శ్రద్ధ తీసుకోవాలో నిపుణులు కొందరు చక్కగా అర్థమయేటట్లు బోధిస్తారు. ఇక్కడ యిలా కొన్నాళ్లున్నాక పనిలో ప్రవేశించగల శక్తి తల్లికివస్తుంది. అప్పుడామెను పంపిస్తారు.

ప్రతి జిల్లాకు, ప్రతి ఫ్యాక్టరీకి ఒక "ప్రసూతి వైద్యశాల" ఉంటుంది. పల్లెటూళ్ళలో ఉన్న గర్భవతులసంగతేమిటని, ప్రశ్నరావచ్చు. అలాంటివారికి యెప్పటికప్పుడు "ప్రసూతి వైద్యశాల"లవారు ఒక డాక్టరుని, ఒక నర్సుని పరికరాలతోను, మందులతోను, ఎప్పటికప్పుడు పంపిస్తుంటారు. సోవియట్ యూనియన్‌లో ఎక్కడబిడ్డ పుట్టినాసరే - పట్టణం కానీయండి, పల్లెటూరుకానీయండి - పురిటివేళకు ఒక డాక్టరు, ఒక నర్సు సిద్ధంగా ఉండవలసిందే! ఇది ప్రభుత్వపు ఆజ్ఞ!

ఈ సౌకర్యాలకు, ఏర్పాట్లకు తల్లిగాని - తండ్రిగాని, ఒక్క చిల్లిగవ్వకూడా యివ్వనవసరంలేదు. పైగా ప్రతి గర్భవతికి ప్రసవానికిముందు

35 రోజులు, తరువాత 28 రోజులు సెలవులిస్తారు. సెలవురోజుల్లో మామూలుజీతమే యిస్తూవుంటారు. ఇదిగాక, ప్రసవసమయంలో 45 రూబుల్సు, ఆ తరువాత 9 నెలలవరకు పదేసి రూబుల్సు, ఉచితంగా యిస్తారు.

## తల్లికి సలహాలు

బిడ్డ పుట్టిన 10 నెలలవరకు తల్లి ప్రతివారం బిడ్డను డాక్టరువద్దకు తీసుకెళ్ళి, తూకం తూయిస్తుంది. బిడ్డ ఆరోగ్యాన్ని, తన ఆరోగ్యాన్ని కాపాడుకోడానికవసరమైన సలహాలుపొందుతుంది. "సలహాకార్యాలయా" లలో తల్లిచూచే ప్రతి వస్తువు, వినే ప్రతిమాట, చాల విలువగలిగినవై వుంటాయి. బిడ్డనుపెంచే సరియైన పద్ధతులేవో, చెడు పద్ధతులేవో, పెద్ద పెద్ద పోస్టర్లలోను, బొమ్మలద్వారాను, చూపుతారు. మంచం యెలా వుండాలో, దానిమీద పక్క యెలావేయాలో, ఎలాంటి తొట్టిలో స్నానం చేయించాలో,-అన్నీ బొమ్మలద్వారా బోధిస్తారు. బిడ్డకు ఆహారం ఎలాంటిది, ఎప్పుడెప్పుడుపెట్టాలో చెబుతారు. ఎలాంటి ఆటవస్తువులివ్వాలోకూడ కన పరుస్తారు. బిడ్డకు మందు అవసరమైతే యిస్తారు. ప్రతివారం ఆ మందు గుణం యిస్తూన్నదోలేదో పరీక్షచేస్తారు. రష్యన్ పిల్లలు బలంగాను, ఆరోగ్యంగాను వుండటానికి చక్కని ఆహారమే కారణం. అవసరమైన ప్పుడు అదనంగాకూడా బిడ్డలకు ఆహారంయిస్తారు. ఈ అదనపుఖర్చులో మాత్రం సగం ప్రభుత్వం, సగం తల్లి-తండ్రులు భరించుకోవాలి.

ఈ విధంగా బిడ్డ తల్లిగర్భంలో ఉన్నప్పటినుంచీ ప్రభుత్వం అమితంగా శ్రద్ధతీసుకోవడంవల్ల, శిశు మరణాలసంఖ్య చాలా తగ్గింది.

## శిశు రక్షణాలయాలు (క్రెచీలు)

ఒకరోజున లెనిన్ కొంతమంది పిల్లల్ని ముద్దులాడుతూ, గోర్కీతో యిలా అన్నాడట: "వీరు మనకంటె సౌఖ్యంగా జీవిస్తారు. మనం పడిన బాధలన్నీ వీరనుభవించరు. వీరి జీవితాలలో యింత క్రౌర్యం ఉండదు."

ఈ ఆశయాన్ని సఫలంచేయడానికి లెనిన్ "శిశు రక్షణాలయాల" ఉద్యమం (క్రెచీ) ప్రారంభించాడు. తల్లి ఫ్యాక్టరీలోగాని, పొలంలోనుగాని, పనిచేసేటప్పుడు క్రెచీలలో బిడ్డల్ని కనిపెట్టుకొని ఉంటూ వారికి మంచి అలవాట్లు నేర్పడానికి కొందరు నిపుణులు నియమించబడతారు. ఇక్కడ బిడ్డలు బలంగా పెరగడానికవసరమైన పనులు చేయిస్తారు. బిడ్డల బుద్ధి కుశలతను పెంపొందింపజేస్తారు. బిడ్డలకు సక్రమమైన అలవాట్లను నేర్పుతారు. చక్కని శిక్షణనిస్తారు. పరిశుభ్రత నేర్పుతారు. ఆడుకోడానికి అందమైన ఆటవస్తువు లిస్తారు.

ఇంతేకాదు. క్రెచీలలో బిడ్డలకు ఆరోగ్యసూత్రాల ప్రకారం ఆహారం యివ్వబడుతుంది. ఎప్పుడుపడితే అప్పుడు చిరుతిండి పెట్టరు ఏడ్చినప్పుడు ఊరుకోపెట్టడానికి లంచం యేమీ ఇవ్వరు. ఉదయం పూట ఒక చిన్న కోడిగుడ్డు అట్టు, కోకో, రొట్టె, వెన్న యిస్తారు. మధ్యాహ్నం భోజనంలోకి పులుసు, మీగడ కలిపిన ఒక రష్యన్ పదార్థం, మాంసం, కూర యిస్తారు. సాయంత్రం టీ, బిస్కత్తు, మజ్జిగ. రాత్రిపూట రొట్టె, పాలు, పళ్ళు. ఇదీ బిడ్డలకిచ్చే ఆహారం. దీనికయ్యే ఖర్చు నెలకు 12 మొదలు 65 రూబుల్సు వరకు ఉంటుంది. తల్లి సంపాదించే జీతాన్నిబట్టి యీ ఖర్చు నిర్ణయించబడుతుంది. మొత్తం ఖర్చులో ఎక్కువ భాగం ప్రభుత్వానిదే.

బిడ్డ పగలల్లా క్రెచీలో ఉండి, రాత్రి తన తల్లితోపాటు యింటికొచ్చేస్తుంది. ఇతర దేశాలలో మాదిరిగా పనిచేసే సమయంలో తల్లికి యాతన ఉండదు. పని పూర్తిచేసుకొని హాయిగా తన బిడ్డను ముద్దులాడుతూ యింటికొచ్చి, భర్తతో కలిసి సుఖంగా కాలం గడపవచ్చు. బిడ్డకు జబ్బుచేస్తే, రోజంతా తల్లి ఆసుపత్రిలోనే ఉండి, అక్కడే భోజనం చేయవచ్చు.

క్రెచీలో, ప్రతి ఆటవస్తువు మీద బిడ్డలు ప్రేమించే ఒకబొమ్మ, బిడ్డ పేరు, ఉంటాయి. అలాంటి ప్రతి వస్తువుకీ ఒక స్థలం ప్రత్యేకించబడి వుంటుంది. రోజులో కొన్నిగంటలు నడవడానికి, కొన్ని ఆడుకోడానికి,



టిక్సీబేనది ఒడ్డున ఎవెంక్ సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని ఒక స్కూలులో

కొన్ని పాటలు నేర్చుకోడానికి, కొన్ని కథలు వినడానికి—ప్రత్యేకించుతారు.

జీవితంలో మనం అనుసరించవలసిన గొప్ప సూత్రాలన్నీ క్రెచీలో నేర్పుతారు. అంటే, ఉగ్గుపాలతో మంచి గుణాలు, గొప్ప గొప్ప ఆదర్శాలు, నూరి పోస్తారన్నమాట.

" ఈ బిడ్డ చేయగలిగిన పనిని మరొక రెవరూ చేసిపెట్టకూడదు." అని ప్రతి క్రెచీ తలుపుమీద వ్రాసివుంటుంది. ఉదాహరణకు, ఒక టేబిలు మీద ఆటవస్తువు ఉన్నదనుకుందాం. టేబులు ఎత్తుగావుండడంవల్ల బిడ్డకు బొమ్మ అందదు. అప్పుడు మనం ఒక పీటవంటి వస్తువును చూపించి, దానిమీదెక్కితే బొమ్మ అందుతుందని చెప్పి, అలా చేయించాలి.

ఇలాగే, బిడ్డకు క్రెచీలో సమిష్టిజీవితం నేర్పుతారు. ఏ బిడ్డను " ఒంటిపిల్లి రాకాసి " గా తయారు చెయ్యరు. ఉదాహరణకు, ఆట సమయంలో కొంచెం బరువైన వస్తువు లిస్తారు. ఒకే బిడ్డ దాన్ని ఎత్త లేదు. అప్పుడు యిద్దరు లేక ముగ్గురు బిడ్డలు కలిసి యెత్తుతారు. చిన్న చిన్న యిళ్ళు, మేడలు, రైళ్లు, వంతెనలు, రైల్వేస్టేషను— అన్నీ బిడ్డల చేత స్వయంగా, అన్యోన్యసహకారంతో, చేయిస్తారు.

## " శిశు శిక్షణాలయాలు " (నర్సరీ స్కూళ్లు)

ఈ విధంగా, బిడ్డకు 3 ఏళ్లు దాటేవరకు క్రెచీలో శిక్షణపొందు తుంది. ఆ తరువాత 8 ఏళ్ళు వచ్చేవరకు " శిశు శిక్షణాలయం " లో (నర్సరీ) శిక్షణ పొందుతుంది. ఇక్కడ శిశువులకు పరిశుభ్రత, క్రమశిక్షణ, వంటచేయడం, పదార్థాలు వడ్డించడం, నేర్పుతారు. 6 వ యేట అక్షరా భ్యాసం చేస్తారు. బడులు, గుణింతాలు, లెక్కలు శాస్త్రీయ పద్ధతులతో నేర్పుతారు. కొత్త ఆటలు అలవాటు చేస్తారు. సంగీతం, డాన్సు మొద లైన లలితకళలలో కూడా శిశువుల్ని తరిఫీదు చేస్తారు.

ఎనిమిదేళ్ళు వచ్చేవరకు బిడ్డల శరీరారోగ్యం ప్రభుత్వంయొక్క ప్రధాన బాధ్యత. ఎనిమిదేళ్లు గడిచాక, ఒకప్రత్యేకమైన ప్రభుత్వశాఖ దీన్ని అజమాయిషీ చేస్తుంది. పిల్లలు ఎనిమిదోయేట స్కూల్లో ప్రవేశించాలి. స్కూల్లో విద్యతోబాటు, ఆరోగ్యసూత్రాలు, క్రమశిక్షణ, అలవాటు చేస్తారు.

ఈరోజున సోవియట్ యూనియన్‌లో 18 లక్షలమంది పిల్లలు క్రెచీలలోనూ, నర్సరీ స్కూళ్ళలోను శిక్షణ పొందుతున్నారు.

## స్కూళ్ళలో బాల, బాలికలు

ఎనిమిదోయేట స్కూళ్ళలో ప్రవేశించిన బాల,బాలికలకు ఎలాంటి విద్యగరుపుతారు? కొందరికి యెక్కువ సౌకర్యాలు, కొందరికి తక్కువ సౌకర్యాలు ఉంటాయా? భాగ్యవంతుల పిల్లల్ని ప్రతి సంవత్సరం ప్యాసు చేసి, బీదవారిపిల్లల్ని ఫెయిల్‌చేసే "ఆచారం" రష్యాలో ఉందా? వ్యక్తుల అభిరుచుల్నిబట్టి విద్యార్థుల్ని ప్రోత్సహిస్తారా? అసలు సోవియట్ యూని యన్‌యొక్క విద్యావిధానానికి మూలసూత్రం ఏమిటి?

బలమైన శరీరం, చురుకైన బుద్ధి, ఉన్నతమైన ఆశయం, విశాల మైన హృదయం-ఇవీ సోవియట్ విద్యావిధానంయొక్క మూలసూత్రాలు.

సోవియట్ ప్రభుత్వం అధికారానికి రాగానే చేసిన మొట్టమొదటి శాసనాలలో ప్రతి బాల, బాలికకు వుచితంగా, నిర్బంధించి చదువుచెప్పడం. గత 25 సంవత్సరాలలో యీ శాసనంవల్ల ప్రజలు పొందిన విద్యాభివృద్ధి ఇంతా - అంతాకాదు. విప్లవానికి పూర్వం రష్యాను విద్య విష యంలో యితర దేశాలతో పోలిస్తే, 19 వ స్థానం ఉండేది. ఇప్పుడో? మొట్టమొదటి స్థానం! 1914 లో 80 లక్షలమంది పిల్లలకు బడులలో చదువు చెప్పేవారట. ఇప్పుడు 3 కోట్ల 60 లక్షలమందికి చెబుతున్నారు.

ఈవిధంగా 15 వ యేడు వచ్చేవరకు బాల,బాలికలకు నిర్బంధోచిత విద్య యివ్వబడుతుంది. ధనికులు - బీదలు - రైతులు - కార్మికులు, మొద లైన వివక్షతలు చదువులో వుండవు.

## ఉన్నత విద్య

16 వ యేడొచ్చాక విద్యార్థులు తమ తమ అభిరుచుల్నిబట్టి వివిధ శాఖలలో విద్య నేర్చుకుంటారు. పారిశ్రామిక విద్యాలయాలలో చదువు నేర్చుకున్నవారికి హాస్టలులో ఉచితంగా బసయిచ్చి, భోజనం పెడతారు. దుస్తులుకూడా ఉచితంగానే యిస్తారు. అలాకాకుండా ఉన్నతవిద్య నేర్చుకో

దలచినవారు 18 వ యేడొచ్చేవరకూ పై తరగతులలో చదువుతారు. వారు తీసుకున్న "సబ్జక్ట్సు"లో మూడింట రెండువంతులు "సబ్జక్ట్సు" "చాలాబాగు న్నా"యని మార్కు వచ్చినట్లయితే, అలాంటివారికి ఉచితంగా చదువు చెబుతారు. విశ్వ విద్యాలయంలో ప్రవేశించినప్పుడు సొంత ఖర్చులకు కూడా సొమ్ము యిస్తారు. ఈలాంటి ఉచిత వేతనాలకు యెంతమంది అర్హులో, అంతమందికీ యిస్తారు. (యుద్ధకాలంలోమాత్రం యీ పద్ధతిని తాత్కాలికంగా ఆపుచేశారు.)

## సమిష్టి జీవితం

రష్యాలో అతివేగంగా వ్యాపించుతూన్న యీ విద్యావ్యాప్తి బాల బాలికల సమిష్టి జీవితానికీ, నైతిక ప్రవర్తనకూ యెంతో తోడ్పడుతూంది. బెత్తం ఉపయోగించకూడదని మనదేశంలో ఉపాధ్యాయులపై నిషేధం ఉన్నప్పటికీ, దాన్ని యెంతమంది పాటిస్తున్నారో చూస్తూనేవున్నాం. రష్యాలో అలాకాదు. ఉపాధ్యాయులెవరూ పిల్లల్ని కొట్టకుండానే క్రమ శిక్షణ నేర్పేటట్లు విద్యాలయాధికార్లు చూస్తారు. మరోవిషయం: సాధార ణంగా బాగా చదివిన విద్యార్థికి ఎక్కువమార్కులు, అంతకంటె తక్కువ బాగా చదివినవానికి తక్కువమార్కులు యిచ్చే సాంప్రదాయం ప్రతిదేశం లోనూ వుంది. ఈ పద్ధతివల్ల విద్యార్థుల్ని ప్రోత్సహించుతున్నామని అధి కార్లవాదన కాని జరిగేదేమిటి? ఎవడిమట్టుకువాడు మంచి మార్కుల కోసం, ఒంటెత్తుగా, ప్రయత్నిస్తాడు. తక్కువ మార్కులువచ్చిన తోడి విద్యార్థుల్నిచూచి విచారించడు. తనకుమాత్రం మంచి మార్కులు వచ్చి నందుకు గర్విస్తాడు. ఈ ఒంటెత్తులక్షణాన్ని సోవియట్ విద్యావేత్తలు నిర్మూలించడానికి పూనుకున్నారు. పదిమందిలో తానొకడననేభావం ప్రతి విద్యార్థికీ కలగాలి. మరోవైపు ప్రతి విద్యార్థిలోను కుశాగ్రబుద్ధిని ప్రోత్స హించాలి,

ఇందుకు వారొక కొత్తపద్ధతి కనిపెట్టారు ఒకే క్లాసు డివిజన్‌లో ఒక విద్యార్థికీ, యితర విద్యార్థులకూ మధ్య పోటీకాకుండా, ఒకక్లాసు డివి జనుకూ, మరొక క్లాసు డివిజనుకూ మధ్య పోటీలు పెడతారు, రెండు

డివిజన్లలోను వున్న తెలివైన పిల్లలు మిగతావారికి సహాయంచేసి, తమ డివిజను గెలవడానికి పనిచేస్తారు. ఈవిధంగా ప్రతి క్లాసులోను సోదర భావం, సమిష్టిపద్ధతి అలవడుతుంది. ఇతర దేశాలలో మంచిబుద్ధిగలవారి ఆధారంతో పైకొచ్చినవాడు గర్వంతో విర్రవీగుతాడు.

## ఫ్యాక్టరీలలో పాఠాలు

సోవియట్ విద్యావిధానం ప్రతి బాల, బాలికను చక్కని పౌరునిగ చేయాలని చూస్తుంది. అయితే యిందుకొకటి అవసరం. శరీర పరిశ్రమకూ, మానసిక పరిశ్రమకూ మధ్య యితరదేశాలలో యిప్పుడున్న భేదం పోవాలి. సాధారణంగా ప్రతి దేశంలోనూ శరీర పరిశ్రమచేసే కార్మికుణ్ణి చూస్తే చాలా నీచభావం కలుగుతుంది. అతనెంత ఉపయోగకరమైన పని చేసినాసరే! ఆఫీసులో పనిచేసే 15 రూపాయల గుమాస్తా; పాకీపనిచేస్తూ మన ఆరోగ్యాన్ని కాపాడేకార్మికుడు- ఈ ఇద్దరిలోనూ గుమాస్తాకే ఎక్కువ గౌరవం ఉంటుంది అన్ని దేశాలలోను. కాని రష్యాలో అలాకాదు. ఎవడే పనిచేసినా, సంఘం మేలుకోసమే. కాబట్టి ప్రతివాణ్ణి సోదరభావంతో చూడాలి.

ఈ సూత్రాన్ని ప్రతీ విద్యార్థికీ బోధిస్తారు రష్యాలో.

ఎలాగు?

విద్యార్థులు పాఠశాలలలో చదువుకొనేకాలంలో ఉపాధ్యాయులు వారిని అప్పుడప్పుడు ఏదో ఒక ఫ్యాక్టరీకి తీసుకెళ్ళి, అందులోవున్న ప్రతి భాగాన్ని చూపిస్తారు. ఫ్యాక్టరీ అంటే యేమిటో; అదెందుకు నడుస్తూందో; సమాజ జీవితంలో ఆ ఫాక్టరీ యెట్టి స్థానాన్ని అలంకరిస్తూందో; అందులో తయారయే సరుకు ప్రజలకేవిధంగా ఉపయోగకరమో; పనిచేయడంలో కార్మికులెంత శ్రమపడుతున్నారో - యివన్నీ విద్యార్థి స్వయంగాచూస్తాడు. చూచి సమాజజీవితంలో ఈఫ్యాక్టరీయొక్క స్థానాన్ని అర్థంచేసుకుంటాడు.

ఒక ఉదాహరణ తీసుకుందాం.

ఒక పిల్లవాణ్ని ఒక కమ్మరి కొలిమిదగ్గరకు తీసుకెళ్దాం. అక్కడ కమ్మరిచేసే పనిని సొంతంగా చూపించుదాం. చూడ్డం అయాక వానిదగ్గ

ఉన్న సాధనాలన్నింటిపై పెత్తనం వానికుంచేనే న్యాయమని పిల్లవాడు చెబుతాడు. ఇతన్నే ఒక పెద్ద ఉక్కుకర్మాగారంలోకి తీసుకెళ్తాం. ఒక్కొక్క కార్మికుడు యెంతెంత కఠినమైన పనిచేస్తున్నాడో, ఒక్కొక్క యంత్రం యెంతెంత బరువైన వస్తువును యెత్తుతూందో ఆ పిల్లవాడు చూస్తాడు. ఇప్పుడతడు కర్మాగారంపై పెత్తనం ఒక వ్యక్తికి ఉన్నట్లయితే యెంత ప్రమాదకరమో గుర్తిస్తాడు. ఎవరి కష్టంవల్ల కర్మాగారం అంతా నడుస్తూందో, వారే ఆకర్మాగారానికి యజమానులై వుండడం న్యాయమని పిల్లవాడు చటుక్కున అర్థంచేసుకుంటాడు. ఈవిధంగా బాల, బాలికలు చిన్నప్పటినుంచీ ఒక్కొక్క వ్యక్తి చేసేపని సంఘానికి యెంత లాభమో, యెంత నష్టమో విచక్షణతో ఆలోచించగల్గుతారు. ఒంటెత్తుతనం పోయి, సామాజిక జీవనం అలవడుతుంది.

## జాతివివక్షత, రంగు వివక్షత లేదు

ప్రతి రష్యన్ బాల, బాలిక తనతోటివారిని సోదరభావంతో చూచేటట్లు ప్రభుత్వం తరిఫీదు యిస్తుంది. జాతి వివక్షత, రంగు వివక్షత, మత వివక్షత, ప్రపంచంలో యింతవరకు రక్తప్రవాహాలకు కారణమయింది. కాని రష్యాలో యీ మహామారిని నిర్మూలించడానికి చిన్నప్పటినుంచీ పిల్లలకు తరిఫీదుయిస్తారు.

కాంటర్‌బరీ మతగురువు (బ్రిటన్) ఒకరోజున మస్కో నగరంలో సినిమాకువెళ్ళాడు. అది పిల్లల సినిమా. అందులో పిల్లలకోసం తయారుచేసిన ఫిల్ములు మాత్రమే చూపుతూంటారు.

ఆ సినిమా చూడ్డానికి ఆ రోజున కనీసం 1,500 మంది పిల్లలైనా వచ్చి వుంటారు. గడ్డంనెరిసిన ఆ మతగురువు కూడా, ఆ భావిపౌర ప్రపంచంలో, ఆ కోలాహలంలో, ఆనందసాగరంలో తేలిపోతూ మధ్యన కూర్చున్నాడు.

ఆనాటి ఫిలిం, "నీగ్రో కుర్రాడు - కోతి" అనేది.

మొదటి దృశ్యం. ఆఫ్రికాలో ఒక అడవి. అందులో కొందరు నల్లపిల్లలు (నీగ్రోలు) ఒకచోట జేరి పోట్లాడుకుంటున్నారు. పోట్లాటలో

అలిసిపోయి, చివరకి ఒక కుర్రాడు అంటాడు: "అబ్బ! మనకి ఒక నాయకుడుంటే బాగుండును" అని. ఇంతలోకే ఒక కుర్రాడు వచ్చి "అయితే మనమంతా కలసి, మనలో బాగా ఆడేవాడు, పాడేవాడు, పరుగెత్తేవాడు అయిన ఒకడ్ని ఎందుకు ఎన్నుకోకూడదు?" అంటాడు.

పోటీ జరుగుతుంది. ఆ కుర్రాడే నాయకుడుగా ఎన్నుకోబడతాడు.

ఒకనాడు ఆ కుర్రాడు వేటకి వెడతాడు. ఒక పెద్దపాము వాడ్ని కరవబోతుంది. ఇంతలోకే ఒకకోతి ఎక్కడినుంచో గభీమని వురికి, వాడ్ని రక్షిస్తుంది. అప్పటినుంచీ ఆ కోతికి, ఈ కుర్రాడికి ప్రాణస్నేహం.

కొన్నాళ్ళకి ఓనాడు ఆ పిల్లలూ, కోతీ కలసి ఆటలాడు కుంటూ వుండగా- ఆ అడవిలోకి వేటకోసం సూట్లు, బూట్లు, హాట్లు వేసుకుని, తుపాకులు చేతబుచ్చుకుని కొందరు తెల్లదొరలు వస్తారు. వాళ్ళని చూచి పిల్లలంతా బెదిరి పారిపోతారు. వాళ్ళు ఆటలు నేర్చిన ఈకోతిని పట్టుకుని, ఓడమీద ఎక్కించి తీసుకుపోతారు.

కుర్రాడు ఈ సుహృద్వియోగాన్ని సహించలేకపోతాడు. ఏమైనా సరే తన కోతిని తిరిగి తెచ్చుకుంటానని బయలుదేరాడు. ఇంకో ఓడ ఎక్కి. చివరకి మాస్కో చేరుకుంటాడు. కోతి కనబడదు. గాని అతడొక చాక్‌లెట్ ఫ్యాక్టరీలో ప్రవేశించుతాడు. కొంచెంసేపటికి భోజనం గంట మోగుతుంది. వర్కర్లంతా ఎవరిదారిని వారు భోజనానికి పోతారు. ఈ కుర్రాడు గోడమీద ఒక ప్రపంచపటం చూస్తాడు. దగ్గరకు వెళ్ళి, అందులో ఆఫ్రికా మీద చేతులువేసి, ఉస్సురని నిట్టూర్పులు విడుస్తూంటాడు.

ఇంతలో ఇద్దరు కాంసొమాల్స్ (యువక కమ్యూనిస్టులు-) ఒక కుర్రాడు, ఒకపిల్ల అక్కడికి వస్తారు. వాళ్ళిద్దరు ఆ కుర్రాడి దగ్గరకు వెళ్ళి చెరో బుజంమీద చేతులువేసి పలకరించుతారు. ఆ సంభాషణలో, "రాత్రి సర్కసు చూద్దాం వస్తావా" అని అడుగుతారు.

తరువాత ఇంటర్‌వల్ ....................

# మాతా శిశు రక్షణ

సంస్థలు




శిశువులకు క్రెచీలు




కిండెర్ గార్టెన్‌లలో శిశువుల సంఖ్య










వేసవికాలంలో పిల్లలు ఆడుకొనే ఆటస్థలాలు







ఇంటర్వల్ అయిన తరువాత, సర్కస్ దృశ్యం. నీగ్రో కుర్రాడు, ఆ యిద్దరు కాంసొమాల్స్ కలసి సర్కసు చూడడానికి వస్తారు.

సర్కస్ మేనేజరు టప్-టప్- మని కొరడాతో శబ్దం చేసుకుంటూ ఒక కోతిని వెంటబెట్టుకుని రంగంమీదికి వస్తాడు. ఆ కోతి మన నీగ్రో కుర్రాడి మిత్రుడే! దాన్ని చూచేసరికి వాడికి ఒళ్ళంతా తేళ్లు, జెర్రులు పాకి నట్లయింది. కోతిని పేరుపెట్టి బిగ్గరగా — హాలులోనివాళ్ళ చెవులు చిల్లులు పడేలా పిలుస్తాడు. ఆ గొంతు గుర్తుపడుతుంది కోతి. చంగుమని ఒక గంతువేసి సర్కసురింగు దాటి, ప్రేక్షకుల గ్యాలరీలోకి దూకి, తన మిత్రుడి ఒడిలో వచ్చి కూర్చుంటుంది. ఇక ఆయిద్దరి ఆనందం వర్ణించలేం. సినిమా చూడ్డానికి వచ్చిన 1500 మంది పిల్లల ఆనందం అంతకంటె కూడా వర్ణనాతీతం.

తరువాత దృశ్యం. ఓడమీద, నీగ్రోకుర్రాడు తన మిత్రుడితో (కోతితో) ఆఫ్రికాకు ప్రయాణ మవుతాడు.

మళ్ళీ ఆఫ్రికా అడవుల్లో తన మిత్రబృందాన్ని కలుసుకుంటాడు.

ఏమి కోలాహలం! ఏమి సంతోషం! ఆ పిల్లలు తమ మిత్రు లిద్దరినీ తిరిగి కలుసుకున్నందుకేకాదు ఆ ఆనందమంతా, తమకు మాస్కో పిల్లలు పంపిన రంగురంగుల అందమైన బహుమతులను చూచి, ఆ నీగ్రో పిల్లలు పొంగిపోయారు. గంతులువేశారు. కేరింతాలు కొట్టారు. ఆకోలా హలంతో అడవి అంతా మారుమ్రోగిపోయింది.

అక్కడ ఆ నీగ్రో కుర్రాడు ఒక ఉద్రేక పూరితమైన ఉపన్యాసం యిస్తాడు.

"ఆ ఉపన్యాసం జీవితంలో మరచి పోలేం" అన్నాడు కాంటర్బరీ మతగురువు. మాస్కో పిల్లలని, వాళ్ళ సుహృద్భావాన్ని, వాళ్ళ సర్వ మానవ సమతాభావాన్ని ఆయన ఉగ్గడించుతాడు.

ఇదీ సినిమాకథ.

ఆ మతగురువు ఇంకా ఇలా అన్నాడు:

"ఇదొక్కటే కాదు. సోవియట్ యూనియన్‌లో ఇలాంటివి లక్ష ఉదాహరణ లివ్వవచ్చు"

1943 లో పాల్ రాబ్సన్ అనే ప్రఖ్యాత నీగ్రో గాయకుడు మాస్కో వెళ్ళినప్పుడు ఆయనకూడా ఇదే ఫిల్మ్ చూడడం తటస్థించింది. సినిమా ఇంటరవల్‌లో పిల్లలంతా వచ్చి, రాబ్సన్‌చుట్టూ మూగారు. ఆయనను కౌగలించు కున్నారు. అందులో ఒక ఎనిమిదేళ్ళ కుర్రాడు సినిమా అయ్యే దాకా ఆయన చేయి పట్టుకుని ప్రక్కనే కూర్చున్నాడు. సినిమా అయాక, రాబ్సన్‌తో ఆ కుర్రాడిలా అన్నాడు: "నీవు మాదేశంలోనే ఉండు. నీకు హాయిగా ఉంటుంది. వెళ్ళిపోకేం" అని. రాబ్సన్ తన రష్యా యాత్రను గురించి ఇలా అన్నాడు.

"నేను ఎక్కడికి వెళ్ళినా, ఆ దేశంలో నాకు అపరిమిత గౌరవం జరిగింది. అప్పుడు నాకు నల్లవాళ్ళకు తదితర దేశాలలో జరిగే అన్యాయాలు, అక్రమాలు ఒక్కసారి స్ఫురణకు వచ్చాయి. తెల్లవాళ్ళ ముఖం చూడ్డానికే భయపడే నా చిన్ని 'పాలీ' (రాబ్సన్ కొడుకు) ఈ దేశంలో వుంటే ఎంత బాగుండేది! అనుకున్నా.

"ఒక్కపట్టణాలలోనే కాదు. గ్రామాల్లోని పిల్లలుకూడా నీగ్రో సమస్యను ఎంతో చక్కగా తెలుసుకున్నారు. ఒకచోట పిల్లలంతా నన్ను కూర్చోబెట్టి పాటలుపాడి వినిపించారు. నేనుకూడా వారికి కొన్ని నీగ్రోపాటలు పాడి వినిపించాను. వారు సంతోషం పట్టలేక, రాగం అందుకుని నాతో లయకలిపి పాడడానికి ప్రయత్నించారు.

"నేనిదివరకు, ఈ జాతిభేదాన్ని, రంగుభేదాన్ని తొలగించ గలమనుకోడం వట్టి కల అనుకునేవాడ్ని. కాని సోవియట్ యూనియన్ నా కళ్ళు తెరిచింది. అది సాధ్యమని రుజువు చేసింది. సోవియట్ పౌరులు అఖండ త్యాగాలుచేసి, తమ రక్తాన్ని ధారవోసి నిర్మించిన ఈ స్వర్గభూమిలో నా 'పాలీ'కి, 'పాలీ' లాంటి కోటానుకోట్లు అణచిపెట్టబడిన వారికి, ఉజ్వల భవిష్యత్తు వుంది."

## బాల, బాలికలకు సమిష్టి పాఠశాలలు

సోవియట్ యూనియన్‌లో బాల, బాలికలు కలిసి చదువుకుంటారు. కలిసి ఆడుకుంటారు. కలిసి అభివృద్ధి చెందుతారు. తామంతా ఒకటేననీ, బాలికలకంటె అతీతమైన ప్రత్యేక లక్షణాలు బాలురకు లేవనీ, అందరూ సమానంగా సుఖజీవనం గడపడానికి అర్హులనీ, వారు తెలుసుకున్నారు. సమాజం అభివృద్ధి చెందడానికి ఉభయులూ ముఖ్యమేనను విషయం అర్థం చేసుకున్నారు.

పాతిక సంవత్సరాలు యిలా గడిచాయి. సమాజానికి పురుషులెంత అవసరమో స్త్రీలుకూడా అంతే అవసరమనీ, ప్రతి సోవియట్ పౌరుడు గుర్తించాడు. తమ అభిరుచుల్నిబట్టి వికాసం పొందడానికి ఉభయులకు సమానమైన హక్కు ఉన్నదని వారు గ్రహించారు.

దేశం క్రమంగా అభివృద్ధిచెంది, బలీయమైన శక్తిగా పరిణమించింది. ప్రజలందరికీ కడుపునిండా తిండి, చేసుకోడానికి సంవత్సరం పొడుగునా పని, ఒంటినిండా బట్ట, నివసించడానికి యిల్లు, లభించాయి.

ఇలా ఆర్థిక సమస్యలన్నీ పరిష్కరించబడ్డాక, సోవియట్ నాయకులు కుటుంబ జీవనానికెక్కువ ప్రాధాన్యత యివ్వసాగారు. ఇది సహజం.

సోషలిస్టు సమాజం అభివృద్ధి చెందుతూన్న కొద్దీ, కుటుంబం అంతకంతకు యెక్కువ ప్రాధాన్యత వహించుతుంది. కుటుంబ జీవనం హాయిగా, విజ్ఞానవంతంగా, వికసించాలంటే దానంతట అది జరగదు. అందుకు కొంత తరిఫీదు, శిక్షణ, ఉండాలి.

సోవియట్ విద్యాధికారులు యిట్టి దృక్పథంతోనే స్కూళ్ళలో యింతవరకూ బాల, బాలికలు కలిసి చదువుకుంటూన్నందువల్ల ఎంత ఉపయోగం కలిగిందో, యెట్టి అనుభవం సంపాదించగలిగారో పరిశీలించారు.

## ప్రత్యేక పాఠశాలల అవసరం

విద్యా విధానంలో కొన్ని మార్పులు చేయడం అవసరమని వారు అభిప్రాయపడ్డారు. దేశంయొక్క అభివృద్ధిలో ఒక కొత్తదశ వచ్చిందనీ,

యీ దశకు అనుగుణ్యంగా విద్యావిధానంలో కొన్ని మార్పులు చేయాలనీ, గ్రహించారు. బాల, బాలికలు కలిసి చదువుకోవడం వల్ల కొన్ని లాభా లున్నాయి. పాత పద్ధతివల్ల, అనగా కలిసి చదువుకోవడంవల్ల ఎంత ఉప యోగం కలగాలో అంతా కలిగింది. ఇప్పుడు కొత్తపరిస్థితు లేర్పడ్డాయి. వీటి కనుగుణ్యంగా వ్యక్తి జీవనం, సంఘజీవనం యింకా అభివృద్ధి చెందా లంటే, 12-18 సంవత్సరాలమధ్య వయసుగల బాల బాలికలకు వేర్వేరు విద్యాలయాలలో చదువుచెప్పడం అవసరం. కాబట్టి సోవియట్ నాయకులు 1943 చివర అట్టినిశ్చయానికి వచ్చారు.

## ఇందుకు కారణాలు

ఇందుకు కారణాలు యివి: స్త్రీ, పురుషులలో ప్రకృతి సిద్ధంగా ఉండే లక్షణాలు వేర్వేరు పాఠశాలలద్వారానే అభివృద్ధి చెందుతాయి.

బాలికలు ముందు ముందు తల్లులు కావలసినవారు. శాస్త్రీయ పద్ధ తుల ప్రకారం బిడ్డల్ని తరిఫీదుచేసి, ఆదర్శ వంతమైన పౌరులుగా వారిని తయారు చేయవలసినవారు. అందువల్ల, ప్రతి స్త్రీ భార్యగాను, తల్లిగాను నెరవేర్చవలసిన బాధ్యత లెన్నో ఉంటాయి. వాటిని నెరవేరుస్తూ స్త్రీ సమాజ జీవనంలో పురుషులతోబాటు సమానంగా భాగస్వామిని కావలసి వుంటుంది. ప్రత్యేక పాఠశాలలుంటేనే, యిది సాధ్యం.

స్త్రీ తన శరీర ప్రకృతిని గురించి, గర్భం దాల్చినప్పుడూ - బిడ్డ పుట్టినప్పుడూ తాను తీసుకోవలసిన జాగ్రత్తల్నిగురించి తెలుసుకోవాలంటే, ప్రత్యేక శిక్షణ అవసరం. తన ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడు కుంటూ, కుటుంబంలోని వారందరి ఆరోగ్యాన్ని కాపాడాలంటే స్త్రీకి వివాహం కాకముందే, అనగా కౌమారావస్థలోనే, ఈ విషయాలను గురించి జ్ఞానం సంపాదించాలి.

12 సంవత్సరాలు దాటిన తరువాత బాల, బాలికలు కలిసి వ్యాయామం చేయడం, కలిసి ఆటలాడడం, కంటె వేర్వేరుగా వ్యాయామం చేయడం వల్ల, వేర్వేరుగా ఆటలాడడం వల్ల, ఉభయుల శరీరావయవాలు ఆదర్శ వంతంగా వృద్ధి చెందుతాయి. అనుభవంమీద తెలుసుకున్న విషయంయిది,

యుద్ధం ఈ విషయాన్ని యింకా బాగా రుజువుచేసింది. యుద్ధ రంగలో బరువైన ఆయుధసామగ్రిని ఉపయోగించడానికి బలిష్ఠమైన శరీరాలుండాలి. సామాన్యమైన స్త్రీకి అంత బలం ఉండదు. కాని, శత్రువును ఓడించి తీరాలనే దీక్షతో తమ శక్తికి మించిన దేహపరిశ్రమ చేయడం వల్ల స్త్రీకి హాని కలుగుతూంది.

ప్రత్యేక పాఠశాలలకు మరో కారణం ఉంది. సోవియట్ ఆర్థిక నిర్మాణం సుస్థిరంగా, కట్టుదిట్టమైన పునాదులపై, అభివృద్ధి చెందుతూంది. అందువల్ల శాస్త్రీయ పద్ధతులపై స్త్రీలకు గృహకృత్యాలు నేర్పడం అవసరమైంది. ఇందుకవసరమైన తరిఫీదు ప్రత్యేక పాఠశాలలోనే సాధ్యం.

ఇలాంటి విద్యలు యెవరి ఇండ్లలో వారు నేర్చుకుంటామని యిదివరలో యువతులు చెప్పేవారు. కొందరు అలా నేర్చుకున్నవారున్నారు. కాని, చాలా సందర్భాలలో నేర్చుకోలేదు. పాఠశాలలలో నేర్చుకుందామంటే, తగినంత వ్యవధి, వసతులు లేవు. మెకానిక్కులుగాను, ఇంజనీర్లుగాను, డాక్టర్లుగాను, ఉపాధ్యాయినులుగాను మాత్రమే తయారు కావడాని కెక్కువ అవకాశం ఉండేది. పంచవర్షప్రణాళికలు జయప్రదం కావాలంటే, యిలాంటి వృత్తివిద్యలకు యెక్కువ ప్రాధాన్యత అప్పటిలో యివ్వడం అవసరమయింది. కాని, యీ రోజున సోషలిస్టు నిర్మాణానికి కావలసినంత బలం చేకూరడంవల్ల, గృహకృత్యాలు కూడా నేర్పడానికి యెక్కువ వ్యవధి, అవకాశం, ఉంది. ఇంజనీర్లుగాను, మెకానిక్కులుగాను, డాక్టర్లుగాను తరిఫీదు పొందుతూ, శాస్త్రీయ పద్ధతులపై గృహకృత్యాలు కూడా నిర్వహించడానికి స్త్రీలు ముందుకొస్తున్నారు. గృహవిద్య కూడా యితర విద్యల మాదిరిగానే నైపుణ్యంతో కూడుకొనియున్న విద్య. టెక్నికల్ పరిజ్ఞానం ఇందులో కూడా చాలా అవసరం.

మరో కారణం యేమంటే, స్త్రీ, పురుషులు శారీరకంగాను, మానసికంగాను, సమాన వేగంతో అభివృద్ధి చెందరు. సర్వసామాన్యంగా బాలుడు 10-13 సంవత్సరాల మధ్య బహు నెమ్మదిగా అభివృద్ధి చెందుతాడు, బాలిక యీ వయస్సులో బహు వేగంగా అభివృద్ధి చెందుతుంది. 14-17 సంవత్స

రాల మధ్య మళ్ళీ బాలుడు అతివేగంగా అభివృద్ధి చెందుతాడు; బాలిక నెమ్మదిగా అభివృద్ధి చెందుతుంది. ఆమెకు యిది "విశ్రాంతి కాలం" అని చెప్పవచ్చు.

రజస్వలానంతరం బాలికలో అనేక మానసిక మార్పు లొస్తాయి. పాఠశాలలలో యీ మార్పుల కనుగుణ్యమైన విద్యావిధానం ఉండడ మవసరం. సమిష్టి పాఠశాలలలో యిందుకై ప్రత్యేక శ్రద్ధ వహించడం అసంభవం.

ఈ కారణాలవల్ల సోవియట్ విద్యాధికారులు బాల బాలికలకు కౌమారావస్థలో వేర్వేరుగా చదువుచెప్పడమే మంచిదని నిశ్చయించారు.

దీని అర్థం, స్త్రీపురుషుల్ని పూర్తిగా వేరుపరచేస్తున్నారని కాదు. క్లబ్బులలోను, విశ్రాంతి భవనాలలోను, సెలవు క్యాంపులలోను, యువక కమ్యూనిస్టు ఉద్యమంలోను, బాలబాలికలు కలిసే కాలం గడుపుతారు.

సోవియట్ యూనియన్‌లోని యితర సంస్కరణం వలె ఈ సంస్కరణ కూడా పరిస్థితుల్నిబట్టి అవసరమయింది. సమిష్టి పాఠశాలలు అవసరమైనప్పుడు బాలబాలికలకు చదువు వాటిల్లోనే చెప్పారు. ప్రత్యేకపాఠశాలలు అవసరమైనప్పుడు ప్రత్యేక పాఠశాలలలోనే చెబుతారు. సోవియట్ నాయకులు యేవిధానాన్నీ మూఢభక్తితో విశ్వసించరు. శాశ్వతంగా ఒకే సిద్ధాంతం పట్టుకొని వేళ్ళాడరు. కొత్తసంస్కరణ అవసరమైనప్పుడు ధైర్యంగా అవలంబిస్తారు. ఇంకో పాతిక సంవత్సరాలు గడిచాక ఇంకా కొత్త సంస్కరణలు అవసరమైతే, వాటిని అవలంబిస్తారు.

ఏ సంస్కరణ చేసినా, సోవియట్ రాజ్యాంగ వేత్తలు ఒక ప్రధాన విషయాన్ని మనస్సులో పెట్టుకొని చేస్తారు. బాలబాలికలు సర్వతోముఖంగా అభివృద్ధిచెంది, కొత్తసమాజంలో వారు ఉత్తమ పౌరులుగా తయారయ్యేలాగు చూస్తారు.

## ౨. సోవియట్ స్త్రీ

ఏ దేశంలోనైనా స్త్రీకి వుండే స్థానాన్నిబట్టి ఆ దేశంయొక్క ఔన్నత్యం చాలావరకు ఆధారపడియుంటుంది. ఈదృష్టితో చూచినట్లయితే, రష్యాతోసాటి మరేదేశంలేదు. ఎందువల్లనంటే, పురుషుల్నిగురించి యింత వరకూ చెప్పిన విషయాలు స్త్రీలకుకూడా వర్తిస్తాయి. ఇతర దేశాలలో ఇలాకాదు.

ఒకనాడు బానిసత్వంలో కృంగి కృశించిన స్త్రీకి ఒక్కసారిగా స్వాతంత్ర్యం లభించింది. సర్వ విషయాలలోను పురుషునితో సమాన హక్కులు, సమాన బాధ్యతలు, లభించాయి చట్టరీత్యా చూచినట్లయితే, పురుషులతోబాటు స్త్రీకి సమానహక్కులున్నాయి. విద్యాసంస్థలలో స్త్రీ-పురుషుల మధ్య విచక్షణలేదు. వోటుచేయడానికి పురుషుని కెంతహక్కు ఉందో, స్త్రీకీ అంతే హక్కు ఉంది. ప్రతి పురుషుడు పనిచేసుకొని స్వతంత్రంగా జీవించడాని కెలాంటి అవకాశం ఉందో, స్త్రీకి కూడా అలాంటి అవకాశమే ఉంది. పురుషుడు సంపాదించిన జీతంమీద స్త్రీ ఆధారపడ నవసరంలేదు. స్త్రీకి ఆర్థిక, రాజకీయ, పౌర, హక్కులన్నీ పురుషునితో సమానంగా యివ్వబడ్డాయి.

### జార్ పరిపాలనలో

జార్ చక్రవర్తి పరిపాలనలో స్త్రీలనుభవించే కష్టాలు ప్రపంచంలో ఎక్కడా ఉండేవికాదు. కాని, సోవియట్ ప్రభుత్వం అధికారానికి వచ్చాక, స్త్రీయొక్క ఔన్నత్యం, గౌరవం, ప్రపంచంలో మరెక్కడా లేవు.

జార్ పరిపాలనకింద ఫ్యాక్టరీలలోకల్లా బట్టల ఫ్యాక్టరీలే యెక్కువగా ఉండేవి. ఇతర పరిశ్రమలలో కంటె బట్టల పరిశ్రమలో ఎక్కువ మంది కార్మికులుండేవారు. వీరిలో యెక్కువమంది స్త్రీలే. మొత్తం

6 లక్షలమంది కార్మికులు బట్టల మిల్లులలో పనిచేస్తూంటే, వారిలో స్త్రీలు 4 లక్షలమంది. ఇందుకు కారణంలేకపోలేదు. స్త్రీలు పురుషులకంటె చౌక. స్త్రీలు పురుషులకంటె రెగ్యులర్‌గా హాజరౌతారు. స్త్రీలు పురుషుల కంటె అడకువతో పనిచేస్తారు. యజమానుల అక్రమాన్ని స్త్రీలు గట్టిగా యెదుర్కోలేరు.

1905 లో జరిగిన మొదటి విప్లవం విఫలమయాక, పరిస్థితులింకా అధ్వాన్నమయాయి. పురుషుల సంఖ్యకంటె స్త్రీల సంఖ్య ఇంకా యెక్కువైంది; కార్మిక సంఘాల్ని పురుషులే యెక్కువగా నడిపించడంవల్ల యజమానులు పురుషుల్ని పనిలోనుండి తొలగించి వారిస్థానే స్త్రీలను పెట్టేవారు. 1906 లో స్త్రీ కార్మికుల సంఖ్య అంతకు పూర్వంకంటె 22,808 పెరిగింది. పురుషుల సంఖ్య 1425 తగ్గింది!

ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్ల తనిఖీని యజమానులు వ్యతిరేకించసాగారు. 1914 లో ఒక్కొక్కనిచే వారానికి 60 గంటల వరకూ పనిచేయించేవారు. ఫ్యాక్టరీ బిల్డింగులు బహుచిన్నవిగా ఉండేవి. కప్పులు చాలా కిందుగా ఉండేవి. కిటికీలు బహుచిన్నవి. అవైనా యెక్కువగా ఉండేవికావు. ఒక యంత్రానికీ, మరో యంత్రానికీ మధ్య ఖాళీస్థలం ఉండేదేకాదు. యంత్రాలనువరుసగా అమర్చేవారు. కార్మికులు కూర్చొని పనిచేయడానికి సరియైన సీట్లు ఉండేవికావు. గాలిగాని, వెలుతురుగాని ప్రవేశించడమే కష్టమయేది.

ఇక కార్మికులు నివశించే స్థలాలు ఎట్టి స్థితిలో ఉండేవి? జంతువులైనా అంత పాడుకొంపలలో నివశించవు! పిల్లలు ఒక మూలగా, చిరిగిపోయిన గుడ్డలు పరుచుకొని, పడుకునేవారు. పెద్దవాళ్లు వంతులప్రకారం పక్కలు పరుచుకొని నిద్రించేవారు. లేదా, వట్టి నేలమీదే తరుచు పడుకునేవారు. రష్యా మనదేశంవలె వేడిదేశంకాదు. అట్టి పరిస్థితిలో అలా పడుకోవడం ఎంతకష్టమో ఊహించుకోవలసిందే.

కార్మికులకిచ్చే జీతాలు నమ్మశక్యంకానంత తక్కువగా ఉండేవి.

1,000 కి 40 మంది చొప్పున కార్మికులు ప్రతియేటా చనిపోయేవారంటే, వారెంత హీనస్థితిలో ఉండేవారో బోధపడుతుంది.

1914 లో మొదటి సామ్రాజ్యవాద యుద్ధం వచ్చింది. పరిస్థితులింకా అధ్వాన్నమయాయి. యజమానులు పురుషులందరినీ యుద్ధభూమికి పంపించి వారిస్థానే స్త్రీలను, పిల్లల్ని నియమించారు. జీతాలు కొద్దిగా పెరిగినప్పటికీ, జీవితావసరాల ధరలు అంతకంటె యెన్నోరెట్లు పెరిగాయి. పొట్టనిండా తిండే దొరికేదికాదు.

ఇట్టి పరిస్థితుల్లో తిరుగుబాట్లు రాక ఏంచేస్తాయి ? స్త్రీలు - సహించలేని యమయాతనలు పడ్డ స్త్రీలు— అనేక సందర్భాలలో తిరుగుబాట్లకు నాయకత్వం వహించారు. అసంఖ్యాకులైన పురుష విప్లవకారుల్ని జార్ ప్రభుత్వం సైబీరియా అడవులలో నిర్బంధించుతూ ఉండేది. అప్పుడు వారి భార్యలు వారిని సంతోషంగా వెంబడించేవారు. కొన్ని సందర్భాలలో పిల్లల్నిసహితం యిళ్ళవద్ద విడిచిపెట్టి ప్రయాణ మయేవారు.

కాలేజీ విద్య నభ్యసించిన యువతులు సహితం విప్లవ ప్రచారం కొరకు మారుమూల గ్రామాలకు వెళ్ళి, అక్కడ ఎన్ని నిర్బంధాలున్నా, ఓపికతో పనిచేసేవారు. 1877 లో ప్రభుత్వ న్యాయశాఖ మంత్రి విప్లవోద్యమాన్ని గురించి చెబుతూ, "కుట్రదారుల" లో యెక్కువమంది స్త్రీలే కావడంవల్ల విప్లవప్రచారం యెక్కువ జయప్రదంగా కొనసాగుతూన్నదని విలపించాడు.

ఉన్నత విద్య నభ్యసించిన విదుషీమణులు, లలితకళలలో ప్రావీణ్యత సంపాదించిన నేర్పరులు, ఆనాటి విప్లవోద్యమంలో ఎడతెగకుండా పనిచేశారు. యౌవనప్రాయంలో వీరు తమ సకలసౌఖ్యాల్ని, విలాసాల్ని, త్యజించి, దేశంకోసం అనేక కష్టాలు పడ్డారు. వ్యక్తిగత ప్రేమకంటె ప్రజాసేవలోనే ఎక్కువ ఆనందాన్ని అనుభవించారు. ఈ ఉద్యమంలో పనిచేసే యువతీయువకులు నిష్కళంకమైన నైతిక జీవితం గడిపేవారు.

1870 వ సంవత్సరంనుండి జార్ ప్రభుత్వం విప్లవోద్యమాన్ని అణచడానికి దేశం అంతటా దారుణమైన నిర్బంధవిధానాన్ని ప్రవేశపెట్టింది. జైళ్ళలో సహితం రాజకీయఖైదీ లెలాంటి అమానుష కృత్యాలకు గురిచేయబడ్డారో, ఎలాంటి చిత్రవధలకు బలిఅయారో, తెలుపడానికి వారి వారి

చిత్రాలు, ఫొటోలు, ఉత్తరప్రత్యుత్తరాలు, కొన్ని పరికరాలు, ఇప్పటికీ సోవియట్ మ్యూజియంలలో ప్రదర్శించబడుతున్నాయి.

గాఢమైన స్నేహం, ఆదర్శప్రాయమైన సహచర్యం, ఎన్నికష్టాలొచ్చినా సరే, కలిసి పోరాడేశక్తి — యివి రష్యన్ విప్లవకారుల ప్రధానలక్షణాలు. జైళ్ళ బయట ఉంటే, ప్రతి దమ్మిడీని అందరూ పంచుకునేవారు. జైళ్ళలో ఉంటే, కలిసి వంటచేసుకోవడం, కలిసి భోజనాలు చేయడం, కలిసి ధనం ఖర్చుపెట్టడం చేసేవారు. స్త్రీ - పురుషులలో యెట్టి ఎక్కువ తక్కువలు ఉండేవి కావు. అందరూ సమాన హోదాతో కాలం గడిపేవారు. అందరూ కలిసి ఒకే ఆదర్శం కొరకు పాటుపడేటప్పుడు భేదభావానికి స్థానం ఉండదు.

రాజకీయ ఖైదీలు జైళ్ళనుండి తప్పించుకోవడానికికూడా స్త్రీలు చాలావరకు సహాయం చేశారు.

ఈ విధంగా రష్యన్ స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు పురుషులతో బాటు సమాన త్యాగాలు చేశారు 1907—1912 సంవత్సరాలలో మాల్ట్సెవ్ జైలులో ఉన్న 67 గురు స్త్రీ ఖైదీలలో 18 గురు యుక్తవయస్సు రాని బాలికలట. 21 మొదలు 30 సంవత్సరాల వయస్సుగలవారు 37 గురు; 30 సంవత్సరాలకంటె యెక్కువ వయసు ఉన్నవారు 12 గురు మాత్రమే!

జైళ్ళలో స్త్రీ విప్లకారులు మానసికంగా అనేకరీతుల అభివృద్ధి చెందేవారు. చదువురాని స్త్రీలు "అ, ఆ" లతో చదువు ప్రారంభించేవారు. చదువుకున్నవారు వివిధశాస్త్రాలలో ప్రావీణ్యత సంపాదించేవారు. జైళ్ళలోనే చిన్నచిన్న గ్రంథాలయాలు బయల్దేరేవి. తత్వశాస్త్రానికి సంబంధించిన పుస్తకాలలో రాజకీయ విషయాలేమీ ఉండవనే భావంతో అధికార్లు వాటిని విచ్చలవిడిగా లోపలికి పంపించేవారు. అందువల్ల విప్లకారులు వివిధ తత్వశాస్త్రాలలో జ్ఞానం సంపాదించేవారు. ఆ జ్ఞానాన్ని అప్పటి సామాజిక సమస్యల కన్వయించుతూ చర్చలు సాగించేవారు.

1887 లో జార్ ప్రభుత్వం నిర్బంధవిధానాన్ని యింకా తీవ్రతరం చేసింది. రాజకీయఖైదీలను దూరంగా సఖాలిన్ ద్వీపానికి ప్రవాసం పంప

సాగింది. అక్కడ జీవితం బహుదుర్లభం. సంవత్సరంలో కొద్దివారాలు మాత్రమే సూర్యుడక్కడ ఉదయిస్తాడు. మిగతా సంవత్సరం అంతా మంచు కురుస్తూ ఉంటుంది.

దేశంలో విద్యాసౌకర్యాలు క్రిమక్రిమంగా నిర్మూలించబడ్డాయి. "ఇక యెవరికీ విద్య యివ్వకూడదు", అంటూ జార్ అలెగ్జాండర్ III ఉత్తరువులు జారీచేయసాగాడు. స్త్రీల కళాశాలలు పూర్తిగా ఎత్తివేయ బడ్డాయి.

ఈ కారణాలవల్ల రష్యన్ యువతులు విద్యకోసం యితరదేశాలకు ప్రయాణమయారు. ముఖ్యంగా జర్మనీకి ఎక్కువమంది వెళ్ళి, కార్ల్‌లీబ్ నెక్ వంటి సోషలిస్టునాయకులతో పరిచయం యేర్పరచుకున్నారు. వారు వ్రాసిన గ్రంథాలు చదవసాగారు. తత్వశాస్త్రమేకాకుండా, రాజనీతిశాస్త్రం అంటే వారిలో పట్టువల బయల్దేరింది. స్విడ్జర్లెండ్‌లో వీరా ససూలిచ్ అనే ఆమె మార్క్స్, ఏంగిల్సు వ్రాసిన గ్రంథాలు చదివి, కొన్నిపుస్తకాలను, రష్యన్‌భాషలో, స్వయంగా వ్రాసింది. ఒక స్నేహితురాలికి ఆమె జాబు వ్రాస్తూ, తాను నెలలతరబడి ఎవరితోనూ మాట్లాడకుండా యెలా కాలం గడిపిందో తెలియజేసింది. ఎల్లప్పుడూ చదువు, చదువు. తెల్లవారకట్ల 2 గంటలయేవరకూ ఆమె వ్రాయడమో, చదవడమో చేస్తూనే ఉండేదట!

1895 లో "కార్మిక విముక్తిసంఘం" అనే పేరుతో ఒక సంస్థ స్థాపించబడింది. అందులో లెనిన్ ఒక సభ్యుడు. క్రూప్‌స్కయా అనే యువతి కూడా అందులో చేరింది క్రూప్‌స్కయా 1890 ప్రాంతంలో చదువు విడిచిపెట్టి, తీవ్రవాదులతో సంబంధం ఏర్పరచుకొంది. మార్క్స్ వ్రాసిన పుస్తకాలు చదివింది. తరువాత పీటర్స్‌బర్గ్ నగరంలో (ఇప్పుడు లెనిన్‌గ్రాడ్) కార్మిక విద్యాలయంలో ఒక ఉపాధ్యాయినిగా పనిచేసింది. ఆమెవద్ద చదువుకున్న చాలమంది విద్యార్థులు రష్యన్‌విప్లవోద్యమంలో ఉత్తమస్థానా లలంకరించారు. కొంతకాలానికి ప్రభుత్వం క్రూప్‌స్కయాను అరెస్టుచేసి, 3 సంవత్సరాల ప్రవాసశిక్ష విధించింది. ఆ రోజుల్లో లెనిన్ సైబీరియాలో ప్రవాసం అనుభవిస్తూ ఉండేవాడు. ఈమె కూడా సైబీరియా

వెళ్ళినప్పుడు లెనిన్‌తో పరిచయంఏర్పడింది. తరువాత ఇద్దరూ ప్రేమించుకొని పెండ్లిచేసుకున్నారు. లెనిన్ విడుదలకాగానే, జర్మనీకి ముఖ్యపట్టణమైన మ్యూనిక్ వెళ్ళి, "స్పార్క్" (నిప్పురవ్వ) అనే పత్రికను స్థాపించినప్పుడు క్రూప్‌స్కయా కూడా పత్రికా కార్యాలయంలో ప్రవేశించి, సంపాదకవర్గానికి కార్యదర్శిగా పనిచేసింది.

రష్యన్ కార్మికోద్యమం ఎక్కువౌతూన్నకొద్దీ స్త్రీలు సమ్మెలు మొదలైన కార్యక్రమంలో విరివిగా పాల్గొని, అనేక హక్కులు సంపాదించుకున్నారు. ఉదాహరణకు, స్త్రీలు-పిల్లలు రాత్రికాలంలో పనిచేయరాదనే చట్టం ప్యాసయింది. బట్టల పరిశ్రమయందలి స్త్రీ కార్మికులు యీ పోరాటాలకు నాయకత్వం వహించారు.

1905 లో ఒకరోజున వేలకొద్దీ సమ్మెదారులు బ్రహ్మాండమైన ఊరేగింపుతో జార్ చక్రవర్తి వద్దకు రాయబారం వెళ్ళారు. వారొక అర్జీని అందజేయాలని ప్రయత్నించారు. కాని, సైనికులు వారిపై తుపాకులు కాల్చారు దానితో, ప్రభుత్వంమీద ప్రజలకుగల కొద్దివిశ్వాసం మాయమైంది. వీధి పోరాటాలు ప్రారంభమయాయి. కెరెలినా అనే ఒకకార్మికస్త్రీ తనతోటి స్త్రీలను యీ విధంగా హెచ్చరించింది: "తల్లులారా! అక్కలారా! మీ భర్తలుగాని, అన్నదమ్ములుగాని, యీ ధర్మ యుద్ధంలో పాల్గొనబోతూంటే, వారిని మీరు ఆపవద్దు. మీరుకూడా వారితోకలిసి రండి! ప్రభుత్వం మనల్ని తుపాకులతో కాలిస్తే విచారపడకండి. ధర్మం జయించితీరుతుంది." అక్కడ సమావేశమై యున్నవారంతా ఒక్కగొంతుకతో "మేమందరం మీతో వస్తున్నాం!" అని జవాబు చెప్పారు. షుమారు వేయిమంది ప్రాణాలు తుపాకి గుండ్లకు బలి అయాయి. వారిలో అనేకమంది స్త్రీలు, పసిపాపలు ఉన్నారు.

స్మిదోవిచ్ అనే ఆమె లెనిన్ పత్రికా కార్యాలయంలో కార్యదర్శిగా ఉండేది. ఆమె ఒడెస్సా తిరుగుబాట్లకు నాయకత్వం వహించింది. కీవ్‌లో ఆమెను పోలీసులు "ఇస్క్రా" పత్రిక కాపీలతో అరెస్టుచేసి, స్టేషన్‌లో నిర్బంధించారు. బయటికి వెళ్ళొస్తానని పోలీసుల అనుమతి తీసుకొని,

లోపలికెళ్ళింది చటుక్కున దుస్తులు మార్చుకొంది. పూర్తిగా మారిపోయిన వేషంతో బయటికొచ్చింది. ఈమెను యెవరూ అనుమానించలేదు. చకచక బయటికి విసురుగా నడిచి వెళ్ళిపోయింది. ఈ విధంగా ఆమె నిర్బంధంనుంచి తప్పించుకొని పారిపోయింది.

లెనిన్ ఒక సందర్భంలో యిలా చెప్పాడు :

" పెట్రోగ్రాడ్‌లోను, మాస్కోలోను, కార్మికులుండే ప్రతిపట్టణంలోను, పల్లెలోను, స్త్రీలు కఠిన పరీక్షలకు నిలబడి, విప్లవంలో అద్భుతంగా పనిచేశారు. వారి సహాయంలేనిదే మనం గెలిచేవారం కాము. గెలిచినా, పేరుకు మాత్రం గెలిచియుండేవారం. ఎంత ధైర్యంతో వారు పోరాడారు ! ఇప్పటికీ యెంతధైర్యం ఉంది వారిలో ! వారు భరించిన బాధలు యిన్నీ అన్నీనా ? ఎందుకు వారన్ని త్యాగాలు చేశారంటే, వారి ఆశయం సోవియట్ ప్రభుత్వస్థాపన ! వారిలక్ష్యం కమ్యూనిజం. "

ఈ విధంగా రష్యన్ స్త్రీలు తమ రక్తాన్ని ధారపోసి, పురుషులతో బాటు సమానంగా త్యాగాలుచేసి, విప్లవానికి తోడ్పడ్డారు. చివరకు గెలుపొందారు. స్త్రీలు ఆత్మార్పణద్వారా పురుషులతో సమానమైన గౌరవప్రతిపత్తిని సంపాదించుకున్నారు

స్త్రీలను గురించి కారల్‌మార్క్స్ యిలా చెప్పాడు : "రాజకీయాలలో గాని, ప్రజలకు సంబంధించిన ఏ విషయంలోగాని, స్త్రీలు పురుషులతో సమానంగా తమ బాధ్యతలను నిర్వర్తించకపోతే, సోషలిజంమాట అటుంచి, సామాన్యమైన ప్రజాస్వామ్యం కూడా యేర్పడదు."

ఈ సూత్రాన్నే 1936 లో సోవియట్ రాజ్యాంగ చట్టం అంగీకరించింది. 22 వ నిబంధనలో యిలా ఉంది : " ఆర్థిక జీవనంలోను, రాజ్యాంగ నిర్మాణంలోను, వైజ్ఞానిక విషయాలలోను, సామాజిక హక్కులలోను, రాజకీయాభివృద్ధిలోను సోవియట్ యూనియన్ స్త్రీలకి పురుషులతో సమానమైన స్థానాన్నిస్తోంది......... ఈ హక్కులు నిత్యజీవితంలో కొనసాగించుకొనుట కవసరమైన అవకాశాల్ని కల్పించింది. పనిచేసి స్వతంత్ర జీవనం గడపడానికి స్త్రీలకు సమానహక్కు లుంటాయి. చేసిన

పనికి స్త్రీ-పురుషులకు సమానంగా జీతాలిస్తారు. విశ్రాంతికీ, ఉచిత భీమా పద్ధతికీ స్త్రీలు కూడా పురుషులతో సమానమైన హక్కుదారులు. విద్య విషయంలో కూడా వారికి సమానహోదా ఉంటుంది. మాతాశిశువుల రక్షణకై ప్రభుత్వం అన్నియేర్పాట్లు చేసింది. గర్భవతికి జీతంతో సెలవులిస్తారు. అనేక 'ప్రసూతి నిలయాలు,' నర్సరీస్కూళ్ళు, కిండర్ గార్డెన్లూ ఉంటాయి ".

సోవియట్ స్త్రీలు కొత్తగా సంపాదించుకున్న యీ హక్కుల్ని, స్వాతంత్ర్యాన్ని, వినియోగించుకోవడానికి సోషలిస్టు నిర్మాణాన్ని బలపరుస్తున్నారు. ఫ్యాక్టరీలలోను, ఆఫీసులలోను పనిచేయడానికి లక్షలాది స్త్రీలు గుమిగూడుతున్నారు. ప్రతి సోవియట్ పరిశ్రమలోను, ప్రతి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోను, స్త్రీలు చాకచక్యంగా పనులు చేస్తున్నారు. ప్రతి వృత్తిలోను, ప్రతి ప్రభుత్వ శాఖలోను, స్త్రీలు బాధ్యతతో పనిచేస్తున్నారు.

## లెనిన్ కృషి

స్త్రీలకు యీ విధంగా రాజ్యాంగ చట్టంలోను, నిత్యజీవితంలోను, లభించిన స్వాతంత్ర్యానికి లెనినే చాలావరకు కారణమని చెప్పాలి. తన కుటుంబ జీవితంలో అతడు స్త్రీకి గౌరవమైన స్థానం యిచ్చాడు.

క్రూప్స్కయా ఆదర్శవంతమైన భార్య. భర్త రోజల్లా పనిచేసి యింటికొచ్చినప్పుడు, అతని కామె ఉపచర్యలుచేసి విశ్రాంతి నిచ్చేది. భర్త అనేక రాజకీయ సమస్యలపై దృష్టిని కేంద్రీకరించి పనిచేయడానికి, యింటిపనులన్నీ తనే స్వయంగా చూచుకునేది.

లెనిన్ కూడా క్రూప్స్కయా విషయంలో చాలా శ్రద్ధ తీసుకొనేవాడు. తను ఒక చిన్నలైబ్రరీగదిలో కూచుని రాసుకొంటూంటే, క్రూప్స్కయా ప్రక్కనే ఉన్న వంటయింట్లో పనిచేసుకుంటూ ఉండేది. ఒక్కొక్కప్పుడామె యింట్లో ఏదో సరుకయిపోయిందని తనలో తాను గొణుక్కుంటూంటే, లెనిన్ ఆ మాటలు వినేవాడు వెంటనే వంటయింటి కెళ్ళి భార్యతో యిలా అనేవాడట: " ఇదుగో, ఇప్పుడే వెళ్తున్నాను బజారుకి; సరుకు అయిపోయిన విషయం నాతో ముందే ఎందుకు చెప్పావుకావు ?"

క్రూప్స్కాయా తల్లి కొకసారి జబ్బుచేసింది. లెనిన్ ఆమె విష యంలో చాలా శ్రద్ధతీసుకుని చికిత్స చేయించాడు. డాక్టర్ని పిలవడం, మందులు తీసుకురావడం, — యివన్నీ స్వయంగా చేసేవాడు. ఆమెను ఓదారుస్తూ, ధైర్యంగా ఉండమని హెచ్చరించేవాడు. "జబ్బు చేసినప్పుడు మొట్టమొదట జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయం గుండెనిబ్బరాన్ని కాపాడు కోవడం" అని తరచు ఆమెకు చెబుతూ ఉండేవాడు. తాను కూడా అప్పుడప్పుడు అనారోగ్యంతో బాధపడినప్పుడు యీ సూత్రాన్నే తనకు వర్తింపజేసుకునేవాడు.

క్రూప్స్కాయా పట్ల లెనిన్, లెనిన్‌పట్ల క్రూప్స్కాయా, ఎంతో అనురాగంతో మెలగేవారు. సోషలిస్టు సమాజంలో కుటుంబజీవితం ఎంత ఆదర్శప్రాయంగా ఉంటుందో తెలుసుకోవాలంటే, ఈ దంపతుల అన్యోన్య ప్రేమ తార్కాణం. లెనిన్ ఏ ఆదర్శాలకై ఎడతెగకుండా పాటుపడ్డాడో, ఆ ఆదర్శాలలో క్రూప్స్కాయాకు కూడా భాగం ఉండేది. అతని జీవిత మందలి ప్రతిముఖ్యమైన ఘటనతో ఆమెకు సంబంధముంది. లెనిన్ తన భార్యతో కలసి షికారు వెళ్ళేవాడు; ఆమెతో అనేక సమస్యలు చర్చించే వాడు; ఆమెతో కలిసి ప్రశాంతమైన గ్రామసీమలకు వెళ్ళి వస్తూ ఉండేవాడు.

క్రూప్స్కాయా Thyroid తో బాధపడిన రోజులలో లెనిన్ ఆమెకు చేసిన ఉపచర్యలు ఇన్నీ అన్నీకావు. ఇంటిపనులన్నీ తనే చేసేవాడు. నిపుణులైన డాక్టర్లచే చికిత్స చేయించేవాడు. జబ్బుకు సంబంధించిన ప్రతి లక్షణాన్ని పరిశీలించేవాడు. చికిత్సచేసే పద్ధతు లాలోచించేవాడు.

భార్యాభర్తల ప్రేమకు లెనిన్ దంపతులొక ఆదర్శం అనిచెప్పాలి.

చిన్నతనంలో లెనిన్ తన తల్లిపట్ల చూపినప్రేమ ఎన్నదగిన విషయం. తానెన్ని పనులలో మునిగియున్నప్పటికీ, తల్లికి జాబులు వ్రాయడంలో అశ్రద్ధ చేసేవాడుకాదు. తరుచు పెద్దపెద్ద జాబులు వ్రాసే వాడు. నిద్రమానుకొని కూడ వ్రాసేవాడు.

ఒకసారి లెనిన్ తల్లి లెనిన్ స్నేహితులవద్ద కొంతడబ్బు వసూలు చేసి, అతనికొక సైకిలు, క్రూప్స్కయా కొకసైకిలు, కొని పంపించిందట. ఇవి చూచుకొని, లెనిన్ సంతోషంతో ఉప్పొంగిపోయాడట. "ఆయనకు తల్లి అంటే విపరీతమైన ప్రేమ. సైకిళ్ళు రెండూ చూడగానే ఆయన ఆశ్చర్యానికి హద్దులేదు." అని క్రూప్స్కయా వ్రాసింది.

ఆధునిక యుగంలో లెనిన్ కున్నంతటి కుశాగ్రబుద్ధి యే రాజ్యాంగ వేత్తకూ లేదని చెప్పాలి. కాని, దీనితోబాటు లెనిన్‌ది కోమలహృదయం. ఇందువల్లనే లెనిన్ స్త్రీల ప్రత్యేక యిబ్బందుల్ని గురించి, వారి సమస్యల్ని గురించి, యితరులకంటే శ్రద్ధగా ఆలోచించేవాడు.

"నిత్యమూ రెక్కలు విరుచుకొని పనిచేసే కార్మికులు సహితం తమతోటి స్త్రీలకెలాంటిసౌకర్యాలు కల్పించి, వారి శ్రమను తగ్గించవచ్చునో ఆలోచించరు" అని లెనిన్ క్లారాజెట్కిన్‌కి వ్రాసిన ఒకవుత్తరంలో విచారించాడు. వంటయింట్లోను, బయటి ప్రపంచంలోను స్త్రీని విముక్తి చేయడానికతడు మొదటినుంచీ పాటుపడ్డాడు.

## స్త్రీల ప్రత్యేక యిబ్బందులు

స్త్రీల శరీర ప్రకృతికీ, పురుషుల శరీర ప్రకృతికీ వున్న భేదంవల్ల స్త్రీల ప్రత్యేక యిబ్బందులేవో లెనిన్‌కి తెలుసు. బిడ్డల్ని కని పెంచవలసింది స్త్రీలు. నెలకొకసారి వారి శరీరారోగ్యం, మానసిక బలం మందగిస్తాయి. గర్భందాల్చినప్పుడు వారి ఆరోగ్యం మరింత సన్నగిలుతుంది. ఇంటిపనులు నిర్వహించడంలో ఎన్ని యిబ్బందులుంటాయో, పిల్లల్ని పెంచడంలో ఎన్ని చిక్కులుంటాయో చెప్పనవసరంలేదు. కుటుంబాన్ని పోషించే భర్త అకస్మాత్తుగాగాని, అనారోగ్యం వల్లగాని చనిపోతే ఆర్థికంగా భార్య, పిల్లలు ఎన్ని యమయాతనలు పడాలో లెనిన్ అనేక కార్మిక కుటుంబాలలో స్వయంగా చూచాడు.

కాబట్టి, లెనిన్ మొదటినుంచీ స్త్రీ స్వాతంత్ర్యంకొరకు పట్టుదలతో పనిచేశాడు. ప్రతి స్త్రీ స్వయంగా పనిచేసి స్వతంత్రంగా జీవించడానికి

అవకాశ మిచ్చాడు. బిడ్డల్ని కనే కాలంలో జీతంమీద సెలవు, ప్రసూతి సహాయం యిప్పించాడు. స్త్రీ పనిచేసే కాలంలో బిడ్డల రక్షణకు క్రెచీలు, నర్సరీ స్కూళ్ళు, పెట్టించాడు. ఆడుకునే పిల్లలకు ఆటస్థలా లేర్పాటు చేశాడు.

వీటితోబాటు యితర విషయాలలోకూడా స్త్రీకి స్వాతంత్ర్యం లభించింది. పెళ్ళిచేసుకోడానికిగాని, చేసుకోక పోడానికిగాని, స్త్రీ స్వేచ్ఛను కలిగియుంది. పెళ్ళి చేసుకున్నాక విడాకులివ్వడానికి కూడా స్త్రీకి స్వేచ్ఛవుంది. కాని, రష్యాలో విడాకుల పద్ధతిని ప్రజలు ప్రోత్సహించరు. విరశిస్తారు. ఎక్కువ ప్రాధాన్యత కుటుంబ జీవితానికిస్తారు. ఉదాహరణకు: భార్యాభర్తలు వేరైనప్పుడు బిడ్డను విడిచిపెట్టిన తల్లిగాని, తండ్రిగాని ఆ బిడ్డ పోషణకై తన జీతంలో నాలుగోవంతు సొమ్ము యిచ్చివేయాలి ఇద్దరు పిల్లలున్నట్లయితే మూడోవంతు సొమ్ము పంపించాలి. ముగ్గురుగాని, ముగ్గురికంటె ఎక్కువమందిగాని పిల్లలున్నట్లయితే సగంజీతానికి నీళ్లొదులుకోవాలి. ఇది సోవియట్ ప్రభుత్వం విధించిన నిబంధన. అందువల్ల సాధారణంగా భార్యగాని, భర్తగాని చీటికీమాటికీ విడాకులిచ్చుకోరు. ఎక్కువ పిల్లలుండే కుటుంబాల్ని ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. 6 గురుకంటె ఎక్కువ పిల్లలున్న స్త్రీకి ప్రభుత్వం ఏడాదికి 2,000 రూబుల్సు చొప్పున కొత్తగా పుట్టే ప్రతిబిడ్డకు యిస్తుంది. ఇలాగే, 10 మందికంటె ఎక్కువ పిల్లలు ఉన్నస్త్రీకి ప్రభుత్వం 5,000 రూబుల్సు చొప్పున కొత్తగా పుట్టే ప్రతిబిడ్డకు యిస్తుంది.

స్వేచ్ఛాప్రవర్తనను లెనిన్ అసహ్యించుకునేవాడు. కొందరు దీన్ని సమర్థిస్తూ, మనిషి తన ఉద్రేకాల్ని సంతృప్తిపరచుకోవడంలో తప్పేమీ లేదనీ, గ్లాసుతో మంచినీళ్ళు తాగి దాహం తీర్చుకోవడంవంటిదేననీ, వాదించేవారు. అట్టివారిని అతడు కఠినంగా మందలించేవాడు. "మనిషి సర్వసామాన్యంగా, మామూలు పరిస్థితుల్లో, మురికి గుంటల్లో పడుకొని, ఆ మురికినీరే తాగుతాడా? అనేక ఎంగిలి నోళ్ళతో మలినమైన అంచును నోట్లో పెట్టుకుంటాడా?" అని అతడు ప్రశ్నించేవాడు.

# స్వేచ్ఛా ప్రవర్తనకు స్థానం లేదు

లెనిన్ అభిప్రాయాలే దేశంలో వ్యాపించాయి. స్వేచ్ఛాప్రవర్తనకు రష్యాలో నేడు స్థానంలేదు నిజం చెప్పాలంటే, రష్యాలో కామవాంఛను పురిగొల్పే ఘటనలుగాని, చిత్రాలుగాని, సినీమాలుగాని లేవు. బజార్లలో రహస్యంగా గాని, బహిరంగంగా గాని బూతుబొమ్మలు అమ్మి, డబ్బు సంపాదించేవాణ్ణి చూస్తే అందరూ మొహంమీద ఉమ్మివేస్తారు. ప్రభుత్వం శిక్ష విధిస్తుంది. దిగంబర నృత్యాలతో యువకుల్ని, యువతుల్ని ఆకర్షించే సినీమాలకు ప్రభుత్వం లైసెన్సు యివ్వదు. ఆడపిల్లలకు మంచి శరీర దారుఢ్యం ఉంటుంది. రోడ్డుమీద నడిచివెళ్తూన్నప్పుడు ఎవడైనా తుంటరి వెటకారంచేస్తే, మళ్ళీ యెప్పుడూ మరచిపోకుండా ఆమె లాగి కొడుతుంది.

చిన్నప్పటినుంచీ క్రమశిక్షణతో పెరగడంవల్ల, రోజంతా ఆరోగ్య కరమైన వాతావరణంలో కాలం గడుపుతూండడంవల్ల, ప్రతివ్యక్తీ ఏదో ఒక ఉన్నతాదర్శం కొరకు పనిచేస్తూండడంవల్ల, మనస్సు వక్రమార్గాలలో పరుగెత్తదు. కామవాంఛకు సాధారణమైన పరిస్థితుల్లో ఎంతస్థానం ఉండాలో, అంతస్థానం మాత్రమే ఉంటుంది. నిగనిగలాడే మొగంచూచి పెళ్ళిచేసుకొని, కొన్నాళ్ళనుభవించాక విరక్తిచెంది, ఒకరి అభిప్రాయాలకూ - మరొకరి అభిప్రాయాలకూ పడక, వెంటనే విడాకులిచ్చుకొనే పద్ధతి రష్యాలో అరుదు. స్త్రీ పురుషులు తమ ఆశయాలు, అభిప్రాయాలు, కోరికలూ కలిసినప్పుడే పెళ్లి చేసుకుంటారు. పెళ్ళిచేసుకున్నాక కుటుంబజీవనంలో ఎంత హాయి అనుభవించగలరో అంతా అనుభవిస్తారు. ముఖ్యంగా బిడ్డ కుటుంబంయొక్క ఐక్యతను కాపాడుతుంది. ఎందువల్లనంటే, బిడ్డ పోషణకు భార్యాభర్త లిద్దరూ బాధ్యతవహించాలి.

రాజ్యాంగ విషయాలలో కూడా స్త్రీ పురుషునితో సమాన హోదాను కలిగి యుంటుంది. సోవియట్ యూనియన్ యొక్క సుప్రీమ్ సోవియట్ లో 189 గురు సభ్యులు స్త్రీలే. ప్రపంచంలో ఏ దేశంయొక్క శాసనసభ లోను స్త్రీల నిష్పత్తి యింత ఎక్కువగాలేదు. చాలామంది స్త్రీలు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ట్రాక్టర్ డ్రైవర్లుగాను, స్కూలు మాష్టర్లుగాను,

పనిచేస్తున్నారు. న్యాయస్థానాలలో స్త్రీ జడ్జీలు పురుషులతోబాటు తీర్పు లిస్తారు. తమ తమ స్థానాలలో ఉండి ప్రజాసేవ చేస్తున్నామనే విశ్వాసంతో స్త్రీలు ప్రభుత్వశాఖలలో ఉద్యోగాలు చేస్తారు. నిజాయితీగాను, నిష్పక్ష పాత బుద్ధితోను, వారు తమ పనులను నిర్వహిస్తారు.

## స్త్రీల వైజ్ఞానికాభివృద్ధి

మానసికంగాను, వైజ్ఞానికంగాను, కూడా స్త్రీఅభివృద్ధి కావడానికన్ని అవకాశాలు కల్పించబడ్డాయి. స్కూళ్ళలోను, కాలేజీలలోను, పురుషులతో సమానమైనఅవకాశాలు స్త్రీలకు యెలా ఇవ్వబడుతున్నాయో పైన చూచాం. ఇంతేగాక, పనిచేసే గంటలసంఖ్య బాగా తగ్గింది. ఆధునిక యంత్రాల సహాయంతో పనిచేయడంవల్ల పని తేలిక అయింది. జీతాలు కూడా యెక్కువ. ఇంట్లో నానాఅవస్థలు పడుతూ బానిసజీవితం గడపవలసిన అవసరంలేదు. పనిచేసేటప్పుడు నిపుణులు బిడ్డల్ని క్రెచీలలో చక్కగా పెంచుతారు. ఈ కారణాలన్నింటివల్ల సోవియట్ స్త్రీలు మానసికంగాను, వైజ్ఞానికంగాను, అభివృద్ధి పొందడానికవకాశాలున్నాయి. ఈ అవకాశాల్ని వారు వినియోగించుకొంటున్నారు కూడా. చదువు నేర్చుకోవడంలో స్త్రీలు అందరికంటె ముందుకు రావడంవల్లనే, ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనంతటి విద్యావ్యాప్తి యీరోజున రష్యాలో చూడగలుగుతున్నాం. వయస్సుచెల్లిన స్త్రీలు సహితం పలక, బలపం తీసుకొని, అక్షరాలు నేర్చు కోడానికెంతో ఆతృత చూపిస్తారు.

స్త్రీలకు ప్రత్యేకంగా పత్రికలున్నాయి. వాటికి కార్మిక స్త్రీలు, రైతు స్త్రీలు, విద్యార్థినులు, అన్ని వయసులవారు, అన్ని జాతులవారు వ్యాసాలు రాస్తారు. ఈ పత్రికలు చదివితే, సోవియట్ స్త్రీ యెంత స్వతంత్రంగా ఆలోచించగలదో, తన రచనలలో ఎంత నైపుణ్యం కనపరచగలదో, తెలుస్తుంది. పాటలు, పద్యాలు కథలు, నాటికలు– అన్నీ కుప్పకుప్పలుగా కార్యాలయాలకు వస్తూ ఉంటాయి. ఉత్తరధృవ ప్రాంతంలో ఆర్కేంజల్ ప్రాంతాన మేరియా క్రివాపోల్యనోవా అనే వృద్ధ స్త్రీ తన జాతీయభాషలో శ్రావ్యంగా జానపదాలు పాడుకుంటూ గ్రామగ్రామానికి తిరిగేదట. ఆమెను

# సోవియట్ యూనియన్‌లో స్త్రీలు

## 1938 లెక్కల ప్రకారం వేర్వేరు వృత్తులలో ఎంతెంతమంది పాల్గొన్నారు:




## 1937 లెక్కల ప్రకారం కార్మికుల సంఖ్య



సోవియట్ ప్రభుత్వం పైకి తీసుకొచ్చి, ప్రోత్సహించుతోంది. పెద్దపెద్ద పట్టణాలలో లక్షలాదిజనం మేరియా పాటలువిని, ఉప్పొంగుతారట.

ఇలాగే యితర లలితకళలలో కూడా స్త్రీలు ప్రావీణ్యత సంపాదిస్తున్నారు. శిల్పకళ విషయం చెప్పాలంటే, స్త్రీలు చెక్కిన విగ్రహాలు పురుషులు చెక్కినవాటికంటె యెక్కువ ఉత్తేజకరంగా ఉంటాయని ప్రతీతి.

## కుటుంబ జీవనం అనేకరెట్లు సంతోషకరం

స్త్రీకి సర్వతోముఖంగా లభించిన యీ స్వాతంత్ర్యం కుటుంబ జీవనాన్ని అనేకరెట్లు సౌఖ్యవంతంగా చేసింది. భార్య తన భర్తతోను. బిడ్డలతోను, కులాసాగా కాలక్షేపం చెయ్యడానికి తగినంత వ్యవధి చిక్కింది. సాంఘిక - రాజకీయ ప్రదర్శనాలలో స్త్రీ పాల్గొంటుంది. బుద్ధి కుశలతతో కూడిన పనులెన్నో చేస్తుంది. భర్తయొక్క మానసిక జీవితంలో సహధర్మచారిణిగా వుంటుంది. అతనుచేసే పనుల్నిగురించి తెలుసుకొంటూ అతనికి సహాయంచేస్తుంది. బిడ్డల్ని నైతికంగాను, సాంఘికంగాను, అభివృద్ధిచేయడానికి పాటుపడుతుంది. ప్రతిబిడ్డను ఉత్తమమైన పౌరునిగా తయారుచెయ్యాలని ఆమె సహజంగాకోరుతుంది. ఈవిధంగా సోవియట్ స్త్రీ ఏదో ఒక ఆశయంతో, ఏదో ఒక ఉన్నతలక్ష్యంతో జీవించుతుంది. వంట వండడానికి, అంట్లు తోమడానికి, భర్తచెప్పిన ప్రతిపనినీ గుడ్డిగా ఆచరించడానికి స్త్రీ పుట్టలేదని ఆమె తెలుసుకుంది. ఇంతేకాదు: ప్రపంచ మానవులందరూ సుఖపడ్డానికి అవకాశంయిచ్చే సోషలిజాన్ని నిర్మించడంలో తనకర్తవ్యాన్ని నిర్వహిస్తోంది. రష్యాలో పడుపువృత్తి నిషేధించబడింది. వేశ్యాగృహాలు నడిపేవారిని అక్కడతుపాకితో కాల్చి చంపుతారు. ఇంతకంటే ముఖ్యం ఏమంటే ఈవృత్తిని అందరూ నీచంగాచూస్తారు. ప్రతిస్త్రీకిఆర్థిక స్వాతంత్ర్యం లభించినప్పుడు పడుపువృత్తియొక్క అవసరం ఏమిటి?



సోవియట్ యూనియన్ లో తల్లులు ఆరోగ్యవంతమైన తమబిడ్డలతో గర్విస్తున్న దృశ్యం

# సోవియట్ స్త్రీ ఆదర్శవంతమైన పతివ్రత

కేవలం వంటకత్తెగా ఉన్నంతమాత్రాన సోవియట్ రష్యాలో స్త్రీ గౌరవించబడదు. పౌరజీవితంలో ఎంత యెక్కువ బాధ్యతల్ని నిర్వహిస్తే స్త్రీకి అంతయెక్కువ గౌరవం యిస్తారు. ఇలా పెరిగిన స్త్రీ క్రిమేణా ఆదర్శవంతమైన పతివ్రతగాను, పూజించదగ్గ తల్లిగాను గౌరవించబడుతుంది. ఇట్టి స్త్రీ భార్యగావుండడం తన అదృష్టమని భర్త ఉప్పొంగుతాడు. తనకంటె యెక్కువ నైపుణ్యంగల భార్యతో కాపురంచేయడానికి భర్త గర్విస్తాడు. ఒక్కొక్కప్పుడు భర్త లోపాలు భార్యకుతెలిసినప్పుడు ఆమె సానుభూతితో ఓదార్చి, భర్తను సరియైన మార్గంలో నడపడం దాంపత్య సౌఖ్యానికి యెంతో దోహదమిస్తుంది.

రష్యాలో పురుషుడు నిజంగా గొప్పవాడై తేగాని, తన భార్యయెదుట కూడా గొప్పగా ప్రవర్తించలేడు. భర్త ఆదర్శవంతంగా వుండటానికి భార్య ఒక ములుకర్రవంటిది.

# 3. వివిధ జాతుల స్త్రీలు

సోవియట్ యూనియన్‌లో రష్యన్‌జాతి ప్రజలేగాక, షుమారు 150 జాతులవారున్నారు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క సాంప్రదాయం, ఒక్కొక్క భాష, ఒక్కొక్క ఆచారంవుంది. తూర్పున, ఉత్తరాన, దక్షిణాన నివసించే జాతుల స్త్రీలు విప్లవానికి పూర్వం రష్యన్ స్త్రీలకంటె అధ్వాన్నమైన స్థితిలోవుండేవారు. తూర్పు ప్రాంతాలలో స్త్రీ పశువుకంటె హీనంగా చూడబడేది. ఆమె యింట్లోనేకాదు; సంఘంలోకూడ ఒక బానిస అవిచెప్పాలి. ఆమెపై భర్తకు సర్వాధికారాలు ఉండేవి. ముస్లిం స్త్రీలస్థితి మరీ ఘోరం! పురుషుని కామవాంఛను తీర్చడానికే స్త్రీపుట్టిందని అక్కడి ప్రజల విశ్వాసం. అందువలన స్త్రీని పరమనీచంగా చూచేవారు. ఇంట్లో ఆమెనుఒక మూలగదిలో నిర్బంధించియుంచేవారు. ముసుగులేకుండా ఆమెపురుషునికి కనపడకూడదు.

కాకేసస్ ప్రాంతంలో నివసించే ముసల్మానులు స్త్రీని అపవిత్రురాలుగా పరిగణించేవారు. వివాహసమయంలో పురుషుడు తన చేతిచుట్టూ ఒక గుడ్డచుట్టుకొని, తరువాత పెండ్లికూతురు చేతిని స్పృశిస్తాడు. అలా గుడ్డ కట్టుకోకపోతే, తన చెయ్యి మలినమౌతుందిట! ఇంట్లో ఏస్త్రీ అయినా చనిపోతే ఆమెకొరకు పురుషుడు దిగులుపడినట్లు కనపడకూడదు. గర్భిణీ స్త్రీ రెండు వారాలలో ప్రసవిస్తుందనగానే ఆమెను దూరంగా ఒక చిన్న గుడిసెలో పడుకోబెట్టేవారట. అందులోకి గాలిగాని, వెలుతురుగాని రాదు. చుట్టూ ప్రదేశం మంచుతో నిండియుంటుంది. అయినా, ఆ ఇంట్లో ఎవరూ కుంపటిగాని, పొయ్యిగాని వెలిగించకూడదు. ఇంతేకాదు; ఆమెతో ఎవరూ మాట్లాడరు. ఆహారంమాత్రం ఒక చిన్న రంధ్రంలోనుంచి పంపుతారు.

పశువులుసహితం విప్పుసెగలో యీనుతాయి. కాని స్త్రీ అందుకు నోచుకోలేదు.

ఉత్తరప్రాంతంలో యాకూషియాజాతి ప్రజలున్నారు. అక్కడ స్త్రీ మరీ దారుణపరిస్థితుల్లో నివసించేది. ఒక కుటుంబీకుని యింటికి ఒక నాడు కొందరు అతిథులొచ్చారట. ఆ కుటుంబానికి పెద్ద అయిన ఆసామి అతిథుల్ని సత్కరించడానికి తన కూతుర్ని ఒకచోట నిలబెట్టి, ముక్కలు ముక్కలుగా మాంసంకోసి, వండిపెట్టాడట. ఆ స్త్రీయొక్క త్యాగాన్ని యాకూషియన్ ప్రజలెంతో ప్రశంసించేవారట! ఈ ఒక్క గాథనుబట్టి తెలుసుకోవచ్చు, యాకూషియన్ స్త్రీయొక్క జీవితం ఎలావుండేదో!

అజర్‌బైజాన్‌లో మగబిడ్డపుట్టితే, ఉయ్యాలదగ్గర ఎప్పుడూ ఎవరో ఒకరుండి కనిపెట్టిచూచేవారు. ఆడబిడ్డ పుట్టితే, అటువైపు పోయేవారే ఉండరట. వెక్కివెక్కి యేడుస్తున్నప్పటికీ ఆబిడ్డగతి అంతే!

## మధ్య ఆసియాలో

మధ్య ఆసియాలో స్త్రీకి తొమ్మిదోయేట పెళ్ళిచేసేవారు. అంత వరకూ ఆమె ఆడుకొనే బొమ్మలు, ఆటవస్తువులు అన్నీ ఒక్కసారి లాక్కునేవారు.

"ఆడపిల్ల విదేశీ సరుకువంటిది."

"భర్తకు భార్య బానిస"

"ఆవుకు ఏ నీళ్ళకుండీలో నీళ్లుతాగాలో నిర్ణయించుకొనే హక్కు లేదు. అలాగే స్త్రీకి ఏ పురుషుణ్ణి వివాహమాడాలో నిర్ణయించుకొనే హక్కు లేదు."

ఇలాంటి సామెతలు అజర్‌బైజాన్ ప్రజలచే గౌరవించబడేవి. సంతలు జరిగేచోట మామూలు సరుకులవలె ఆడపిల్లల్నికూడా మూడేసి, నాలుగేసి రూబుల్సుయిచ్చి కొనుక్కునేవారు. లేదా, 35 పౌనుల గోధుమ పిండికి ఒక ఆడపిల్ల వచ్చేది. అమ్మినప్పుడు గుడ్డలేకుండానే అమ్మేవారు. లేదా, చుట్టూ గడ్డిచుట్టి యిచ్చేవారు.

ఎదిగినపిల్ల అయితే ఆమె విలువయింకా యెక్కువయేది. ఎందు వల్లనంటే యింట్లోను, పొలంలోను అన్నిపనులూ చెయ్యవలసింది స్త్రీ. ఉత్తర కాకేసస్, ట్రాన్స్‌కాకేషియా, అజర్‌బైజాన్, కజాక్‌స్థాన్, టర్కొమాన్, బురియత్ మంగోలియా మొదలైన ప్రాంతాలలో స్త్రీ చేసేపని మీదనే ప్రజల ఆర్థికజీవనం అంతా ఆధారపడియుండేది. కోతలుకోయడం; పిండి విసరడం; గొర్రెబొచ్చు కత్తిరించడం; చర్మాన్ని శుభ్రంచేయడం; వంట వండడం; బట్టలునేయడం - ఇవన్నీ స్త్రీచేయవలసిన నిత్యకృత్యాలు. ఇంత పనిచేసినా, ఆ శ్రమఫలితాన్ని అనుభవించేది పురుషుడు। టర్కొమాన్‌లో పెండ్లికొడుక్కి పెళ్ళిలో పొడవైన కొరడా ఒకటి కానుకగా యిచ్చేవారట. ఉజ్‌బెక్‌స్థాన్‌లో పెండ్లయిన మొదటిరోజు రాత్రినుండే భర్త మంచంమీద, భార్య కింద పడుకుంటారు. ఉదయం టీకి భార్యను లేపడానికి కాల్తో తన్ని లేపేవాడట।

ఈ ప్రాంతాలలో స్త్రీ యెప్పుడూ తన మొగం యితరులకు కనపడకుండా, పొడుగైన ముసుగు ఒకటి ధరించాలి. దానికి " పరంజా " అని పేరు. గుఱ్ఱపు వెంట్రుకలతో చేస్తారు దాన్ని. అంత పాడుకంపు మరే వస్తువుకీ ఉండదు. లోపలికి పీల్చేగాలి చెడుగాలి. అందువల్ల అనేకరోగాలొచ్చేవి.

కాబట్టి, యీ ప్రాంతాలలో స్త్రీలు రెండు విధాలుగా బానిసలు. జార్ పరిపాలనలో వీరు అణచబడ్డ జాతులకు చెందినవారు. రెండోది: తమ పురుషుల నిరంకుశత్వానికి గురి అయ్యేవారు. రష్యన్ విప్లవాన్ని గురించీ, తత్ఫలితంగా రష్యన్ స్త్రీలు పొందిన స్వాతంత్ర్యాన్ని గురించీ, వార్తలు వీరికి చేరేటప్పటికి చాలకాలం పట్టింది.

ఇక్కడి పురుషులు విప్లవోద్యమంలో తీవ్రంగానే పాల్గొని, అనేక పోరాటాలు నడిపినప్పటికీ, వారి స్త్రీలు మాత్రం విప్లవానికి దూరంగా ఉన్నారు. అక్కడక్కడ కొద్దిమంది స్త్రీలు ఉద్యమంలో పాల్గొన్నమాట నిజమేగాని, అట్టివారు బహు అరుదు.

విప్లవం వచ్చాక, స్త్రీలలో క్రమంగా విజ్ఞానం వ్యాపించింది. ప్రచారంద్వారా అనేక దురాచారాలు పోయాయి. ప్రభుత్వశాసనం కూడా చాలా వరకు యిందుకు తోడ్పడింది. ఉదాహరణకు, ఆడపిల్లల్ని అమ్మడం నిషేధించబడింది. బాల్యవివాహాలు చేసేవారిని శిక్షించ నారంభించారు. మనదేశంలో శారదా వివాహాలవలె అక్కడకూడా చట్టాన్ని మొదట్లో ధిక్కరించేవారు. కాని, క్రమేణ దురాచారాలన్నీ అంతరించాయి. ఆడపిల్లకు పెండ్లియీడు 16 సంవత్సరాలని శాసనం చేయబడింది. రష్యాలో మాత్రం 18 సంవత్సరాలు. ఎందువల్లనంటే, తూర్పు ప్రాంతాలలో శరీరతత్వం వేరు, పడమటి ప్రాంతాలలో శరీరతత్వం వేరు.

స్త్రీలలో మూఢవిశ్వాసాలను పోగొట్టి, విజ్ఞానం కలిగించడానికి ప్రభుత్వం అనేక క్రొత్తపద్ధతు లవలంబించింది. రష్యన్ స్త్రీలు అనేక దూరప్రాంతాలకు ప్రయాణమై వెళ్ళి, ధైర్యంతోను, చాకచక్యంతోను పని చేయ నారంభించారు. స్త్రీలకు ప్రత్యేకంగా క్లబ్బులు తెరవబడ్డాయి. మొదట, క్రొత్త న్యాయశాస్త్రం ప్రకారం స్త్రీల కీయబడిన హక్కుల్ని వివరించేవారు, తరువాత విజ్ఞానాన్ని గురించి, కళలను గురించీ బోధించేవారు. ఆఖరున దేశంయొక్క ఉత్పత్తి విధానంలో స్త్రీలుకూడా పాల్గొని, ఆర్థికంగా స్వతంత్రజీవనం గడపాలని చెప్పేవారు. ఉదాహరణకు, బాకూ పట్టణంలో మొదట సూదులుచేసే ఒక కర్మాగారం తెరువబడింది. అది క్రమంగా బట్టలమిల్లుగా అభివృద్ధి అయింది. క్లబ్బులకు స్త్రీ డాక్టర్లు స్వయంగా వచ్చి, యితర స్త్రీలతో ఆసుపత్రులలో మందులు తీసుకోమనీ, జబ్బులు మాన్పుకుంటూ ఉండవలసిందని నచ్చజెప్పేవారు.

## ఘోషాపద్ధతికి స్వస్తి

"పరంజా" కూడా క్రమేణా మాయమైంది. మొదట అనేక గ్రామాలలో యీ సమస్యపై తిరుగుబాట్లు బయలుదేరాయి. ఉజ్బెక్‌స్థాన్‌లో దీన్ని నిర్మూలించడంవల్ల 14 హత్యలు జరిగాయి. యుగయుగాలుగా ప్రజ

ల్లో పాతుకుపోయిన ఏ ఆచారాన్నైనా తొలగిస్తే తీవ్రమైన వ్యతిరేకత రాక మానదు. కాని, చివరకు ఈమూఢాచారం పటాపంచలై పోయింది. 1928వ సంవత్సరం మార్చి 8 వ తేదీని ఉజ్ బెక్ స్థాన్ స్త్రీలు " పరంజాను " మంట కలిపారు. గడ్డిమేటవలె ఒకదానిపై మరొక పరంజా కుప్పకుప్పలుగా వచ్చి పడ్డాయి. పారెఫిన్ అనే చమురు వాటిమీద పోసి. అగ్గిపుల్ల వెలిగించారు. నల్లనిపొగ ఆకాశం అంతా ఆవరించింది. షుమారు 1000 సంవత్సరాలుగా అమలులో ఉన్న యీ దురాచారం సహించరానిదైంది. అందువల్ల అగ్నికీలలకు ఆహుతి అయింది. ఈ దృశ్యాన్ని చూచి స్త్రీలు పొందిన ఆనందం యింతా, అంతా కాదు.

ఈ విధంగా తూర్పుప్రాంత ప్రజలలో బూజుపట్టిన దురాచారాలను స్త్రీలు కాలితో తన్ని పారవేశారు.

తాము కొత్తగా సంపాదించుకున్న హక్కుల్ని గూర్చి తెలుసుకోగానే, స్త్రీలు క్రియారంగంలో ప్రవేశించారు. ఉదాహరణకు, గుల్ బీబీ యొక్క గాథ తీసుకుందాం. తల్లిదండ్రులు ఆమెకు పెండ్లిచేయాలని నిశ్చయించారు. ఆమె ఎప్పుడూ చూడని ఒక వ్యక్తిని తీసుకొచ్చి, పెళ్ళిపీటల మీద కూర్చోపెట్టారు. వెంటనే, అందరి యెదుట, గుల్ బీబీ లేచి యిలా అరచింది : " ఇతనెవరో నాకు తెలియదు; అయినప్పటికీ నేను యితన్నే పెళ్ళిచేసుకోవాలని నా తండ్రి ఉద్దేశం. కాని, అది నాకిష్టంలేదు. నౌరస్ అనే ఉపాధ్యాయుణ్ణి పెళ్ళిచేసుకోవాలని నాకుంది. కాబట్టి, మా యిద్దరికీ వివాహం రిజిస్టరు చేయండి." నౌరస్ వెంటనే ప్రజల్లోనుండి ముందుకు వచ్చి, " గుల్ బీబీని నేను పెళ్ళిచేసుకుంటాను " అని ప్రకటించాడు. " పరంజా " ఒక్కసారిగా పటాపంచలయింది. స్త్రీలంతా " స్త్రీల స్వాతంత్ర్యం చిరస్థాయి అగుగాక ! " అని కేకవేశారు.

## కొత్త పరిణామం

ఈవిధంగా సోవియట్ యూనియన్‌లో స్త్రీలు ఒక్కసారిగా 10 వ శతాబ్దంనుండి 20 వ శతాబ్దంలోకి దుమికారు. పెండ్లికి పూర్వం భర్త యెవరో తెలియక బలవంతంగా పెళ్ళి అయిన బాలిక, భర్తకుటుంబంలోని



బురియత్ మంగోలియోలో, లెనిన్ సమిష్టివ్యవసాయ కమ్యూనిస్టు యువతులు

ప్రతి పురుషునికీ కాళ్లుకడుగుతూ బానిసవలె జీవితంగడిపిన యువతి, యీ రోజున మాస్కో విశ్వవిద్యాలయంలో తన భర్తప్రక్కనే కూర్చొని విద్య నభ్యసించుతోంది!

కేవలం పురుషుని కామవాంఛను తీర్చడానికే వినియోగపడిన భార్య యీ రోజున తన భర్తను "కామ్రేడ్" అని సంబోధిస్తూంది. స్త్రీ ప్రతి పరిశ్రమలోను పనిచేసి స్వతంత్రంగా జీతం సంపాదించుకొంటూంది. డబ్బుకోసం పురుషునిమీద ఆధారపడనవసరంలేదు. రాజకీయాలలోకూడా ఆమె ఉచిత స్థానాన్ని అలంకరించుతోంది. ఇదివరకెన్నడూ తలయెత్తి మాటాడని స్త్రీ నేడు గంభీరోపన్యాసాలిస్తోంది. ఇదివరకు రోజల్లా తల వంచి పనిచేయడంలో కాలాన్నిగడిపిన మహిళ నేడు విమానాలలో పైకెగిరి గాలిగుమ్మటాలలో కిందికిదిగుతోంది. మధ్య ఆసియాలో తాష్కెంటు ఒక పెద్ద పట్టణం. ఆ పట్టణ సోవియట్‌కు ఒక స్త్రీ అధ్యక్షురాలు. ఆమె కొద్ది సంవత్సరాలకు పూర్వం చదువురాని ఒక దాసీపిల్ల (పనిమనిషి). ఈవిధంగా పూర్వ ప్రపంచం అతివేగంగా మారిపోయి, కొత్త ప్రపంచం సృష్టించబడుతోంది.

బుఖారాలో ఒక స్త్రీ అక్కడి టీచర్సు కాలేజీకి ప్రిన్సిపాల్. ఆమె కూతురు 6 ఏండ్ల బాలిక ఒకరోజున తల్లిని యిలా ప్రశ్నించుతోంది: "అమ్మా! పరంజా అంటే ఏమిటే?"

కొత్తతరం పిల్లలు ఘోషా అంటే యేమో యెరుగరు.

# 4. సోవియట్ యువకులు

సోవియట్ యూనియన్ యువకుల దేశం. ఫ్యాక్టరీలు, వర్కు-షాపులు, పరిశోధనాలయాలు యువకులచే నడుపబడుతున్నాయి. మాస్కో-డైనెమోపర్కుస్సను నిర్వహించే మేనేజర్ల వయసు 30 సంవత్సరాలకు లోపు. ఉత్తర ధృవాన్ని పరిశోధించడానికి విమానాలలో ప్రయాణంచేసిన వారిలో యెక్కువమంది 25 సంవత్సరాలలోపువారే।

సోవియట్ ప్రభుత్వం యువకుల విషయంలో చేసిన, చేస్తూన్న పని యేమిటి?

బాల బాలికలు 15 వ యేట చదువు పూర్తిచేయగానే విశ్వ విద్యాలయాలలోగాని, టెక్నికల్ కాలేజీలలోగాని విద్య నభ్యసించవచ్చు: లేదా తమకేవృత్తిలో అభిరుచి వుందో అందులో సరాసరి ప్రవేశించవచ్చు.

ఉదాహరణకు: ఇంజనీరింగ్ చదవాలని ఒక విద్యార్థికోరితే, అతనొక టెక్నికల్ కాలేజీలో ప్రవేశిస్తాడు, అక్కడ ఇంజనీరింగు శాస్త్రాన్ని గురించి 2 సంవత్సరాలు చదువుతాడు. జీతం ఏమీవుండదు. 17 వ యేడు వచ్చాక ఏదైనా ఒక ఇంజనీరింగ్ పరిశ్రమలో ప్రవేశించుతాడు. వయస్సు తక్కువకాబట్టి, రోజుకి 6 గంటలకంటె అతను పనిచేయకూడదు. పనికి తగిన జీతం యిస్తారు. 18వ యేట అతను ఆ పరిశ్రమను విడచి మరొక పెద్ద టెక్నికల్ కాలేజీలో ప్రవేశించవలసియుంది. తరవాత 5 సంవత్సరాలవరకు 'థియరీ'లోనూ, ప్రాక్టికల్‌లోనూ ప్రావీణ్యత సంపాదిస్తాడు. 24 వ యేట ఇంజనీరింగ్ నిపుణుడౌతాడు.

## టెక్నికల్ విద్యార్థులకు ప్రభుత్వ సహాయం

ఇలా తరిఫీదుపొందే కాలంలో ప్రభుత్వం అతనికి ఉచితంగా భోజనవసతి, పుస్తకాలు, ప్రతినెల ఖర్చులకు కొంత సొమ్ము యిస్తుంది. విద్యార్థి డబ్బుకోసం యితరులమీద ఆధారపడనవసరం వుండదు.

# వ్యాయామం, ఆటలపోటీలు

వ్యాయామంలోను, ఆటలపోటీలలోను
స్టాండర్డు పరీక్షలలో ప్యాసైనవారిసంఖ్య

1933

465,000



1938

4,978,000













పురుషులు : 44 లక్షల 68 వేలమంది    స్త్రీలు : 5 లక్షల 10 వేలమంది

# విద్యాభివృద్ధి




1913
1940
ప్రాథమిక, ఎలిమెంటరీ పాఠశాలలలో చదివే పిల్లల సంఖ్య
78 లక్షలు
3 కోట్ల 60 లక్షలు



వృత్తి విద్యలు నేర్చుకునే విద్యార్థులు
35,800
951,900



కాలేజీలు, విశ్వవిద్యాలయాలు
71
716



కాలేజీ విద్యార్థులు
112,000
700,000

విద్యార్థికి కాలేజీలో వివిధజాతులకు చెందిన యితర విద్యార్థులతో సంబంధం యేర్పడుతుంది. ఇష్టముంటే "యువక కమ్యూనిస్టు సమితి"లో సభ్యుడుగా చేరుతాడు. రాజకీయ చర్చలలో పాల్గొంటాడు. అంతర్జాతీయ విషయాలు చర్చిస్తాడు. 18 వయేడు వచ్చేసరికి వోటింగుహక్కు, ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడేహక్కు లభిస్తుంది. సోవియట్ యూనియన్ యొక్క సుప్రీమ్ సోవియట్‌లో యీరోజున సభ్యులుగా ఉన్న 1,143 రు డెప్యూటీలలో 284గురి వయస్సు 18 — 30 సంవత్సరాల మధ్యవుంటుంది.

## ఆ ట ల పో టీ లు

చాలామంది సోవియట్ యువకులు ఆటల పోటీలలో ఉత్సాహంగా పాల్గొంటారు. ఈత కొట్టడం, గాలిగుమ్మటాలనుండి దూకడం, మంచు గడ్డలమీద జారడం, మొదలైన పందాలలో యువతీ, యువకులు విరివిగా పాల్గొంటారు. రష్యాలో 10 యేళ్ళ వయస్సునుంచీ బాలబాలికలకు గాలి గుమ్మటాల తరిఫీదు యిస్తారట! షుమారు 5 లక్షలమంది యువతీయువకులు గాలిగుమ్మటాలనుండి దూకడం నేర్చుకున్నారు.

కీవ్ నగరంలో 1937 వ సంవత్సరాన 1112 గురు యువతులు ఉన్నత విద్యను పూర్తిచేసి, 100 కి 90 మంది యింకా ఉన్నతవిద్య నభ్యసించడానికి కళాశాలలలో చేరారు. ఇంగ్లండ్‌వంటి పారిశ్రామిక దేశంలో సహితం ఇట్టి యువతులసంఖ్య 100 కి 5 లేక 6 కంటె హెచ్చులేదు.

## విద్యావ్యాప్తికి కారణాలు

ఉన్నతవిద్యపట్ల రష్యన్‌లు యెందుకింత ఉత్సాహం చూపుతున్నారు?

మొదటి కారణం: ఆర్థిక సమస్య విద్యార్థుల్ని ఎదుర్కోదు. ఇతర దేశాలలో విద్యార్థికెంత కుతూహలం ఉన్నప్పటికీ విశ్వ విద్యాలయాలలో ప్రవేశిస్తే యిచ్చుకోవలసిన జీతం వగైరాలు చాలా ఎక్కువగావుంటాయి. రష్యాలో అలాకాదు. నెలకెంత ఖర్చు అవుతుందో అంతా ప్రభుత్వమే స్టయిపెండ్‌గా యిస్తుంది.

రెండో కారణం: మన దేశంలోవలె రష్యాలో తల్లిదండ్రులు పేదరికంతో బాధపడుతూ కుటుంబపోషణకు తాము సంపాదించుకునే డబ్బుచాలక, తమబిడ్డలచేత చదువు మానిపించవలసిన గతిపట్టదు. ఎందువల్లనంటే, ప్రతి వ్యక్తికీ తనకుటుంబ పోషణకు చాలినంత జీతం గ్యారంటీగా ఇవ్వబడుతుంది. తల్లిదండ్రులు ముసలివారైతే, వారికి పింఛన్లు ఉంటాయి.

మూడవ కారణం: ఉన్నతవిద్య అంటే విద్యార్థులకుండే ఉత్సాహం: శాస్త్రవిద్యలు నేర్చుకోవాలనే అభిలాష.

మూడవ పంచవర్షప్రణాళిక పూర్తి అయేసరికి (1942) సోవియట్ యూనియన్‌లో టెక్నికల్ కాలేజీలలో మొత్తం 6½ లక్షలమంది విద్య నభ్యసించుతారని అంచనా వేయబడింది.

ఇంతకంటె వేగంగా ప్రాథమికవిద్య వ్యాప్తిచెందుతోంది. ప్రాథమిక పాఠశాలలలోచదివే విద్యార్థులసంఖ్య 7½ లక్షలనుండి 1,290,000 కు పెరుగుతుందని అంచనావేశారు.

సోవియట్ విద్యావిధానంలో ముఖ్యమైన అంశం కార్మికవర్గం యొక్క నైపుణ్యాన్ని, విజ్ఞానాన్ని అనేకరెట్లు ఎక్కువచేయడం. ప్రతి కార్మికుడు ఇంజనీర్‌గా తయారుకావాలి; శరీరపరిశ్రమ చేసేవారికీ, మానసిక పరిశ్రమ చేసేవారికీ, మధ్యగల అంతరాన్ని నిర్మూలించాలి. ఈ ఆశయాన్ని సాధించడం ఎంతో కష్టంకాదు. ఎందువల్లనంటే, దేశంయొక్క ఉత్పత్తి శక్తులన్నీ పెట్టుబడిదారుల సంకెళ్ళనుండి విముక్తి చేయబడ్డాయి. కార్మికుల్ని పీల్చి పిప్పిచేసే షాహుకార్లు లేరు. కార్మికవర్గమే అధికారంలో ఉండి, పరిపాలన కొనసాగిస్తోంది. యువక కార్మికులు ఇంజనీరింగ్ పరిశ్రమలో విరివిగా ప్రవేశించి నైపుణ్యం సంపాదించడానికి సకల అవకాశాలు ఉన్నాయి.

దీని అర్థం ఏమిటి?

దేశమంతటా పారిశ్రామిక నిపుణుల్ని తయారుచేయడమన్నమాట. అందరినీ టెక్నికల్ విద్యలో ప్రవీణులుగా చేయడమన్నమాట!



మాస్కోలో ఆటలపోటీలలో ఆరితేరిన యువతీయువకులు మాస్కో స్క్వేర్‌లో ప్రదర్శనం చేస్తున్నారు

# పరిమితిలేని అవకాశాలు

ఈ విధంగా సోవియట్ యువకుడు ఉన్నతవిద్య నభ్యసించి, చక్కని తరిఫీదు పొంది, బయటికి వచ్చునప్పటికి యెలాంటి జీవితం అతని కొరకు యెదురుచూస్తూ ఉంటుంది ?

ప్లానుప్రకారం ఉత్పత్తిజరిగే దేశాలకూ, లాభాలకోసం మాత్రమే ఉత్పత్తిజరిగే దేశాలకూ, గలభేదం యిక్కడ చక్కగా చూడగలుగుతాం.

ప్లానుప్రకారం ఆర్థికజీవనం అంతా నడుపబడే రష్యాలో ప్రతియువకుడూ తన అభిరుచినిబట్టి ఏ శాఖలో పనిచేయాలని ఉంటే, అందులో పని చేయవచ్చు. సోవియట్ ప్రభుత్వం ప్రతి యువకుని సహాయం కోరుతుంది, శాస్త్రం, కళ, విజ్ఞానం, రాజకీయం, ఆర్థికం—మొదలైనశాఖలలో యువకునికి పరిమితిలేని అవకాశాలుంటాయి. నిరుద్యోగరాక్షసి శాశ్వతంగా నిర్మూలించబడింది. యువకుని భవిష్యత్తు నిరంతరం ఆశతో నిండియుంటుంది. ప్రతివానికీ, ప్రతి శాఖలోను, స్థానం ఉంటుంది. ఉత్సాహంతో, ఆనందంతో, పనిచేయడానికి ఉన్నతమైన ఆదర్శాలుంటాయి. ఏ పనికైనా గౌరవం, శ్రమనుబట్టి ఫలితం లభిస్తాయి. ఇక రష్యాలో యువకుల ఉత్సాహానికి హద్దులేమి ఉంటాయి ?

ఇతర దేశాలలోనో ! అసలు ఉద్యోగం దొరకడమే దుర్లభం. ఒక్క ఖాళీకి పదివేల అప్లికేషన్లు ! దొరికినా, తగినంత జీతం ఉండదు. ఉన్నా, ఎప్పుడు పనికి స్వస్తి చెపుతారో తెలియదు. ఏ నిమిషంలోనైనా నిరుద్యోగి కావచ్చును. ఇలాంటి పరిస్థితుల్లో చాకచక్యంగా పనిచేయడానికి ఉత్సాహం ఉంటుందా ? చేసినప్పటికీ, తగినంత ప్రతిఫలం లభిస్తుందా ? ప్రజల కవసరమైన అనేకవస్తువులు తయారుచేయగల బుద్ధిమంతులు ఏ కంపెనీ ఏజెంట్లుగానో బజార్లపైబడి, కావలసినా, అక్కరలేకపోయినా తమకంపెనీ తయారుచేసిన వస్తువునే కొననుని ప్రాధేయపడ్డం ఎరుగమా? తమ నేర్పరితనాన్ని చంపుకొని, ఎంతమంది విద్యాధికులు పురుగులవలె రోజల్లా ఒకే పనితో కొట్టుకోవడంలేదు ?

కాని సోవియట్ యూనియన్‌లో యిలాకాదు. ఏకొద్దిమంది "అదృష్ట వంతుల"కో కాదు, ఉద్యోగాలు. ప్రతి వ్యక్తికీ ఏదో ఒక శాఖలో పని సిద్ధంగా ఉంటుంది. ఉత్పత్తి విధానాన్ని నడిపేదీ ప్రజలు; ఉత్పత్తిపై యాజమాన్యమే ప్రజల్ది. తమ కెందులో అభిరుచి ఉంటుందో, అందులో అందులో చేరి పనిచేయవచ్చు. అప్పుడే తన మానసికశక్తుల్ని పూర్తిగా వినియోగించి ఉత్సాహంగా పనిచేస్తాడు. ఉద్యోగాలకోసం ప్రతి ఆఫీసు గుమ్మం యెక్కవలసిన అవసరం ఉండదు. ఆఫీసులే యువకులకోసం వెతుక్కుంటూ ఉంటాయి! నకిలీపని ఉండదు. యువకుడు ఏ వృత్తిలో ప్రవేశించినా తన దేశంకొరకు, ప్రజలకొరకు పనిచేస్తున్నాననే ఉల్లాసం ఉంటుంది. తానేపనిచేసినా, తను, తన కుటుంబం, తన పట్టణం లేక గ్రామం, తన మాతృభూమి సుఖపడుతున్నాయనే విశ్వాసం అతనిలో మూర్తీభవించుతుంది.

సోవియట్ రష్యాలో విద్యకొరకు, విజ్ఞానం కొరకు యీ విధంగా వెల్లివిరుస్తున్న ఉత్సాహం ఏయేరూపాలలో ప్రదర్శితమవుతూంది? తమకు లభించిన అవకాశాన్ని యువకు లేవిధంగా వినియోగించుకుంటున్నారు? సంతృప్తికరమైన ఫలితాలు కనిపిస్తున్నాయా? లేదా?

దేశాన్ని యెదుర్కొనే మొట్టమొదటి సమస్య ఉత్పత్తి సమస్య. ఈ ఉత్పత్తి నిపుణులైన టెక్నికల్ స్టాఫ్ మీద చాలావరకు ఆధారపడి యుంటుంది. కాబట్టి, ఇంజనీరింగ్ పరిశ్రమలలో పనిచేసే యువకు లెలాంటివారు? అనే ప్రశ్నకు మొదట జవాబు చెప్పవలసియుంది.

విదేశీ సామ్రాజ్యవాదుల ఏజంట్లు రష్యన్ సోషలిస్టు నిర్మాణాన్ని నాశనం చేయడానికి రష్యన్ ద్రోహుల సహాయ్యంతో కుట్రలు పన్నడం ఆరంభించారు. ప్రభుత్వాని కిదితెలిసి, 1937 లో యిలాంటి కుట్రదారు లందరినీ ఎరెస్టుచేసి, విచారణజరిపి, కఠినమైన శిక్షలకు గురిచేసింది. వీరందరూ పెద్ద పెద్ద ఇంజనీరింగ్ కర్మాగారాలలో మేనేజర్లుగాను, ఇంజనీర్లుగాను, టెక్నీషియన్లుగాను, పనిచేసేవారు. అకస్మాత్తుగా వీరు తొలగించబడ్డంవల్ల, వీరిస్థానే యువకులు ప్రవేశించి పని ప్రారంభించవలసి

వచ్చింది. వీరికి అనుభవం తక్కువకావడంవల్ల 1936 వ సంవత్సరంలో కంటె 1937 లో 100 కి 20 చొప్పున ఎక్కువకాలసిన ఉత్పత్తి యేమాత్రం హెచ్చలేదు. 1936 లో ఉన్న ఉత్పత్తే 1937 లో కూడా ఉంది. కాని క్రమేణా యువకులు తమ క్రొత్త బాధ్యతల్ని నిర్వహించ డంలో అనుభవం సంపాదించుకుంటూ వచ్చారు. 6 నెలలలో బాగా తరిఫీదు పొందారు. నెమ్మదిగా ఉత్పత్తిని యెక్కువచేయడం ఆరంభిం చారు. 1938 లో 100 కి 15 చొప్పున మాత్రమే హెచ్చించ గల్గుతామని ప్రభుత్వానికి చెప్పారు. ప్రతినెలా ద్విగుణీకృతోత్సాహంతో పనిచేయ సాగారు. మొదటి 6 నెలలు పూర్తి అయేసరికి తమ శ్రమ ఫలించుతూ న్నట్లు కనపడింది. 100 కి 15 చొప్పున కాకుండా, 21 చొప్పున ఉత్ప త్తిని ఎక్కువ చేస్తామని వాగ్దానంచేశారు. సంవత్సరం పూర్తి అయేసరికి వాగ్దానాన్ని నిలబెట్టుకున్నారు.

## స్టఖనోవ్ ఉద్యమంలో యువకులు

ఇలాగే, సోవియట్ యువకులు స్టఖనోవ్ ఉద్యమంలో అనేక విజయాలు సాధించారు. స్టఖనోవ్ ఉద్యమం అంటే, ప్రతి కార్మికుడు తన చాకచక్యాన్ని ఉపయోగించి, మామూలు పరిస్థితులలో తయారుచేయ వలసిన దానికంటె యెక్కువగా తయారుచేయడం. దుస్యావినోగ్రడోవా, టూస్యాబడిన్ట్సోయా అనే యిద్దరు యువతులు బట్టల పరిశ్రమలో అత్యంతమైన నైపుణ్యాన్ని ప్రదర్శించారు. వ్యవసాయంలో మరో యిద్దరు యువతులు ఆదర్శవంతమైన పనులు చేశారు.

మాస్కోలో క్యాగనోవిచ్ స్టేట్ బాల్‌బేరింగ్ ప్లాంట్ అనే కర్మా గారంవుంది. దానికి మేనేజరు యూసిమ్ అనే యువకుడు. యూనివర్సిటీ చదువు పూర్తి కాగానే, యితడిక్కడ ప్రవేశించి, ఇంజనీరింగ్ పరిశ్రి మలో మొట్టమొదటి స్టఖనోవైట్‌గా పేరు సంపాదించాడు. ఒకటితరు వాత మరొక విజయం సంపాదించి, అరెస్టుచేయబడిన మేనేజరుస్థానంలో ప్రవేశించి, ఉత్పత్తిని యెక్కువచేశాడు.

యంత్రనిర్మాణశాఖకు ప్రభుత్వ కమిసార్‌గా ఎన్నుకోబడ్డ విక్టర్ ల్వోవ్‌యొక్క చరిత్ర చాలా చిత్రమైనది. ఇతని వయస్సు 38. చిన్న తనంలో యీతని తల్లితండ్రులు చనిపోయారు. అందువల్ల నాల్గవయేట చదువుమానేసి, ఒక భూస్వామివద్ద పాలేరుగా ప్రవేశించాడు. విప్లవం వచ్చాక 18 వయేట రెడ్‌ఆర్మీలోచేరి, అనేక రంగాలలో యుద్ధంచేశాడు. తరువాత ఖ్యాటికోవ్ యింజనీరింగ్ కర్మాగారంలో ప్రవేశించాడు. పని చేస్తూనే ఒక టెక్నికల్ కాలేజీలో ఉన్నతవిద్య నభ్యసించాడు. 1933 లో ఇంజనీరింగ్ డిగ్రీ సంపాదించాడు. ఇనుమును కరిగించడంలో ఒక సుళువుమార్గాన్ని కనిపెట్టినందుకు ప్రభుత్వం యీతనికొక డిప్లొమా యిచ్చింది. ఉక్కు పరిశ్రమలో తరిఫీదు పొందడానికి 1934 లో ఇతడు ఫ్రాన్సుకు పంపబడ్డాడు. 1936 లో తిరిగివచ్చాక తాను పనిచేసే కర్మాగారంలో ఉక్కు ఫౌండ్రీశాఖకు నాయకుడయాడు. తరవాత కర్మాగారాని కంతకూ డైరెక్టరు అయాడు. చివరకు 1938 లో అతన్ని యంత్ర పరిశ్రమ శాఖకంతకూ ప్రభుత్వ కమిసార్‌గా తీసుకున్నారు.

యువకులతోబాటు యువతులుకూడా సోవియట్ పరిశ్రమలలో నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ, ఉత్పత్తిని యెక్కువ చేస్తున్నారు. ఉదాహరణకు, టట్యానా మొరొజోవా 15 వయేట మాస్కోయందలి "న్యూ డాన్ సోప్ అండ్ పెర్‌ఫ్యూమరీ ఫ్యాక్టరీ"లో ప్రవేశించింది. కొన్నాళ్ళయాక ఆమెను ఒక ప్రత్యేక కళాశాలకు పంపి, అక్కడ ట్రేడ్‌యూనియన్ నిర్మాణాన్నిగురించి తరిఫీదుపొంది రమ్మన్నారు. చదువు పూర్తి అయాక తిరిగి తన ఫ్యాక్టరీలో ప్రవేశించింది. కార్మికులామెను ట్రేడ్‌యూనియన్ కమిటీ అధ్యక్షురాలినిగా యెన్నుకున్నారు. కొన్నాళ్ళయాక ప్రభుత్వం ఆమెను ఫ్యాక్టరీకి అసిస్టెంట్ డైరెక్టరుగాను, తరువాత డైరెక్టరుగాను నియమించింది. ఇప్పుడామె దేశం మొత్తంమీద ఉన్న పెర్‌ఫ్యూమరీ పరిశ్రమకు అధ్యక్షురాలు. వయస్సు 31 మాత్రమే.

ఇలాగే అనేక శాఖలలో సోవియట్ యువతీ, యువకులు ప్రావీణ్య తనుసంపాదించి, సోషలిస్టు నిర్మాణంలో ఉత్తమ స్థానా లలంకరిస్తున్నారు. సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత రొమెయిన్ రోలెండ్ యీ క్రిందివిధంగా వారినిగురించి ప్రశంసించాడు.

" ప్రపంచం అంతా ఆశతో మీవైపుచూస్తోంది. ముందు రాబోయే వర్గరహితమైన సమాజానికి మీరు బీజంవంటివారు. అప్పుడు మనిషిని మరోమనిషి దోచుకోవడం ఉండదు. ఒక రాజ్యానికీ, మరొక రాజ్యానికీ మధ్య సరిహద్దులుండవు. ఇక జాతికీ, మరొకజాతికీ మధ్య ద్వేషభావం మాయమౌతుంది. "

# ఆరోగ్యం, విశ్రాంతి





1914
1940
డాక్టర్లసంఖ్య
19,785
120,000



ఆసుపత్రులలో పక్కల సంఖ్య
175,500
840,000





1927
1938
ఆరోగ్యసదనాలలో ఉచితంగా సహాయం పొందినవారి సంఖ్య
74,200
555,000



విశ్రాంతి భవనాలలో ఉచితంగా సహాయం పొందినవారిసంఖ్య
437,200
1,900,000

# ౫. సోవియట్ కార్మికులు

సోవియట్ యూనియన్‌లో కార్మికుల శ్రమశక్తిని దోచుకుని తెగ బలిసే పెట్టుబడిదారీవర్గం లేనప్పటికీ కార్మికసంఘాల అవసరం యెంతో వుంది. దేశం అంతటా, ప్రతి పరిశ్రమలోను, ఉత్పత్తిని అధికంచేస్తూ తద్వారా తమ జీవిత పరిమాణాన్ని యెక్కువ చేసుకోవాలంటే, నిర్మాణ యుక్తమైన కార్మికసంఘాలు ఉండాలి అంతేకాక, ఒక్కొక్క పరిశ్రమలో పనిచేసే కార్మికులకు ప్రత్యేకమైన సమస్యలెన్నో ఉంటాయి. వాటిని పరిష్కరించుకొని, కార్మికుల కష్టాల్ని తీర్చుకోడానికి కార్మిక సంఘాలు అవసరం.

కాబట్టి ట్రేడ్ యూనియన్లు పంచవర్ష ప్రణాళికలు జయప్రదంగా కొనసాగేటట్లు చూస్తాయి. ఏ ఫ్యాక్టరీకి ఆ ఫ్యాక్టరీ తన కోటాను పూర్తి చేయడంలో ఆ ట్రేడ్‌యూనియన్ సహాయపడుతుంది.

ఇంతేకాదు, కార్మికుల్ని శాస్త్ర విద్యలలో తరిఫీదు చేయడానికికూడ ట్రేడ్ యూనియనులు పూనుకుంటాయి. ప్రభుత్వ భీమా నిధిని ట్రేడ్ యూనియనులే స్వయంగా పంచిపెడతాయి. ఫ్యాక్టరీల అజమాయిషీకూడా ట్రేడ్‌యూనియన్లదే.

ట్రేడ్‌యూనియన్ మెంబర్లకు వివిధ సౌకర్యా లేర్పాటుచేయడం, కొత్త కార్మికశాసనాలను సిఫార్సుచేయడం, ఆటలు, నాటకాలు, గానసభలు మొదలైన వైజ్ఞానిక కార్యక్రమాన్ని నిర్వహించడం — కూడా ట్రేడ్ యూనియన్‌ల పనులే.

ప్రభుత్వం ప్రతి ఫ్యాక్టరీలోను పనిచేసే కార్మికుల సౌకర్యార్థం కొంత సొమ్మును భీమానిధికి ప్రత్యేకిస్తుంది. ఈ నిధికి కార్మికులు ఒక్క దమ్మిడీకూడా యివ్వ నవసరంలేదు. ప్రతి ఫ్యాక్టరీలోను మేనేజిమెంటు

కార్మికుల జీతాలకై యెంత సొమ్మును ప్రత్యేకిస్తుందో, అందులో 100 కి 4 లగాయతు 10 వంతులవరకు సమిష్టి భీమానిధికిగాను తీసి వుంచుతారు.

1929 మొదలు 41 వరకు యీ నిధి క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది.

| | | | |
|---|---|---|---|
| 1929 — | 133 | కోట్ల | రూబుల్సు |
| 1933 — | 480 | ,, | ,, |
| 1936 — | 888 | ,, | ,, |
| 1941 — | 1000 | ,, | ,, |

ఈ నిధిని ఏయే ఖర్చులకు వినియోగిస్తారో చూద్దాం :

ట్రేడ్ యూనియన్లలో సభ్యులుగా చేరినా, చేరకపోయినా కార్మికులకు ముసలితనంలోగాని, జబ్బుచేసినప్పుడుగాని, పెద్దపెద్ద దెబ్బలు తగిలినప్పుడుగాని కొంత సొమ్ముయిస్తారు. 26 సంవత్సరాల సర్వీసువుండి, 60 సంవత్సరాల వయస్సువస్తే, వారి సగటుజీతంలో నూటికి 50 లగాయతు 60 వంతులవరకు పించను ఉంటుంది. స్త్రీలకు 55 వ సంవత్సరంనుండీ పించను యిస్తారు. అంతకుముందు వారికి 20 సంవత్సరాల సర్వీసు ఉంటేచాలు. అయితే ముసలితనంవచ్చాక తప్పనిసరిగా పించను పుచ్చుకోవాలనే నిర్బంధంలేదు. ఇష్టంవుంటే పనిచేయవచ్చు. అలా పని చేసిన వారికి మామూలు జీతంతోబాటు పించనుకూడా యిస్తారు.

ఏ కారణంచేతనైనా కార్మికుడు పనిచేయలేని స్థితికి వచ్చినప్పుడు మామూలు పించను రేటుతోబాటు అదనంగా అతనికి కొంత సొమ్ము యిస్తారు. ఆ సొమ్ము పనిచేసిన కాలాన్నిబట్టి యెక్కువగాని, తక్కువగాని ఉంటుంది. గనులలోను, ప్రమాదకరమైన పరిశ్రమలలోను పనిచేసే వారికి అందరికంటె యెక్కువ రేట్లువుంటాయి. 20 సంవత్సరాలలోపు వయస్సుగల కార్మికుడు పనిచేయలేని స్థితి యేర్పడితే అంతవరకూ అతను చేసిన సర్వీసుతో సంబంధంలేకుండా పించను యిస్తారు. 20 సంవత్సరాలకు మించిన వయస్సయినప్పటికీ కార్మికుడు తాను చేయవలసిన పనిని చేస్తున్నప్పుడుగాని - తత్ఫలితంగాగాని, పనిచేయలేకుండా అయిపోతే యెంత తక్కువ సర్వీసు ఉన్నప్పటికీ పూర్తి పించను యిస్తారు.

ఇంతేకాదు, కార్మికుడు జబ్బుచేసినప్పుడు పనికి హాజరు కాలేక పోతాడు. అట్టివారికి ప్రభుత్వం రక్షణయిస్తుంది. భీమా నిధిలోనుండి 100 కి 100 చొప్పున జీతం యిచ్చి పోషిస్తుంది. ఈ సొమ్ము జబ్బుపడిన రోజు లగాయతు పూర్తిగా బాగుపడేవరకూ యిస్తూవుంటుంది.

ట్రేడ్‌యూనియన్ సభ్యులందరికీ ఉచితంగా వైద్యసహాయం వుంటుంది. అవసరమైనప్పుడు యింటివద్దనే చికిత్సచేస్తారు. దీనికయే ఖర్చు ప్రభుత్వ భీమా నిధినుండి వస్తుంది.

ఉచిత వైద్య సహాయంతోపాటు ఆరోగ్యాశ్రమాలు, విశ్రాంతి భవనాలు మొదలైనవి కట్టించి, వాటిని ప్రభుత్వం కార్మికుల ఉపయోగం కొరకు తెరచియుంచుతుంది. ఇట్టి సౌకర్యాలు యెంత జోరుగా వ్యాపించు తున్నాయంటే 1929 లో సోవియట్ యూనియన్‌లో నివసించే ప్రతి కార్మికునికి 121 రూబుల్సు చొప్పున ఖర్చుపెట్టబడితే 1933 లో యిది 216 రూబుల్సుకు, 1936 లో 346 రూబుల్సుకు పెరిగింది. యుద్ధంవచ్చే వరకు ప్రతి సంవత్సరం యిలా పెరుగుతూనే వచ్చింది.

ప్రతి పెద్ద ఫ్యాక్టరీకి అనుబంధశాఖగా టెక్నికల్ ట్రెయినింగ్ స్కూళ్ళు ఉంటాయి. కార్మికులు వాటిల్లో విద్య నభ్యసించి, తమ నైపుణ్యాన్ని వృద్ధిచేసుకోవచ్చు. ఇందుకయే ఖర్చులు ట్రేడ్‌యూనియన్ నిధిలోనుండి, భీమా నిధిలోనుండి యిస్తారు. ఇందుకై ప్రతియేటా ఎంతెంత ఖర్చుపెట్టాలో. ఫ్యాక్టరీకమిటీలే నిర్ణయిస్తాయి. కార్మికులు యిట్టి టెక్నికల్ స్కూళ్ళలో తర్ఫీదుపొందడానికి ఫ్యాక్టరీకమిటీలు ఉచితంగా వేతనాలిస్తాయి.

అనేక ట్రేడ్‌యూనియన్లు తమ సభ్యుల సౌకర్యార్థం అనేక క్లబ్బులు, లైబ్రరీలు నిర్మించుతాయి. 1923 లో దేశం మొత్తంమీద 2000 క్లబ్బులుంటే, 1937 నాటికి యీ సంఖ్య 6000 కు పెరిగింది. లైబ్రరీల సంఖ్య 2 వేలనుండి 13 వేలకు పెరిగింది. వాటిల్లో ఉండే పుస్తకాల సంఖ్య 35 లక్షలనుండి 4 కోట్లవరకు హెచ్చింది.

కార్మికుల వినోదార్థం ట్రేడ్‌యూనియనులే సినీమాలు, నాటకాలు, గానసభలు మొదలైనవాటిని నడుపుతాయి.

1936 లో దేశంమొత్తంమీద విద్యాసౌకర్యాలకు, వైజ్ఞానిక కళలకు ట్రేడ్‌యూనియన్లు 100 కోట్ల రూబుల్సు ఖర్చుపెట్టాయి. వాటి ఆదాయంలో ఈ మొత్తం 100 కి 57 వంతులు. ఇందునిమిత్తమే ప్రభుత్వం కూడా భీమానిధి నుండి 61 కోట్ల రూబుల్సు చెల్లించింది. అనగా మొత్తం 161 కోట్లరూబుల్సు అన్నమాట.

సోవియట్‌రష్యాలో నేడుమొత్తం 162ట్రేడ్‌యూనియన్లుఉన్నాయి. వీటిలో సభ్యత్వం 2 కోట్ల 30 లక్షలు. 1939 లోని లెక్కలప్రకారం కార్మికుల సంఖ్యలో 100కి 85 గురు యూనియన్ సభ్యులు. యూనియన్‌లో చేరిన ప్రతిసభ్యుడు తాను నెలకు సంపాదించే జీతంలో 100 కి 1 రూబుల్ వంతున ప్రవేశరుసుం చెల్లించాలి. తరువాత ప్రతినెల 100 కి 1½ రూబుల్స్ వంతున చందా చెల్లించాలి. సభ్యత్వరుసుం మాత్రమే కాకుండా ప్రతి ట్రేడ్‌యూనియన్‌కీ అదనంగా ప్రభుత్వం నుండి కొంత ఆదాయం లభిస్తుంది. ప్రభుత్వం ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులకు జీతాల నిమిత్తం ఎంతసొమ్మును ప్రత్యేకించుతుందో, అందులో 100 కి 2 రూబుల్సు చొప్పున ప్రభుత్వం ట్రేడ్‌యూనియన్ కమిటీకి యిస్తుంది. 1936 లెక్కల ప్రకారం, మొత్తం ట్రేడ్‌యూనియన్ల సభ్యత్వరుసుం 50 కోట్లరూబుల్సు అయితే, పై విధంగా ఫ్యాక్టరీ మేనేజిమెంటు ద్వారా వచ్చిన సొమ్ము 100 కోట్లరూబుల్సు.

సోవియట్‌యూనియన్‌లో సరకుల ఉత్పత్తి, పంపకం, మొదలైన వన్నీ ఎలాప్లాను ప్రకారం నిర్ణయించబడతాయో, కార్మికులకిచ్చే జీతాలు కూడా ప్లాను ప్రకారం నిర్ణయించబడతాయి. ఉత్పత్తి ప్లానులో జీతాల మొత్తం కూడా ఒక భాగంగా ఉంటుంది.

5 సంవత్సరాల కొకసారి సోవియటు ప్రభుత్వం ప్రణాళికలను ప్రకటిస్తుందనీ, వాటి ప్రకారం దేశంయొక్క ఆర్థికజీవనం కొనసాగుతూ ఉంటుందనీ, పైన చూచాం. ఈ పంచవర్ష ప్రణాళికలతోబాటు సంవత్సరానికొకసారి, 3 నెలలకొకసారి, చెకప్ (అజమాయిషీ) లు జరుగుతూ ఉంటాయి. ఆ 3 నెలల కాలంలో అంచనాప్రకారం ఉత్పత్తి జరిగిందో,

లేదో, అంతకంటె ఎక్కువ జరిగితే దానిప్రకారం కార్మికులకు జీతాలెంత ఎక్కువచేయడానికవకాశం ఉంటుందో మొదలయినవి నిర్ణయిస్తారు.

మొదట స్టేట్ ప్లానింగ్ కమిషన్ అఖిల సోవియట్ ట్రేడ్‌యూనియన్ కౌన్సిల్ సలహాతో ప్రణాళికలయొక్క చిత్తుప్రతిని తయారుచేస్తుంది. దీన్ని వేర్వేరు పరిశ్రమలకు సంబంధించిన సెంట్రల్ ఎకనామిక్ బోర్డులకు ఒక్కొక్కఫ్యాక్టరీకి సంబంధించిన మేనేజిరియల్‌బోర్డుకు పంపుతారు. ప్రతి ఫ్యాక్టరీలోను, ప్రతి పరిశ్రమలోను, కార్మికులు యీ చిత్తుప్రతిని గురించి వివరంగా చర్చించి, తమ అభిప్రాయాన్ని స్టేటుప్లానింగు కమిషనుకు పంపుతారు. అప్పుడు ప్లానింగు కమిషను అంతిమనిర్ణయాలతో ప్రణాళికను ప్రకటిస్తుంది.

ఈ ప్రణాళికలో కార్మికుల కీయవలసిన జీతాలమొత్తం కూడా ఉదహరించుతారు. ఫ్యాక్టరీకమిటీలు, రీజియనల్‌కమిటీలు, సెంట్రల్ కమిటీలు, అదివరకే తమ అభిప్రాయాలను తెలియచేసి యుంటాయి. దేశం మొత్తంమీద జీతాలకై ఖర్చుపెట్టవలసినసొమ్ము, కార్మికులు తయారుచేసిన నిత్యజీవితావసర వస్తువులన్నింటివిలువ ఒకటిగాఉంటుంది. అంటేఉత్పత్తి ఎక్కువయితే జీతాలు కూడా యెక్కువౌతాయన్నమాట.

ఈవిధంగా ప్రతి ఫ్యాక్టరీలోను పనిచేసే కార్మికులకు జీతాల నిమిత్తం ఖర్చుపెట్టవలసిన సొమ్ము మొత్తం సొమ్ములో ఎన్నవవంతో, ముందుగానే ఫ్యాక్టరీ కార్మికులకు, మేనేజిమెంటుకు తెలిసియుంటుంది. ఏటేటా ఫ్యాక్టరీ మేనేజిమెంటుకు, ఫ్యాక్టరీ కమిటీకి మధ్య జరిగే సమిష్టి ఎగ్రిమెంట్లలో యీమొత్తం ఉదహరించబడుతుంది. సమిష్టి ఎగ్రిమెంట్లకు ముందు ఫ్యాక్టరీ కార్మికులందరూ సమావేశమై చర్చిస్తారు.

ఈ సమిష్టి ఎగ్రిమెంటులో ఫ్యాక్టరీకి సంబంధించిన ప్రతివిషయం స్పష్టంగా ఉదాహరించబడుతుంది. ఎంతమంది కార్మికులుండేదీ; ఎంతమందిని ట్రాన్స్‌ఫర్ చేయవలసిందీ; ఎంతమందికి టెక్నికల్ విద్య యివ్వవలసిందీ; ఒక్కొక్క కార్మికుని కీయవలసిన జీతం; కార్మికులు నివసించడానికి తగినయిళ్ళు కట్టించడం; పనిచేసే చోటికి రాకపోకల

మార్గాలు ; ఫ్యాక్టరీకి అనుబంధించబడి ఎన్నెన్ని వంటశాలలుండవలసిందీ: ఎన్ని కాఫీహోటళ్ళు: పిల్లల శిక్షణకు ఎన్ని క్రెచీలు, నర్సరీ స్కూళ్లు, నిర్మించబడవలసిందీ; ఆరోగ్యవసతులు ; పనిచేసే సమయంలో రక్షణ కవసరమైన దుస్తులు ; వైజ్ఞానిక ప్రదర్శనాలు : ఎగ్రిమెంటు అమలు జరిగేదీ, లేనిదీ తనిఖీచేయడానికి ఏర్పాట్లు—మొదలైన అంశాలన్నీ సమిష్టి ఎగ్రిమెంటులో ఉంటాయి. కార్మికులు దీన్ని ఆమోదించిన తరువాత ఉభయపార్టీలూ దీనికి కట్టుబడియుండాలి. ఈ ఎగ్రిమెంట్లు బేరంచేసి కుదుర్చుకున్నవి కావు. ఏ ఫ్యాక్టరీకి ఆ ఫ్యాక్టరీ న్యాయంగా, ధర్మసమ్మతంగా, దేశంయొక్క శ్రేయస్సును మనస్సులో పెట్టుకొని, తీసుకునే ప్రతిజ్ఞలు, మేనేజిమెంటు, కార్మికులు సమానంగా యీ ప్రతిజ్ఞలను పాటించాలి.

## సమాన జీతాలుండవు

సోవియట్ యూనియన్‌లో కార్మికులందరికీ సమానంగా జీతాలివ్వరు. "ఎవరి శక్తినిబట్టి వారు పనిచేయాలి; పనినిబట్టి జీతం యిస్తారు." ఈ సూత్రం ప్రకారం కార్మికులకు ఎక్కువ, తక్కువ జీతాలుంటాయి. మామూలు కార్మికునికంటె నిపుణులకు సహజంగా ఎక్కువ జీతా లిస్తారు. అందరికంటె చాకచక్యంగా పనిచేసేవారికి అదనంగా బోనసు ఉంటుంది. కార్మికుడు మామూలుకంటె యెక్కువగా కష్టపడినప్పుడుగాని, తన కుశాగ్రబుద్ధివల్ల కొత్తపద్ధతులు కనుక్కున్నప్పుడుగాని, మామూలు జీతంకంటె అదనంగా ప్రతిఫలం యిస్తారు. ఈ విధంగా కార్మికులు చూపే నైపుణ్యాన్నిబట్టి, చేసే శ్రమనుబట్టి, తగిన ప్రతిఫలం యిస్తూండడంవల్ల యితర కార్మికులలో కూడా ఉత్సాహం బయల్దేరుతుంది. తాము కూడా ఉత్పత్తిని యెక్కువ చేయాలనే ఆసక్తి కలుగుతుంది.

పంచవర్షప్రణాళికల ఫలితంగా, ప్రతి సంవత్సరం కార్మికుల జీతాలకై ప్రత్యేకించబడే మొత్తం సొమ్ము హెచ్చుతూంది. 1928 లో 820 కోట్ల రూబుల్సు ఉంటే, 1933 నాటికి 3490 కోట్ల రూబుల్సుకు పెరిగింది; 1938 నాటికి 9640 కోట్ల రూబుల్సు వరకు హెచ్చింది. నగ

టున ఒక్కొక్క కార్మికుని కీయబడే జీతం 1,500 నుండి 4,000 రూబు ల్సకు పెరిగిందని అంచనావేశారు. భీమాసౌకర్యాలు, ఆరోగ్యపసతులు మొదలైనవి యీ మొత్తంలో చేరవు.

యుద్ధానికి ముందు (1939) ప్రతి కార్మికుడు 7 గంటలకంటె ఎక్కువ పనిచేయ నవసరం ఉండేదికాదు. ప్రమాదకరమైన పరిశ్రమలలో 6 గంటలకంటె ఎక్కువ పనిచేయ నవసరం ఉండేదికాదు; ఆరురోజు లొకవారం. వారంలో ఒకరోజు సెలవు ఉండేది. కాని, యుద్ధంలో హిట్లరు మూకల్ని తరిమిగొట్టడానికి, తాము తమరక్తం ధారపోసి సంపాదించుకున్న సోషలిస్టు రాజ్యాన్ని రక్షించుకోడానికి కార్మికులు పనిచేసే గంటల సంఖ్య 7 నుండి 8 కి హెచ్చించబడింది; వారానికి 6 రోజులనీ, ఏడవరోజు సెలవు అనీ, నిర్ణయించారు.

కాని, సోవియట్ కార్మికులు నేడు ఇంతకంటె యెక్కువకాలం పనిచేస్తున్నారు. తమ దేశాన్ని, తమ కొత్త సమాజాన్ని, కాపాడుకొనే టందుకు ఎక్కువ ఆయుధసామగ్రిని తయారుచేస్తున్నారు.

## "స్టాఖానొవైట్" ఉద్యమం

"స్టాఖానోవ్" ఉద్యమం ఉంటే, వేర్వేరు కర్మాగారాలలో కార్మికులు తమ సొంత చాకచక్యంవల్ల, చొరవవల్ల, ఉత్పత్తిని యెక్కువచేసే పద్ధతులను కనుక్కోవడం. మొదటి అఖిల సోవియట్ స్టాఖానొవైట్ కాన్ఫరెన్సులో స్టాలిన్ యిలా చెప్పాడు:

"మొదట యీ ఉద్యమం దానంతట అదే బయల్దేరింది. కార్మికులు తమ సొంతకృషివల్ల దీన్ని ప్రారంభించారు. ఫ్యాక్టరీ మేనేజిమెంట్ల ప్రమేయం లేకుండా ప్రారంభమయింది ఈ ఉద్యమం.... ....తరువాత సోవియట్ యూనియన్ అంతటా విపరీతమైన వేగంతో ఒక తుపాను వలె వ్యాపించింది."

స్టాఖానోవ్, గనులలో పనిచేసే ఒక కార్మికుడు. ఇతను 1935 లో యిద్దరు కార్మికుల సహాయంతో తనపనిని బాగా ఆర్గనైజు చేసుకున్నాడు.

తత్ఫలితంగా యీ ముగ్గురూ కలిసి 102 టన్నుల బొగ్గును 5 గంటల 45 నిమిషాలలో ఉత్పత్తి చేయగలిగారు. అదివరకు వీరు ఒక్కొక్కరు ఒక రోజులో 7 టన్నులు మాత్రమే ఉత్పత్తి చేసేవారు.

ఈ ఉద్యమానికి మొదటి మూలసూత్రం కార్మికుల ఆర్థిక పరిస్థితిని అనేకరెట్లు బాగుచేసి, జీవితాన్ని పూర్వం కంటె అనేకరెట్లు సౌఖ్యప్రదం చేయడం. ఎప్పుడైతే జీవితంలో సుఖం ఉంటుందో, అప్పుడే పని జోరుగా సాగుతుంది. కనుకనే ఉత్పత్తి యెక్కువౌతోంది. కనుకనే యుద్ధరంగాలలో పోరాడే సైనికులవలె పరిశ్రమలలో కూడా యోధులు బయల్దేరారు. యుద్ధం సాగుతూన్న యీ రోజులలో "స్టాఖానోవ్" ఉద్యమం కొత్త రూపాలతో అభివృద్ధి చెందుతోంది. ప్రతికార్మికుడు ఉత్పత్తిని రెండు రెట్లు యెక్కువచేయడానికి ప్రతి ఫ్యాక్టరీలోను ప్రతిజ్ఞ తీసుకొంటున్నాడు. యుద్ధరంగానికి వెళ్ళిన కార్మికుల కోటాను కూడా పూర్తిచేయవలసిన పవిత్ర బాధ్యత వీరిపై ఉంది. ఇంతేకాదు నాజీలు ఆక్రమించుకున్న ప్రదేశాలలో సోవియటు పోగొట్టుకున్న పరిశ్రమల స్థానే యితర పరిశ్రమలలో పనిచేసే కార్మికులు పూర్వంకంటె ఉత్పత్తిని అధికం చేయవలసి వుంది.

"స్టాఖానొవైట్" ఉద్యమంతోబాటు ఫ్యాక్టరీలలో సోషలిస్టుపోటీ లుంటాయి. ఒకఫ్యాక్టరీ మరొక ఫ్యాక్టరీతోగాని, ఒకే ఫ్యాక్టరీలో ఉన్న రెండు "షిప్టులు" గాని, తమ ఉత్పత్తి కోటాలను ఎక్కువచేసుకోడానికి పందేలు వేసుకుంటారు. రెండు పార్టీలవారు ఎప్పటికప్పుడు ఎంతెంత ఉత్పత్తి చేస్తున్నారో ఫ్యాక్టరీ గోడలమీద కాగితాలంటించి తెలియజేసుకుంటూ ఉంటారు. పెద్ద ఫ్యాక్టరీలైతే, వార్తాపత్రికలలో ప్రతిరోజూ అంకెలు యిస్తూ ఉంటారు. ఈ పందేలవల్ల కార్మికులలో కలిగే ఉత్సాహం ఇంతా, అంతా అని చెప్పడానికి వీల్లేదు. పోటీలలో పాల్గొనే కార్మికుల్ని "షాక్‌బ్రిగేడర్లు" అంటారు. వీరిలో యెక్కువ సామర్థ్యాన్ని ప్రదర్శించినవారు జాతీయ నాయకులుగా పరిగణించబడతారు. అలాంటివారికి ప్రభుత్వం బహుమతులు, బిరుదులు యిస్తుంది.



స్టాలిన్ ఇనుము - ఉక్కు పరిశ్రమాగారంలోని కార్మికుల పఠన మందిరం

"షాక్ బ్రిగేడ్ల" లో ఉన్న కార్మికులు ఒండొరులకు సలహా లిచ్చుకుంటూ సహాయం చేసుకుంటారు. వెనుకబడే కార్మికులకు హుషారు యిచ్చే నిమిత్తం "షాక్ బ్రిగేడ్ల" లో ఆరితేరినవారి అనుభవాన్ని ట్రేడ్ యూనియన్‌లు ఎప్పటికప్పుడు అందజేస్తూ ఉంటాయి.

ఈ విధంగా ప్రపంచ మానవజాతిని మారణహోమం చేయజూచే ఫాసిస్టు రాక్షసుల్ని ఢీకొంటూ సోవియట్ కార్మికులు ప్రపంచ కార్మికులకు దారి చూపుతున్నారు.

# 6. సోవియటు సంస్కృతి

రష్యాలో వ్యాపించినంత విద్య యెక్కడాలేదని తెలుసుకున్నాం. ఏ దేశంలోనూ యేటేటా యిన్ని యెక్కువ పుస్తకాలు ప్రచురించబడవు. ఒక్కొక్క పుస్తకానికి కొత్త ముద్రణ వచ్చిందంటే, కాపీలకోసం ప్రజలు బారులుతీరి నిలబడతారు. పుష్కిన్ రచించిన ఒక గ్రంథానికి కొత్త ముద్రణ ప్రచురించబడినప్పుడు 3 గంటలలో 600 కాపీలు అమ్ముడయాయట.

1939 లో రష్యాలో ప్రచురించబడినన్ని యెక్కువపుస్తకాలు ప్రపంచంలో యెక్కడా ప్రచురించబడలేదు. ఆ సంవత్సరం మొత్తం 43 వేల పుస్తకాలు 70 కోట్ల 10 లక్షల ప్రతులతో అచ్చువేయబడ్డాయి. ఇందులో 11 కోట్ల 70 లక్షలు రష్యన్ భాషకాక మిగతా భాషలలోనే;

ప్రసిద్ధికెక్కిన రష్యన్ రచయితలందరూ ప్రజల మన్ననలను పొందుతున్నారు. 1917 మొదలు 1937 వరకు, అనగా 20 సంవత్సరాలలో మాక్సింగోర్కీ రచించిన గ్రంథాలకు 3 కోట్ల 20 లక్షల ప్రతులు ముద్రించబడ్డాయి. పుష్కిన్ గ్రంథాలు 1 కోటి 90 లక్షలు; టాల్‌స్టాయి గ్రంథాలు 1 కోటి 40 లక్షలు; చెకోవ్ గ్రంథాలు 1 కోటి 10 లక్షలు; టెర్గనీవ్ గ్రంథాలు 80 లక్షలు; రాజకీయ గ్రంథాల విషయం చెప్పనవసరమేలేదు. మార్క్సిజాన్నిగురించి, లెనినిజాన్నిగురించి యీ 20 సంవత్సరాలలో 35 కోట్ల ప్రతులు అచ్చువేయబడ్డాయి.

మాస్కోలో ఒక ప్రచురణాలయంవుంది. అది 85 భాషలలో పుస్తకాలు ప్రచురిస్తుంది. పిల్లలు చదువుకునే చిన్నచిన్న కథల పుస్తకాలు లగాయతు పెద్దపెద్ద టెక్నికల్ పుస్తకాలవరకూ - అన్ని విషయాలకు సంబంధించినవి అక్కడ ప్రచురించబడతాయి. ఇలాగే ఉక్రెయిన్

రాష్ట్రింలో మొత్తం 90 లక్షల గ్రంథాలు ప్రచురించబడ్డాయి. టాల్‌స్టాయి రచించిన గ్రింథాలను ఒక్క రష్యాలోనేగాక, యితర జాతుల ప్రిజలు వారి వారి భాషలలో యెక్కువగా కొని, చదువుతారు. ఉదాహరణకు: ఆర్మీనియాలో, ఒక్క సంవత్సరంలో 61 వేల ప్రితులు అమ్ముడు పోయాయి.

ఇక వార్తాపత్రికల విషయం. మొదట్లో రోజుకి 30 లక్షల ప్రతులు అచ్చువేయబడేవి. నేడు 3 కోట్ల 60 లక్షలు అచ్చు వేయబడుతున్నాయి. ఈన్‌స్టీన్ అనే ప్రిపంచ ప్రిఖ్యాతిబడసిన శాస్త్రజ్ఞుని గ్రింథాలు మొత్తం 45,000 కాపీలు అమ్ముడుపోయాయి ప్రిజాసామాన్యం శాస్త్ర పరిశోధనల వట్ల యెంత శ్రిద్ధ చూపుతున్నారో దీనివల్ల బోధపడుతుంది.

సోవియట్ ప్రిజలలో వ్యాపించుతూన్న యీ విజ్ఞానానికి కారణం ఏమిటి?

మొదటి విషయం: కొత్త ప్రిభుత్వం వచ్చాక, ప్రిజల సంపద యెక్కువై, కావలసినంత విరామం ప్రితివ్యక్తికీ దొరుకుతోంది. ఎవరూ రోజుకి 7 గంటలకంటె యెక్కువ పనిచేయ నవసరంలేదు. ఏడాదికొక సారి జీతంతోసహా సెలవులిస్తారు. ఇందువల్ల జీవితాన్నిగురించి ప్రిజల దృక్పథం పూర్తిగా మారింది. జబ్బుచేసినా, బలహీనత ప్రివేశించినా, వృద్ధాప్యం వచ్చినా, ప్రభుత్వం ధనసహాయం చేస్తుంది. అందువల్ల మెదడు మందగించకుండా చురుకుగా పనిచేస్తుంది. ప్రిజల మానసిక శక్తులు వృద్ధిపొందుతాయి.

రెండవ కారణం: లాభాలకోసం పెనగులాడేపద్ధతి లేనందువల్ల ప్రజలు సహజంగా వైజ్ఞానికంగా అభివృద్ధిచెందడానికి కుతూహలపడతారు.

మూడవ కారణం: సోవియట్ ప్రిభుత్వం అవలంబిస్తూన్న కొత్త విద్యా విధానం ప్రిజలలో కొత్త చైతన్యాన్ని కలిగించింది. తమలో ఎన్ని శక్తులు నిబిడీకృతమై యున్నవో ప్రిజలు తెలుసుకున్నారు.

నాల్గవ కారణం: ప్రితి వ్యక్తీ వైజ్ఞానికంగా వృద్ధిపొందడానికి ప్రిభుత్వం అనేక అవకాశాలు, సదుపాయాలు కల్పించింది.

సినీమాలొచ్చాక, అనేక దేశాలలో నాటకాలకు ప్రభుత్వసహాయం గాని, ప్రజల ప్రోత్సాహంగాని, లేదు. రష్యాలో ఇలా కాదు. మాస్కో ఆర్టుధియేటరు ఒక్కటీ చూస్తేచాలు. ఈకళకు రష్యాలో ఎంతప్రోత్సాహం యిస్తున్నదీ తెలుస్తుంది. షేక్స్పియర్ ప్రపంచ నాటకకర్త లందరిలోను ఉత్తమోత్తముడని ప్రఖ్యాతి. ఇతడు ఇంగ్లండ్‌లో జన్మించాడు. ఇతను చనిపోయాక అనేకమంది ఆంగ్లకవులు, నాటకకర్తలు షేక్స్పియర్‌ని ఆదర్శంగా తీసుకుని గ్రంథాలు రచించారు. ఇంతటి ధీశాలి జన్మమెత్తిన ఇంగ్లండ్‌లో షేక్స్పియర్ యొక్క 325వ వర్ధంత్యుత్సవం జరుపబడలేదంటే ఎంత ఆశ్చర్యం। కాని సోవియట్ యూనియన్‌లో షేక్స్పియర్ యొక్క ఘనతను ప్రజలు గుర్తించారు. పూర్తిగా వారంరోజులు దేశం అంతటా షేక్స్పియర్ వర్ధంత్యుత్సవాలు జరిగాయి. 800 నాటకశాలలలో ప్రావీణ్యత నొందిన నటీనటకులు నాటకాలను ప్రదర్శించారు. షేక్స్పియర్ రచనలకు క్రొత్తముద్రణలు ప్రచురించబడ్డాయి. అనేక కేంద్రాలలో షేక్స్పియరును గురించి ఉపన్యాసాలీయబడ్డాయి. రేడియో ప్రసంగాలలో షేక్స్పియర్ ఘనతను ప్రశంసించారు. ప్రతి రోజూ మాస్కో రేడియో ఈ ప్రపంచ విఖ్యాతపురుషుని గురించి ప్రస్తుతిస్తుంటే. బి.బి.సి. (లండన్) రేడియోవారు ఆ వారంరోజులు ప్రశాంతంగా గడిపారు. లక్షల కొలది బ్రిటిష్ ప్రజలు ఈ విచిత్రఘటనను గూర్చి తెలుసుకుంటే, సిగ్గుతో తలలువంచుకోరా?

నాటకాలలో ఉత్తేజకరమైన జీవకళ కోసం సోవియట్ ప్రేక్షకులు ఎదురుచూస్తారు. షేక్స్పియర్ నాటకాలలో అది చక్కగా ప్రదర్శితమవుతుంది. ఏదో ఒక ఆదర్శం కోసం పనిచేస్తున్నామనే భావం సోవియట్ పౌరులలో నాటుకుపోవడంవల్ల మానవుల స్నేహబంధాన్ని గురించి, ఆత్మగౌరవాన్ని గురించి, శ్రమనుగురించి, ప్రేమను గురించి, విశ్వాసాన్ని గురించి, చిత్రించే నాటకాల్ని ఎక్కువగా మెచ్చుకుంటారు. ఈఅభిరుచిని షేక్స్పియర్ చక్కగా సంతృప్తి పరచగలుగుతున్నాడు. కనుక ఆయన నాటకాలకు రష్యాలో ఎంతో ప్రచారం ఉంది.

# శాస్త్ర పరిశోధనాలయాలు, మ్యూజియంలు, వార్తాపత్రికలు, గ్రంథాలు

శాస్త్ర పరిశోధనాలయాల సంఖ్య

1929



438

1938




806

మ్యూజియంల సంఖ్య

1914



180

1938






761

వార్తాపత్రికల ప్రతులు

1913



27 లక్షలు

1940














3 కోట్ల 80 లక్షలు

గ్రంథాల ప్రతులు



8 కోట్ల 67 లక్షలు














70 కోట్ల 10 లక్షలు

# థియేటర్లు, క్లబ్బులు, గ్రంధాలయాలు

1914 1940

థియేటర్లు






153 825

1938

క్లబ్బులు

222







95,626

గ్రంధాలయాలు









12,600 70,000

ఒక్క రష్యాలోనేగాదు. సోవియట్ యూనియన్‌కి చెందిన ఇతర రిపబ్లిక్కులలో కూడా నాటకకళ అనేకరెట్లు అభివృద్ధి చెందింది.

ఉదాహరణకు. బురియత్ మంగోలియా ప్రజలు విప్లవానికి ముందు అడవిజాతి ప్రజలవలె నివశించేవారు. వారి భాషకు లిపిలేదు. అందుచేత కాగితంమీద వ్రాయడం వారికి చేతకాదు. చెంఘిజ్‌ఖాన్ పుట్టినది యీ దేశంలోనే. ఆరోజుల్లో చెంఘిజ్‌ఖాన్ ఎలా జీవించేవాడో, 1917 వరకూ ప్రజలు అలా జీవించేవారు. అడవులలో దొరికిన గుర్రాలపై ఎక్కి, ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశానికి ప్రయాణాలు చేసేవారు. ప్రజల సంపద ఈ గుర్రాలనుబట్టే లెక్కించబడేది. అటువంటిచోట 1940 నాటికి ఒక బురియత్ మంగోలియన్ థియేటరు, ఒక రష్యన్ డ్రమాటిక్ థియేటరు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలవద్ద రెండు ధియేటర్లు, అనేక బాలబాలికల థియేటర్లు, బయల్దేరి ప్రజలవిజ్ఞానాన్ని అభివృద్ధిచేస్తున్నాయి. షేక్స్పియర్ రచించిన కింగ్‌లియర్, ఒథెల్లో మొదలైన నాటకాలు, గోర్కీ-గొగోల్ వంటి రష్యన్ రచయితల నాటకాలు, ఆథియేటర్లలో ఎక్కువగా ప్రదర్శించబడతాయి.

ఉత్తరధృవ ప్రాంతంలో ఎస్కిమోలు, ఎవెన్‌కీలు, యాకూట్‌లు, నెన్‌ట్సీలు, చుక్‌చీలు, ఇంకా అనేకతెగల ప్రజలున్నారు. వారు అడవి జింకల్ని పెంచుకొని వాటిపాలను తాగేవారు. అడవిమృగాల్ని వేటాడి, వాటి మాంసం తిని బ్రతికేవారు. మట్టిపాత్రలలో అన్నం తిని, వాటిని నీళ్ళతో కడిగి శుభ్రం చేసుకోడానికి బదులు నాలుకతో నాకివేసేవారు. వీరి భాషకు కూడా లిపిలేదు. సోవియట్ ప్రభుత్వం అధికారానికి వచ్చాక యీ ప్రాంతాలలో సమిష్టి వ్యవసాయపద్ధతి అమల్లోకి వచ్చింది. కొద్దిపాటి శ్రమతోనే ప్రజలందరికీ కావలసిన ఆహారపదార్థాలు లభ్యమవుతున్నాయి. అందువల్ల వైజ్ఞానికంగా అభివృద్ధి చెందడానికి కావలసినంత వ్యవధి, అవకాశం లభించింది. నాటకాలకొరకు ప్రజల్లో ఉత్సాహం బయల్దేరింది. అంకాకేమెన్ ఒక అను చుక్‌చీ యువకుడు లెనిన్‌గ్రాడ్‌లో నాటకకళను గురించి కొన్నినెలలు విద్య నభ్యసించి, తన దేశానికి తిరిగివచ్చాడు. తన జాతిభాషలో సొంతంగా ఒక నాటకం వ్రాసి ప్రదర్శించాడు. ఎస్కిమోలకు

యిది తెలిసి, వారు కూడా ఆ నాటకాన్నే ఆడటం మొదలెట్టారు. ఇలాగే యాకూట్స్కి జాతికిచెందిన 6 గురు నటకులు మాస్కోలో తరిఫీదుపొంది సుప్రసిద్ధ ఫ్రెంచి నాటకకర్తఅయిన మోలియర్ నాటకాలను ప్రదర్శించ సాగారు. నిన్న మొన్నటివరకూ అంధకారంలో కాలంగడిపే ప్రజలు ఈ విధంగా ఒక్కసారి అంతర్జాతీయంగా కళలకు వన్నెతెస్తున్నారు.

తాజీకిస్థాన్ రిపబ్లిక్కు మనదేశానికి ఉత్తర సరిహద్దులో ఉంది. అంతా పర్వత ప్రాంతం. పూర్వం బాబర్ ఇక్కడి పామీర్ పర్వత లోయలగుండా మనదేశంలోకి వచ్చాడని ప్రతీతి. అట్టి పర్వతప్రాంతంలో ప్రజలెంత అనాగరికంగాజీవించేవారో చెప్పనక్కర్లేదు. కాని అక్కడే 10 సంవత్సరాల క్రితం ఒకనాటకశాల బయల్దేరింది. విప్లవాన్ని గురించి, విప్లవంవల్ల ప్రజలకు కలిగిన ఉపయోగాల్ని గురించి, ఆ నాటకశాలలో చూపేవారు. జమీందార్లు, మతాధిపతులు యిది సహించలేక నటకుల్ని కాల్చి చంపేవారు. కాని ప్రజా విజ్ఞానానికి నాశనం ఉండదు. ఇంకా ఉత్సాహంతో నాటకాలు వేసేవారు. అంతర్యుద్ధాన్ని గురించి, అందులో విప్లవ వ్యతిరేకుల పరాజయాన్ని గురించి, సమిష్టి వ్యవసాయ పద్ధతిని గురించి, అనేకనాటకాలు వ్రాసి ప్రదర్శించసాగారు. షేక్స్పియర్ వ్రాసిన "ఒథెల్లో" అనేక వేలమంది ప్రేక్షకుల్ని ఆకర్షించింది. తాజీకిస్థాన్‌ను ఫలవంతంగా చేయడానికి రైతులు—కూలీలు మొత్తం 1,60,000 మంది కలిసి స్వయంగా ఒక పెద్ద పంటకాలువను తవ్వుతూన్న రోజులలో, రాత్రిపూట నాటకప్రదర్శనాల ద్వారా, పగలు చెమటోడ్చి పనిచేసిన ప్రజలకు ఆనందం, విశ్రాంతి యిచ్చేవారు.

## ఉజ్బెకిస్థాన్‌లో

దీనికి పక్కనే ఉన్న ఉజ్బెకిస్థాన్‌లో 1917 కి పూర్వం తోలు బొమ్మలు, బుర్రకథలు మాత్రమే ప్రచారంలో ఉండేవి. చదువంటే యేమో తెలియని కొద్దిమంది వీధిగాయకులు ఊరూరు వెళ్ళి, ప్రజలకు తమ ప్రావీణ్యతను ప్రదర్శించి, ఏ రోజు కారోజు తిండికి సంపాదించుకొని పొట్ట పోసుకునేవారు. కాని, యీ రోజున ఉజ్బెకిస్థాన్‌లో "ఉజ్బెక్ స్టేట్



అజర్ బైజాన్‌లో "కీరోగ్లీ" అనే ప్రభుత్వ నాటకరంగం

ఆపెరా " అనే నాటకశాల సోవియట్ యూనియన్‌లోని ఉత్తమ నాటక శాలలలో ఒకటని పేరుపొందింది. ఇదిగాక, షుమారు 50 నాటకశాలలలో షేక్స్పియర్, పుష్కిన్, గోర్కీ, షిల్లర్ వంటి ప్రపంచవిఖ్యాత రచయితల నాటకాలు ప్రదర్శించబడుతున్నాయి.

ఇలాగే, కిర్ఘిజ్ రిపబ్లిక్‌లో ప్రజలు అనేక శతాబ్దాలుగా అనాగరిక జీవితం గడిపి, యీ రోజున ఆధునిక కళలలో అభిరుచిని ప్రదర్శిస్తున్నారు. మొలొగాజాటొకొబయేవ్ అనే అతడు కిర్ఘిజ్ భాషలో మొట్టమొదటి నాటకం వ్రాశాడు. కధావస్తువు, ఒక యువతి తాను ప్రేమించని ఒక యువకునికి బలవంతంగా డబ్బుకోసం అమ్మివేయబడటం ఇందులో కన్యాశుల్కపద్ధతి తీవ్రంగా ఖండించబడింది. స్త్రీస్వాతంత్ర్యం ప్రశంసించ బడింది. 1928 నాటికి కొందరు నటకులు కలిసి ఒక నాటకసమాజంగా ఏర్పడి, "కిర్ఘిజ్ స్టేట్ థియేటరు" ను స్థాపించారు. అందులో ప్రదర్శించబడు కొన్ని నాటకాలపేర్లు: "సమిష్టి వ్యవసాయానికి శత్రువు లెవరు?" "తిరుగుబాటు". ఈరోజున కిర్ఘిజియాలో 17 పెద్ద నాటక శాలలున్నాయి. వాటిలో సుప్రసిద్ధ సోవియట్ రచయితల నాటకాలే కాకుండా, షేక్స్పియర్ రచించిన "ఒథెల్లో", "కింగ్ లియర్" "రోమియో అండ్ జూలియట్" "మర్చెంట్ ఆఫ్ వెన్నిస్" మొదలైనవి కూడా ప్రదర్శించ బడుతున్నాయి.

ఈ రిపబ్లిక్కులన్నీ మనదేశానికి సమీపంలోనే కాశ్మీర్ సంస్థానానికి ఉత్తరంగా ఉన్నాయి. అక్కడ నివశించే ప్రజలు ముస్లిం మతస్థులు. ఈ అనాగరిక జాతులలో విప్లవం ఎంత విజ్ఞానాన్ని పెంపొందించిందో స్వయంగా చూడవలసిందేగాని, వ్రాయడానికి సాధ్యంకాదు. కొన్నివిష యాలు మనకు నమ్మశక్యంకాకుండా ఉంటాయి. మన దేశంలో కోయలు, సవరలు మొదలైన అడవిజాతుల ప్రజలున్నారు. పాములవాళ్లు, ఏనాదులు, నక్కలాళ్లు, మొదలైన అనాగరిక ప్రజలున్నారు. వీరందరూ టాగూర్, గోర్కీ, షేక్స్పియర్, కాళిదాసు మొదలైనవారి నాటకాలను తమ తమ భాషలలో చూచి ఆనందించగల రోజులు వస్తాయంటే, ఇప్పుడు మనం నమ్మగలమా?

# హిందూ—ముస్లిం సంస్కృతి

సోవియట్ ప్రభుత్వం కేవలం తమ దేశ సరిహద్దులలోని సంస్కృతిని మాత్రమే గాక, యితర దేశాల సంస్కృతిని కూడా పరిశోధన చేయడానికి పూనుకుంది. ఉదాహరణకు, మనదేశంలో మహాభారతం హిందువులందరి చేత ఉత్తమ పౌరాణికగ్రంథంగా యెంచబడుతోంది. కొన్నివేల సంవత్సరాల క్రితం మనదేశంలో ప్రజల ఆహారవ్యవహారాలు, నాగరికత, లలిత కళలు, మొదలైనవి యేస్థితిలో ఉండేవో మహాభారతం ద్వారా తెలుసుకోవచ్చు. ఆ రోజుల్లో సమాజనిర్మాణం ఎలా ఉండేదో, ఏయే తత్వశాస్త్రాలు అభివృద్ధి చెందాయో, భాష—విజ్ఞానం ఎంతస్థాయిలో ఉండేవో—ఇవన్నీ చక్కగా అర్థంచేసుకోవచ్చు. ప్రొఫెసర్ కల్యనోవ్ అనే సోవియట్ రచయిత యీ గ్రంథాన్ని సంస్కృతంలోనుంచి రష్యన్ భాషలోకి తర్జుమా చేస్తున్నాడు. అతనిలా తెలియజేస్తున్నాడు :

"మహాభారతాన్ని ఎందుకు తర్జుమాచేయ నారంభించానంటే, సోవియట్ యూనియన్‌లో అనేకమంది మేధావంతులు ప్రాచీన భారతదేశాన్ని గురించి తెలుసుకోవాలని కుతూహలపడుతున్నారు. ప్రపంచ నాగరికతకు భారతదేశం పుట్టినిల్లు. దాన్నిగురించి అనేకవిషయాలు తెలుసుకోవడంలో రష్యన్ ప్రజలు శ్రద్ధ తీసుకుంటున్నారు. ఇతర ప్రాచ్యదేశాలలోను, కొన్ని యూరపియన్ దేశాలలోను, వేర్వేరు భాషలు అభివృద్ధిచెందడంలో మహాభారతంయొక్క ప్రభావం హెచ్చుగా ఉంది. గెటీ అనే జర్మన్ తత్వశాస్త్రజ్ఞుడు "ఫాస్టు" అను గ్రంథాన్ని వ్రాసేటప్పుడు, కాళిదాసు రచించిన ఒక నాటకం చాలావరకు సహాయపడింది. ఆ నాటకానికి కథా వస్తువు మహాభారతం లోనిది.

"మహాభారంలో దేశభక్తి, ధైర్యస్థయిర్యాలు, తెగింపు, యివి చక్కగా చిత్రించబడ్డాయి. ఫాసిజం అనే బ్రహ్మరాక్షసితో ప్రపంచ ప్రజలందరూ హోరాహోరీగా పోరు సల్పుతున్న యీ రోజులలో మహాభారతం ఒక ఉత్తమ సందేశాన్ని యివ్వగలదు. న్యాయం, ధర్మబుద్ధి,

నిష్కల్మష హృదయం, కృతజ్ఞత, పరోపకారం — యిత్యాది ఉత్తమ లక్షణాలను మహాభారతం చిత్రించింది.

"సంస్కృతం నుండి మహాభారతంవంటి బృహద్గ్రంధాన్ని తర్జుమా చేయాలంటే నా జీవితం యావత్తు సరిపోతుంది. కాబట్టి ఇప్పుడు నేను కొంతమందికి తరిఫీదు యిస్తున్నాను. వారి సహాయంతో కొద్ది కాలంలో తర్జుమాను పూర్తిచేయగల్గుతాను. ప్రాచీన మానవ నాగరికతకు మణివంటి యీ ఉత్తమ గ్రంథాన్ని, భారతీయులందరూ గర్వించదగిన యీ పౌరాణిక గాథను, రష్యన్ విద్యార్థులు తెలుసుకోవడానికి అవకాశం లభించుతోంది."

మహాకవి కాళిదాసు రచించిన 'శాకుంతల' నాటకం రష్యన్ భాషలోకి అనువదించబడింది. దాన్ని అనేక థియేటర్లు ప్రదర్శించాయికూడ.

అరబ్ సంస్కృతి విషయంలోకూడా సోవియట్ పరిశోధకులు యెంతో శ్రద్ధచూపుతున్నారు. "ప్రాచ్య విజ్ఞాన పరిషత్తు"లో అరబ్ సంస్కృతికొక ప్రత్యేకశాఖ వుంది. అందులో క్రచ్కోవ్స్కీ అనునతడు ప్రముఖస్థానం అలంకరిస్తున్నాడు. అరబ్ సంస్కృతినిగురించి, అరబ్ భాషనుగురించి, విజ్ఞానాన్ని గురించి సోవియట్ శాస్త్రజ్ఞులు యెక్కువ పరిశోధనలు చేయడానికి కారణంయేమంటే, మధ్య ఆసియాలోను, కాకేసస్‌లోను, టాటారియాలోను నివశించే సోవియట్ ప్రజల ప్రాచీన విజ్ఞానానికి అరబ్ సంస్కృతి పునాది. పూర్వం తామర్లేను కాలంనాటి అరబ్బు ప్రజల సంతతి తాజీకిస్థాన్‌లోను, ఉజ్బెకిస్థాన్‌లోను, నేటికీ వున్నారు. కాకేసస్ పర్వతశ్రేణిలో కొందరు ప్రజలు ప్రాచీనకాలపు అరబ్బీ భాష మాట్లాడుతున్నారు. దాఘెస్థాన్, చెకినో ఇంగుసేషియాలలో ప్రజలు తమ మాతృభాషతోపాటు అరబ్బీ భాషలో పాటలు - పద్యాలు వ్రాసుకొని ఆనందిస్తారు. ప్రాచీనకాలపు రష్యా చరిత్రను వ్రాయటంలో అరబ్బీభాష చాలా ఉపయోగించింది. ముఖ్యంగా టర్కోమేనియా, కాకేసస్, మొదలైన మధ్యఆసియాజాతుల చరిత్రను వ్రాయడంలో ప్రాచీనఅరబ్బీగ్రంధాలు చాలా ఉపయోగించాయి. శామిల్ అనే కాకేసస్ యోధుడు 1798 - 1871

సంవత్సరాలనాటివాడు. ఆరోజుల్లో వ్రాయబడిన అరబ్బీ గ్రంథాల వ్రాత ప్రతులు యిటీవల అచ్చువేయబడి ప్రచురించబడ్డాయి. జార్ చక్రవర్తుల పరిపాలనలో శామిల్, కాకేసస్ స్వాతంత్ర్యోద్యమానికి నాయకుడు. అతని అనుచరులు అరబ్బీ భాషలోనే పుస్తకాలు వ్రాశారు. ఇందుకు కారణం యేమంటే, వారి మాతృభాషయైన అవారియన్‌భాషకు లిపిలేదు. కొరాన్ వ్రాయబడిన అరబ్బీ భాషలోనే తాముకూడా వ్రాస్తే, అప్పట్లో చదువునేర్చు కున్న ఆజాతి ప్రజలంతా వాటిని చదువవచ్చు. దాఘిస్థాన్‌లో యీమధ్య శామిల్ అనుచరులు వ్రాసిన కొన్ని కొత్తవ్రాత ప్రతులు దొరికాయి. వాటిని తర్జుమాచేసి, యుద్ధం కొద్దిరోజులలో వస్తుందనగా, రష్యాలో ప్రచురించారు. మూలగ్రంథాన్ని లెనిన్‌గ్రాడ్‌లో అచ్చువేశారు.

ఇంతేకాదు, అరబ్ సంస్కృతికీ, రష్యన్ సంస్కృతికీగల సంబంధాన్నిగురించి తెలుసుకోడానికి యీ మధ్య అనేక పరిశోధనలు జరిగాయి. పుష్కిన్ రచించిన కొన్ని గ్రంథాలకు కథావస్తువులు అరబ్బీ గ్రంథాలలో దొరికాయి. సెన్ కోవ్‌స్కీ అనే రష్యన్ గ్రంథకర్త వ్రాసిన The Knight on The Dun Horse అను నవలకు కథావస్తువు ఒక ప్రాచీన అరబ్బీ గ్రంథంలో ఉన్నదట "గోర్కీ - అరేబియన్ సాహిత్యం" అనే గ్రంథంలో అరబ్ సంస్కృతియొక్క ప్రభావం మాక్సింగోర్కీ రచనలలో యెక్కడెక్కడ పడిందో చూపబడింది. అరేబియన్ సాహిత్యం యొక్క చరిత్రనుగూర్చికూడా కొన్ని గ్రంథాలు ప్రచురింపబడ్డాయి. The Syntax of the Modern Arabian Literature (ఆ ధు ని క అరేబియన్ సాహిత్యసర్వస్వం) యుద్ధం ప్రారంభమయాక లెనిన్‌గ్రాడ్‌లో ప్రచురింపబడింది.

మన భారతదేశంయొక్క చరిత్రనుగురించి, విజ్ఞానాన్నిగురించి, యింకా అనేక యితర విషయాలనుగురించి ఒక పెద్ద "సర్వస్వం" యీ మధ్యనే ప్రచురింపబడినట్లు "మాస్కో న్యూస్" పత్రిక తెలియజేసింది. ఇందులో మన ప్రాచీన చరిత్రకు సంబంధించినట్టి. ఆధునిక చరిత్రకు సంబంధించినట్టి విషయాలు యెన్నో వున్నాయట.

సోవియట్ యూనియన్‌లో పంచవర్ష ప్రణాళికలు ప్రారంభమైన ప్పటినుంచి నాటకశాలలు, సినీమాలు, చిత్రకళామందిరాలు, నృత్యశాలలు, గానసభలు - విపరీతంగా వృద్ధిచెందుతున్నాయి. ప్రజాసామాన్యం వీటిలో తరిఫీదుపొంది విజ్ఞానం సంపాదిస్తున్నారు. వారివారి దేశచరిత్రలలోని ఉత్కృష్ట విషయాలన్నీ కళ్ళకుకట్టినట్లు చిత్రించబడతాయి. యువకులు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు తమ తమ మానసిక శక్తుల్ని అభివృద్ధి చేసుకోడానికి, ఉత్తమ కళలలో ప్రావీణ్యత సంపాదించడానికి, అనేక "వైజ్ఞానిక మండలులు", "పయొనీర్ భవనాలు", "సంగీత కళాశాలలు", "నాటక కళాపరిషత్తులు", "చిత్రకళా భవనాలు" ఉన్నాయి. ఆయా కళలలో నైపుణ్యం సంపాదించిన అనేకులు అక్కడి విద్యార్థులకు చక్కని తరిఫీదు యిస్తారు. కాబట్టి సోవియట్ యూనియన్‌లో అనేకమంది క్రొత్త కళా కోవిదులు ఉద్భవిస్తున్నారు. క్రొత్త ఫక్కీపై కళల్ని అభివృద్ధిచేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఒక సామాన్య కార్మికునికి నాటక కళలో మంచి అభిరుచి ఉందనుకుందాం. అతను తనపని ముగించుకున్న తరువాత సుప్రసిద్ధ నటకులచే ప్రదర్శించబడు నాటకాలు చూచివచ్చి, ఆపద్ధతుల ప్రకారం తానుకూడా తనక్లబ్బులో నటించి, తనశక్తుల్ని ప్రదర్శించుతాడు. ఇంతేకాదు, అతడు యేదైనా నాటక కళాపరిషత్తులోగాని, సంగీత కళాశాలలోగాని, తరిఫీదు పొందడానికి ఆ ట్రేడ్‌యూనియన్ కొంత సొమ్మును విరాళంగా యిస్తుంది. సోవియట్ యూనియన్‌లో వ్యక్తుల అభిరుచులకెంత ప్రోత్సాహం వుంటుందో దీన్నిబట్టి తెలుసుకోవచ్చు. తల్లితండ్రులు ధనికులు కానంతమాత్రంచేత, వారిబిడ్డల కళాభిరుచి నాశనం కాదు. ఎవరి అభిరుచినిబట్టి వారికి ప్రోత్సాహం యివ్వబడుతుంది. ఈ విధంగా ప్రజలు కళకు తోడ్పడుతారు; కళ ప్రజలకు తోడ్పతుంది. "కళ కోసం కళ" అనే పాడు సిద్ధాంతానికి అక్కడ స్థానంలేదు.

ఉదాహరణకు : ఈరోజున సోవియట్ గాయకులు రెడ్‌ఆర్మీ యోధుల సాహసచర్యల్ని అనేక గేయాలలో స్తుతిస్తున్నారు. సోవియట్ రచయితలు గెరిల్లా సైనికుల చాకచక్యాన్ని ప్రశంసిస్తూ గ్రంథాలు రాస్తున్నారు. సోవియట్ కవులు కార్మికుల దేశభక్తిని స్తుతిస్తూ, పాటలు రాస్తు

న్నారు ఒకవైపు లెనిన్‌గ్రాడ్ నగరాన్ని జర్మన్‌సేనలు ముట్టడించు తూంటే, ఆ లెనిన్‌గ్రాడ్‌లోనే స్టాకొవిచ్ అను సుప్రసిద్ధ గాయకుడు వంచినతల ఎత్తకుండా గేయాలు రాస్తూవుండేవాడు. "ఏడవ సింఫొనీ" అను ఒక కొత్త నడకను ఆయన కనిపెట్టాడట. అందులో ప్రజల వీరోచిత పోరాటాలు, త్యాగదీక్ష, దేశభక్తి - యెంతో చక్కగా ప్రదర్శించ బడుతున్నాయని ప్రతీతి.

## సోవియట్ సాహిత్యం

సోవియట్ సాహిత్యంలో కొత్త సామాజిక నిర్మాణం, కొత్తజీవిత పంథా, చిత్రించబడడం సహజం. విప్లవంవచ్చాక కథావస్తువులు పూర్తిగా మారిపోయాయని చెప్పాలి. జార్ చక్రవర్తుల పరిపాలనలో తయారైన రచనలుచూస్తే, వ్యక్తిని ఉత్తేజపరచే ఆత్మ విశ్వాసం యేకోశంలోనూ కన పడదు. పుస్తకం చదివినతరువాత చదువరులు తామెంతో అల్పులమనీ, యెవరిమీదా పోరాటం జరపడానికి వీలుపడదనీ, అది తమ కర్మ అనీ, నమ్రత, అడకువ, ఇవిమాత్రమే సుగుణాలనీ నేర్చుకుంటారు. ఆరోజుల్లో రచనలన్నీ ప్రపంచానికి దూరంగావున్న మనస్సుకుమాత్రమే సంబంధించి యుండేవి. ఎదురుగా కనపడే యదార్థ పరిస్థితుల్నిగురించి రాయడం నీచ మైన పనిగా భావించబడేది. కాని, యిప్పుడలాకాదు. సోవియట్ సాహిత్యంలో జీవకళ ఉట్టిపడుతూవుంటుంది. కొత్త జీవితంపట్ల మనస్సుకు కలిగే ఆనందం, ఉత్సాహం, కళలలో చక్కగా చిత్రించబడతాయి. విప్లవంవల్ల అధికారం అంతా కార్మికులకీ, రైతులకీ, విద్యార్థులకీ వచ్చింది. ఈరోజున వీరి శక్తి యింతా అంతా అని చెప్పడానికి వీల్లేదు. దోపిళ్ళు, అన్యాయాలు, దౌర్జన్యం లేని ప్రపంచం కావాలని వీరు నమ్ముతారు. అందుకై పనిచేస్తున్నారు. కాబట్టి సోవియట్ నవలలలో సహజంగా కొత్త పరిశ్రమలనుగురించి, సమిష్టి వ్యవసాయాన్నిగురించి, కొత్త మేధావంతుల్నిగురించి, వ్రాస్తున్నారు. కొత్త సమాజాన్ని నిర్మించడంలో నాయకత్వం వహించినవారు కథలలో కథానాయకులు. షోలొకోవ్ రచించిన "బీళ్లుదున్నేరు" అనే నవలకు, అలెగ్జిటాల్‌స్టాయి రచించిన "రొట్టె"కు,



బాల్టిక్ రిపబ్లిక్‌లోని రచయితల, చిత్రకారుల సమావేశం

కథావస్తువు విప్లవానంతరం జరిగిన అంతర్యుద్ధం. చౌకచక్యంగల నిపుణులు, సర్వసామాన్యమైన కార్మికులు, కథానాయకులు.

నేటి సోవియట్ సాహిత్యంలో ప్రజలందరికీ సంబంధించిన ప్రధాన విషయా లెన్నో ఉంటాయి. అనేక శతాబ్దాలు బానిసత్వం అనుభవించిన ప్రజలలోవిప్లవం ఒకక్రొత్త చైతన్యాన్ని కలిగించింది. ప్రతివ్యక్తి స్వతంత్రంగా అభివృద్ధి చెందుతున్నాడు. ప్రతి పౌరుడు తన అభిరుచుల్నిబట్టి ముందుకు పోతున్నాడు. ఇదంతా విప్లవంవల్ల కలిగిన మార్పు. ఈ మార్పును సోవియట్ రచయితలు అనేక రూపాలలో చిత్రించుతున్నారు.

ఈ విధంగా వారు ప్రజలలో తామొక భాగం అని గుర్తించి, ప్రజలతోబాటు ఉత్సాహం, సంతోషం పొందుతున్నారు. అంతర్యుద్ధంలో అస్ట్రోవ్‌స్కీ అనే ఒక యువక కవికి కళ్లుపోయాయట. అయినప్పటికీ, అతని హృదయం కొత్తసమాజం మీదే లగ్నమైంది. దానికొరకు పోరాడాలనే పట్టుదలతో అతను " ఉక్కు యెలా తయారైంది " అను పుస్తకం రచించాడు. అందులో మనిషి చూపగల ధైర్యస్థయిర్యాలు చక్కగా చిత్రించబడ్డాయి. సోవియట్ యువకులు దీన్ని ఎక్కువగా చదువుతారు.

# 7. మతస్వాతంత్ర్యం

సోవియట్ రష్యాలో మతస్వాతంత్ర్యం లేదనీ; మతాధిపతుల్ని ప్రభుత్వం అతిక్రూరంగా అణచివేసి చిత్రవధలకు గురిచేసిందనీ; ఎవరి మతం ప్రకారం వారు దైవారాధన చేసుకొనే హక్కు రష్యాలో లేదనీ: క్రైస్తవ దేవాలయాలు, యితర మతసంస్థలు తగలపెట్టబడ్డాయనీ— చాలా కాలం ప్రచారం సాగింది.

నిజానికి యివన్నీ కల్పితకధలు. సోవియట్ రష్యా యొక్క శత్రువులు చేసిన అబద్ధపు ప్రచారం. మతాన్ని యెప్పుడూ సోవియట్ ప్రభుత్వం అణచియుండలేదు. పూర్తియైన మతస్వాతంత్ర్యం ఉంది. ఎవరి మతం ప్రకారం వారు దైవారాధన చేసుకునే హక్కును ప్రభుత్వం కాపాడుతుంది. సోవియట్ ప్రజాస్వామ్యంలో యిదొక ముఖ్యమైన హక్కు.

విప్లవానికి పూర్వం, అనగా జార్ చక్రవర్తుల పరిపాలనలో, మతం అంటే కేవలం దైవారాధన మాత్రమేకాదు. జారిస్టు నిరంకుశత్వానికి క్రైస్తవ మతాధిపతులు అండగా నిలిచేవారు. పెద్ద మతాధిపతులకు ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలుండేవి. జార్ చక్రవర్తులకు వీరుచేసే సహాయానికి ప్రతిఫలంగా, దేవస్థానాలకు లక్షలాది యకరాలభూమి కానుకగా లభించేది.

వీరందరూ విప్లవం వచ్చిన కొత్తరోజులలో సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రలు పన్నసాగారు. 1919–20 వరకు కొనసాగిన అంతర్యుద్ధంలో క్రైస్తవ దేవాలయాలు విప్లవ ప్రతీఘాతకులకు సహాయం చేశాయి. వాటిల్లో తుపాకులు, మందుగుండు సామాను దాచేవారు.

ఇట్టి మతాధిపతులపై సోవియట్ ప్రభుత్వం విధిలేక కఠినచర్య తీసుకోవలసి వచ్చింది. ప్రజల్ని వ్యతిరేకించిన ప్రతివారిపైన సోవియట్ ప్రభుత్వం కఠినమైన చర్యే తీసుకుంది.

1918 వ సంవత్సరం జనవరి 23 వ తేదీని కొత్తప్రభుత్వం ఒక ఉత్తరువు జారీచేసింది దానిప్రకారం, మతానికీ—ప్రభుత్వానికీ మధ్య ఎట్టి సంబంధం ఉండదు. దైవారాధనకు సంబంధించిన పనులకు తప్ప యితర వాటికి క్రైస్తవ దేవాలయాలుగాని, యితర దేవాలయాలుగాని ఉపయోగ పడరాదు. ఒక్కొక్క దేవాలయానికి నిత్యము వచ్చేవారిసంఖ్య 20 మందికంటె తక్కువగా ఉండి, అట్టి దేవాలయాలు సరియైన స్థితిలో లేకపోయినట్లయితే, వాటిని ప్రభుత్వం స్వాధీనపరచుకొంటుంది.

ఈ శాసనంలో మత స్వాతంత్ర్యానికి వ్యతిరేకమైన నిబంధన యేముంది ?

అయితే, సోవియట్ ప్రభుత్వం మతాధిపతుల్ని విచ్చలవిడిగా వదల లేదు. వారిపై కొన్ని చర్యలు తీసుకుంది. ఉదాహరణకు—

— జమీందార్ల ఎస్టేట్లతోబాటు, దేవస్థానం భూములన్నింటినీ స్వాధీనం చేసుకుని, రైతులకిచ్చింది.

— జార్ చక్రవర్తుల పరిపాలనలో మతాధిపతులకుండే ప్రత్యేక సౌకర్యాలు, హక్కులు, రద్దుచేయబడ్డాయి.

— విద్యకూ, మతానికీ గల సంబంధం తెగగొట్టబడింది.

— జమీందార్లు, పెట్టుబడిదార్లు, జారిస్టు ఉద్యోగస్థులు, మొదలైన వారితోబాటు, మతాధిపతులకు కూడా వోటింగు హక్కు రద్దుచేయబడింది.

ఇంతకు మించి "చిత్రవధ" లేవీ జరగలేదు. స్పష్టంగా చెప్పా లంటే, కొత్తశాసనం ప్రకారం—

— ప్రజలందరూ దైవారాధన చేసుకోవచ్చు.

— మత సంస్కారాలలో పూజార్లు కర్మకాండను నడపవచ్చు.

— ఆరాధకు లిచ్చే విరాళాలపై పూజార్లు జీవించవచ్చు.

మతానికి మూలం దైవారాధనే అయినట్లయితే, సోవియట్ రష్యాలో నేడు పూర్తియైన మతస్వాతంత్ర్యం ఉంది. ఆరాధకులయొక్కగాని, మత సంస్థల యొక్కగాని, వ్యవహారాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకోదు.

ఈ రోజున సోవియట్ యూనియన్‌లో 30 వేల మతసంఘాలున్నాయి. 8,338 క్రైస్తవ దేవాలయాలున్నాయి. అనేక మసీదులున్నాయి. వీటిల్లో దైవారాధనే కాకుండా, పిల్లలకు పేర్లుపెట్టడం, వివాహాలు జరపడం, పండగలు చేయడం, ఉపవాసాలు ఉండడం, అంత్యక్రియలు జరపడం— యిత్యాది కర్మకాండ కూడా ఉంటుంది. ఎవరి యిళ్లల్లో వారు దేవుని విగ్రహాలు ఉంచుకోవచ్చు.

ఉక్రెయిన్, జార్జియా, మంగోలియా, కిర్ఘిజ్ మొదలైన జాతుల ప్రజలు యెవరి భాషలో వారు ఆరాధన చేసుకోవచ్చు; కర్మకాండ జరుపుకోవచ్చు. విప్లవానికి పూర్వం వారికీహక్కు ఉండేదికాదు.

విప్లవంయొక్క మొదటి రోజుల్లో మతాధిపతులకుండే ప్రత్యేకాధికారాలను నిర్మూలించడ మొక్కటే సరిపోలేదు. వివిధ మతస్వరూపాల్ని తీవ్రంగా ఖండించవలసి వచ్చింది. ఎందువల్లనంటే, యీ మతాధిపతులు తమ ప్రచారం ద్వారా ప్రజల్ని నమ్మించి, నెమ్మదిగా వారిని తమ వలలో వేసుకోడాని కవకాశం ఉండేది. కాబట్టి, సోవియట్ ప్రభుత్వం మతానికెంత స్వాతంత్ర్యం యిచ్చిందో, నాస్తికప్రచారానికి కూడా అంతే స్వాతంత్ర్యం యిచ్చింది. దేశం అంతటా నాస్తికప్రచారక దళాలు బయల్దేరాయి. ఈ దళాలు తమ ప్రచారంలో మతాధిపతులు, మతం అనే ముసుగుతో ప్రజల్ని యెలా మోసం చేస్తున్నారో, ప్రజల శ్రేయస్సుకు యెలా భంగం కలిగిస్తున్నారో, ఉదాహరణపూర్వకంగా చెప్పేవారు. నాస్తిక ప్రచారంలో చిత్రకళా ప్రదర్శనలు చూపేవారు. వాటిలో పెద్దపెద్ద కార్టూన్లు, పోస్టర్లు, ఉండేవి. ఒక కార్టూన్‌లో జమీందారొకడు రైతుల రక్తాన్ని పీలుస్తున్నట్లూ, శిలువ వెనకాల దాక్కున్నట్లూ, చిత్రించబడి యుంది. మరొక కార్టూన్‌లో దేశాంతరవాస శిక్ష విధించబడ్డ జమీందార్లు, పెట్టుబడిదార్లు, రాజవంశీకులు ఒకదేవాలయంలో రహస్యంగా కూర్చున్నట్లుగా చూపబడేది. ఇలాగే యింకా అనేక కార్టూన్లు, పోస్టర్లు చూపుతూ ఉండేవారు.

ఈ ప్రజాద్రోహులు మతం అనే ముసుగుతో సోవియట్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి చేసే కుట్రల్ని అరికట్టుటకు ప్రారంభ దశలో నాస్తిక ప్రచారం అవసరమైంది.

నాస్తిక ప్రచారంతోబాటు పాఠశాలలలోను, కాలేజీలలోను విద్యార్థులు ప్రతి జీవిత సమస్యను శాస్త్రీయ దృక్పథంతో హేతువాదాని కనుగుణ్యంగా పరిశీలించేటట్లు సోవియటు ప్రభుత్వం చర్యతీసుకుంది. సోది, మంత్రాలు, భూతవైద్యం, శకునాలు, మొదలైన మూఢవిశ్వాసాల్ని ఉపాధ్యాయులు సహేతుకంగా ఖండించేవారు. విప్లవానికి పూర్వం రష్యన్ ప్రజల మూఢవిశ్వాసాల్ని, సాంఘిక దురాచారాల్ని మాన్పించి, వారిలో చక్కని విజ్ఞానం, విద్య అలవర్చడం అవసరమైంది. అందువల్లనే పాఠశాలలలో యిచ్చిన యీ శాస్త్రీయ దృక్పథం సోవియట్ పౌరులకు కొత్త వికాసం, కొత్త నాగరికత యిచ్చింది.

అప్పట్లో నాస్తిక ప్రచారం, శాస్త్రీయ విద్యావిధానం లేనట్లయితే సోవియట్ ప్రజలు పంచవర్ష ప్రణాళికల ప్రకారం అంతంత అద్భుతమైన పరిశోధనలు, యంత్రోత్పత్తి చేయగలిగేవారు కారు; టెక్నికల్ సరిశ్రమలలో అంతంత అభివృద్ధి జరిగియుండేది కాదు.

క్రమంగా పరిస్థితులు మారాయి. సోవియట్ విధానం నానాటికి బలపడసాగింది. ప్రజల్ని దోచుకొనితినే వర్గాలు మాయమయాయి. వారి యేజంట్లు రహస్యంగా చేసే కుట్రల్ని ప్రభుత్వం కనిపెట్టి, అట్టి చీడ పురుగుల్ని పూర్తిగా నాశనం చేసింది.

1936 నాటికి సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు విధానానికి పూర్తియైన విజయం లభించింది, దేశంలో దోపిడీచేసే వర్గాలు, దోపిడీ చేయబడే వర్గాలు అనే భేదంపోయింది. కార్మికులు, కర్షకులు, మేధావంతులు—అంతాకలసి ఒకే ఒక ఆదర్శం-తో పనిచేయసాగారు. మతం అనే బురఖాతో సోవియట్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రయత్నించే వర్గాలన్నీ నాశనమయాయి.

ఈవిధంగా దేశ పరిస్థితులలో పూర్తియైన మార్పువచ్చింది. కొత్త పరిస్థితుల్నిబట్టి కొత్తశాసనాలు చేయడం సోవియట్ పద్ధతి. కాబట్టి 1937 లో ఆమోదించబడిన స్టాలిన్ రాజ్యాంగచట్టంలో మతాధిపతులందరికీ యితర ప్రజలతో సమానమైన హక్కు-లీయబడ్డాయి. ఈ సందర్భంలో స్టాలిన్ యిలా చెప్పాడు:

"వీరందరూ ఒకనాడు ప్రజలపై పోరాటాలు చేసినవారే. సోవియట్ శాసనాల్ని ధిక్కరించినవారే. వారి చర్యలకు ప్రతీకారంగా సోవియటు ప్రభుత్వం అప్పట్లో వారి వోటింగ్‌హక్కును రద్దుచేసింది. తరువాత కొన్ని సంవత్సరాలు గడిచాయి ప్రజల్ని దోచుకుతినే వర్గాలు నాశనమయాయి. సోవియట్ ప్రభుత్వం అజేయమై నిలబడింది."

నాస్తిక ప్రచారంకూడా యిక అవసరం లేకపోయింది. పూర్వపు నాస్తిక ప్రచారకదళాలు యిప్పుడులేవు. కాని, కొత్త విద్యావిధానంమాత్రం కొనసాగుతూనేవుంది. జీవిత సమస్యల్ని శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించడం, మార్క్సు - లెనిన్ కనుగొన్న సూత్రాలప్రకారం సమాజాన్ని అభివృద్ధిపైపుకి ముందుకు తీసుకుపోవడం, కమ్యూనిస్టుతత్వ శాస్త్రాన్ని కమ్యూనిస్టు నీతి నియమాల్ని, ప్రజలకు బోధించడం - యీ కార్యక్రమం పూర్వంకంటె యెక్కువ ఉత్సాహంతో కొనసాగుతోంది.

కాబట్టి, యీరోజున సోవియటు యూనియన్‌లో యితర దేశాలలో యెక్కడా లేనంతటి మత స్వాతంత్ర్య వుంది. క్రైస్తవ దేవాలయాలు, మసీదులు, సంపూర్ణమైన స్వేచ్ఛ ననుభవిస్తున్నాయి. క్రైస్తవులందరూ కలసి తమ మత గురువును (పేట్రియార్క్) యెన్నుకుంటారు. ముస్లింలందరూ ముస్లిం మత గురువును (ముఫ్తీ) యెన్నుకుంటారు. ప్రతిమత సంస్థకు వేర్వేరు నిధులుంటాయి. సోవియట్ రాజ్యాంగయంత్రంలో అత్యున్నతమైన పదవులకు సహితం మతగురువులు యెన్నుకోబడే అర్హతవుంది. నేడు క్రైస్తవమతాధిపతులు, ముస్లింమతాధిపతులు సోషలిస్టు విధానాన్ని హృదయపూర్వకంగా బలపరుస్తున్నారు. అది ఫాసిస్టు హంతకుల చేతుల్లో పడకుండా రక్షించుటకు అద్భుతమైన ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు.



క్రైస్తవ బాప్టిస్టు సంఘంవారు చర్చిలో సమావేశమై రష్యన్ సైనికుల విజయంకొరకు ప్రార్థిస్తున్నారు.

# 7 (ఎ). రెడ్ ఆర్మీ

ప్రపంచప్రజలకు స్వేచ్ఛాపరిపాలనా ? లేక ఫాసిస్టుదాస్యమా ? అనే భీకరసమస్యను రెడార్మీ నేడు రష్యారంగంలో పరిష్కరిస్తోంది. ప్రపంచ చరిత్రలో యిదివరకెన్నడూ కని, విని యెరుగనంతటి పైశాచికహంతకు లతో ఘోరసంగ్రామంచేస్తూ, నాజీలచే ఆక్రమించుకోబడ్డ కీలకస్థానా లన్నింటినీ ఒకటి తరువాత మరొకదాన్ని, స్వాధీనంచేసుకొంటూంది. నాజీసేనల బలాన్ని తుత్తునియలు చేసి, హిట్లర్‌మూకల ప్లానులన్నింటినీ తలక్రిందు చేస్తోంది. మాతృదేశరక్షణకై త్యాగం చేయడమంటే యేమో ప్రపంచానికి చూపుతోంది. నాజీసేనలు యింతవరకు మన పడమటి సరి హద్దుమీదుగావచ్చి మన దేశాన్నికూడా తమ యినుపసంకెళ్ళలో బంధించ లేకపోయారంటే, యిందుకు కారణం స్టాలిన్‌గ్రాడ్ రంగంలో రెడార్మీ ప్రదర్శించిన చాకచక్యం, ధైర్యసాహసాలే నని చెప్పాలి. యూరపులో రెండోరంగం లేకపోయినప్పటికీ, ఒంటరిగానే రెడ్ఆర్మీ పోరుసల్పుతూ యిన్ని విజయాలు సంపాదిస్తూన్నదంటే, మానవజాతి చరిత్రలో దానిపాత్ర ఎంత ప్రాధాన్యత వహించిందో తెలుసుకొనవచ్చు.

ప్రపంచప్రజల స్వాతంత్ర్య సమరంలో యీ విధంగా నాయకత్వం వహిస్తూ, ఫాసిజం అనే పెనుభూతాన్ని నాశనంచేయగల శక్తి రెడ్ఆర్మీకి యెలా వచ్చిందో చూదాం.

రెడార్మీకీ, యితర సైన్యాలకు చాలా తారతమ్యం ఉంది. కామ్రేడ్ స్టాలిన్ మాటలలో "విముక్తిపొందిన కార్మిక - కర్షకుల సైన్యమే రెడ్ ఆర్మీ. నవంబరు విప్లవంద్వారా యేర్పడ్డ సైన్యం యిది. ఇదే శ్రామికవర్గ నియంతృత్వాన్ని కాపాడే సైన్యం." ప్రజాసామాన్యాన్ని అణచడానికి కాకుండా, స్వాతంత్ర్య మొసగడానికి, రెడ్ఆర్మీ ఏర్పడిందన్నమాట. చరి త్రలో యిదివరకెన్నడూ, ఏ దేశంలోనూ యిలాంటి సైన్యం లేదు.

రెడార్మీయొక్క రెండో ప్రత్యేకతనుగురించి కామ్రేడ్ స్టాలిన్ ఇలా చెప్పాడు: "వలసదేశాల ప్రజల్ని దోచుకునే సైన్యాలకూ, మన సైన్యానికీ చాల తేడావుంది. మనదేశంలో నివసించే వివిధజాతుల ప్రజలమధ్య అన్యోన్యతను పెంపొందించడంవల్లనే రెడ్ఆర్మీ నిర్మాణం యింతబలంగా వుంది. ఇదివరలో (అనగా, జారుచక్రవర్తికాలంలో) అణచియుంచబడ్డ జాతు లన్నింటికీ సంపూర్ణ స్వాతంత్ర్యం యిచ్చి కాపాడుతూన్నందుకే రెడ్ఆర్మీ యింతశక్తిని సంపాదించింది." అనగా, సామ్రాజ్యవాద దేశాలలోవలె. యితరుల స్వాతంత్ర్యాన్ని హరించడంద్వారా కాదు. కాపాడడం ద్వారా, రెడ్ఆర్మీ బలపడింది.

కామ్రేడ్ స్టాలిన్ యింకా ఇలా అన్నాడు: "రెడ్ఆర్మీ పుట్టినప్పటినుంచీ అది అంతర్జాతీయ సాంప్రదాయంలో తరిఫీదు చేయబడింది. ఇతర దేశాల్ని గౌరవించే పద్ధతి దానికి అలవడింది. అన్నిదేశాల కార్మిక ప్రజాసామాన్యాన్ని రెడ్ఆర్మీ ప్రేమిస్తుంది." సామ్రాజ్యవాద ప్రభుత్వాల సేనలకూ, రెడ్ఆర్మీకి, ఎంత వ్యత్యాసం ఉందో యిప్పుడు సులభంగా తెలుసుకోవచ్చు. 14 సామ్రాజ్యప్రభుత్వాల సేనలతో హోరాహోరీగా పోరు సల్పడంద్వారా (1918—20) రెడ్ఆర్మీ పుట్టిందనే విషయం పాఠకులు గుర్తించాలి.

## ప్రజల తోడ్పాటు

రెడ్ఆర్మీ విజయాలకు మరికొన్ని ప్రధాన కారణాలున్నాయి. మొదటిది: యుద్ధరంగానికి వెనుకతట్టునుండి సోవియట్ ప్రజలు సర్వవిధాల తోడ్పడుతున్నారు. తుపాకులు, ఫిరంగులు, టాంకులు, విమానాలు, ఆహార పదార్థాలు యేకధారగా యుద్ధరంగానికి రవాణా చేయబడతాయి. చనిపోయే సైనికులస్థానే రిజర్వుదళాలు విరివిగావచ్చి పోరుసల్పుతాయి. యుద్ధం ప్రారంభమయాక వందలకొద్దీ యుద్ధ పరిశ్రమలు దూరంగా ఊరల్ పర్వతాలవైపుకు గొనిపోబడ్డాయి. ఇంతదూరం శత్రు విమానాలు ప్రయాణం చేసి దాడులు చేయడం అసాధ్యం. ఇవిగాక, కొత్త పరిశ్రమలెన్నో

స్థాపించబడ్డాయి. పాతవి పునర్నిర్మించబడ్డాయి. నేడు సోవియట్ ప్రజలలో ఒకే ఒక భావం విహరిస్తోంది. వారి నినాదం యిది: "అన్నివిధాల రెడ్ఆర్మీకి తోడ్పడాలి. విజయ సాధనకై సర్వశక్తులు ధారపోయాలి" ఇంత ఉత్సాహంతో సోవియట్ ప్రజలు తమ సర్వస్వం యుద్ధరంగానికి అర్పిస్తున్నారంటే, సోషలిస్టు నిర్మాణం యెంత గట్టి పునాదులపై కట్టబడిందో తెలుసుకోవచ్చు.

రెడార్మీకి, సోవియట్ ప్రజలకు మధ్య అపూర్వమైన ప్రేమబంధం వుంది. మంచుతోనిండిన ఉత్తరధృవంలో చూచినా, దక్షిణాన నల్ల సముద్రపు ప్రాంతాలలో చూచినా, ప్రజలు తమ్ము బలపరుస్తున్నారనే విషయం ప్రతి రెడ్ఆర్మీ సైనికునికీ తెలుసు. తమ్ము కని, పెంచిన ప్రజలపై ఫాసిస్టురాక్షసులు గావించిన హత్యాకాండకు ప్రతీకారం జరపాలనే పట్టుదలతో రెడ్ఆర్మీ పోరాడుతుంది.

రెడ్ఆర్మీ శక్తికి మరొక కారణం - విదేశ దురాక్రమణ దాడుల నుండి దేశాన్ని రక్షించుకొంటూ చేసే యీ యుద్ధం ధర్మయుద్ధమని ప్రతి రెడ్ఆర్మీ సైనికునికీ తెలుసు. కనుకనే రెడ్ఆర్మీ యింత అసమానమైన ధైర్యంతోను, అకుంఠితమైన చాకచక్యంతోను పోరాడుతోంది. ఈమధ్య జర్మన్లు కొత్తగా టైగర్ టాంకుల్ని, ఫెర్డినాండ్ ఫిరంగుల్ని రష్యారంగానికి దింపారు. వీటి సహాయంతో రెడ్ఆర్మీని సులభంగా నాశనం చేయవచ్చునని ఆశించారు. కాని వీరి ఆశలు అడియాశలయాయి. ఒకచోట "గాండ్జా" అనేపేరుగల ఒక రెడ్ఆర్మీ యువకునికీ, ఒక టైగర్ టాంకుకూ మధ్య యెడతెగని పోరాటం జరిగింది. టాంకు రాక్షసివలె అతనివైపు దుముకుతూ వస్తోంది. టాంకుల్ని కాల్చి నాశనంచేసే రైఫిల్ అతనివద్ద వుందికాని, మొదటిగుండు గురి తప్పిపోయింది. టాంగు వడివడిగా ముందుకువస్తోంది. "గాండ్జా" చటుక్కున కందకంలోదూరాడు. పక్కగా టాంకు నడిచిపోయింది. ఈసారి దాన్ని యెలాగైనా ధ్వంసంచేయాలనే నిశ్చయంతో "గాండ్జా" టాంకుకు వెనుక గురిచూచి కాల్చాడు. కాని, ఈసారికూడా గురితప్పిపోయింది. టాంకు వెనక్కుమళ్ళి "గాండ్జా" వైపు

వస్తోంది. అతన్ని కందకంలో నొక్కేయ్యాలని దాని ఊహ. చటుక్కున "గాంట్జా" పొజిషన్ మార్చుకొని టాంకును కింది భాగంలో గురిచూచి కాల్చాడు. టాంకుకు నిప్పంటుకుంది. మరఫిరంగులతో కట్టుదిట్టం చేయ బడ్డ టైగర్ టాంకు ఒక్క రెడ్ఆర్మీ సైనికునిచేతిలో నాశనమైంది.

1918 లో కామ్రేడ్ స్టాలిన్ ఒక మిలిటరీ నిపుణునితో మాట్లా డుతూ, యిలాచెప్పాడు : "ప్రతితుపాకి వెనుక ఒకవ్యక్తి ఉంటాడుగదా ! సైన్యాధికారి స్వాధీనంలో ఎన్నితుపాకు లున్నప్పటికీ, వాటితో పోరాడే వ్యక్తులకు చక్కని రాజకీయతరిఫీదు లేకపోతే, అవన్నీ వృధాకాకతిప్పదు. ఎక్కువ తుపాకులు ఉన్నప్పటికీ, విప్లవచైతన్యంగల శత్రువు యెదుట అవి యెందుకూ పనికిరానివౌతాయి." ఈ వాక్యాలకు 'గాంట్జా' చక్కని ఉదాహరణ. కాని, నేడు రెడ్ఆర్మీకి విప్లవచైతన్యం మాత్రమేగాక, టాంకులు, విమానాలు, మరఫిరంగులు ఎన్నోఉన్నాయి. శత్రువుకంటె యెక్కువగా ఉన్నాయి. కార్మిక-కర్షకుల రెడ్ఆర్మీ కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన నాజీమూకల్ని కొద్దిరోజుల్లోనే యూరపునుండి తుడిచివేయ గలదు. అట్టి శుభదినంకొరకు ప్రపంచం అంతా ఎదురుచూస్తోంది.

## రెడ్ఆర్మీ సైనికుని ప్రతిజ్ఞ

ప్రతి రెడార్మీ సైనికుడు యీ క్రింది ప్రతిజ్ఞను తీసుకుంటాడు :

"సోవియట్ పౌరుడనైన నేను కార్మిక-కర్షకుల రెడ్ఆర్మీలో ప్రవేశించుతూ, గౌరవనీయుడుగాను, ధైర్యశాలిగాను, సుశిక్షణతో, మెలకు వతో పోరాడేవాడుగను వుంటాను. మిలిటరీ రహస్యాలను, ప్రభుత్వ రహస్యాలను బైటపెట్టకుండా వుంటాను. మిలిటరీ నియమాలను, కమాండర్ల ఆజ్ఞలను జవదాటకుండా వుంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

"నేను మిలిటరీజ్ఞానాన్ని చిత్తశుద్ధితో సంపాదిస్తాను. మిలిటరీ ఆస్తులను, జాతీయసంపదను అనిమేషుడనై, నిర్నిద్రతగా కాపాడుతాను. నా దేశప్రజలకు, సోవియట్ మాతృభూమికి, కార్మిక-కర్షక ప్రభుత్వానికీ, నా కంఠంలో కొనఊపిరి ఉండేదాకా బాసటగా నిలబడి పోరాడుతాను.



ఎడారి యోధుడు

# రెడ్ ఆర్మీ, నావికాదళం

| | 1934 | 1939 | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సైన్యం |  |  |  | | | | 100 కి 203 మంది హెచ్చు |
| మోటారు సైనికదళాలు |  |  |  | | | | 100 కి 167 హెచ్చు |
| టాంకులు |  |  |  |  |  | | 100 కి 393 హెచ్చు |
| విమానాలు |  |  |  |  | | | 100 కి 230 హెచ్చు |
| బాంబులు |  |  |  |  | | | 100 కి 308 హెచ్చు |
| విమాన విధ్వంసక శతఘ్నులు |  |  |  |  |  | | 100 కి 388 హెచ్చు |

నేను సోవియట్ యూనియన్‌కోసం కార్మిక-కర్షక ప్రభుత్వంయొక్క ఆజ్ఞలు శిరసావహించుతాను. కూలీ-రైతుల రెడ్‌ఆర్మీలో చేరిన నేను నా మాతృదేశాన్ని. ధైర్యంతో, నేర్పుతో, గౌరవప్రతిష్ఠలతో సంరక్షిస్తాను. ఈ కర్తవ్యనిర్వహణలో నా రక్తం ధారపోయడానికి, ప్రాణం బలియివ్వ డానికి వెనుదీయను. సోవియట్ ప్రజల శత్రువులను నాశనంచేయడంలో నేను వెనుకాడను. నేను అసూయచేగాని, ప్రాణభీతిచేతగాని, ఈ ప్రతినను భంగంచేసినట్లయితే, నా మీద సోవియట్ చట్టాలప్రకారం శిక్ష విధింపబడు గాక ! నా ప్రజలు, కార్మిక, కర్షకలోకం నన్ను అసహ్యించుకొనుగాక ! నా సోదరుల చేతిలోనే లజ్జాకరమైన మరణం పొందుదునుగాక ! "

# 8. నైతిక విజయాలు

భౌతిక ప్రపంచంలో సోవియట్ యూనియన్ యెంత అభివృద్ధి గాంచిందో చూచాం. సోషలిస్టు విధానం యేర్పడ్డం వల్ల ఎన్నెన్ని విజయాలు సాధించిందో పరిశీలించాం. ఈ విజయాలు చూచి యితర ప్రభుత్వాలు ఆశ్చర్యపోతున్నాయి. కాని, ఇంతకంటె అద్భుతమైన విజయాలు నైతిక ప్రపంచంలో సాధించబడ్డాయి.

సోవియట్ నాయకులు తమ దేశంలో ఉన్న ఉత్పత్తిసాధనాలన్నింటినీ కొద్దిమందికి లాభాలు సంపాదించిపెట్టడంకోసం కాకుండా, ప్రజలందరికీ ఉపయోగపడేటందుకు పనిచేస్తున్నారు పంచవర్ష ప్రణాళికలన్నీ యీ సూత్రంమీదే ఆధారపడియున్నాయి.

సోవియట్ యూనియన్ శాస్త్రపరిశోధనకెంత ప్రాధాన్యత యిస్తూందో, ప్రజల నైతికాభివృద్ధికి కూడా అంతే ప్రాధాన్యత యిస్తోంది. ఇంగ్లండ్ మొదలైన దేశాలలో నైతికాభివృద్ధి, శాస్త్రాభివృద్ధితో సమానంగా జరగడం లేదనే అభిప్రాయం అక్కడి జ్ఞానవంతులలో బయల్దేరిందంటే అందులో ఆశ్చర్యం ఏమీలేదు. ముఖ్యంగా ఏదైనా ఒకసామాజిక విధానం శిథిలమయే రోజుల్లో నైతికసూత్రాలు కూడా శిథిలావస్థకు వస్తాయి. బ్రిటిష్ శాస్త్రపరిశోధకులు తమ పరిశోధనాలయాలబయట ప్రపంచం ఏమవుతుందో తెలుసుకోకుండా, నూతిలో కప్పమాదిరిగా జీవించేవారైనప్పటికీ, నైతిక సూత్రాలు పతనంకావడం చూచి విచారిస్తున్నారు. తాము కనిపెట్టిన గొప్ప గొప్ప పరిశోధనలన్నీ చెడుమార్గాలలో ఉపయోగించబడ్డం చూచి బాధపడుతున్నారు. సోవియట్ యూనియన్‌లో యిలా కాదు. శాస్త్రాభివృద్ధితో సమానంగా నైతికవ్యవస్థ అభివృద్ధి చెందుతోంది, పంచవర్ష ప్రణాళికలను తయారుచేయడంలోను, వాటి ఫలితాలను పొందడం

లోను, సోవియట్ ప్రజలు ఉత్తమమైన నైతిక జీవులుగా అభివృద్ధి చెందారు.

1. మొదటివిషయం : స్వార్థంకొరకు ఎంతసేపూ డబ్బుసంపాదించడమే జీవిత పరమావధిగా పెట్టుకునేపద్ధతి నశించింది. దానిస్థానే. సంఘం అంతటియొక్క మేలుకొరకు సంపదను అభివృద్ధిచేసే విధానం అమల్లోకి వచ్చింది. చిరకాలంనుంచీ సంఘశ్రేయస్సుకు విరుద్ధంగా వ్యక్తులు దురాశతో ధనం సంపాదించే పద్ధతిని ఖండిస్తూ అన్నిదేశాలలోను మహాపురుషులు, నైతిక శాస్త్రవేత్తలు అనేక గ్రంథాలు వ్రాస్తూ వచ్చారు. ఈ పద్ధతి వల్ల సంఘానికెంతహాని కలుగుతుందో 19 వ శతాబ్దంలో చూచాయగా కనబడింది. 20 వ శతాబ్దంలో యిది బాగా తీవ్రరూపం దాల్చింది. సోవియట్ ప్రభుత్వం ప్లాను ప్రకారం ఉత్పత్తిచేసే విధానాన్ని అమలుజరపడం వల్ల, స్వార్ధచింతయొక్క తల్లివేరు నిర్మూలించబడింది. అక్కడక్కడ పిల్లవేళ్లు బయల్దేరే అవకాశం కొద్దిగా ఉన్నప్పటికీ, అందువల్ల సంఘానికి హాని కలుగదు. ఎప్పటికప్పుడు ఆ పిల్లవేళ్లు సులభంగా నిర్మూలించబడతాయి. తల్లివేరు నాశనమైన తరువాత, పిల్లవేళ్లు సంఘాన్ని యేమీ చేయలేవు.

ఎంత యెక్కువ కష్టపడితే అంత యెక్కువ జీతం, ఎంతచక్కవి పరిశోధనచేస్తే అంత యెక్కువ ఇంక్రిమెంట్లు ఉన్నమాట నిజమే. కాని, లాభంకొరకు ఉత్పత్తిచేసే విధానం-పెట్టుబడిదారీ విధానం— నాశనమవడం వల్ల, స్వార్థపరత్వంయొక్క మూలం నిర్మూలించబడింది.

2. సోషలిస్టు ప్లానింగువల్ల ప్రజలందరికీ ఉద్యోగం దొరికింది. పనికితగిన ప్రతిఫలం లభిస్తోంది. పనిచేసే అవకాశం ప్రతివ్యక్తికీ ఉంది. పెట్టుబడిదారీ విధానంలో మాదిరిగా ధరలు అకస్మాత్తుగా పెరగడం, అకస్మాత్తుగా పడిపోవడం, లేనేలేవు. వాటితోబాటు నిరుద్యోగ సమస్యకూడా నిర్మూలించబడింది. సర్వసాధారణంగా ప్రజలకుకావలసిన సరుకులు తయారుచేయవలసిన అవసర మున్నంత కాలం, అవి తయారుకావడానికి చక్కనిప్లాను కూడా అమలులో ఉన్నంతకాలం, నిరుద్యోగం ఎందుకుంటుంది? ఉత్పత్తి పూర్తిఅయాక, కావలసినంత విశ్రాంతి లభిస్తుంది.

అందరికీ లభిస్తుంది.కాబట్టి, పని ఉన్నంతకాలం అందరికీ పనిచేసేహక్కు ఉంది. పెట్టుబడిదారీ దేశాలన్నింట్లోను అనేకమంది కార్మికులు నిరుద్యోగులుగా ఉంటే, సోవియట్ యూనియన్‌లో కార్మికులు చాలడంలేదు; ఇంతేకాదు; ప్రతి కార్మికుని జీతం యేటేటా హెచ్చుతోంది;

3. పంచవర్ష ప్రణాళికలమూలంగా సోవియట్ యూనియన్‌లో నివశించే ప్రతి వ్యక్తియొక్క జీవితానికి రక్షణ యేర్పడింది. పెట్టుబడిదారీ దేశాలలో ప్రతినెల ఎంతెంత నిలువచేసుకోగలిగితే అంత రక్షణవుంటుంది. సంఘాన్ని వ్యక్తి నమ్మలేడు; దానిపై ఆధారపడలేడు. ఎందువల్లనంటే సంఘం తన జీవితాన్ని రక్షించే గ్యారంటీ యెప్పుడూ యిచ్చియుండలేదు. ఇంగ్లండువంటి దేశాలలో నిరుద్యోగ భృతి, పింఛన్లు ఉన్నప్పటికీ, అవి సరిపోవు. పైగా అవమానకరమైన షరతులెన్నో వున్నాయి. అందువల్ల అనేకులు స్వయంగానే సంపాదించుకొని, నిలువచేసుకోడానికి ప్రయత్నిస్తున్నారు. ఈవిధంగా వ్యక్తి తన కుటుంబరక్షణకై యెదతెగకుండా పాటుబడవలసివస్తోంది. స్వార్థంకొరకు చేయకూడని పనులు చేయవలసి వస్తోంది.

సోవియట్ పౌరుడు యిలాకాదు. తనయొక్క, తన కుటుంబం యొక్క రక్షణకై సంఘంమీద ఆధారపడతాడు. సంఘం అతన్ని రక్షించుతానని గ్యారంటీ యిస్తుంది. వ్యక్తి నిర్విచారంగా కాలంగడుపుతాడు; జబ్బుచేసినప్పుడు ప్రభుత్వం మామూలుగా యిచ్చేజీతంయిస్తూ, అదనంగా యెంత అవసరముంటుందో అంతా యిస్తుంది. ఎన్ని నెలలు, ఎన్ని సంవత్సరాలు చికిత్స అవసరమో అంతకాలం యిస్తుంది. ముసలితనం వస్తే పింఛను యిస్తుంది. యే సందర్భంలోను, యెవరిపట్ల, అవమానకరమైన షరతులు - నిబంధనలు వుండవు.

4. సాధారణంగా భయం, ఔన్నత్యాన్ని అణచివేస్తుంది; ధైర్యాన్ని చంపుతుంది; జీవశక్తిని నాశనంచేస్తుంది; భయాన్ని నిర్మూలించడం అంటే బ్రహ్మాండమైన మానవశక్తిని సమకూర్చడమన్నమాట. సోవియట్ యూనియన్‌లో యిలా జరగడంవల్లనే ప్రజలు అంతంత ఘనకార్యాలు చేయగలిగారు; నైతికంగా అంతంత ఉన్నతమార్గాలలో సంచరిస్తున్నారు.

పెట్టుబడిదారీ దేశాలలో ప్రతి కార్మికుణ్ణీ భయం అనే రాక్షసి ఆవహిస్తుంది. యజమాని ఎప్పుడు డిస్మిసుచేస్తాడోనని భయం; తన్ను తగ్గిస్తే వేలకొద్దీ నిరుద్యోగులు తన స్థానంలో ప్రవేశించడానికి కాచుకొని కూర్చున్నారే! అను భయం; భయంవల్ల కార్మికునిలో బానిసప్రవృత్తి యేర్పడుతుంది. యజమాని యెలాచెబితే అలా చెయ్యాలనిపిస్తుంది. ధరలు పడిపోయినప్పుడు నిరుద్యోగులై పోవలసివస్తుందనే భయం; వ్యాపారం మందగిస్తే జీతాలలో కోతకోస్తారని భయం; విశ్రాంతిలేకుండా నిరంతరం పనిచేస్తే యేదైనా వ్యాధి ప్రవేశిస్తుందేమోనని భయం; ముసలితనంలో పొట్ట పోసుకోవడం యెలాగనే భయం. ఈవిధంగా పెట్టుబడిదారీ దేశాలలో కార్మికునికి అడుగడుక్కీ భయమే. ఏమైనా నిలువవుంటే యే కొద్ది వారాలకో సరిపోతుంది. తరువాత అతని అవస్థ దేవునికే తెలియాలి.

సోవియట్ యూనియన్‌లో అడుగుపెట్టే ప్రతివ్యక్తి, అక్కడి ప్రజలలో భయం పూర్తిగా నిర్మూలించబడ్డం చూచి ఆశ్చర్యపోతాడు. సోషలిస్టు ప్లానింగువల్ల అనేక భయాలు తీరిపోతాయి. కొత్తగా బిడ్డ పుట్టినప్పుడు, ఆ బిడ్డను పోషించాలే! అన్న భయం తల్లితండ్రులలో కనపడదు. డాక్టర్లకు డబ్బుపోయాలనిగాని, విద్యాలయాధికార్లకు జీతాలివ్వాలనిగాని, ఆందోళనపడరు. జీతాలు తగ్గించబడతాయనిగాని, యెక్కువ గంటలు పనిచేయవలసి యుంటుందనిగాని కార్మికులు భయపడరు.

5. సోషలిస్టు ప్లాను అబద్ధాలను, కుటిలత్వాన్ని, విధ్వంసాన్ని సహించదు. పెట్టుబడిదారీ విధానంలో యీ లక్షణాలెన్నివుంటే వ్యక్తి అంత పైకొస్తాడు. కనుకనే సున్నితహృదయం కలవాడు యిదంతాచూచి బాధపడతాడు. అనేక పోటీ పరిశ్రమలలోను, వ్యాపారంలోను ముక్కుకు సూటిగా ఉన్నదున్నట్లు చెప్పడం సులభమైన పనికాదు. అనేక పాపకార్యాలు చేస్తూనేవుంటాడు; ప్రాయశ్చిత్తంకొరకు దాన ధర్మాలు, తీర్థయాత్రలు చేస్తూవుంటాడు!

ఇంతేకాదు; ఒక పరిశ్రమలో అనేకమంది మెకానిక్కులు, టెక్నీషియన్లు వుంటారు. వారిలో యెక్కువ కుశాగ్రబుద్ధిగలవారు తమ తెలివి

తేటలవల్ల ఒకేపనిని యితరులకంటె వేగంగా చేయవచ్చు. లేదా శరీర దారుఢ్యం యెక్కువగావున్న కార్మికుడు మిగతావారికంటె యెక్కువగా పనిచేస్తాడు. కాని యిది మిగతావారికి అనర్థదాయకం. ఎందువల్లనంటే, ఒక నిర్ణీతకాలంలో వారు చేయగలిగిన పనికంటె యెక్కువపని చేయాలని యజమాని మిగతావారందరినీ నిర్బంధిస్తాడు. యజమాని దృష్టిలో శరీర దారుఢ్యం యెక్కువగా వున్నవాడు చేయగలిగిన పనినే అందరూ చేసి తీరాలి. కాబట్టి యెక్కువ కుశాగ్రబుద్ధిగల మెకానిక్కులు బాగా శరీర దారుఢ్యం ఉన్న కార్మికులు, మిగతావారిచే అసహ్యించుకొనబడతారు. కాని అసలు విషయం యేమంటే, తెలివితేటలుగాని, బలంగాని యెక్కువగా వున్నవారిని సంఘం ప్రోత్సహించి, గౌరవించాలి.

సోవియట్ యూనియన్‌లో యీ కృత్రిమ పద్ధతులేవీలేవు. ప్లానింగులో అబద్ధాలకు స్థానంలేదు. కాగితం అట్టలతో జోళ్ళు తయారుచేసి, అవే చర్మంజోళ్ళని అబద్ధం ఆడక్కర్లేదు. ఫ్యాక్టరీలో ఒకవ్యక్తి మిగతా వారికంటె యెక్కువ వేగంగాగాని, చాకచక్యంగాగాని, పనిచేస్తే, అతడు యితరులచే శత్రువుగా భావించబడడు. ఎందువల్లనంటే ప్రతి వ్యక్తి తయారుచేసిన వస్తు సంపదలో అందరికీ హక్కువుంది; దాన్ని అందరూ అనుభవిస్తారు. కాబట్టి పనిలో యెక్కువ చాకచక్యం చూపేవారిని ఇతర కార్మికులు అభినందిస్తారు. వారివలె తాముకూడా అవుదామని ఉత్సాహపడతారు. ప్రభుత్వం కొత్త పరిశోధనలను, కొత్త పద్ధతులను ప్రోత్సహిస్తుంది. యెక్కువ జీతాలిచ్చి బహూకరిస్తుంది. ప్రతి కార్మికుడు తన పనిలో నైపుణ్యం సంపాదించడానికి అన్ని అవకాశాలు యిస్తుంది. ట్రేడ్ యూనియన్లుకూడా తక్కువ శ్రమతో యెక్కువ తయారుచేయాలని కార్మికుల్ని హెచ్చరిస్తాయి. ప్రతి వ్యక్తి తాను చేయగల పనిని యెంత చురుకుగా చేస్తాడో సంఘం అంత హర్షిస్తుంది. ఎందువల్లనంటే, సంఘ శ్రేయస్సుకు అది విరుద్ధంకాదు; అనుకూలం. నిజం చెప్పడం చవటదద్దమ్మలుచేసే పని అని యెవరూ నిందించరు. ఎందువల్లనంటే అబద్ధాలు చెప్పవలసిన అవసరం అక్కడ లేనేలేదు. అబద్ధాలాడేవారిని యితరులు మెచ్చుకోరు; గర్హిస్తారు; కొత్త యంత్రంగాని, కొత్త పద్ధతిగాని అమ

ల్లోకివస్తే కార్మికుల నిరుద్యోగం యెక్కువ అవుతుందనే భయం అక్కడ లేదు. కాబట్టి శాస్త్ర పరిశోధన యెక్కువగా ప్రోత్సహించబడుతోంది.

6. సోషలిస్టు ప్లానింగువల్ల, స్వార్థపరత్వానికీ, స్వార్థరాహిత్యానికీ మధ్యగల ఘర్షణ నిర్మూలించబడింది. పెట్టుబడిదారీ విధానంలో ఈరెండు వేర్వేరుగా వుండడంవల్ల, మానవునిలో ఔన్నత్యం క్షీణిస్తుంది. సోవియట్ యూనియన్‌లో అలాకాదు. ఉన్నతమైన ఒక ఆదర్శంకొరకు యీ రెండూ సమన్వయింపబడ్డంవల్ల ప్రతి మానవుని ఔన్నత్యం హెచ్చుతోంది. సముద్రతరంగాలు ఒకదానితో ఒకటి ఢీకొని, క్రిందికి కూలిపోవడం మనం చూస్తున్నాం. ఇది పెట్టుబడిదారీ దేశాలలో మనంచూసే పరిస్థితి. సోవియట్ యూనియన్‌లో ఒక తరంగం, మరోతరంగం కలిసి యెలా ఉచ్ఛస్థితికి పోతున్నాయో అలాగే మనిషిలోవుండే స్వార్థపరత్వం స్వార్థరాహిత్యం కలిసి మానవసమాజాన్ని, ఉన్నత స్థితికి తీసుకుపోతున్నాయి. కార్మికులు అనేక వృత్తి విద్యలు నేర్చుకొని; తమ తమ శాఖలలో నైపుణ్యం సంపాదిస్తున్నారు. మిగతా కార్మికులకంటె వీరికి జీతాలు హెచ్చు. ఈవిధంగా మనిషిలోవుండే స్వార్థచింత సంతృప్తి చేయబడుతోంది. అయితే తాముచేసే పనివల్ల సమాజంయొక్క సమిష్టి సంపద కూడా యెక్కువౌతూన్న విషయం వీరికి తెలుసు. ఎంత యెక్కువ చాకచక్యంగా పనిచేస్తే సమాజానికంత లాభం అనే విషయాన్ని ప్రజలు గుర్తించి గర్విస్తున్నారు. ఈవిధంగా మనిషిలోవుండే స్వార్థరాహిత్య చింత సంతృప్తి చేయబడుతోంది. ఫుట్‌బాల్ పందెంలో ఒక్కొక్క ఆటగాడు చూపే నైపుణ్యంవల్ల టీమ్ అంతకూ మాత్రమేకాకుండా వ్యక్తులకుకూడా బహుమతులెలా యివ్వబడతాయో, అలాగే, సోవియట్ పరిశ్రమలలో వ్యక్తులు ప్రదర్శించే చాకచక్యంవల్ల సమాజం అంతాలాభం పొందడమేగాక, వ్యక్తులకు యెక్కువ జీతాలు లభిస్తాయి.

7. ప్లాను ప్రకారం ఉత్పత్తి కొనసాగడంవల్ల, సోవియట్ పౌరులలో ఒకవిధమైన కొత్త స్వత్వం, కొత్తబాధ్యతలు యేర్పడ్డాయి. ప్లానులో ప్రతి స్త్రీకి, ప్రతి పురుషునికి, ప్రతి శిశువుకు స్థానం ఉంటూ, ఆ ప్లాను అమలుజరగడంవల్లవచ్చే ప్రతిఫలంలో అందరికీ భాగం ఉన్నదనే విషయం

ప్రతివారికీ తెలుసు. కనుకనే, రైతులు - కార్మికులు - విద్యార్థులు - పిల్లలు అంతా "మన" దేశం, "మన" ఫ్యాక్టరీ, "మన" పొలం, "మన" స్టోరు, "మన" సినీమా అని పలుకుతూ ఉంటారు.

ఈ విధంగా సోషలిస్టు ఆస్తిపై ఎప్పుడైతే కొత్త స్వత్వం ఏర్పడిందో, అప్పుడే కొత్తబాధ్యత కూడా యేర్పడింది. పెట్టుబడిదారీ దేశాలలో కార్మికులు యితరుల ఫ్యాక్టరలలో పని చేస్తారు; తమ శ్రమఫలితం యితరులకు లభిస్తుంది. సోవియట్ యూనియన్‌లో ఫ్యాక్టరీలు, భూమి మొదలైన ఉత్పత్తిసాధనాలు ప్రజలందరి సొత్తు. వాటిలో పనిచేయడం వల్ల లభించే ప్రతిఫలం ప్రజలది. ఈ విషయం సోవియట్ పౌరులందరికీ తెలుసు.

8. సోవియట్ ఉత్పత్తి విధానంలో ప్రతివ్యక్తీ పనిచేసి తీరాలి; సోమరితనంగా ఉండకూడదు. అందువల్ల పనిచేయడం నీచంగా భావించబడదు. పెట్టుబడిదారీ దేశాలలో ఒకవైపు ధనికవర్గం పనికి దొంగలై, యితరుల విషయంలో మాత్రం పనిచెయ్యటం గౌరవప్రదమైనదంటూ ధర్మోపన్యాసా లీయడం మనకు తెలుసు. కార్మికవర్గం నీచమైన వర్గమనీ, ఎలాంటి పనీ చేయకుండా దర్జాగా షికార్లు తిరిగేవారు పెద్దమనుష్యులనే అభిప్రాయం సోవియట్ యూనియన్‌లో నిర్మూలించబడింది. ప్లానుప్రకారం ఉత్పత్తి జరగాలంటే, అందరూ తోడ్పడాలి. అందరికీ దాని ప్రతిఫలం ముట్టుతుంది. ఏశాఖకు చెందినప్పటికీ, పని అంటే అందరికీ గౌరవభావం ఉంటుంది. కార్మికులచే నడుపబడుతూన్న సమాజంలో పనిచేయడం యెలా గర్వించదగిన విషయమో పాఠశాలలలో ప్రతి బాలబాలిక నేర్చుకొంటుంది. తాను ఏ పనిచేస్తూన్నదీ, ఎందుకు చేస్తూన్నదీ, ప్రతివ్యక్తి చిన్నప్పటినుంచీ తెలుసుకుంటాడు. మొత్తం ఉత్పత్తి ఒక మహాసముద్రం వంటిది; అందులో తనభాగం ఒక చిన్ననీటిబొట్టు. అయినప్పటికీ, నీటిబొట్లన్నీ కలిసి మహాసముద్రం యెలా అవుతుందో, అలాగే వ్యక్తులుచేసే పనిమీద సమాజంయొక్క సంపద ఆధారపడియుంటుంది. కాబట్టి, తాను త్రికరణశుద్ధిగా పనిచేసి, యితరుల పనిపట్ల సోదరభావంతో మెలగుతాడు.

9. సాధారణంగా ఎవరైనా నేరాలు పేదరికంవల్ల చేస్తారు. ఎప్పుడైతే పేదరికం, నిరుద్యోగం నిర్మూలించబడతాయో అప్పుడే నేరాలు కూడా పోతాయి. అయితే, కొందరు త్వరగా డబ్బు సంపాదించి విలవ చేసుకుందామనే ఆతృతలో నేరాలు చేయడం కద్దు. ఎల్లకాలం ఒకేవిధమైన పనిచేయడంవల్ల విసుగెత్తుతుంది; లేదా, కొన్నిసందర్భాలలో ఎట్టి హుషారులేక, మానసికశక్తులు వికసించడానికి అవకాశంలేక, నిరాశ - నిస్పృహ, ప్రవేశిస్తాయి. అప్పుడు తాగుడు, జూదం, వ్యభిచారం అలవాటు అవుతాయి. సోవియట్ ప్రభుత్వం పై పరిస్థితుల్ని తొలగించి, వ్యక్తికి ఆనందం, విరామం యిచ్చేటట్లు చేసింది. అందువల్ల నేరాలసంఖ్య బాగా పడిపోయింది. కోర్టులు, జైళ్ళు పూర్వం ఉన్నన్ని లేవు. సోవియట్ యూనియన్‌లో నేరాలసంఖ్య నానాటికీ తగ్గిపోతూంది.

10. సోషలిస్టు ప్లానింగు ప్రతివ్యక్తిజీవితాన్ని శోభావంతంగా చేస్తుంది. ఎందువల్లనంటే, వ్యక్తుల అభిరుచినిబట్టి వారు యే పనిలోనైనా ప్రవేశించవచ్చు; తమ సొంత తెలివితేటలవల్ల కొత్తపద్ధతులు కనుకోక్కవచ్చు; వాటిని ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. "సోషలిస్టు నిర్మాణం" అనే మాట ప్రతిపౌరుని పెదవిమీద ఉంటుంది. ఇందుకై సహాయం చేయమని ప్రతివ్యక్తినీ సంఘం పిలుస్తుంది. సమాజ జీవితంలో అందరికీ ఉచితమైన స్థానం లభించేటట్లు చూస్తుంది. సమాజానికి తన అవసరం ఉన్నదని ప్రతివ్యక్తి గర్విస్తాడు; తాను చేసేపని సమాజానికంతకూ ఉపయోగకరమని తెలుసుకుంటాడు. సోవియట్ యూనియన్‌లో ఎవరూ, ఏ పనినీ వృధా అని భావించరు; అనవసరమని తలచరు.

11. సోవియట్ యూనియన్‌లో నివసించే ప్రతిజాతిపౌరులు ప్లానింగుయొక్క ప్రయోజనాలను అనుభవిస్తున్నారు. ప్రపంచంలో ఆరవ భాగం వైశాల్యంలో, అన్నిజాతుల ప్రజలను సంతృప్తిపరచేటట్లు ప్లాను తయారు చేయబడుతుంది. కొన్ని ప్రాంతాలలో వ్యవసాయానికి, కొన్నిచోట్ల పరిశ్రమలకు ప్రాధాన్యత యివ్వబడిందంటే, అందుకు కారణం తాత్కాలికమైన మిలిటరీఅవసరాలు కాదు; ప్రజల శ్రేయస్సు. సోవి

యట్ యూనియన్‌లో అంతా అన్నదమ్ములు. అందరికీ చేతినిండా పని ఉంది. దానివల్ల అందరికీ ఉపయోగం ఉంటుంది. సోవియట్ ప్రభుత్వం వచ్చాక అభివృద్ధి చెందిన ప్రదేశాలలో పూర్వంకంటె అనేకరెట్లు వేగంగా ఉత్పత్తి కొనసాగుతూన్నప్పటికీ, వెనుకబడియుండే ప్రదేశాలలో యింకా వేగంగా కొనసాగుతోంది. కొద్దికాలంలో అన్నిప్రాంతాలు సమానంగా అభివృద్ధిచెంది, సమానస్థాయిని చేరుకుంటాయి.

అనేక శతాబ్దాలు వెనుకబడియున్న జాతులకు సోషలిజం యిచ్చే సందేశం ఇదే.



రవీంద్రనాథ టాగూర్

"సామ్రాజ్యవాద ప్రభుత్వాలు స్వలాభదృష్టితో తమక్రింది బానిస జాతులఅభివృద్ధిని నిరోధిస్తూంటే, మరోవైపు సోవియట్ యూనియనులో వివిధ జాతులమధ్య అన్యోన్య భావం, సహకారం, వృద్ధిచెందుతున్నాయి. నిన్న మొన్నటివరకూ అడవి జంతువులవలె తిరిగే అనాగరిక ప్రజలకు నాగరికపద్ధతులు బోధింప బడుతున్నాయి. ఇందుకై కొన్నిచోట్ల తరిఫీదు యిస్తున్నారు. మూఢవిశ్వాసాలు, పాత దురలవాట్లు త్వరగా పోయేటట్లు చక్కని విద్యా విధానం కనిపెట్టబడింది. అందుకై ధనం విరివిగా ఖర్చు పెడుతున్నారు. సోవియట్ యూనియన్‌లో దాదాపు 200 ల జాతులు వున్నాయి. నిన్న మొన్నటివరకు యీ జాతుల అభివృద్ధి వివిధ దశలలో ఉండేది. కాని యీ రోజున శాంతిసౌఖ్యాల ననుభవిస్తూ, అన్యోన్య సహకారంతో ముందుకు యెలా నడుస్తున్నాయో నేను స్వయంగా చూచాను. నా దేశం సంగతి ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. మన నాగరికత యెంతో ఉన్నతస్థాయికి చెందినదై యున్నప్పటికీ, మనవారి మానసిక శక్తులు ఉత్తమ తరగతికి చెందినవైయున్నప్పటికీ, మనం తిరిగి అనాగరిక యుగాలకు జారిపోతున్నాం. ఈ రెండు ప్రభుత్వాలమధ్య యెంత తారతమ్యం ఉందో, మనం స్పష్టంగా గుర్తించవలసియుంది. సోవియట్ ప్రభుత్వం అన్యోన్య సహకారంపై ఆధారపడియుంటే, మన ప్రభుత్వం దోపిడీ విధానంపై ఆధారపడి యుంది."

— రవీంద్రనాథ్ టాగూర్.

# 1. సోవియట్ యూనియన్ స్వతంత్రజాతుల సమ్మేళనం

జార్ చక్రవర్తుల కాలంలో, పెట్టుబడిదారీవిధానం నెమ్మదిగా తలయెత్త నారంభించింది. అధికారం, పలుకుబడి, ధనం యెక్కువగా ఉన్న గ్రేట్ రష్యన్ జాతి తమ వ్యాపారాన్ని, పరిశ్రమలను, వృద్ధిచేసు కుంటూ ఉక్రెయిన్, బైలో రష్యా, కాకేసస్, కజాక్‌స్థాన్, తాజీకిస్థాన్ మొదలైన ప్రాంతాలకు వెళ్ళి, అక్కడి మార్కెట్లను స్వాధీనం చేసుకో సాగారు. కాని, ఆయా జాతుల ధనికవర్గం కూడా క్రమంగా చైతన్యం పొంది, తాముకూడా పరిశ్రమలు పెట్టుకోసాగారు. కాని ప్రతిచోటా పరి శ్రమలు వ్యాపిస్తే, గ్రేట్ రష్యన్ జాతి యొక్క ఆధిక్యత నశించదా? కాబట్టి సర్వవిధాల యెక్కువ శక్తిగల గ్రేట్‌రష్యన్లు చిన్నజాతుల పారి శ్రామికాభివృద్ధిని ఆటంక పరచసాగారు. బలహీనమైన జాతులు కేవలం ముడిపదార్థాలనే పండిస్తూ, తమకు కావలసిన వస్తువులన్నీ గ్రేట్ రష్యన్ ఫ్యాక్టరీలలో తయారైనవే కొనుక్కుంటూ ఉండవలసి వచ్చింది. పలుకు బడి, పెత్తనం గ్రేట్ రష్యన్ పెట్టుబడిదారులది కాబట్టి, యీ కృత్రిమ విధానానికి కట్టుబడవలసి వచ్చింది.

ఈ విధంగా, ఒకవైపు గ్రేట్ రష్యన్లు చిన్నజాతుల జాతీయాభి వృద్ధిని ఆటంకపరచడం, మరొకవైపు చిన్నజాతుల ప్రజలలో అభివృద్ధి పొందాలనే కోరిక నానాటికి వృద్ధిచెందడం — ఈ ఘర్షణ, పోరాటాలకు దారితీసింది.

కాని, ఇదే సమయంలో మరొక ఉద్యమం బయల్దేరింది. జమీందారీ విధానాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించి, సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజా పరిపాలన, సోషలిజం స్థాపించబడాలని కార్మికవర్గ పార్టీలు ఆందో

శన ప్రారంభించాయి. తక్కువజాతులు, ఎక్కువజాతులు అనే విభేదం లేకుండా తమ ప్రచారాన్ని యెక్కువ చేయసాగారు. జార్ ప్రభుత్వం యీ ప్రజావెల్లువను ఎదుర్కోవలసి వచ్చింది. ఒక జాతిమీద మరొక జాతినీ, దానిమీద మరొకజాతినీ ఎక్కించి, తిరుగుబాట్లు, దొమ్మీలు, జరిగేటట్లు ప్రోత్సహించింది. ఎందువల్లనంటే, అన్నిజాతులకు చెందిన పీడితవర్గాలు కలిస్తే, తన అధికారం మంటకలుస్తుందని జారుచక్రవర్తులకు తెలుసు.

ఇందుకు చాలా ఉదాహరణలున్నాయి. విప్లవోద్యమాన్ని పెడ ద్రోవపెట్టడానికి జార్ ప్రభుత్వం యూదుజాతి ప్రజలపై యితరుల్ని దొమ్మీలకు రెచ్చగొట్టడం అందరికీ తెలిసిన విషయమే. యూదులపై ప్రజలకు గల ద్వేషభావాన్ని ఆధారంగా తీసుకొని, ధరలు పడిపోయినా- నిరుద్యోగం హెచ్చినా- కరువుబాధ లెక్కువైనా, యూదులే వీటన్నింటికీ కారణమని ప్రచారం చేసేవారు. ట్రాన్స్‌కాకేషియాలో కొత్తపరిశ్రమలు కొన్నిబయ ల్దేరి వృద్ధిపొందసాగాయి. పెట్రోలు పరిశ్రమలో కార్మికోద్యమం అంత కంతకు యెక్కువ కాజొచ్చింది. ఐతే, కార్మికులలో జార్జియన్లూ ఉన్నారు; ఆర్మీనియన్లూ ఉన్నారు; అజర్‌బైజానియన్లూ ఉన్నారు. వీరందరూ ఐక్యమై, జార్‌ప్రభుత్వాన్ని ఢీకొన సిద్ధంగా ఉన్నప్పుడు ప్రభుత్వోద్యోగులు ఒకజాతి కార్మికుల్ని మరొకజాతి కార్మికులపై వుసిగొల్పి, దాన్ని అంతర్యు ద్ధంగా మార్చి, విప్లవపోరాటాన్ని చీల్చడానికి ప్రయత్నించేవారు. ఫలితం, మనదేశంలో అప్పుడప్పుడు బయల్దేరే హిందూ—ముస్లిం దొమ్మీలవంటి దొమ్మీలు యెక్కువగా జరిగేవి.

ఈ విధంగా జార్‌ప్రభుత్వం వివిధజాతుల ప్రజల్ని అణచియుం చుతూ, వారి ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి విశ్వప్రయత్నాలు చేస్తూ ఉండేది.

జార్‌ప్రభుత్వం తన సామ్రాజ్యంలో నివసించే వివిధజాతుల ప్రజలకు వారివారి విజ్ఞానాన్ని, భాషను పెంపొందించుకోడాని కెట్టి అవకాశం యిచ్చేదికాదు. విశ్వవిద్యాలయాలు గ్రేట్‌రష్యాలో మాత్రమే ఉండేవి.

ఉక్రెయిన్‌లో నిషేధించబడ్డాయి. ఉక్రేనియన్ భాషలో యెవరూ చదువు చెప్పకూడదు. రష్యన్‌భాషలోనే చెప్పాలి. కిర్‌ఘీజ్‌లో 200 మంది ప్రజల కొకరు మాత్రమే చదువుకున్నారట! కజాక్‌స్థాన్, ఆర్మీనియా మొదలైన జాతుల ప్రజలకు విశ్వవిద్యాలయంగాని, కనీసం ఒక్క కాలేజీ గాని ఉండేదిగాదు. కొద్దిగా ప్రాథమిక పాఠశాలలు మాత్రం ఉండేవి. ప్రజలకు మాతృభాషలో చదువుచెప్పడానికి వీల్లేదు. మాతృభాషలలో సాహిత్యం ప్రకటించబడేదికాదు. ఉక్రేనియన్ల, జార్జియన్ల, ఆర్మీనియన్ల, కిర్‌ఘీజ్ ప్రజల, జానపదాలు, జాతీయ కళలు, అణచివేయబడ్డాయి. జానపదాలు పాడుకున్నందుకు జార్జియన్లు అరెస్టుచేయబడేవారు. ఉక్రేనియన్ల జాతీయ నాట్యరంగంపై ఆంక్ష విధించబడింది. అనేక జాతీయభాషలకు లిపికూడా ఉండేదికాదు.

ఈ నిర్బంధాలకు వ్యతిరేకంగా పీడితజాతులన్నీ తిరగబడసాగాయి. "మన జాతి నిర్దాక్షిణ్యంగా అణచివేయబడుతోంది. మన భాష, మన విజ్ఞానం. మన కళలు, మన పరిశ్రమలు వికసించడానికి ప్రోత్సాహం లేక పోగా, అనేక ఆటంకాలున్నాయి. మన జాతీయజీవనమే నశించేటట్లుంది!" అనే అసంతృప్తి వివిధజాతుల ప్రజలలో అంతకంతకు యెక్కువ కాజొచ్చింది. అనేక జాతీయోద్యమాలు తీవ్రరూపం దాల్చాయి. అయితే, వీటికి నాయకత్వం వహించింది ప్రజలుకాదు; ఆయా జాతుల పెట్టుబడి దారీ వర్గాలు. ఎందువల్లనంటే, అప్పుడే పైకొస్తూన్న పరిశ్రమలను గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్లు ఆటంకపరుస్తున్నారు. వారిపెత్తనానికి వ్యతిరేకంగా వివిధజాతుల పెట్టుబడిదార్లు తమ ప్రజల జాతీయవాంఛను బహిరంగంగా ప్రకటించసాగారు. ప్రజల జాతీయోద్యమాలకు వీరే నాయకత్వం వహించసాగారు.

గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్లు యీ జాతీయోద్యమాలపట్ల యేవైఖరివి ప్రదర్శించారో చూదాం. జమీందారీ వర్గంయొక్క చేతులలో కీలుబొమ్మగా ఉన్న జార్‌ప్రభుత్వం పోవాలని పట్టుదల వహించారు. పూర్తియైన ప్రజాస్వామ్యపరిపాలన కావాలన్నారు వీరు. అంటే, పారిశ్రామికంగా దేశం ఎంత యెక్కువ అభివృద్ధి చెందగలదో, అంతవరకూ అభివృద్ధి

చెందడానికి స్వేచ్ఛకావాలన్నారు. కాని, యీ స్వేచ్ఛ ఇతర చిన్నజాతులు అభివృద్ధి చెందకుండా ఉండడానికే! తాము తయారుచేసిన సరుకులు వెనుకబడియున్న ప్రాంతాలలో విచ్చలవిడిగా అమ్ముకోటానికే! అక్కడ పండే ముడిసరుకులన్నీ తమ పరిశ్రమలకు చౌకగా లభించేటందుకే! "రష్యా అంతా ఒకే ఒకదేశం; దాన్ని చీల్చడానికి వీల్లేదు!" అనే నినాదాన్ని పైకి తీసుకొచ్చింది వీరే. ఎందువల్లనంటే, రష్యా ఏక ఖండంగా ఉన్నప్పుడే గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్లు యితర జాతుల ప్రజల్ని బానిసత్వంలో ముంచి, తాము అంతకంత కెక్కువలాభాలు సంపాదించుకో వచ్చు! ఏ జాతికి ఆ జాతి విడిపోయి, స్వతంత్ర పరిపాలన నేర్పరచుకుంటే, యిది సాధ్యం కాదు.

ఇక పీడితజాతుల పెట్టుబడిదారీవర్గం యేమందో చూదాం. తాము కూడా స్వేచ్ఛగా అభివృద్ధిపొందాలనీ, విరివిగా పరిశ్రమలను స్థాపిద్దామనీ, చూస్తున్నారు. ఇందుకు సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య పరిపాలన కావాలన్నారు. గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్లు జార్ ప్రభుత్వాన్ని నిర్మూలించి ఎలాంటి ప్రజాస్వామ్యం కావాలంటున్నారో, అలాంటి ప్రజాస్వామ్యమే తమకు కూడా కావాలన్నారు. గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్ల పెత్తనం పోవాలన్నారు. కనుకనే తమ జాతి రష్యానుండి విడిపోయి, స్వతంత్రంగా అభివృద్ధిచెందాలనే నినాదం లేవదీశారు. "రష్యా అంతా ఏక ఖండం" అనే నినాదాన్ని బహిరంగంగా వ్యతిరేకించ సాగారు.

## భీషణ సమస్య

వెంటనే రష్యన్ కార్మికవర్గ పార్టీలన్నింటినీ ఒక భీషణ సమస్య యెదుర్కొంది. జార్ ప్రభుత్వం అన్నిజాతుల ప్రజలకూ శత్రువే. అది నిర్మూలించబడిననాడే, ఏ జాతియైనా స్వేచ్ఛగా వికసించడానికి వీలుంటుంది. అది ఉన్నంతకాలం ప్రజలందరకూ బానిసత్వం తప్పదు. కాబట్టి ఏ ఉద్యమమైనా జార్ప్రభుత్వాన్ని పడగొట్టడానికి తోడ్పడాలిగాని, బల పరచరాదు. కొత్తగా బయల్దేరిన జాతీయోద్యమాలు ప్రజల ఐక్యతను చెడ

గొట్టసంచా మరింత యెక్కువ జేయడానికి సహాయపడాలి. ఇదీ, ఆనాటి రష్యన్ కార్మికవర్గ పార్టీలన్నింటినీ ఎదుర్కొన్న సమస్య.

ఈ ఉద్యమంలో రెండు దృక్పధాలున్నాయి. మొదటిది మెన్షివిక్కుల దృక్పధం; రెండవది బోల్షివిక్కుల దృక్పధం.

మెన్షివిక్కుల వాదనయేమంటే, "మనం అన్ని దేశాలలోను సోషలిజం స్థాపించాలంటున్నాం. ప్రపంచం అంతా ఒకే ఒక సోషలిస్టు రిపబ్లిక్కుగా ఉండాలని పనిచేస్తున్నాం. అటువంటప్పుడు వేర్వేరు జాతులతో పనకేమివని? ఈరోజున జార్ ప్రభుత్వంక్రింద రష్యా అంతా ఏకఖండంగా ఉంది రేపు సోషలిజంవచ్చాక రైతులూ - కూలీలు యేకమైనప్పుడు జాతులసమస్య రావడానికే వీల్లేదు. కాబట్టి మన కార్యక్రమంలో వివిధజాతుల ప్రజలు వైజ్ఞానికంగామాత్రం అభివృద్ధి పొందడానికవకాశమిద్దాం. అదొక్కటీయిస్తే సరిపోతుంది."

దీని అర్థం యేమిటి? వివిధజాతుల ప్రజలు తమ తమ భాషలనభివృద్ధి చేసికోడానికి, విజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి మాత్రం అవకాశమిస్తే సరిపోతుంది. రాజకీయంగా వారు ఒకే ఒక రాజ్యాంగ యంత్రం క్రింద పడివుండాలి. ఒకే ప్రభుత్వంగావించిన శాసనాలకు కట్టుబడియుండాలి.

మెన్షివిక్కుల వాదనకూ, గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్ల వాదనకూ భేదం యేమివుంది? "రష్యా అంతా యేక ఖండం: దాన్ని చీల్చడానికి వీల్లేదు!" అనే నినాదమిచ్చిన గ్రేట్ రష్యన్ పెట్టుబడిదార్ల వాదనను కార్మిక శ్రేయోభిలాషులమని చెప్పుకొనే మెన్షివిక్కులు బలపరచారన్న మాట. పైకిమాత్రం "అంతర్జాతీయ సోషలిజం", "ప్రపంచ సోషలిస్టు సమాఖ్య" మొదలైన పదజాలంతో ప్రజల్ని మోసంచేయజూచారు.

ఇక బోల్షివిక్కుల పాలసీ యెలాంటిది?

"అన్నిజాతుల ప్రజలకు స్వాతంత్ర్యం. ప్రజాస్వామ్య పరిపాలన కావాలంటే, మొట్టమొదట జార్ ప్రభుత్వాన్ని ప్రజలందరూకలిసి కూలద్రోయాలి. ఇది జరిగిన తరవాతనే మిగతావన్నీ జరుగుతాయి. కాబట్టి

కార్మికులు, కర్షకులు, ప్రజాసామాన్యం అంతాకలసి జార్ ప్రభుత్వాన్ని నిర్మూలించి, ప్రజాస్వామ్య పరిపాలనను, శోషలిజాన్ని స్థాపించాలి."

అయితే యీ కర్తవ్యం యెలా నెరవేరుతుంది? అన్ని జాతుల ప్రజలు ఐక్యంకావాలని హెచ్చరించితే సరిపోతుందా?

సరిపోతుందని మెన్షివిక్కులు వాదన. కాని బోల్షివిక్కులు వాస్తవిక పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకున్నారు. వివిధ జాతులకు చెందిన రైతుల్ని, కార్మికుల్ని, పోరాటంలో పాల్గొనవలసిందని పిలుపు ఇచ్చినంత మాత్రాన వారలా పాల్గొనేటట్లు చేసే శక్తియేది? ఏ ఆదర్శంకొరకు వారు పాల్గొంటారు? కొత్తగా వారిలో మొలకలెత్తిన జాతీయ చైతన్యమే వారిని అలా పాల్గొనజేసే శక్తి. ఈ జాతీయ చైతన్యంద్వారా వారిలో యేర్పడ్డ రాజకీయ చైతన్యం ఎంత బలీయమైనదో బోల్షివిక్కులు గ్రహించారు. ఇంతేకాదు; ప్రజలలో రేకెత్తిన జాతీయ చైతన్యాన్ని పెట్టుబడిదారీ వర్గం వినియోగించుకొని ఉన్న ఐక్యతనుకూడా విచ్ఛిన్నం చేయకుండా జాగ్రత్తపడ్డారు.

ఈ దృక్పధంతోనే బోల్షివిక్కులు ప్రతి జాతికి స్వయంనిర్ణయ హక్కును గుర్తించాలని వాదించారు. ఇందులో విడిపోయేహక్కుకూడా ఒక భాగంగా ఉంటుంది.

దీని అర్ధంయేమిటి? ఒకజాతి మరొకజాతిని అణచియుంచదని గ్యారంటీ యివ్వడమన్నమాట. ముందుముందు స్థాపించబడబోయే ప్రజా రాజ్యంలో ప్రతిజాతికీ సమాన హోదా ఉంటుందని హామీ యివ్వడమన్న మాట. ప్రతి జాతిప్రజలు నిజమైన ప్రజాస్వామ్య పరిపాలనను అనుభవించడానికి అర్హులని చెప్పడమన్నమాట. ఈ సూత్రాన్ని అంగీకరించనిదే ప్రజా సామాన్యాన్ని ఒకతాటిమీద నడిపించడం సాధ్యంకాదు. ఒక్కొక్క జాతి ప్రజలమధ్య అంతవరకూ ఉన్న అనుమానాలు, అపోహలు, భయం పోయి, సోదరభావంతో కలిసిపనిచెయ్యాలంటే. యీ హక్కును గుర్తించితీరాలి. అప్పుడే నిజమైన ఐక్యత నిర్మించబడుతుంది. "సరే, ప్రజా ప్రభుత్వం యేర్పడుతుందనుకుందాం; అప్పుడు మాస్థితి

యెలా వుంటుంది ? ఇప్పుడు జారిస్టు సామ్రాజ్యంకింద నలిగిపోతున్నాం; రేపు ప్రజా ప్రభుత్వంకింద నలిగిపోతాం; అంతేనా ? మేము స్వాతంత్ర్యం కావాలని తహతహలాడుతున్నాం. దాని మాట యేమిటి ? ఈరోజున బాగా అభివృద్ధిచెందిన జాతులు, మావంటి వెనుకబడ్డ జాతులపై పెత్తనం చెలాయించకుండా ఉంటాయని గ్యారంటీ యేముంది ? "అని చిన్నజాతులు అడిగే ప్రశ్నకు బోల్షివిక్కులు సూటిగా, స్పష్టంగా, ధైర్యంగా జవాబిచ్చారు. ఎట్టి సందేహాలకు స్థానంలేని గ్యారంటీ యిచ్చారు.

వెంటనే పెట్టుబడిదారీవర్గం మెన్షివిక్కులు, బోల్షివిక్కులపై కారాలు, మిరియాలు నూరసాగారు. విడిపోయే హక్కుకూడా యిస్తే దేశం అంతా ఛిన్నాభిన్నమైపోతుందనీ, ఐక్యత మంటకలసిపోతుందనీ వాదించసాగారు. ఈరోజున మనదేశంలో ముస్లింజాతులకు స్వయంనిర్ణయ హక్కు, విడిపోయేహక్కు యిస్తే దేశం ముక్కచెక్కలౌతుందనీ, ఐక్యత అడుగంటుతుందనీ యెంతమంది వాదించడంలేదు ?

కాని, బోల్షివిక్కులకు అలాంటి భయంలేదు. ఈ రెండుహక్కులూ యిచ్చిననాడు దేశం విభజించబడదనీ, ఐక్యత మరింత బలపడుతుందనీ వాదించారు.

వారి ధైర్యానికి ఆధారం యేమిటి ? ఎప్పుడైతే 17 కోట్లమంది ప్రజాసామాన్యం ఏకముఖంగా జార్‌ప్రభుత్వాన్ని నిర్మూలించుటకై పోరాటం నల్పుతారో ఆనాడు ఐక్యతయొక్క అవసరాన్ని, ప్రాధాన్యతను స్వయంగా తెలుసుకుంటారు. పోరాటంద్వారా నిర్మించబడ్డ ఐక్యత ప్రజా ప్రభుత్వాన్ని నిర్మించేటప్పుడు యింకా బలపడుతుంది. కొత్తగా సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని యితరులు హరించకుండా కాపాడుకొనేటందుకు అన్నిజాతుల ప్రజలు కలసి పట్టుదలతో పనిచేస్తారు.

## సోవియట్ ప్రకటన

ఇట్టి పాలసీని బోల్షివిక్కులు ప్రచారంచేశారు. చివరకు అదే గెలిచింది. విప్లవం వచ్చింది. అన్నిజాతుల కార్మిక-కర్షకులు దుర్భేద్యమైన

ఐక్యతతో సోవియట్ ప్రభుత్వాన్ని స్థాపించారు. నవంబరు 15 వ తేదీని అనగా విప్లవం జరిగిన 8 రోజులతరవాత కొత్త ప్రభుత్వంచేసిన ప్రకటనలో యీ క్రింది హక్కులు గుర్తించబడ్డాయి.

1. సోవియట్ యూనియన్‌లో నివశించే వివిధ జాతుల ప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్యం, సమాన హోదా ఉంటుంది.

2. ప్రతిజాతికి స్వయం నిర్ణయహక్కు, విడిపోయే హక్కుతో సహా, గుర్తించబడింది.

3. కొన్ని జాతులకు, మతాలకు, ప్రత్యేకాధికారాలు, సౌకర్యాలు, ఉండే పద్ధతి నిర్మూలించబడింది.

4. జాతీయ అల్పసంఖ్యాక ప్రజలు వైజ్ఞానికంగా అభివృద్ధిచెందుట కవకాశాలు కల్పించబడతాయి.

అక్టోబరు విప్లవం జరిగిన తరవాత, ఒక్కొక్క జాతి ప్రజలు నివశించే ప్రాంతంలో ఒక్కొక్క సోవియట్ ప్రభుత్వం బయల్దేరింది. ఆ ప్రభుత్వం తన రిపబ్లిక్కు యే పేరుతో పిలువబడాలో స్వయంగా నిర్ణయించుకొనేది. అక్టోబరు విప్లవం చూచి, సామ్రాజ్యవాద ప్రభుత్వాలన్నీ ఓర్వలేకపోయాయి. యుద్ధంలో (మొదటి సామ్రాజ్యవాద యుద్ధం) పాల్గొన్న యిరుపక్షాలూ—అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, జర్మనీ, పోలెండ్—మొదలైన దేశాలన్నింటికీ కన్నుకుట్టింది. సోషలిస్టు విప్లవం వల్ల ప్రపంచ సామ్రాజ్యవాదం అనే కోటలో పెద్ద బీట యేర్పడింది. సోవియట్ ప్రభుత్వం బలపడితే, యీ బీట క్రమక్రమంగా పెద్దదై, ఎప్పుడో ఒకనాడు సామ్రాజ్యవాదం అంతా కూలిపోక తప్పదని పైరాజ్యాలు గ్రహించాయి.

కాబట్టి, సామ్రాజ్యవాద ప్రభుత్వాలన్నీ ఒక్కుమ్మడిగా తమ సైన్యాలతో సోవియట్ యూనియన్ మీదికి దూకాయి.

ఈ విదేశీదండయాత్ర జాతులసమస్యను తిరిగి ముందుకు తీసుకొచ్చింది. స్వయంనిర్ణయ సూత్రం సరియైనదా, కాదా? అనే పరీక్ష సమయం మళ్ళీ వచ్చింది. ప్రతి జాతి సోవియట్ యూనియన్‌నుంచి విడి

పోవాలనే వాదన మళ్ళీ బయల్దేరింది. "మీరు సోవియట్ల పరిపాలనకింద అనవసరంగా నలిగిపోతున్నారు. మేం మిమ్మల్ని విడుదల చేయడానికి వచ్చాం. బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి సేనల సహాయంతో మేం మిమ్మల్ని విడిపిస్తాం. మీకు స్వాతంత్ర్య మిస్తాం. మమ్మల్ని అనుసరించండి!" అంటూ కొందరు విప్లవద్రోహులు ప్రచారం ప్రారంభించారు. విప్లవానికి ముందైతే, యిట్టి ప్రచారం కొంత ఫలించియుండేది. కాని, సామాన్య రైతుకు తెలుసు యీ కొత్త "దూత" లెవరో! ఎవరైతే విప్లవానికి ముందు తన్ను పీల్చి పిప్పిచేశారో, ఆ జమీందార్లు — ఆ భూస్వాములు యిప్పుడు తీయని పలుకులతో తన దగ్గరకు వస్తున్నారు. ఈ జమీందార్ల మాటలువింటే, తిరిగి తన కెలాంటిగతి పడుతుందో రైతుకుతెలుసు. బోల్షివిక్కుల పరిపాలనలోనే అన్నిజాతుల ప్రజలకూ స్వాతంత్ర్యం ఉంటుందని స్వయంగా రైతు చూచాడు. స్వాతంత్ర్యం అంటే, తాను దున్నేభూమిపై తనకు పూర్తి హక్కు ఉంటుందనీ, తాను పడిన శ్రమకు పూర్తి ఫలితం లభిస్తుందనీ, అతనికి తెలుసు. కనుక, కొత్తగా స్వాతంత్ర్యం యిస్తామంటూ బయల్దేరిన యీ "దూతల" ప్రచారం నిష్ప్రయోజనమైంది.

మొదటి విషయం, బోల్షివిక్కుల పరిపాలనలో ప్రతి రైతుకూ భూమి లభించింది; ప్రతి కార్మికునికీ స్వాతంత్ర్యం లభించింది; ప్రతి వ్యక్తికీ తిండి, బట్ట లభించాయి. వీటిని కాపాడుకోవాలి. రెండో విషయం: ప్రతి జాతికీ స్వయంనిర్ణయ హక్కు ఉంది. ప్రజల స్వాతంత్ర్యం కేవలం ఊహాకల్పితమైనది కాదు; యదార్థమైనది. ప్రజలు తమకిష్టమైన పరిపాలనను స్థాపించుకోవచ్చు, తమ కిష్టమైన శాసనాలు చేసుకోవచ్చు. తమ భాషలో స్వేచ్ఛగా చదువుకోవచ్చు; మాట్లాడుకోవచ్చు; తమ భాషలో పాటలు పాడుకోవచ్చు. పాఠశాలలను నిర్మించుకోవచ్చు. నాటక సమాజాలను స్థాపించుకోవచ్చు. తమ్ము ఆటంకపరిచే వారెవరూ ఉండరు. యితర జాతులు తమపై సవారి చేయరు. కనుక ప్రతిరైతు తన భూమిని మాత్రమేగాకుండా, తన జాతినికూడా కాపాడుకునేటందుకు కత్తిదూశాడు, పోరుసల్పాడు: చివరకు జయించాడు. సోవియట్ ప్రభుత్వం ప్రతిజాతికీ స్వయంనిర్ణయ హక్కును (విడిపోయే హక్కుతో సహా) యివ్వడం

వల్లనే, అన్నిజాతుల ప్రజలు కలిసి, ప్రపంచ సామ్రాజ్యవాద ప్రభుత్వా లన్నింటిని ఢీకొని, చివరకు జయించగలిగారు. ఈ హక్కు సరియైనదని రుజువుచేయడాని కింతకంటే ఏమికావాలి ?

ఒకే ప్రభుత్వం యేర్పడి, ఆర్థిక నిర్మాణం - దేశరక్షణ ఆ ప్రభు త్వం ద్వారా జరిగితే మంచిదనేభావం పై అనుభవంవల్ల ప్రజలలో విరి విగా వ్యాపించింది. 1922 డిసెంబరులో యూనియన్ ఆఫ్ ది సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్ స్థాపించబడింది. అప్పటికి 4 రిపబ్లిక్కులు మాత్రమే యూనియన్‌లో చేరాయి. ఆ నాలుగూ రష్యన్ రిపబ్లిక్కు, ఉక్రేనియన్ రిపబ్లిక్కు, బైలో రష్యన్ రిపబ్లిక్కు, ట్రాన్స్ కాకేషియన్ రిపబ్లిక్కు.

కాని, 1922 మొదలు 36 వరకు సోవియట్ యూనియన్‌యొక్క అభివృద్ధిచూస్తే, రెండు పోకడలు స్పష్టంగా కనపడతాయి. మొదటిది యూనియన్ ప్రభుత్వం అంతకంతకు బలపడి, దానికిక్రింద వేర్వేరు రిప బ్లిక్కులు ఐక్యంకావడం. రెండవ పోకడ, అన్ని ప్రాంతాలలోను ఆర్థి కాభివృద్ధి, జాతీయాభివృద్ధి, వేగంగా కొనసాగుతూ, కొత్తకొత్త జాతులు కొత్త రిపబ్లిక్కులు, కొత్త రీజియన్లు బయల్దేరడం, అదివరకే ఉన్న జాతులు, రిపబ్లిక్కులు ఇంకా వృద్ధిచెందసాగాయి. ఈవిధంగా సోషలిస్టు ప్రభుత్వంలో వివిధజాతులకు స్వాతంత్ర్యం లభించడమేకాకుండా కొత్త జాతులనేకం ఉద్భవించాయి. అన్ని జాతులలోను సర్వతోముఖంగా అభి వృద్ధి కనపడింది.

సామ్రాజ్యవాద పరిపాలనలో యిది అసాధ్యంకదా :

ఉదాహరణకు : మధ్య ఆసియా విషయం తీసుకుందాం. జారిస్టు పరిపాలనలో దీనికి టర్కిస్థాన్ అనిపేరు. ఈ ప్రదేశంలో ఉజ్బెక్కులు, తాజిక్కులు, టర్కొమన్స్, కజాక్కులు, కిర్ఘిజ్‌లు అనే 5 తెగల ప్రజలు నివశించేవారు. వీరు వట్టి అనాగరికులు. ఒకచోటినుంచి మరోచోటికి లంబాడీలవలె ప్రయాణంచేస్తూ పొట్టపోసుకునేవారు. ఒక్కొక్క తెగకు ఒక్కొక్క సుల్తాన్ రాజుగావుండి పరిపాలనచేసేవాడు. ఈ సుల్తాన్‌లపై అధికారం జార్ చక్రవర్తిది. మన దేశంలో స్వదేశ సంస్థానాధీశులు

యేలాంటి పరిపాలన చేస్తున్నారో, అంతకంటె హీనంగా వారి పరిపాలన ఉండేది. ఉజ్బెక్కులమధ్య, తాజీక్కులమధ్య, కిర్ఘిజ్‌లమధ్య, టర్కొమాన్లమధ్య - యిలా ఒకతెగకూ, మరోతెగకూ మధ్య యెల్లప్పుడూ దెబ్బలాటలు, దొమ్మీలు జరుగుతూవుండేవి. జారిస్టు ప్రభుత్వం యిట్టి దొమ్మీలను పురిగొల్పుతూవుండేది.

విప్లవం వచ్చాక పరిస్థితులన్నీ పూర్తిగా మారిపోయాయి. ఆర్థికంగా కావలసినంత అభివృద్ధివచ్చింది. కొద్ది సంవత్సరాలకాలంలో యీ 5 తెగలు 5 జాతులుగా వృద్ధిచెందాయి. ప్రతిజాతికీ ప్రత్యేకమైన విజ్ఞానం, కళలు, పరిశ్రమలు, లభించాయి. 1924 లో ఉజ్బెక్, టర్కొమాన్ రిపబ్లిక్కులురెండూ యూనియన్ రిపబ్లిక్కులుగా గుర్తించబడ్డాయి. 1929 లో తాజీకిస్థాన్‌కూడా యూనియన్ రిపబ్లిక్ హోదాను సంపాదించింది. కజాక్, కిర్ఘిజ్ రిపబ్లిక్కులు 1936 లో యూనియన్‌రిపబ్లిక్కులయాయి.

సోవియట్ యూనియన్ యీవిధంగా అంతకంతకు పెద్దదై నలుమూలలకు వ్యాపించింది. కొత్తజాతులు, చిన్నజాతులు క్రమక్రమంగా సోవియట్ యూనియన్‌లో చేరాయి.

డిసెంబరు 1922 నాటికి 4 యూనియన్ రిపబ్లిక్కులు, 4 స్వతంత్ర రిపబ్లిక్కులు, 14 స్వంత రీజియన్లు మాత్రమే సోవియట్ యూనియన్‌లో వుండేవి. యూనియన్ రిపబ్లిక్కులకు మాత్రమే జాతులకుండవలసిన లక్షణాలు పూర్తిగా వుండేవి. కనుక వాటికి మాత్రమే విడిపోయేహక్కు యివ్వబడింది. మిగతావి క్రమంగా అన్ని లక్షణాలు సంపాదించుకొంటున్నాయి. అవికూడా జాతులకుండవలసిన లక్షణాలన్నీ సంపాదించుకొనేటట్లు ప్రభుత్వం ప్రోత్సాహమిచ్చింది. కొత్త వ్యవసాయపద్ధతులద్వారా మానవజాతి వికసింపసాగింది. కొన్నాళ్ళకు అవికూడా జాతుల హోదాను పొందాయి. 1933 నాటికి యీవిధంగా 11 యూనియన్ రిపబ్లిక్కులేర్పడ్డాయి. అనగా వీటన్నింటికీ విడిపోయేహక్కుకూడా లభించినదన్నమాట. ఇవిగాక, 22 స్వతంత్ర రిపబ్లిక్కులు, 9 స్వతంత్ర రీజియన్లు, 10 జాతీయ ప్రదేశాలు, యేర్పడ్డాయి. అంటే, 1932 కంటె 1938 లో షుమారు

60 ప్రదేశాలు వేర్వేరు హోదాలతో సోవియట్ యూనియన్‌లో సభ్య త్వాన్ని కలిగియున్నాయన్నమాట.

1936 లో కొత్త రాజ్యాంగ చట్టం అమలులోకి వచ్చింది. దాని ప్రకారం :

" 1. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ ఫెడరల్ విధానంమీద ఆధారపడు రాజ్యాంగయంత్రం. ఈకింది సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కులు యిష్టపూర్వకంగా, సమాన హక్కులతో, సభ్య త్వాన్ని కలిగియుంటాయి (రిపబ్లిక్కుల జాబితా యివ్వబడింది.)

" 2. సభ్యత్వం పొందిన ప్రతి రిపబ్లిక్కు సోవియట్‌యూనియన్ నుండి విడిపోవడానికి హక్కు గలిగి వుంటుంది.

" 3. ఆయా రిపబ్లిక్కుల అనుమతిలేకుండా వాటి సరిహద్దులను మార్చడానికి వీల్లేదు. "

## సోవియట్ యూనియన్ ఒక సమిష్టి కుటుంబం

ఒకరోజున ఎడ్గార్ స్నో అనే అమెరికన్ పత్రికా విలేఖరి సోవియట్‌యూనియన్‌లో సంచారంచేస్తూ, మధ్య ఆసియాలో నివశించే ఉజ్బేక్ రైతులు, కజాక్ కార్మికులు, యెంతోదూరాన తూర్పురంగంలో పోరాడే రెడ్‌ఆర్మీకి యెందుకు అంత ఉత్సాహంతో అధికోత్పత్తిని కొనసాగిస్తున్నారని ప్రశ్నించాడట. దానికి షరిబోవ్ అనే కజాక్ ప్రతినిధి యిలా జవాబిచ్చాడట: " ఈ యుద్ధంలో శతృవులమధ్యగాని, మిత్రులమధ్యగాని ఉండేదూరం ప్రధానమైన విషయంకాదు. సోవియట్ యూనియన్ ఒక పెద్ద సమిష్టి కుటుంబం; అందులో కజాక్ జాతికి చెందిన మేముకూడా భాగస్థులం. ఇదే ముఖ్యమైన విషయం. సమిష్టి కుటుంబానికి చెందిన ఒక యింటిని యెవరైన ముట్టడిస్తే మా అందరియిళ్లు ముట్టడించబడినట్లే! దూరంగా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోడం యెలా సాధ్యం ? అలాచేస్తే మా స్వాతంత్ర్యం యెలా నిలుస్తుంది ? "

## 2. ముస్లిం ప్రజల విముక్తి

జార్ చక్రవర్తుల కాలంలో, మధ్య ఆసియాలో నివసించే 3 కోట్ల మంది ముస్లిం ప్రజలు దారుణమైన నిరంకుశత్వానికి గురి అయేవారు. అమీర్లని పిలువబడే సామంతరాజులు ప్రజల్ని పీల్చి పిప్పిచేసేవారు. అమీర్ తనక్రింది గవర్నర్లకు, కలెక్టర్లకు, యితర ప్రభుత్వోద్యోగులకు, జీతాలిచ్చే పద్ధతికి బదులు, కమిషన్ పద్ధతిని ప్రతిఫలం యిచ్చేవాడు. ప్రజలవద్ద వారు వసూలుచేసే పన్నులలో 100 కి యింత కమిషన్ అని ఉండేది. ఎంత యెక్కువ పన్నులు వసూలుచేస్తే అంత యెక్కువ కమిషన్ లభించేదన్నమాట! ఉద్యోగాలిచ్చేటప్పుడు లంచగొండితనం, పక్షపాతదృష్టి, ఇంతా అంతా కాదు. పెద్ద ఉద్యోగస్తులు వివిధ డిపార్టు మెంట్లలో తమ బంధు మిత్రులకు మాత్రమే ఉద్యోగా లిచ్చేవారు. ఇక పన్నుల విషయం: పండినా, యెండినా ప్రతి రైతు పంటపై ప్రభుత్వం విధించిన పన్నును చెల్లించవలసిందే. ఇ తేకాదు. రైతువద్ద ఎన్ని పశువు లుంటే అంత "పశువుల పన్ను" చెల్లించాలి. సంతలో ఏదైనా సరుకు అమ్మితే, దానిపై అమ్మకపు పన్ను; కొంటే, కొనుగోలు పన్ను. కుటుంబంలో ఎంతమంది ఉంటే అంతమంది మీదా తలపన్ను. వంతెన దాటితే పన్ను; రోడ్డుమీద నడిస్తే పన్ను. ఈ విధంగా రైతులమీద ఎన్ని రకాల పన్నులు విధించాలో అన్నీ విధించేవారు. ఇంతేకాదు. ప్రతిముస్లిం సంపాదించే దాంట్లో పదవవంతు పాఠశాలలకు, విజ్ఞానాభివృద్ధికి, దాన ధర్మాలకు తప్పనిసరిగా యివ్వాలని వారి మతం చెబుతోంది. ఇలా వసూలు చేసిన సొమ్ముకు "యాకూఫ్" అని పేరు. కాని, యిదికూడా అమీర్ లే కాజేసి సొంతఖర్చులకు వినియోగించుకునేవారు. పెద్దపెద్ద మతాధిపతులకు యిందులో కొంతభాగం యిచ్చేవారు. యీ విధంగా రాజ్యాధికారి హోదా లోను, మతాధిపతి హోదాలోను, అమీర్ తాను సంపాదించే ధనంతో

సంతృప్తిపడి ఊరుకునేవాడా ? లేదు. వర్తకంలోను, పరిశ్రమలలోను, రైల్వే కంపెనీలలోను, 10 కోట్ల రూబుల్సు ధనం పెట్టుబడిపెట్టి యేటేట లక్షలాది రూబుల్సు లాభం సంపాదించేవాడు. ప్రభుత్వాలకి యింత, సొంతఖర్చుకు యింత. అనే వివక్షత ఉండేదికాదు. ప్రజలు చెల్లించే ధనం అంతా తన సొంత సంపాదనగానే చెల్లుబడి అయిపోయేది. ఫ్రెంచి బ్యాంకులలోను, ఇంగ్లీషు బ్యాంకులలోను అమీర్ నిలవజేసిన ధనంకూడా కలుపుకుంటే, యెంత సిరిసంపదలతో అతడు తులతూగుతూ ఉండేవాడో ఊహించుకోవచ్చు. పరిశ్రమల అభివృద్ధికిగాని, వర్తకాభివృద్ధికిగాని, కొంచెంకూడా తోడ్పడేవాడు కాడు. తనప్రజల ఆరోగ్యాన్ని రక్షించడానికి వైద్యసౌకర్యాలు నామమాత్రంగానే ఉండేవి. ఇక ప్రజల విద్యాభివృద్ధి విషయం, వైజ్ఞానికాభివృద్ధి విషయం, చెప్పనవసరమేలేదు. నీటిపారుదలకుగాని, రోడ్ల నిర్మాణానికిగాని, పాఠశాలలకుగాని, ఒక్కదమ్మిడీ కూడా ఖర్చుపెట్టి యెరుగడు.

## మతాధిపతుల పెత్తనం

అమీర్ పరిపాలనలో ప్రజల నిత్యజీవితంపై మతాధిపతుల పెత్తనం యింతా అంతా అని చెప్పడానికి వీల్లేదు. వీరందరిపైన అధికారం అమీర్‌ది. ప్రజల విద్య, న్యాయవిచారణ, కుటుంబ వ్యవహారాలు—అన్నీ యీ మతాధిపతుల చేతుల్లో ఉండేవి. ప్రజలు స్వతంత్రంగా ఆలోచించేశక్తిని నాశనం చేయడానికి వీరొక విద్యావిధానం కనిపెట్టారు. పాఠశాలలలో మతాన్ని గురించి తప్ప, మరొక విషయం బోధించరు. ఎలిమెంటరీ పాఠశాలలలో పిల్లలకు మంత్రాలు చక్కగా వల్లించడం, ప్రార్థన సమయంలో శ్లోకాలు చదవడం, కొరాన్‌లో ఉన్న వాక్యాలు బట్టీవేయడం మాత్రమే నేర్పేవారు. బహుకొద్దిమంది మాత్రమే పుస్తకం చదవగలిగేవారు. వ్రాయగలవారు ఇంకా అరుదే। ఉన్నతపాఠశాలలలో కూడా మత సంబంధమైన విద్యకే ప్రాధాన్యత ఉండేది. శాస్త్రవిద్యలు, కళలు, పరిశోధనలు ఉండేవే కావు.

పట్టణాలలోను, పల్లెటూళ్ళలోను, ముల్లాలే (ముస్లిం మతాధిపతులు ) ఉపాధ్యాయులు ; వారే న్యాయాధికారులు ; వారే సర్వమూ. ప్రతి చిన్న విషయానికి ప్రజలు సలహాకై ముల్లాలవద్దకు వెళ్ళేవారు. ఏ గ్రామ తగాదా వచ్చినా, యే చిన్నసమస్య బయల్దేరినా, ముల్లాలే పరిష్కరించేవారు. ఈ ఆచారం అనేక శతాబ్దాలు అమలులో ఉంది. జీవితంలో అనేక కష్టాలు పడి, పేదరికంతో కృంగి కృశించిన ప్రజలు పరలోకంలోనైనా సుఖపడ వచ్చునుగదా అనే ఆశతో ముల్లాలవద్దకు వస్తాయి. కాని, పరలోకానికి కూడా వెళ్ళే హక్కు యీ ముల్లాల చేతులలోనే ఉండేది. అమీర్ నిరంకుశత్వాన్ని యెవరైనా, ఎప్పుడైనా ధిక్కరిస్తే అలాంటివారిని ముల్లాల భక్తులు ముక్కలుముక్కలుగా చేసి గద్దలకు పారవేసేవారు.

ప్రజల భావాలమీద ముల్లాలకు అంతటి పెత్తనం ఉండేదన్నమాట!

## పెట్టుబడిదారీ విధానం

క్రమంగా రష్యాలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందసాగింది. రష్యన్ బట్టల పరిశ్రమకు పత్తి యెక్కువగా అవసరమయింది. మధ్య ఆసియాలో చక్కని పత్తి పండుతుంది. రష్యన్ పెట్టుబడిదార్లు మధ్య ఆసియాలో బ్యాంకులు, వర్తక కేంద్రాలు, కంపెనీలు విరివిగా స్థాపించి, రైతులవద్ద ముడి పత్తిని కొనడం, తిరిగి వారికి మిల్లుబట్టలు అమ్మడం ప్రారంభించారు. ఈ విధంగా ఆ ప్రాంతపు ప్రజల ఆర్థికవిధానం, సాంఘిక నిర్మాణం మార్పుచెందాయి. వర్తకపు పెట్టుబడి క్రమంగా వృద్ధిచెందడం, పాతకాలపు జమీందారీపద్ధతులు పోవడం, రైతులు నిరుపేదలుగా తయారుకావడం, ప్రారంభమయింది. పేదరైతులు- వ్యవసాయ కూలీలు ఒకప్రక్క, ధనికభూస్వాములు- రష్యన్ బ్యాంకర్లు మరోప్రక్క బయల్దేరారు.

పత్తిపంటకు సాధారణంగా ఎక్కువ పెట్టుబడి అవసరం. రైతులలో అత్యధికభాగం పేదరైతులు కాబట్టి, అప్పులుతెచ్చి పెట్టుబడి పెట్టవలసి వచ్చింది. ప్రైవేట్ కంపెనీలు, వడ్డీవ్యాపారస్తులు రైతులకు విప

రీతమైన రేట్లకు అప్పు యిచ్చేవారు. రైతులు చెల్లించలేక, భూములు వదలుకోవలసి వచ్చేది. పత్తి యెక్కువగా పండే టర్కిస్థాన్‌లో 100 కి 30 మంది ప్రజలు భూమిలేని వ్యవసాయ కూలీలు; 40 మందికి కుటుంబానికి ఒక్కొక్క పశువు చొప్పున మాత్రం ఉండేది; మరో 30 మందికి ఎలాంటి ఆస్థిలేకుండా, యిల్లుసహితం పోగొట్టుకొని, గ్రామగ్రామం తిరుగ నారంభించారు. రైతులభూములు క్రమంగా భూస్వాముల వశమయాయి. రైతు కౌలుదారుగానో, వ్యవసాయ కూలీగానో మారిపోయాడు. కాబట్టి అప్పుతో అవసరం లేకుండా, స్వంతంగా పెట్టుబడి పెట్టుకోగలిగిన కొద్ది మంది భూస్వాములు మాత్రమే పత్తిని పండించి, లాభాలు సంపాదించ గలిగేవారు. ఈ విధంగా, రష్యాలో పెట్టుబడిదారీ విధానం వృద్ధిచెందడం వల్ల, పేదలు మరింత పేదరికంలో పడ్డారు. ధనికులు యింకా ధనవంతులయారు. యూరపు - అమెరికాలలో పెట్టుబడిదారీ విధానం వచ్చాక, రైతులలో చాలమంది ఫ్యాక్టరీలలో కూలీలుగా ప్రవేశించి, పొట్టపోసుకునేవారు. రష్యాలో కూడా కొంతవరకు యిలాగే జరిగింది. కాని, మధ్య ఆసియాలో యిలాకాదు. జార్‌చక్రవర్తి యిక్కడ పరిశ్రమలు వృద్ధికాకుండా కట్టుదిట్టం చేశాడు. మనదేశంవలె మధ్య ఆసియాకూడా పరజాతి పరిశ్రమలకు కావలసిన ముడిసరుకులన్నీ పండించవలసి వచ్చేది. అందువల్ల రైతు యెంత దీనస్థితిలో ఉంటే మాత్రం రష్యన్ చక్రవర్తికి యేం పట్టింది?

ఈవిధంగా భూములు పోగొట్టుకొని ఇళ్ళనుంచి తరుమగొట్టబడిన రైతులు జీవనోపాధిలేక దోపిడీలకు, దొంగతనాలకు దిగవలసివచ్చింది. అనేక ధనిక కుటుంబాలు వీరి దౌర్జన్యానికి గురి అయాయి. ఈ దోపిడీ ముఠాలకు "బస్మాచీ"లని పేరు. వీరుచేసే దారుణాలనుగురించి కథల లోను, పాటలలోను వ్రాయబడించేగాని అసలు వీరిలా ఎందుకు దిగవలసి వచ్చిందో యెవరూ వ్రాయలేదు!

కజాక్, కిర్ఘిజ్, టర్కొమాన్ తెగలవిషయం చెప్పనవసరమే లేదు. వీరు రైతులకంటె అధ్వాన్నస్థితికి తేబడ్డారు. వ్యవసాయంచేయడం వీరికి తెలియదు. పచ్చిక బయళ్ళమీద పశువుల్ని మేపుకుంటూ జీవించేవారు. రష్యాలో రైతుల అసంతృప్తిని అణచడానికి జార్‌ప్రభుత్వం యీ

పచ్చికబయళ్ళలో రష్యన్ రైతుల్ని ప్రవేశపెట్టింది. కనుక కజాక్, కిర్గీజ్, టర్కోమాన్ పశుపులకాపర్లు క్రమక్రమంగా దూరదేశాలకు వలస పోవలసివచ్చింది.

## విప్లవ సందేశం

ఇలాంటి పరిస్థితులలో అక్టోబరు విప్లవం వచ్చింది. వెంటనే మధ్య ఆసియా ప్రజలు తిరుగుబాట్లు చేశారు. 1917 లో తాష్కెంట్ లోను, 1919 లో ఖైవాలోను 1920 లో బొఖారాలోను, సోవియట్ ప్రభుత్వాలేర్పడ్డాయి.

అమీర్ గుండెల్లో రాయిపడింది. కొత్త ప్రభుత్వం ప్రజలహక్కులకు సంబంధించిన ప్రణాళిక నొకదాన్ని ప్రకటించింది. అందులో జారు చక్రవర్తుల నిరంకుశ పరిపాలనకు గురియైన ప్రజలందరూ శాశ్వతంగా విముక్తి చేయబడినట్లు తెలియజేశారు. రష్యాలో నివశించే ప్రజలందరికీ సమాన హోదా, స్వతంత్ర పరిపాలనా హక్కు ఉన్నట్లు ప్రకటించారు. ప్రతిజాతికీ స్వయంనిర్ణయ హక్కు గుర్తించబడింది. ఇష్టంలేకపోతే విడిపోయే హక్కుకూడా యివ్వబడింది. వివిధజాతులమధ్య విచక్షణ, యెక్కువ తక్కువలు నిర్మూలించబడ్డాయి. అన్నిజాతులు సమానమేనని బహిరంగంగా చాటిచెప్పారు. జాతీయఅల్పసంఖ్యాక ప్రజలు, భాషా ప్రయుక్తరాష్ట్రాలు, స్వేచ్ఛగా అభివృద్ధి పొందడానికవకాశం ఏర్పడింది

ఈ ప్రణాళిక ప్రకటించబడిన రెండురోజుల తర్వాత లెనిన్ — స్టాలిన్‌ల సంతకాలతో మరొక ప్రణాళిక ప్రకటించబడింది. దానిపేరు " రష్యాలోను, ప్రాచ్య దేశాలలోను నివశించే ముస్లిం ప్రజలకు విజ్ఞప్తి " ఈసారి బోల్షివిక్కులు "రష్యన్ ముస్లింలను, వోల్గా - క్రిమియాలలో నివశించే టార్టార్లను, సైబీరియా-టర్కిస్థాన్‌లలో నివశించే కిర్గీజ్ ప్రజల్ని, ట్రాన్స్ కాకేషియా - చెంచెంజీ పర్వతప్రాంతాలలో నివశించే టర్కిష్ ప్రజల్ని" సంబోధించారు. "ఎవరి మసీదులు, ప్రార్థన స్థలాలు, సాంప్రదాయాలు జార్ చక్రవర్తుల పరిపాలనలో అణచివేయబడ్డాయో, అట్టి ముస్లింప్రజలందరినీ" సంబోధించారు. "ఈరోజు లగాయతు ముస్లిం

ఆచారాలు, సాంప్రదాయాలు. జాతీయ విజ్ఞానం. జాతీయ సంస్థలు - అన్నీ స్వేచ్ఛగా అభివృద్ధి చెందవచ్చు"నని ప్రకటించారు. "మీరు మీ జాతీయ జీవనాన్ని మీ యిష్టంవచ్చిన పద్ధతిలో స్వేచ్ఛగా నిర్మించుకోవచ్చు; ఎవరూ యిక మిమ్మల్ని అటంకపరచరు" అని బోల్షివిక్కులు వ్రాశారు. "వాటిపై మీకు సంపూర్ణమైన హక్కువుంది. మీహక్కులే కాకుండా, రష్యాలో నివశించే ప్రజలందరి హక్కులూ రక్షించబడతాయి. విప్లవం, విప్లవ సంస్థలైన సోవియట్లు, అతి జాగ్రత్తతో వాటిని కాపాడుతాయి" అని ఆ ప్రకటనలో తెలియజేశారు.

## అమీర్ కుట్రలు

అమీర్‌కి యిక నిద్రపట్టలేదు. ఒంటరిగా తన గదిలో కూర్చొని, పై రెండు ప్రకటనలు జాగ్రత్తగా, వాక్యం తరువాత వాక్యం చదవనారంభించాడు. చదివిందే మళ్ళీ చదివాడు; మళ్ళీ మళ్ళీ చదివాడు.

చివరికొక ఉపాయం ఆలోచించాడు.

ఆసియాఖండంలో బ్రిటిష్ సామ్రాజ్యం విశాలంగా వ్యాపించియుంది. ఇండియా, పెర్ష్యా, ఆఫ్ఘనిస్థాన్, టర్కీ, చైనాదేశాలలో బ్రిటిష్ పలుకుబడి, పెత్తనం యింతా అంతా కాదు. సమీప ప్రాచ్యంలోను, దూర ప్రాచ్యంలోను, మధ్యప్రాచ్యంలోను, బ్రిటిష్ సామ్రాజ్యానిదే పైచేయి. అట్టి బ్రిటిష్ సామ్రాజ్యానికి పోటీగా రష్యన్ జార్‌సామ్రాజ్యం బలపడుతూ వచ్చింది. క్రిమియా, కాకేసస్, మధ్య ఆసియాలను క్రమంగా స్వాధీన పరచుకొని, యింకా దక్షిణంగా వచ్చి, పెర్షియా, ఆఫ్ఘనిస్థాన్, ఇండియాలలో కూడా పెత్తనం సంపాదించాలని ప్రయత్నిస్తోంది. ఇందుకు బ్రిటిష్ ప్రభుత్వం అడ్డుతగుల్తోంది. బ్రిటన్ మధ్య ఆసియాలో పండే పత్తికొరకు, కాకేసస్‌లో దొరికే నూనెకొరకు, ఉవ్విళ్లూరుతోంది. యీ రెండు సామ్రాజ్యాలు ఒకదానిపై ఒకటి దూకడానికి అనేక సంవత్సరాలు ప్రయత్నించాయి. బ్రిటన్ యితరచోట్ల యుద్ధాలలో చిక్కుకున్నప్పుడల్లా జార్‌చక్రవర్తి ఒక్కొక్క భూభాగాన్ని తన్నుకుపోయేవాడు. ఉదాహరణకు, 1907 లో బ్రిటన్ బోయర్‌యుద్ధంలో యిరుక్కున్నప్పుడు రష్యా టిబెట్,

పెర్షియా దేశాలను కాజేసింది. పెర్షియన్ నూనె, బొగ్గు, యినుం రష్యాకు స్వాధీనమయాయి. పెర్షియన్ ప్రజలు బానిసలయారు. కాని, బ్రిటన్‌తో యుద్ధం చేయకుండా తప్పించుకోడానికి రాజీ చేసుకోవలసి వచ్చింది. దాని ప్రకారం ఉత్తర పెర్షియాలో రష్యన్ అధికారం, దక్షిణ పెర్షియాలో బ్రిటిష్ పెత్తనం స్థిరమయింది. ఇలాగే ఆఫ్ఘనిస్థాన్ కూడా యీ రెండు సామ్రాజ్యాల మధ్య యిరుక్కుని, చివరకు బ్రిటిష్ పలుకుబడి క్రిందకు పోయింది. మొదటి సామ్రాజ్యవాద యుద్ధంలో బ్రిటన్—రష్యాలు రెండూ జర్మనీకి వ్యతిరేకంగా పోరాడాయి. అయితే, రష్యాయొక్క సహాయం ఇంకా విరివిగా పొందడానికి బ్రిటన్ టర్కీకి ముఖ్యపట్టణమైన కాన్‌స్టాంటినోపుల్‌ను రష్యాకు వాగ్దానం చేసింది.

రష్యన్ విప్లవంవల్ల సామ్రాజ్యవాదం నాశనమై, బోల్షివిక్కులు అధికారానికి వచ్చాక, వారు బానిసప్రజలకు - ముఖ్యంగా ముస్లిం ప్రజలకు- సంపూర్ణస్వాతంత్ర్యం యిస్తూ ప్రకటించిన ప్రణాళిక బ్రిటిష్ సామ్రాజ్యవాదులగుండెల్లో బేజారుపుట్టించింది. ఎందువల్లనంటే, ఇండియా-పెర్షియా-ఆఫ్ఘనిస్థాన్- టర్కీ- చైనా దేశాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడీ ఇంతా అంతా కాదు. ఒక్క రష్యాలోనే గాకుండా, రష్యా బయట జార్ చక్రవర్తి యితర దేశాలతో చేసుకున్న ఒడంబడిక లన్నింటినీ బోల్షివిక్కులు రద్దుచేశారు. ఒక ప్రకటనలో వారిలా తెలియజేశారు :

"ప్రాచ్య దేశాలలో నివశించే ముస్లిం ప్రజలారా! పెర్షియా - టర్కీ నివాసులారా! అరబ్ ప్రజలారా! హిందువులారా! కొన్ని వందల సంవత్సరాలనుంచి మీ జీవితాలు, మీ ఆస్థులు, మీ ఆచారాలు, మీ సాంప్రదాయాలు, మీ స్వాతంత్ర్యం యూరపియన్ సామ్రాజ్యవాదులచే హరింపబడ్డాయి. ఈ దోపిడీదార్లు యుద్ధానంతరం (1914—18) మీ భూముల్ని తెగ పంచుకుందామని ఉద్దేశించారు. కాని, మేము మీకు తెలియజేసేది యేమంటే; అట్టి రహస్య ఒడంబడికలన్నీ నేటితో రద్దుచేయబడ్డాయి. జార్ చక్రవర్తి తొలగించబడ్డాడు. కాన్‌స్టాంటినోపుల్‌ను రష్యా యిక స్వాధీనం చేసుకోదు. సోవియట్ ప్రభుత్వానికి యితరుల ఆస్థి అవసరం లేదు. అక్రమంగా ఎవరిభూముల్నీ మేం స్వాధీనంచేసుకోము. కాన్‌స్టాంటి

నోపిల్ ముస్లిం ప్రజల స్వాధీనంలోనే ఉంటుంది. ఇలాగే పెర్షియాను, రెండుముక్కలుగా విభజించి పంచుకోవడానికి జరిగిన ఒడంబడికనుకూడా రద్దుచేస్తున్నాం. పెర్షియన్ ప్రజలు తమ రాజకీయ భవిష్యత్తును తామే స్వయంగా నిర్ణయించుకోడానికి హక్కును కలిగియున్నారు. టర్కీని రెండింటికిక్రింద విభజించి, ఆర్మీనియాను లాక్కోవాలని చేసుకున్న ఒడం బడికకూడా యింతటితో రద్దుచేయబడింది."

ఇట్టి విదేశ రాజనీతి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కిష్టంవుంటుందా? కాబట్టి మధ్య ఆసియాలో బ్రిటన్ సహాయం తీసుకొని బోల్షివిక్కుల ప్రభుత్వాన్ని నాశనంచేయ సంకల్పించాడు అమీర్! బ్రిటిష్ ప్రభుత్వం కూడా యిందు కంగీకరించింది. కల్నల్ బెయిలీ, మేజర్ బ్లాకర్, లెఫ్టి నెంట్-కల్నల్ ఎథర్టన్ అనే ముగ్గురు బ్రిటిష్ మిలిటరీ ఉద్యోగస్తులు అమీర్ సేనలకు సహాయంచేస్తూ, విప్లవాన్ని అణచడానికి తోడ్పడ్డారు. బోల్షివిక్కు సైన్యాలు 1918 లోను, 1919 లోను చాలాచోట్ల ఓడించ బడ్డాయి.

## బోల్షివిక్కుల విజయాలు

కాని, బోల్షివిక్కు విప్లవం ప్రజల విప్లవం; ప్రజల హక్కులకై నిలబడే విప్లవం. కనుకనే బోల్షివిక్కులు క్రమక్రమంగా ప్రజల్ని తిరిగి సమీకరించి ఖైవా-బొఖారా-అష్కాబాద్-స్టాలినాబాద్ మొదలైనచోట్ల ఎర్రజెండాను ప్రతిష్ఠించారు. తాజీకిస్థాన్, ఉజ్బేకిస్థాన్, కిర్ఘిజ్, టర్కో మన్‌స్థాన్, కజాక్‌స్థాన్‌లు సోవియటు రిపబ్లిక్కులుగా ప్రకటించబడ్డాయి. అమీర్ అలీంఖాన్ అర్ధరాత్రివేళ తన సింహాసనం విడిచిపెట్టి ఆఫ్ఘనిస్థాన్ పారిపోయాడు.

అయినప్పటికి అమీర్ ఏజంట్లు విప్లవాన్ని నాశనంచేసే ప్రయత్నా లను విడిచిపెట్టలేదు. అన్వర్ పాషా, ఇబ్రాహింబేగ్ అనే యిద్దరు విప్లవ ప్రతీఘాతకులు "బస్మాచీ" బందిపోటు ముఠాలను సమీకరించి, సాయుధ తిరుగుబాట్లు ప్రారంభించారు. ముస్లింప్రజల ప్రాచీన సాంప్రదాయాలను ఆధారంగా తీసుకొని, వారిలో విప్లవ వ్యతిరేకభావాలను ప్రచారం చేయ

నారంభించారు. కాని, వీరిచర్యల గూఢార్థం త్వరలోనే ప్రజలకు బోధ పడింది. అసంఖ్యాకులైన రైతులు ఎర్రసైన్యంలో చేరి, "బస్మాచీ" గుంపుల్ని తరిమితరిమి కొట్టారు.

తాజీకిస్థాన్‌లో, లోకై జిల్లా "బస్మాచీ" గుంపులకొక కేంద్రం. ఒకరోజు రాత్రి ఇబ్రాహింబేగ్ రహస్యంగా కోక్‌టాష్ అనే గ్రామానికి వచ్చాడు. ఆ వూరివారంతా తన తెగకు చెందినవారే. తనకు చాలామంది అనుచరులు ఆ గ్రామంలో లభిస్తారని ఇబ్రాహింబేగ్ ఆశించాడు. గ్రామస్తు లందరినీ ఒకచోట రహస్యంగా సమావేశపరిచాడు. తాను చేస్తూన్న కార్యం అల్లాకు ఎంతో ప్రియమైనదన్నాడు. చాలామంది సైనికులు తనవద్ద ఉన్నా రన్నాడు. ఇతరదేశ ప్రభుత్వాలు తనకు సహాయం చేస్తున్నాయన్నాడు. తుపాకులు, ఫిరంగులు, మరఫిరంగులు, మందుగుండు సామాను, విమా నాలు - అన్నీ ఉన్నాయన్నాడు. రెడ్‌ఆర్మీకి, సోవియట్ ప్రభుత్వానికి ఉన్న బలం బహుకొద్ది మాత్రమే నన్నాడు. "ఐదు సంవత్సరాల క్రితం నేను తూర్పు బొఖారాను విడిచిపెట్టి వెళ్ళాను. బోల్షివిజం అంటే ఏమిటో మీరే స్వయంగా తెలుసుకునే నిమిత్తం నేనల్లా చేశాను; ఇప్పుడు బోల్షివిజం అంటే యేమో తెలుసుకున్నారు; మంచి గుణపాఠాలు నేర్చుకున్నారు. ఏ పతాకాన్ని మీ రనుసరించాలో మీ కిప్పుడు అర్థం అయింది. నన్ను మీరు తప్పకుండా బలపరుస్తారనే ధైర్యంతో మీవద్ద కొచ్చాను. మన భూమిల్ని, మన ఆస్థినీ, మన స్త్రీలను, మన మతాన్ని రక్షించుకోవాలని మీకుంటే నాతో చేరండి; ఈ ధర్మ యుద్ధంలో మనం అంతా కలిసి పోరాడుదాం; ద్రోహుల్ని, బోల్షివిక్కుల్ని, చీల్చి చెండాడుదాం!" అని ఇబ్రాహిం బేగ్ తన ఉపన్యాసాన్ని ముగించాడు.

ఆ గ్రామానికి ఒకవృద్ధు గ్రామపెద్ద. అతడు సభలో లేచి నిల బడ్డాడు. గ్రామస్తులంతా అతన్ని గౌరవిస్తారు; అతని మాటను యెవరూ జవదాటరు. అందరూ నిశ్శబ్దంగా కూచుని చూస్తున్నారు. గ్రామ పెద్ద సందిగ్ధావస్థలో పడ్డాడు. తానూ, ఇబ్రాహింబేగ్ ఒకే తెగలోనివారు. లోకై జిల్లావాసులందరూ తన్ను బలపరచాలని ఇబ్రాహింబేగ్ ఆశించడం సబబైన

విషయమే. ఐతే, యితర భావాలెన్నో అతని మనస్సును పట్టి లాగుతున్నాయి, చేతిలో ఉన్న డబ్బీలోనుంచి కొద్దిగా పొగాకు తీసి, జాగ్రత్తగా దాన్ని పరిశీలించి, బుగ్గకింద యిరికించాడు. తన గ్రామస్థులవైపు ఒక్కసారి దృష్టిని మరల్చి చూచాడు. తాజీకిస్థాన్‌లో సోవియట్ ప్రభుత్వం ఏర్పడ్డాక ప్రజలస్థితి యెలా బాగుపడిందో పూసగుచ్చినట్లు చెప్పసాగాడు. తరువాత ఒక్కనిమిషం ఆగాడు. బుగ్గనున్న పొగాకును ఉమ్మివేసి, తల యిటూ అటూ ఊపుకుంటూ, యిలా అన్నాడు :

" ఇబ్రాహీం! ఇబ్రాహీం! బోల్షివిక్కులనుండి నువ్వు మమ్మల్ని కాపాడుతానంటూ వచ్చావు. నీవద్ద సేనలున్నాయనీ, మందుగుండుసామగ్రి ఉన్నదనీ చెప్పావు. విదేశ ప్రభుత్వాలు నీకు అండగా వున్నాయని అన్నావు. అయితే - ఇబ్రాహీం! నువ్వింత అర్ధరాత్రివేళ రహస్యంగా యిక్కడికి దొంగవలె రావడానికి కారణం యేమిటి? ఎప్పుడూ నువ్వు గొఱ్ఱెమాదిరిగా కొండలోయలలోనే ఉంటావెందుకు? ఇబ్రాహీం! మన తెగవారు చాలాకాలం పోరాటాలుచేశారు. ఇప్పుడు యెవరి పనులలోవారు నిమగ్నులై ప్రశాంత జీవితం గడుపుతున్నారు. కొద్దిరోజులలోనే ప్రత్తి చేలు పూతపూస్తాయి. నువ్వు మా కవసరంలేదు. మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళు. "

వెంటనే ప్రజలలో కలకలం ప్రారంభమయింది. అంతా గ్రామ పెద్దను బలపరిచారు. కొద్దిమంది భూస్వాములుమాత్రం ఇబ్రాహింబేగ్‌ను బలపరిచారు. తాను వచ్చినపని చెడిందని తెలుసుకొని, ఇబ్రాహింబేగ్ గుఱ్ఱంయెక్కి పలాయనమంత్రం చిత్తగించాడు. కొంతకాలం అయాక అతన్ని ప్రజలు పట్టుకొని ప్రభుత్వానికి వప్పజెప్పారు.

అమీర్ అలింఖాన్ యిప్పుడు కాబూల్‌లో ఉన్నివర్తకం చేసుకుంటూ జీవిస్తున్నాడు.

మధ్య ఆసియా ప్రజలు హాయిగా, స్వేచ్ఛావాయువులు పీలుస్తూ తక్కిన ఆసియాఖండ వాసులకు మార్గం చూపుతున్నారు.

# 3. సోవియట్ ఆసియా

మధ్య అసియా సోవియట్ రిపబ్లిక్కులు మనదేశాని కెంతో దూరంలో లేవు. ఫామీర్ కొండల దిగువభాగాన్ని, ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుకు అవతల, ఉజ్బేకిస్థాన్ ఉంది. దాని వైశాల్యం 4,10,000 చదరపు కిలోమీటర్లు (1 కిలోమీటర్ అంటే, షుమారు 5 ఫర్లాంగులు). జనసంఖ్య దాదాపు 63 లక్షలు. ముఖ్యపట్టణం తాష్కెంట్. విశాలమైన పచ్చిక బయళ్లు, బొగ్గుగనులు, నూనెగనులు, గంధకపు గనులు, రాగి గనులు ఉన్నాయి.

ఉజ్బేకిస్థాన్ పత్తి యెక్కువగా పండే ప్రదేశం. కాని, జార్ చక్రవర్తుల పరిపాలనలో రైతులు అంతకంతకు కటికదరిద్రులై, భూములు పోగొట్టుకొని, జమీందార్లవద్ద - భూస్వాములవద్ద, భూములు కౌలుకు తీసుకొని వ్యవసాయం చేసేవారు. అప్పులభారం, శిస్తులభారం, ఇంతా-అంతా అని చెప్పడానికి వీల్లేదు. ఇలా తయారైన పత్తి రష్యన్ ఫ్యాక్టరీలకు పంపబడేది. ఉజ్బేకిస్తాన్‌లో మాత్రం ఒక్క ఫ్యాక్టరీకూడా ఉండేదికాదు. అక్కడ బట్టలపరిశ్రమ బయల్దేరకుండా చూడ్డమే జార్ చక్రవర్తుల ఉద్దేశం.

పాఠశాలలుగాని, హైస్కూళ్లు గాని, నామమాత్రంగా ఉండేవి. ఉన్న కొద్ది పాఠశాలలలో రష్యన్ భాషలోనే పాఠాలు చెప్పేవారు. ఉజ్బేక్ ప్రజల మాతృభాష అణచివేయబడేది. మొత్తం జనాభాలో 100 కి ముగ్గురు మాత్రమే చదువు నేర్చినవారు.

## ఉజ్బేకిస్తాన్‌లో క్రొత్తపరిణామం

1924 వ సంవత్సరంలో ఉజ్బేక్ ప్రజలు తమ సొంతప్రభుత్వాన్ని స్థాపించుకున్నారు. సోషలిస్టు విధానాన్ని స్వీకరించారు. సోవియట్ యూనియన్‌లో ఉజ్బేకిస్తాన్ ఒకభాగం అయింది. అప్పటినుంచీ ఉజ్బేక్ ప్రజల

సాంఘికనిర్మాణంలో ఒక కొత్త పరిణామం వచ్చింది. చక్కని నీటి పారుదల వసతులు, సమిష్టి వ్యవసాయపద్ధతి యేర్పడ్డాయి. సోవియట్ యూనియన్‌లో ఏ రిపబ్లిక్కులోనూ వ్యవసాయాభివృద్ధికి ఇన్ని నీటిపారు దల వసతులు లేవు. 1938 లెక్కలప్రకారం, ఉజ్బేకిస్తాన్‌లో సాగుకు లాయకు అయిన భూమి 28 లక్షల హెక్టేర్లు (1 హెక్టేరు 2½ యకరాలతో సమానం). ఇందులో 15 లక్షల హెక్టేర్ల భూమికి చక్కని నీటిపారుదల వసతులున్నాయి. కాని, 1938 నుంచీ, యేటేటా, కొత్తవసతు లేర్పరుప బడుతున్నాయి ఉదాహరణకు, 1940 లో 270 కిలోమీటర్ల పొడవుగల ఫెర్ఘానా కాలువ తవ్వబడింది. ఆ నీరు 5 లక్షల హెక్టేర్ల భూమిని తడుపు తుంది. సిర్-దరియా అనే నదిలోనుంచి యీ కాలువను తవ్వారు.

సోవియట్ యూనియన్‌లో పండే మొత్తం ప త్తిపంటలో 100 కి 60 వంతులు ఒక్కఉజ్బేకిస్తాన్‌లోనే పండుతుంది. 1938 లెక్కలప్రకారం 10 లక్షల హెక్టేర్ల భూమిలో సమిష్టిపద్ధతిని ప త్తి పండించారు. ఆ ఒక్క సంవత్సరంలో 15 లక్షల టన్నులు పండింది.

ప త్తితోబాటు ధాన్యం, నూనెవిత్తులు, బీట్ దుంప, మల్బరీచెట్లు, ద్రాక్షపళ్ళు ఎక్కువగా పండుతున్నాయి. ఈ భూము లన్నింటికీ నీటిపారు దల వసతులున్నాయి లేనిచోట్ల గోధుమ, బార్లీ, కాయధాన్యాలు పండు తాయి. కొయ్యనాగళ్ళకు బదులు ట్రాక్టర్లు, కొడవళ్ళకు బదులు హార్వెస్టర్ కంబైనులు ఉపయోగించుతున్నారు. ఉజ్బేకిస్తాన్‌లో యీ రోజున మొత్తం 20 వేల ట్రాక్టర్లు, 1500 కంబైన్లు ఉన్నాయి.

ఒక్క వ్యవసాయమేకాదు ; పరిశ్రమలుకూడా అతివేగంతో వృద్ధి పొందుతున్నాయి. ఆధునికయంత్రి సహాయంతో దారంతీసి, బట్టలు నేస్తున్నారు. సిల్కుబట్టల నేతకు వేరే ఫ్యాక్టరీలున్నాయి. ప త్తిగింజలతో నూనె తయారౌతోంది. రకరకాల పళ్ళు, కూరగాయలు డబ్బాలలో నింపి రవానా చేస్తున్నారు. ద్రాక్షరసం తయారుచేస్తున్నారు. 1938 లో మొత్తం 150 కోట్ల రూబుల్సు విలువగల పారిశ్రామిక సరుకులు తయారయాయి.

ఆర్థికాభివృద్ధితో సమానంగా ఉజ్బేకిస్తాన్ వైజ్ఞానికాభివృద్ధి పొందుతూంది. 1939 లో 100 కి 70 మంది జనాభా చదువుకున్నవారు. ప్రతి వ్యక్తీ తప్పనిసరిగా చదువుకోవాలని ప్రభుత్వం శాసించింది. ప్రాథమిక పాఠశాలలలో మొత్తం 13 లక్షలమంది పిల్లలు చదువు నేర్చుకుంటున్నారు. వృత్తివిద్యలు నేర్చుకోడానికి షుమారు 100 కాలేజీలున్నాయి. ఇవిగాక 27 ఆర్ట్సుకాలేజీలున్నాయి లైబ్రరీలు, క్లబ్బులు షుమారు 3,000 వరకూ ఉన్నాయి. దాదాపు 200 వార్తాపత్రికలు ప్రకటించబడుతున్నాయి. వీటిలో 130 ఉజ్బేక్ భాషలోను, మిగతావి యితరభాషలలోను, ఉంటాయి. ఇంతేకాదు. శాస్త్రపరిశోధనకై 20 పరిశోధనాలయాలున్నాయి. ఉజ్బేక్ ప్రజల సంగీతకళ, నృత్యం ప్రభుత్వంచే ప్రోత్సహించబడుతోంది. మొత్తం 40 థియేటర్లకు పైగా నిర్మించబడ్డాయి.

ఉజ్బేక్ స్త్రీలకు సంపూర్ణమైన స్వేచ్ఛ, సమానహోదా, లభించింది. పూర్వంవలె వారిప్పుడు బానిసలుకారు.

## ఉజ్బేక్ ప్రజల యుద్ధకృషి

1942 లో నాజీసేనలు స్టాలిన్‌గ్రాడ్ వరకు తోసుకొచ్చినప్పుడు, ఉజ్బేక్ ప్రజలు యుద్ధరంగంలో పోరాడే తమ కొడుకుల్ని యీ విధంగా హెచ్చరించారు :

" సోవియట్ రాజ్యంలోని ప్రతి అంగుళం నేలను, ప్రతి చిన్న గ్రామాన్ని, ప్రతి పట్టణాన్ని రక్షించే నిమిత్తం మీ రక్తాన్ని ధారపోయండి. జర్మన్లను పూర్తిగా నాశనమొనర్చండి. మీరలా చేస్తే, మీ జీవితంలో గొప్ప ఘనకార్యం చేసినవారౌతారు. మీ రెంతమంది జర్మన్లను చంపితే, అంత యెక్కువ జాలిగుండెగలవా రౌతారు ! "

పైవిధంగా తమ కొడుకుల్ని సంబోధించి, ఉజ్బేక్ ప్రజలు యింటి వద్ద కాళ్ళు చాచుకొని కూచోలేదు. యుద్ధకృషికి సర్వవిధాల తోడ్పడుతున్నారు. సైనికుల కవసరమైన దుస్తులను వేగంగా నేసి పంపుతున్నారు. మందుగుండు సామగ్రికి కావలసిన పత్తిని విరివిగా పండిస్తున్నారు.

యుద్ధానికి ముందు ఉజ్బేకిస్తాన్ ఆహారపదార్థాలకు యితర రిపబ్లిక్కులపై ఆధారపడియుండేది. ఇప్పుడో ! తనకు కావలసిన కాయధాన్యాలన్నీ ఉజ్బేకిస్తాన్‌లోనే పండుతున్నాయి. ఆహారపదార్థాలు పండే భూమివైశాల్యం 1942 లో కంటె 1943 లో 5 లక్షల హెక్టేర్లకు హెచ్చింది. ఈ భూమి మీద వేసవికాలం పంట, శీతకాలపు పంట కూడా పండించారు.

ఇంతకంటె అద్భుతమైన కార్యం యేమంటే, ప్రియనిష్నికోవ్ అనే వ్యవసాయ శాస్త్రజ్ఞుడు ఒక కొత్త వ్యవసాయపద్ధతిని కనిపెట్టాడు. 'రొటేషన్‌స్కీము' అని దానికి పేరు. ఈ పద్ధతివల్ల కాయధాన్యాలు, పంచదార (బీట్‌దుంప) కొన్నిలక్షల టన్నులు అధికంగా పండుతాయి. పత్తిపంట యేమాత్రమూ తగ్గదు ; పైగా హెచ్చుతుంది.

1934 నుండి ఉజ్బేకిస్తాన్‌లో పత్తిపంట రెట్టింపు హెచ్చినమాట నిజమే. సగటున హెక్టేరుకు 1½ టన్నుల చొప్పున పండ నారంభించింది. కాని, హాలెండ్ - బెల్జియం వంటి పశ్చిమ యూరపియన్ దేశాలలో వాడే కంపెనీ యెరువులకంటె ఉజ్బేకిస్తాన్‌లో యెక్కువ ఎరువులు వాడుతూ న్నప్పటికీ రెట్టింపువరకు మాత్రమే పంట హెచ్చడం ప్రియనిష్నికోవ్‌కు ఆశ్చర్యం కలిగించింది. కనీసం రెండురెట్లయినా ఎక్కువ కావాలని అంచనావేశాడు. ఎందువల్లనంటే, ఉజ్బేకిస్తాన్‌లో కావలసినన్ని నీటి పారుదల వసతులున్నాయి ; హాలెండ్ - బెల్జియంలలోకంటె యెక్కువ ఎండకాస్తుంది ; శీతోష్ణస్థితి యెక్కువ అనుకూలం. లోపం యెక్కడుందో తెలుసుకున్నాడు ప్రియనిష్నికోవ్. ఉజ్బేక్ ప్రజలు పశువుల యెరువు విషయంలో అశ్రద్ధచూపుతూన్నట్లు గ్రహించాడు. పాశ్చాత్యదేశాలలో కంపెనీ యెరువులతోబాటు పశువుల యెరువునుకూడా విరివిగా ఉపయోగిస్తారు. ఉజ్బేకిస్తాన్‌లో కూడా అలాచేస్తే, ప్రతి హెక్టేరుకు 3½ టన్నులకు తక్కువకాకుండా పండుతుందని అంచనావేశాడు. పశ్చిమ యూరపులో పశువుల యెరువు హెక్టేరుకు 10 టన్నుల వరకూ వేస్తూంటే, ఉజ్బేక్ ప్రజలు అందులో మూడవవంతు మాత్రమే వేస్తున్నారు.

సాగుచేయబడుతూన్న భూమిలో మూడవవంతు పశుగ్రాసానికి ప్రత్యేకించబడుతోంది. సంవత్సరానికి అది నాలుగుసార్లు కోతకువస్తుంది. పశువులకు కావలసినంత మేత లభిస్తుంది. ఇన్ని చక్కని అవకాశాలున్నప్పటికీ, ఉజ్బేక్ రైతులకు ఎందువల్ల పశువుల యెరువు తగినంతగా లభించడం లేదు?

కేవలం పశుగ్రాసం వల్లనే తగినంత యెరువు రాదు. ఎందువల్లనంటే, పేడలో ఉన్న ద్రవపదార్థాన్ని పీల్చి, జాగ్రత్తపెట్టడానికి అందులో ఎండుగడ్డి విస్తారంగా ఉండాలి. అంటే, ధాన్యం వగైరా కాయధాన్యాలను ఎక్కువగా పండించాలన్నమాట. మొదటినుంచీ ఉజ్బేక్‌స్తాన్‌లో పత్తి పంటకే యెక్కువ ప్రాధాన్యత యిచ్చేవారు. ఆహార పదార్థాలు సైబీరియా నుండి దిగుమతి అయేవి. అందువల్ల ఎండుగడ్డి దొరికేదేకాదు. ప్రియనిష్నికోవ్ రొటేషను పద్ధతి కనిపెట్టాడు. దానిప్రకారం ఒకే భూమిలో పత్తి, కాయధాన్యాలు వంతులప్రకారం పండిస్తారు. ఈ స్కీము ప్రకారం 9 దశలలో భూమి సాగుచేయబడుతుంది. మొదటి మూడు సంవత్సరాలు పశువుల యెరువుతో భూమిని సారవంతం చేస్తారు. నాలుగో సంవత్సరం, అయిదో సంవత్సరం, పత్తి పండిస్తారు. ఆరో సంవత్సరం కాయధాన్యాల పంట. ఇది నాలుగు నెలల కొకసారిచొప్పున, సంవత్సరంలో మూడు పంటలు పండుతుంది. ఏడో సంవత్సరం కూడా కాయధాన్యాలకే వినియోగిస్తారు. ఎనిమిదో సంవత్సరం, తొమ్మిదో సంవత్సరం మళ్ళీ పత్తిపంట.

ఈ పద్ధతిప్రకారం, పూర్వం పత్తిపంటకై వినియోగించబడే భూమి వైశాల్యం మూడవవంతునకు తగ్గినప్పటికీ, పంటమాత్రం తగ్గదు. ఎందువల్లనంటే, పశువుల యెరువుతో భూమి పూర్వంకంటె సారవంతమవుతుంది. ఇంతేకాదు. ఎండుగడ్డి, పేడ కలిసిన యెరువు పూర్వంకంటె ఎక్కువగా వేయడంవల్ల పత్తిపంట 100 కి 33 చొప్పున హెచ్చు నారంభించింది.

'రొటేషన్ పద్ధతి' వల్ల నాలుగు సమస్యలు పరిష్కరించబడ్డాయి : (1) పత్తిపంట యెక్కువైంది. (2) ప్రజలకు కావలసిన ఆహారపంటలు

పుష్కలంగా లభిస్తున్నాయి. (3) ఒకేభూమిపై సంవత్సరానికి రెండు, మూడు పంటలు పండుతాయి. (4) పంచదారకు అవసరమైన బీట్ దుంప సాగు యెక్కువైంది. దాని ఆకులు, బెరడు, పశుగ్రాసంగా ఉపయోగించ వచ్చు. అంతేగాక, ప్రత్తిపంటకంటె బీట్ దుంప త్వరలో కోతకు వస్తుంది. వెంటనే ఆ భూమిలో యే శీతాకాలపు పంటనైనా పండించవచ్చు.

## సోవియట్ తాజీక్‌స్థాన్

పామీర్, త్యన్షాన్ పర్వతపంక్తుల మధ్య ఉంది సోవియట్ తాజీక్‌స్థాన్. ఇదికూడా ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుకు ఆనుకొనియుంది. దీని వైశాల్యం 1 లక్ష 44 వేల చదరపు కిలోమీటర్లు. జనసంఖ్య 15 లక్షలు.

జారిస్టు పరిపాలనక్రింద తాజీక్‌స్తాన్ యెట్టి అభివృద్ధిలేకుండా, అణచివేయబడేది. కాని రష్యన్ ప్రజల సహకారంతో జారిస్టు పరిపాలనను, అమీర్ నిరంకుశత్వాన్ని నిర్మూలించారు. 1924 లో స్వతంత్ర రిపబ్లిక్కుగాను, 1929 లో యూనియన్ రిపబ్లిక్కుగాను గుర్తించబడింది.

తాజీక్‌స్తాన్‌లో సోవియట్ ప్రభుత్వం స్థాపించబడ్డాక, ఆర్థికనిర్మాణంలో అనేక మార్పులొచ్చాయి. పశ్చిమ తాజీక్‌స్తాన్‌లోను, దానికి ఆనుకొనియున్న పర్వతపంక్తికి క్రిందుగాను, నీటిపారుదల వసతు లేర్పడ్డాయి. 1938 లెక్కలప్రకారం 1914 లో కంటె అదనంగా 2 లక్షల 90 వేల హెక్టేర్ల భూమికి నీటిపారుదల వసతు లేర్పడ్డాయి. అనగా, 100 కి 67 చొప్పున హెచ్చాయన్నమాట. 1914 లో కంటె 6 రెట్లు వైశాల్యంగల భూమిలో వరి, ప్రత్తి పండుతున్నాయి. 1939 లో 40 వేల హెక్టేర్ల భూమిలో మేలురకపు ఈజిప్షియన్ ప్రత్తి సాగుచేయబడింది. ఇంతేకాదు. తాజీక్‌స్తాన్‌లో చాలామంది ప్రజలు పశ్లవ్యాపారంపై ఆధారపడుతారు. (అమ్మేది ప్రభుత్వానికి). నీటిపారుదలకు అవకాశంలేని ప్రదేశంలో, 6 లక్షల హెక్టేర్ల భూమిలో, గోధుమ - బార్లీ పండుతాయి. ఈ రెండిటి సాగు 1914 లో కంటె 100 కి 30 చొప్పున హెచ్చింది. తాజీక్‌స్తాన్ కొండలవంటి యెత్తైన ప్రదేశాలలో ద్రాక్షతోటలు, బార్లీతోటలు, పెరుగు

తాయి. ప్రపంచంలో యెక్కడా ఇంత యెత్తైన ప్రదేశంలో వ్యవసాయం సాధ్యంకాదు.

మేలురకపు జాతి గుర్రాలు, ఆవులు, గేదెలు, మేకలు, గొర్రెలు, ఆల్ప్స్ కొండలక్రింది పచ్చికబయళ్ళలో మేస్తూ ఉంటాయి. తాజీక్‌స్తాన్ గొర్రెలు ప్రపంచఖ్యాతిని గాంచాయి.

పెద్దపెద్ద బట్టల మిల్లులు కూడా యీ మధ్య స్థాపించబడ్డాయి. బొగ్గు, నూనె, బంగారం, గనులు ఉన్నాయి. విప్లవానికి పూర్వంకంటె ఉత్పత్తి 4 రెట్లు హెచ్చింది. ఇటీవల ప్రభుత్వం ఒకనదికి ఆనకట్టకట్టి, విద్యుచ్ఛక్తిని తయారుచేస్తూంది. జార్ పరిపాలనలో రోడ్లు అనేవి తాజీక్‌స్తాన్‌లో లేనేలేవు. పర్వతపంక్తులమీదుగాను, లోయలగుండాను ప్రమాదకరమైన మార్గాలలో ప్రయాణం చేయవలసి వచ్చేది ఇప్పుడో: ఎక్కడ చూచినా మోటార్ రోడ్లే!

పూర్వం బానిసలవలె యిండ్లలో జీవితంగడిపే స్త్రీలు యిప్పుడు బయటికొచ్చి, తమ భర్తలతోను, అన్నదమ్ములతోను కలిసి సోషలిస్టు నిర్మాణంలో పాల్గొంటున్నారు.

ఇక విద్యవిషయం. సోవియట్ ప్రభుత్వం వచ్చాక, 4,000 ఎలిమెంటరీస్కూళ్లు, 100 హైస్కూళ్ళు, వందలాది లైబ్రరీలు లేచాయి. 3 లక్షలమంది బాలబాలికలు పాఠశాలలలో చదువు నేర్చుకుంటున్నారు. విప్లవానికి ముందు 100 కి 100 మంది చదువురానివారే! ఇప్పుడు (1938) చదువు రానివారు 100 కి 28 గురు మాత్రమే. తాజీక్‌స్తాన్‌లో 5 కాలేజీలు కూడా ఉన్నాయి. మొత్తం 70 వార్తాపత్రికలు ప్రచురించబడుతున్నాయి. తాజీక్ గాయకులు, కళాకోవిదులు సోవియట్ యూనియన్ అంతటా పేరుగాంచారు. శాస్త్రపరిశోధనకూడా విరివిగా జరుగుతోంది.

ఈ విధంగా తమకు స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం, తెచ్చిపెట్టిన సోవియట్ విధానాన్ని తాజీక్ ప్రజలు సర్వవిధాల బలపరుస్తున్నారు. సోవియట్ యూనియన్‌పై దెబ్బతీసిన నాజీమూకల్ని హతమొనర్చడానికి తమ కొడుకుల్ని యుద్ధరంగాలకు పంపుతున్నారు.

## తాజీక్ ప్రజల యుద్ధకృషి

తాజీకిస్తాన్‌లో అన్నిదశల శీతోష్ణస్థితి ఉంది. అందువల్ల సంవత్సరం పొడవునా నాట్లుగాని, కోతలుగాని ఎక్కడో ఒకచోట జరుగుతూ ఉంటాయి. 1941 లో కంటె 1942 లో 100 కి 12 చొప్పున యెక్కువ భూమి సాగుచేయబడింది. 1943 లో మరొక 12 వంతులు ఎక్కువ సాగుచేయబడింది. పత్తి, కాయధాన్యాలు ఎక్కువగా పండుతాయి. పశుసంపద 1942 లో 100 కి 41 చొప్పున; మేకలు, గొర్రెలు, 100 కి 25 చొప్పున; గుర్రాలు 100 కి 15 చొప్పున; ఒంటెలు 30 చొప్పున; గాడిదలు 76 చొప్పున; పందులు 8 చొప్పున ఎక్కువయాయి. 1942 లో తవ్వబడిన గిస్సార్ కాలువయే చాలావరకు యీ వ్యవసాయాభివృద్ధికి కారణం. మరొక కారణం, పురుషులు చేసే పనిని స్త్రీలు వేగంగాను, చాకచక్యంతోను చేయడం. మొత్తం 4,000 మంది ట్రాక్టర్ డ్రైవర్లలో 1,500 మంది స్త్రీలే.

రెడ్ ఆర్మీకి సహాయంగా తాజీక్ ప్రజలు వందలకొద్ది టన్నుల మాంసం, కొవ్వు, కాయధాన్యాలు, పళ్లు పంపుతున్నారు, ఎర్ర అశ్వికదళాలకు మేలురకం గుర్రాలను సప్లయి చేస్తున్నారు.

## అజర్‌బైజాన్

ఇక అజర్‌బైజాన్‌కు వద్దాం. దీని వైశాల్యం 8 లక్షల 60 వేల చదరపు కిలోమీటర్లు. జనసంఖ్య 32 లక్షలు. బాకూ దీనికి ముఖ్యపట్టణం. పెర్షియాదేశానికిది ఆనుకొని యుంది.

జార్ పరిపాలనలో యిక్కడ జమీందారీవిధానం అమల్లో ఉండేది. అందువల్ల నీటి సదుపాయాలేమీ లేవనే చెప్పాలి. ప్రజలు యెక్కువగా పశువుల్ని పెంచుకొని, ద్రాక్షపళ్ళు పండించి, పట్టుపురుగుల్ని పెంచి జీవిస్తూ ఉండేవారు. పత్తిని బహుతక్కువగా మాత్రమే పండించేవారు. బాకూ నూనెగనులు తప్ప మరో పరిశ్రమ లేనేలేదు.

1920 లో అజర్‌బైజాన్ ప్రజలు సోవియట్ ప్రభుత్వాన్ని స్థాపించుకున్నారు. అప్పటినుంచీ ఆర్థికంగాను, సాంఘికంగాను, రాజకీయంగాను, అభివృద్ధిపొందుతున్నారు. అజర్‌బైజాన్‌లో నివసించే వివిధజాతుల మధ్య కలహాలు, పోరాటాలు అంతరించి సంఘీభావం యేర్పడింది. జార్ పరిపాలన కింద నిరక్షరాస్యులుగా ఉన్న ప్రజలు వైజ్ఞానికంగా అభివృద్ధి చెంది, ఉత్సాహంతో సోషలిస్టు నిర్మాణానికి పూనుకొన్నారు. 1936 నాటికి 100 కి 99 మంది చదువు నేర్చుకున్నారు. 5 లక్షలమంది బాలబాలికలు 3,000 పాఠశాలలకు ప్రతిరోజూ వెళ్తున్నారు. విప్లవానికి ముందు సెకండరీ పాఠశాలలే గగనకుసుమాలు. ఇప్పుడు సెకండరీ స్కూళ్ళతో బాటు 15 కాలేజీలు, 100 వృత్తి విద్యలు నేర్పే కళాశాలలు ఉన్నాయి. పూర్వం 12 గురు ఇంజనీర్లు మాత్రం ఉండేవారు ఇప్పుడో ! కొన్నివేల మంది ఉన్నారు. నిజామీ అనే కవి ప్రపంచవిఖ్యాత ప్రాచీన కవులలో ఒకడు. ఆయన 800 సంవత్సరాల క్రితంనాడు వ్రాసిన గ్రంథాలన్నీ యిప్పుడు చక్కని పుస్తకాలుగా అచ్చువేస్తున్నారు. కొత్తరచయితలు, కవులు, గాయకులు ఎందరో బయల్దేరారు. విప్లవానికి పూర్వం రెండు వార్తాపత్రికలు మాత్రం ఉండేవి. ఇప్పుడు షుమారు 100 పత్రికలు అచ్చు అవుతున్నాయి.

సోవియట్ యూనియన్‌పై హిట్లరు దూకేటప్పటికి బాకునూనెగనులలో నూనె సంవత్సరానికి 1½ కోట్ల టన్నులు తయారౌతూండేది. మొదటి ప్రపంచయుద్ధంలో ఇందులో మూడవవంతు మాత్రమే తయారయ్యేది.

సోవియట్ తాజీకిస్తాన్‌లో వ్యవసాయంకూడా అభివృద్ధి గాంచింది. మొత్తం 10 లక్షల హెక్టేర్ల వైశాల్యంగల భూమి సాగు చేయబడుతోంది. అనేక పంటకాల్వలు తవ్వబడ్డాయి. వీటిలోకల్లా పెద్దది సామూర్ - దవీచీ కాలువ. దీనిపొడవు 107 కిలోమీటర్లు. దీనికింద 60 వేల హెక్టేర్లభూమి తడుస్తుంది. 1940 లో దీన్ని తవ్వారు. సోవియట్ యూనియన్‌కంతకూ పత్తిపంట విషయంలో అజర్‌బైజాన్ రెండవస్థానం అలంకరిస్తోంది. ఇక్కడ పండినంత మేలురకపు ఈజిప్షియన్ పత్తి మరెక్కడా పండదు. కొండ స్లోపులమీద ఫలవృక్షాలు, ద్రాక్షతోటలు, పొగాకు, మల్బరీచెట్లు

యెక్కువగా వున్నాయి. కాస్పియన్ సముద్రింవద్ద వరి విస్తారంగా పండుతోంది.

ఈ యుద్ధంలో హిట్లరు బాకూ నూనెగనులను స్వాధీనం చేసుకోడానికి చాలా ప్రయత్నించాడు. కాని, రెడార్మీ 1942 - 43 శీతకాలంలో జరిపిన దాడి ఫలితంగా వెల్లకిలపడ్డాడు!

1942 లో కంటె 43 లో యెక్కువ వేగంగాను, ముందుగాను, నాట్లువేశారు. 42 లో కంటె 43 లో కాయ ధాన్యాలు 1 లక్ష హెక్టేర్ల వైశాల్యంలో యెక్కువ పండాయి. రెడార్మీకి వేగంగా ధాన్యాలు, పళ్లు, కాయకూరలు పంపడానికి నాట్లువేయడం త్వరగాను, వేగంగాను ముగిస్తున్నారు. ఇందువల్ల మామూలుగా పండే పంటకంటె యెక్కువ పంట పండుతుంది. ఉదాహరణకు: 1942 లో కంటె 1943 లో 100 కి 25 చొప్పున యెక్కువపంట పండింది. సబిరాబాద్ జిల్లాలో 1942 లో 9,800 హెక్టేర్ల భూమిలో కాయధాన్యాలు పండించబడితే, 1943 లో 18,420 హెక్టేర్లభూమి సాగుచేయబడింది. కెర్టేర్ జిల్లాలో 19,150 హెక్టేర్లభూమి సాగుచేయబడింది. క్రిందటి సంవత్సరం కంటె యిది రెట్టింపు వైశాల్యం. ఇంతేగాక, అజర్‌బైజాన్ రైతులు వేలకొద్దీ యకరాల బంజరుభూమిని సాగులోకి తీసుకొచ్చారు. పురుషులు యుద్ధరంగాలలో పోరుసల్పేసమయంలో స్త్రీలు ముందుకొచ్చి వ్యవసాయం చేస్తున్నారు. అంతేకాదు, పురుషులకంటె వేగంగా విత్తులు నాటుతున్నారు; అదనపు భూమిని సాగుచేస్తున్నారు. హిట్లరును యెంత వేగంగా నాశనంచేయాలని కోరుకుంటున్నారో అంతవేగంగా వ్యవసాయపుపనులు పూర్తిచేస్తున్నారు.

ఇంతకంటె అద్భుతమైన విషయం యేమంటే, నాట్లువేసే సమయంలో పట్టణాలలో పనిచేసే కార్మికులు ట్రాక్టర్లను బాగుచేసి సరియైన స్థితిలో వాటిని రైతులకు అందజేస్తారు. కోతల సమయంలో వేలకొద్దీ కాలేజీ విద్యార్థులు- పట్టణ స్త్రీలు పల్లెలకువచ్చి సహాయంచేస్తారు ఈ విధంగా పురుషులొకవైపు తుపాకిపట్టుకొని యుద్ధంచేస్తూంటే స్త్రీలు, పట్టణవాసులు కలసి తమప్రాంతానికి కావలసిన ఆహార పదార్థాలను పండించడమేకాకుండా యుద్ధరంగానికికూడా విరివిగా పంపుతున్నారు.

## కిర్ఘిజ్ రిపబ్లిక్

కిర్ఘిజ్ రిపబ్లిక్కు కాశ్మీర్‌కు ఉత్తరదిశగా, పశ్చిమ చైనాను అనుకొని యుంది. వైశాల్యం 2 లక్షల చదరపు కిలోమీటర్లు. జనాభా 15 లక్షలు.

జారిస్టు రష్యా అంతకూ బాగా వెనుకబడియున్న రాష్ట్రాలలో కిర్ఘిజియా ఒకటి. ప్రజలు సారవంతమైన భూములనుండి వెళ్ళగొట్టబడి, పొట్టపోసుకునేటందుకు ఒకచోటనుండి మరోచోటికి తిరుగుతూ ఉండేవారు పశువుల్ని మేపుకోవడం వీరి ప్రధానవృత్తి. వ్యవసాయం యే కొద్దిమందికో తెలిసేది. అసలు వ్యవసాయపనిముట్లే ఉండేవికావు. పరిశ్రమల విషయంలో యిక చెప్పనవసరమేలేదు.

విప్లవానికి ముందు కిర్ఘిజ్‌జాతి నాశనమయేస్థితిలో వుండేది. 1904 మొదలు 1914 వరకు పది సంవత్సరాలలో జనసంఖ్య 100 కి 10 చొ॥న తగ్గిపోయింది. 100 కి 98 గురికి చదువురాదు. కిర్ఘిజియాలో వున్న పాఠశాలలన్నింట్లోను మొత్తం 7,000 మంది పిల్లలకంటె యెక్కువ ఉండేవారుకారు.

సోవియట్ ప్రభుత్వం అధికారానికి రాగానే కిర్ఘిజ్ ప్రజల పునర్జన్మ ప్రారంభమైంది. 1924 లో స్వతంత్ర రిపబ్లిక్కుగాను, 1936 లో యూనియన్ రిపబ్లిక్కుగాను, ప్రకటించబడింది. 1927 - 39 సంవత్సరాలమధ్య జనసంఖ్య 100 కి 45 చొప్పున హెచ్చింది. 1939 లెక్కల ప్రకారం 100 కి 70 మంది చదువు నేర్చుకున్నారు. అంతకుపూర్వం కిర్ఘిజ్‌భాషకు లిపి ఉండేదికాదు. ఇప్పుడు కిర్ఘిజ్ లిపి యేర్పడింది. పాఠశాలల సంఖ్య 17 రెట్లు హెచ్చింది. ఈరోజున మొత్తం 2,000 పాఠశాలలలో 3 లక్షలమంది బాలబాలికలు చదువు నేర్చుకుంటున్నారు. హైస్కూళ్లు, కాలేజీలు, వృత్తి విద్యలునేర్పే కళాశాలలు కూడా తెరువబడ్డాయి. పబ్లిక్ లైబ్రరీలు, క్లబ్బులు బయల్దేరాయి. "మానస్" అనే కిర్ఘిజ్ ప్రాచీన కావ్యం అచ్చువేయబడి, ప్రజల గౌరవాన్ని పొందుతోంది. అనేక కొత్త రచనలుకూడా ప్రచారంలోకొచ్చాయి. కిర్ఘిజ్ భాషలో వార్తాపత్రికలు,

మాస పత్రికలు, ప్రచురించబడుతున్నాయి. మొత్తం 17 నాటకశాలలు నిర్మించబడ్డాయి. శాస్త్రపరిశోధన విషయంలోకూడా కిర్ఘీజియా పైకి వస్తూవుంది.

పూర్వంవలె ప్రజలిప్పుడు పశువుల్ని మేపుకుంటూ పొట్టపోసుకోరు; సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో వ్యవసాయంచేస్తారు. సోవియట్ ప్రభుత్వం వీరికి ట్రాక్టర్లు, కంబైన్ యంత్రాలుయిచ్చి సహాయంచేస్తూంది. శాస్త్రీయ పద్ధతుల ప్రకారం మేలురకం గుర్రాలు, ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు పెంచబడుతున్నాయి. 1937వ సంవత్సరంనాటికి 10 లక్షల హెక్టేర్లభూమి సాగుచేయబడింది, చక్కని నీటిపారుదల వసతులేర్పడ్డాయి. ఇటీవల లెక్కల ప్రకారం మరో 30 లక్షల హెక్టేర్లభూమి సాగులోకి వచ్చింది.

ఇక పరిశ్రమలకు వద్దాం. కిర్ఘీజియాలో మాంసం పరిశ్రమ, పంచదార పరిశ్రమ, ప్రధానమైనవి. బట్టలమిల్లులుకూడా తెరువబడ్డాయి. కిర్ఘీజియాలో దొరకేబొగ్గు మధ్య ఆసియా అంతకూ సరిపోతుంది.

యుద్ధం ప్రారంభమయాక ప్రతిరోజూ కిర్ఘీజియానుండి రైళ్ళమీద పొగాకు, పంచదార, పళ్ళు, కాయధాన్యాలు, మాంసం, ఉన్ని, మందుగుండు సామగ్రి రెడ్ఆర్మీకి సప్లయి అవుతోంది. ఇమాం షకిర్ హాజీ అనే ముస్లిం మతగురువు టాంకుల నిర్మాణానికి 1 లక్ష రూబుల్సు సోవియట్ ప్రభుత్వానికిచ్చాడు. ముస్లింప్రజల్ని అతడిలా హెచ్చరించాడు :

" 'నీ మాతృభూమిపై శత్రువు దూకినప్పుడు నువ్వు బలంగా ఒక దెబ్బతీయి. ఆ దెబ్బలో నీ శక్తినీ, నీ ఐశ్వర్యాన్ని ఒడ్డు !' అని కొరాన్ చెబుతోంది. ఈ వాక్యాలు మీ రెప్పుడూ జ్ఞాపకం ఉంచుకోండి."

అతడు 'మాస్కో న్యూస్' పత్రికా విలేఖరితో యిలా చెప్పాడు :

" రెడ్ ఆర్మీకి సహాయం చేయడంలో కిర్ఘీజ్ ముస్లింలు తమ యావచ్ఛక్తిని వినియోగిస్తున్నారు. ఎందువల్లనంటే, కిర్ఘీజ్ప్రజలు, సోవియట్ ప్రజలు, హిట్లరు చేతుల్లో ఎన్నిఅవస్థలు పడాలో అన్నీ పడవలసి

వస్తుంది. నాజీలు మతాలన్నింటినీ నాశనం చేస్తారు : మతగురువుల్ని అణచివేస్తారు. మా రిపబ్లిక్కులో యిప్పుడు సంపూర్ణమైన మతస్వాతంత్ర్యం ఉంది. ముస్లింప్రజలు స్వేచ్ఛగా తమ మసీదులలో ప్రార్థనలు సల్పుకోవచ్చు. కొరాన్‌ను బోధిస్తూంటే నన్నెవరూ యిప్పుడు అడ్డు పెట్టరు. ఎవరైనా దీనికి వ్యతిరేకంగా చెబితే, అట్టివాడు పచ్చి అబద్ధ మాడుతున్నాడని కిర్ఘిజ్ ముస్లింలకు గురువునైన నేను స్పష్టంగా తెలియ జేస్తున్నాను."

ఇమాం షకీర్ హాజీప్‌కి నలుగురు కొడుకులు. వారిలో యిద్దరు యుద్ధరంగంలో పోరాడుతున్నారు. పెద్దకొడుకు సీనియర్ లెఫ్టినెంట్‌గా ఉన్నాడు. అతడింకా యిలా అన్నాడు :

"నా హృదయం యుద్ధరంగంమీద ఉంది. నా పెద్దకొడుకును చూచి నే నెంతో గర్విస్తున్నాను.........యుద్ధంలో జర్మనీ గెలిస్తే ఇన్నాళ్లూ సోవియట్ ప్రభుత్వం మాకు ప్రసాదించిన హక్కులు మట్టిపాలౌతాయి. ఈ విషయం ప్రతికిర్ఘిజ్ ముస్లింకీ తెలుసు. జారిస్టు పరిపాలనక్రింద మేం అనుభవించిన బానిసజీవితం కంటె 100 రెట్లు యెక్కువ బానిసత్వం వస్తుందని మాకు తెలుసు. కనుకనే తండ్రులు తమ కొడుకుల్ని ఆశీర్వ దిస్తూ యుద్ధరంగానికి పంపుతున్నారు. 'పురుషునివలె పోరాడు. నేను చేయగల సహాయం అంతా రెడార్మీకి చేస్తాను' అని చెప్పిపంపుతున్నారు. మసీదులలో మేం సమావేశమై, అల్లాను మా కొడుకుల కెట్టి అపాయం కలుగకుండా చూడమని, రెడార్మీకి విజయం చేకూర్చవలసిందని ప్రార్థిస్తాం.

"ఎక్కడ ముస్లిం లున్నప్పటికీ, వారిని నేను కోరేదేమంటే, మా ప్రార్థనలో మీరు కూడా పాల్గొనండి. మీ యావచ్ఛక్తినీ వినియోగించి రెడార్మీ సల్పుతూన్న స్వాతంత్ర్య సంగ్రామానికి సహాయపడండి. కొరాన్ యిలా చెబుతోంది : 'శత్రువును హతమార్చటంలో సహాయంచేస్తే, ఆ ధర్మయుద్ధంలో స్వయంగా మీరు పాల్గొంటున్నారన్నమాటే.' ఈరోజున ముస్లిం ప్రజలకు యీ మాటలు కొత్తప్రాధాన్యత నిస్తున్నాయి."

# సోవియట్ టర్క్‌మేనియా

టర్క్‌మేనియా రిపబ్లిక్ పెర్షా-ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దులకు అనుకొనియుంది: వైశాల్యం 4 లక్షల 44 వేల చదరపుకిరోమీటర్లు. ఇందులో అయిదింట నాలుగుభాగాలు కారకూం యెడారి. జనసంఖ్య షుమారు 10 లక్షలు. ముఖ్యపట్టణం అష్కాబాద్.

జారిస్టు పరిపాలనలో టర్క్‌మేనియన్ ప్రజలు గొర్రెలు కాచుకుంటూ, ఒంటెలను పెంచుకుంటూ, జీవించేవారు. అక్కడక్కడ, ఒయాసిస్సులవద్ద (యెడారిమధ్య నీటికుంటలు) పత్తి పండించేవారు.

సోవియట్ ప్రభుత్వం స్థాపించబడ్డాక, యిక్కడి ప్రజలు అతి వేగంగా అభివృద్ధిపొందారు. రైతులు సమిష్టిపద్ధతి ప్రకారం భూములు దున్ని వ్యవసాయం చేస్తున్నారు. వారికి ప్రభుత్వం ట్రాక్టర్లు, కంబైన్లు, ఎరువులు, విత్తనాలు యిచ్చి తోడ్పడుతోంది. మంచి మంచి నీటివసరులు తవ్వబడ్డాయి. 1939 లో మొత్తం 800 సమిష్టివ్యవసాయక్షేత్రాలున్నాయి. వాటి ఆదాయం సాలుకి ఏబదిలక్షల రూబుల్సు: గ్రామాలలో రేడియోలు, టెలిఫోన్‌లు, సినీమాలు, లైబ్రెరీలు బయల్దేరాయి. నదులగుండా కాలువలు తవ్వి, నీటి పారుదల వసతులు కల్పించబడ్డంవల్ల పత్తి విరివిగా పండుతోంది. కారకూం యెడారిలోకూడా రైతులు వ్యవసాయం చేస్తున్నారు. 20 లక్షల పశువుల్ని మేపుతున్నారు.

ఈ మధ్య దూదిమిల్లులు, బట్టల మిల్లులు, సిల్కునేత, మాంస పరిశ్రమ, జోళ్ళపరిశ్రమ, స్థాపించబడ్డాయి. కొన్నిగనులు కూడా తవ్వబడుతున్నాయి. కాస్పియన్ సముద్రతీరంలో మంచిరకం చేపలు దొరుకుతున్నాయి.

ఇంతేకాదు. 1927–1939 సంవత్సరాలమధ్య టర్క్‌మేనియా జనసంఖ్య 100 కి 25 చొప్పున హెచ్చింది. 1400 పాఠశాలలు, 33 కాలేజీలు స్థాపించబడ్డాయి. 60 వార్తాపత్రికలు, 7 మాసపత్రికలు ప్రచురించబడుతున్నాయి. శాస్త్రపరిశోధనకు 30 పరిశోధనాలయాలున్నాయి. 37 నాటకశాలలు, 700 లైబ్రరీలు, 600 క్లబ్బులు నిర్మించబడ్డాయి. కొత్త

కవులు, రచయితలు, గాయకులు ఉద్భవించారు. అష్కాబాద్ పట్టణం ఒక పెద్ద వైజ్ఞానికకేంద్రం అయింది. ఎన్నో పార్కులు, కాలేజీలు, మైదానాలు, ఎత్తైన బిల్డింగులు లేచాయి.

యుద్ధకృషికి టర్క్‌మేనియన్ ప్రజలు పూర్తిగా తోడ్పడుతున్నారు.

## కజాక్‌స్తాన్

మధ్య ఆసియా రిపబ్లిక్కులన్నింట్లోను కజాక్‌స్తాన్ పెద్దది. జార్ పరిపాలనలో వ్యవసాయం, పరిశ్రమలు చాలా వెనుకబడియుండేవి. సోవియట్ ప్రభుత్వం స్థాపించబడ్డాక సర్వతోముఖంగా అభివృద్ధి చెందింది. జంబూల్ అనే 90 సంవత్సరాల సుప్రసిద్ధకవి యీ రిపబ్లిక్కుకు చెందిన వాడే.

యుద్ధం వచ్చాక కజాక్ ప్రజలు రెడార్మీకి పారిశ్రామిక వస్తువులు, వ్యవసాయసరుకులు, విరివిగా సప్లయిచేస్తున్నారు. బల్కాష్ ప్రాంతం నుంచి రాగి, చింకెంట్-లెనిన్‌గొర్‌స్కీల నుంచి సీసం, కరగండానుంచి బొగ్గు, ఎంబానుంచి నూనె సప్లయి చేయబడుతున్నాయి. కాయధాన్యాలు, మాంసం, వెన్న, ఉన్ని, చర్మం విస్తారంగా పంపబడుతున్నాయి. ఇనుము-ఉక్కు సప్లయివిషయంలో కజాక్‌స్తాన్ సోవియట్‌యూనియన్‌లో రెండో స్థాన మలంకరించుతోంది. సీసం విషయంలో మొట్టమొదటి స్థానం.

యుద్ధరంగంలో జర్మన్ పిశాచాలపై కాల్చబడే ప్రతి 10 తూటాలలో 9 తూటాలు కజాక్‌స్తాన్‌లోనే తయారౌతున్నాయి. సోవియట్ విమానాలలోను, టాంకులలోను, ఓడలలోను కజాకస్తాన్ రాగి, కజాకస్తాన్ టిన్ను, కజాకస్తాన్ జింకు ఉన్నాయి.

యుద్ధం ప్రారంభమైనప్పటినుంచీ కజాక్‌స్తాన్ నూనె పరిశ్రమ యితర పరిశ్రమ లన్నింటికంటె వేగంగా వృద్ధిచెందింది. ఏటేటా ప్రభుత్వం నిర్ణయించే ఉత్పత్తికోటాలను పూర్తిచేయడమేకాకుండా అదనంగా ఉత్పత్తిని కొనసాగిస్తోంది. వందలకొద్దీ నూనె కార్మికులకు ప్రభుత్వం బిరుదులు, బహుమానాలు యిచ్చింది.

యుద్ధానికిపూర్వం బొగ్గు ఉత్పత్తి విషయంలో కరగాండా బొగ్గు గనులు సోవియట్ యూనియన్‌కంతకూ మూడవస్థానం అలంకరించేవి. యుద్ధంవచ్చాక ముఖ్యంగా డాన్బాస్ బొగ్గుగనులు జర్మన్లకు స్వాధీన మయాక, విపరీతమైన వేగంతో బొగ్గు ఉత్పత్తిచేయబడుతోంది. అధికోత్పత్తికి ప్రభుత్వం నిర్ణయించిన కోటాలను కార్మికులు అనుకున్న సమయం కంటె త్వరగా పూర్తిచేస్తున్నారు. ప్రతి డిపార్టుమెంటులోను బొగ్గుకార్మికులు పోటీలుపడి ఉత్పత్తిని యెక్కువచేస్తున్నారు. స్త్రీలు సాధారణంగా గనులలో పనిచేయరు. కాని కజాక్ స్త్రీలు పురుషులతో సమానంగా గనులలో పనిచేస్తున్నారు. జకెన్‌ముకనోవా అనే యువతి 3 నెలలు పనిచేసిన తర్వాత 100 కి 50 చొప్పున ఉత్పత్తిని యెక్కువ చేసింది. ప్రభుత్వం ఆమెను ఉచితరీతిని బహూకరించింది.

కజాక్‌స్తాన్‌లో యినుము పరిశ్రమ, ఉక్కు పరిశ్రమ కూడా వేగంగా వృద్ధిచెందాయి. ఇంజనీరింగ్ వర్కుషాపులు, మందుగుండు సామగ్రి కార్ఖానాలు, జోరుగా పనిచేస్తున్నాయి. బాంబులు, గ్రెనేడ్‌లు, మందు పాతరలు అధికంగా తయారౌతున్నాయి. కజాక్‌స్థాన్‌లో కావలసినంత ముడి యినుము దొరుకుతుంది. దాన్ని వర్కుషాపులలో ఉక్కుగా కరిగించి, యుద్ధ పరికరాలు తయారుచేస్తారు.

## వ్యవసాయ పరిశ్రమ

కజాక్ రైతులు వ్యవసాయం విషయంలో కూడా యెక్కువ శ్రద్ధతో పనిచేసి, సైనికులకు యెప్పటికప్పుడు విరివిగా ఆహార పదార్థాలను పంపుతున్నారు. 1941 లో కంటె, 42 లో 20 లక్షల యకరాల భూమి కొత్తగా సాగుచేయబడింది. పంచదార ఉత్పత్తి 1941 లో కంటె 42 లో మూడు రెట్లు హెచ్చింది. రబ్బరు, నూనె గింజలు, పత్తి కూడా పండించబడుతున్నాయి. దక్షిణ ప్రాంతంలో పళ్లు విస్తారంగా పండుతాయి. సోవియట్ యూనియన్ కంతకూ కజాక్‌స్తాన్‌లో శ్రేష్టమైన పశువులు పెంచబడుతాయి. 1942 శీతాకాలంలో మొత్తం 30 లక్షల

పశువులు పెంచబడ్డాయి; వేసవిలో యీ సంఖ్య 50 లక్షలకు పెరిగింది. 1942 లో కజాక్‌స్తాన్ పంపిన మాంసంకంటె 1943 మొదటి 5 నెలలలో పంపిన మాంసం 3½ కోట్ల పౌన్లు యెక్కువ. 1941 లో కంటె 42 లో ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు 100 కి 24 చొప్పున, గుర్రాలు 100 కి 12½ చొప్పున యెక్కువయాయి.

నాట్ల విషయంలో 1943 సంవత్సరానికి పూర్తిచేయవలసిన కోటా సెప్టెంబరు నెలాఖరుకు పూర్తిచేయడమేగాకుండా 12½ లక్షల యకరాల బంజరు కొత్తగా సాగుచేయబడింది. యుద్ధం ప్రారంభమయాక మొదటి 2 సంవత్సరాలలో మొత్తం 27½ లక్షల యకరాలభూమి అదనంగా సాగు చేయబడింది.

ఈవిధంగా, పూర్వం మధ్యఆసియాలో నివశించే అనాగరిక ప్రజలు బహు కొద్దికాలంలోనే సర్వతోముఖంగా అభివృద్ధిచెంది, ప్రపంచానికి - ముఖ్యంగా బానిసజాతులకు - నూతన సందేశం యిస్తున్నారు.

## ముగింపు

సోషలిస్టుసమాజంకింద సోవియట్ యూనియన్ నేటివరకు సాధించిన విజయాలనుగూర్చి, అక్కడి ఆర్థిక - రాజకీయ - సాంఘిక విధానాన్ని గూర్చి, యీ పుస్తకంలో స్పష్టీకరించ ప్రయత్నించాను. సామ్రాజ్య విధానంకింద 200 సంవత్సరాలుగా కృంగి కృశించుతూన్న మన దేశానికీ, 25 సంవత్సరాలకాలంలో సోవియట్ యూనియన్ ప్రజలు పొందిన అభివృద్ధికీ, ఎంత తారతమ్యం వుందో పాఠకులు గ్రహించివుంటారు. అదే విధానమే మన దేశంలోకూడా అమల్లోకివస్తే, 40 కోట్ల మంది భారతీయులు సుఖసంపదలతో తులతూగవచ్చుననీ, సర్వతోముఖంగా అభివృద్ధి చెందవచ్చుననీ భారత కమ్యూనిస్టుపార్టీ కృషిచేస్తూంది. సామ్రాజ్య విధానంక్రింద బానిసత్వ మనుభవించే మనకు, సోవియట్‌యూనియన్ ఒక ఆశాజ్యోతి, అనడం అతిశయోక్తికాదు.

# సోవియట్ విదేశాంగనీతి: భారతదేశం





సోవియట్ యూనియన్ ఇండియాకు ఏమి చేసింది? జపానుతో సోవియట్ ఎందుకు ఒడంబడిక చేసుకుంది? అట్లాంటిక్ చార్టరులో స్టాలిన్ ఎందుకు సంతకం చేసాడు? సోవియట్ విజయాలవల్ల సామ్రాజ్యవాదులు బలపడుతున్నారా, బల హీన పడుతున్నారా? మొదలైన ప్రశ్నలకు చక్కని జవాబులు ఈ పుస్తకంలో లభిస్తాయి. తప్పక చదవండి.

వెల 0–10–0

ప్రజాశక్తి కార్యాలయం
గవర్నరుపేట : బెజవాడ